శ్రీరస్తు

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

# పాండవాజ్ఞాతవాసము

## (విరాటపర్వము)

వచనకావ్యము



ప్రకాశకులు:

**ఎమ్.ఎ.గోపాల్ అండ్ కో.,**

***నెం. 63, కృష్ణప్పనాయకన గుంట వీథి,***

**మద్రాసు-1**

 **1958** వెల రూ 2-00

# పీఠిక

మహాశయులారా!

పాండవు లరణ్యవాసానంతర మొక సంవత్సర మజ్ఞాతవాసము నొనరించునట్లు భాగవతమందుఁ జెప్పఁబడియున్న కథనుఁ గొని పలువురు వేలువేలుగా వచన గ్రంథములు వ్రాసియున్నారు. కాని యవి యంతగాఁ శ్లాఘనీయములు గావని నాయభిప్రాయము. యుక్తమైన శైలి ననుసరించి వ్రాయఁబడకయు, కథావ్యత్యాసము గలిగియు, పద్ధతి సరిగా లేకయు, తప్పులతో నిండి చదువుట కింపుగాక, కాలహరణముగాఁ గనుపట్టుచున్నవి. పద్యకావ్యములు సాధారణముగా నెల్లరకుం దెలియునవిగావు గద్య కావ్యములు జన సామాన్యమున కంతటికిని పఠనార్హమ్మై యుండును. కావున వచనముగా వ్రాయఁబడు గ్రంథములు సర్వజన సుబోధకమును నాహ్లాదకరమునునై యున్ననే ప్రయోజనకారు లగును. వచనకావ్యములను వ్రాయవలసిన రీతి నెఱుంగకయు తగిన నేర్పులేకయుఁ దోఁచినట్లు పూర్వోత్తర సందర్భములు సంబంధము లేకుండులాగునను, వచ్చిడిమాటలు గూర్చి వ్రాయుచు తాము గొప్ప కవులనియుఁ బండితుల మనియుఁ బేరుఁబొందుటకు ప్రయత్నించుచుండుటఁ జూచుచున్నారము. అట్టుల వారు తలంచుట వలనఁగాని అటువంటివారు వ్రాసిన పుస్తకములను జదువుట వలనఁగాని, వారికిని లోకమునకును నించుకయు ప్రయోజనము గలుగ నేరదు, కాఁబట్టి గ్రంథములను జదువ నెంచినవారు తాముకోరిన పుస్తకము తగినదా? కాదా? యని విమర్శించి చూచి, యుక్తమగువాని నేఱిగికొని చదివిన యెడల సంతోషమును జ్ఞానాభివృద్ధియుఁ గలుగును.

పై నుదహరించిన విషయములం గూర్చి యాలోచించి యందఱకునుం దెలియునట్టి సులభములగు మాటలతో, చదువరులకు హృదయానందకరముగా నుండులాగున వ్రాయవలయునని తలంపుఁగొని నేనీ వచన కావ్యమును వ్రాసినాఁడను, సహృదయు లిందలి లేఖన ప్రమాద జనిత దోషములను మన్నించి యీగ్రంథము వలెనే మఱియుం బెక్కుగ్రంథములు వ్రాయుటకు ప్రోత్సాహముఁ గలిగింప వలయునని మిక్కిలి ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు,

గ్రంథకర్త.

# భగవత్ప్రార్థన



శా॥ శ్రీకాంతాబ్ధి నవాకృతిం బరఁగు రా - జీవాక్షి మంగాంబ, యా
స్తోకానంద మెలర్పఁ గొల్వ విబుధుల్ - స్తోత్రంబుఁ గావింప భ
వ్యాకాలంబున వేంకటేశ్వర నిరూ - ఢాభిఖ్యతో భక్తలన్
శ్లోకం బాలనఁ జేయు శేషగిరివా - సుం గొల్తు నిష్టాప్తికిన్.

క॥ సురగుణ మునిజన వందిత
తరుణాబ్జ సమానపావ - నాంఘ్రిద్వయమా
పరమేశ్వరి నెంచెద నఘ
హరణను కరుణాంతరంగ - నలమేల్మంగన్,

క॥ గజవదను నేకదంతుం
ద్రిజగన్నుత పుణ్యచరితు - దీనశరణ్యున్
భజియించెద నొగివిఘ్న
వ్రజమును నడఁగించి కృతిని - రక్షించుటకున్.

గీ॥ విద్యలకునెల్ల నిలయమై - వెలయు తల్లి
నాశ్రితుల కల్పవల్లిన - యబ్జభవుని
రాణి నళికులవేణిని - వాణి నాత్మఁ
దలఁతు ననయంబు వాక్సిద్ధిఁ - గలుగఁజేయ.

చ॥ కవివరులన్ సుధీజనులఁ - గావ్య రసజ్ఞుల నార్యులం గుబు
ప్రవరుల సన్నుతించెదను - భక్తి దలిర్పఁగ, మత్కవిత్వమం
చవగతమైన దోషముల - నాత్మఁ దలంపక సాదరంబులోఁ
దివిరి పరిష్కరించి తగు - తీరున నున్నదినొందఁ జేయగన్.

శా॥ శ్రీవత్సాహ్వయ గోత్రముఖ్యుఁడగు ల - క్ష్మీనార సింహాయ్యకున్
సావిత్ర్యంబకు యజ్ఞ - శ్యాకన్ మహాలక్ష్మికే
గైవరిల్లు శుభాంగి వల్లభుఁడ శి - ష్టాచార సంపన్న స
ద్భావుండన్ ధరణీసురప్రియుఁడ నా - పస్తంబ సూత్రుండ, రా
జీవాక్షుండగు వేంకటేశ్వరుని పం - సేవించు నే శుండ నే
ధావుల్ సత్కవి పుంగవుల్పొగడ ప - ద్యగ్రంథముల్పెక్కులన్
భావింపందగు గద్యకావ్య చయముం - బాగొప్పఁగా వ్రాసి యీం
తే విఖ్యాతినిఁ గొన్నవాఁడ నిలలో - నేఁబిచ్చయాభిఖ్యుఁడన్

ఆ॥ పరఁగ నిపుడు పూని - సాంఢవాజ్ఞాత వా । స ప్రకార మఖిల జనులు మెచ్చ
కరము సులభపఱకి - గద్యకావ్యంబుగా । పూనెదను ముదంబు మీఱఁగ.


విషయసూచిక

విషయసూచిక

సంపూర్ణము

శ్రీ ర

# పాండవాజ్ఞాతవాసము



క. శ్రీకల్యాణ గుణాకర
లోకావన దక్ష పద్మ - లోచన భక్తా
నీకాశ్రయ దేవేశ వి
వేకప్రద వినుతచరణ - వేంకటరమణా!

దేవా! అవధరింపుము. జనమేజయునకు వైశంపాయన మునీంద్రుం డిట్లని చెప్పం దొడంగె.

## కథాప్రారంభము

"మహీపాలకా! అట్లు పాండునందనులు తమ దాయాదులైన కౌరవులతోడ నేర్పఱచుకొనిన యొడంబడిక చొప్పున పన్నెండేండ్లు నానాకష్టముల ననుభవించుచు, ధర్మబద్ధులై వనవాస కాలంబును సంపూర్ణముం గావించిరి. ఇంక నొక సంవత్సరము తమ జాడ నన్యులెఱుంగకుండు విధంబున గడుపవలసి యుండెను.

అట్టియెడ వారికి ధర్మదేవత ప్రత్యక్షం బగుటయు, నందఱును భక్తిమీర నద్దేవునకు నమస్కరించి చేతులు మోడ్చి నిలిచి, తా మొనరింప నుండెడి యజ్ఞాత వాసంబునకు భంగంబు గాకుండునలాగున వరంబుఁ బ్రసాదింప వేఁడుటయు, వారల కవ్విధంబున వరంబు లొసంగి యంతర్హితుండయ్యె. అంత పాండుకుమారులు తమ వెంట నంతకు మున్ను విడువక యడవులలో నగ్నిహోత్రంబులం గొని కూడి వర్తించుచున్న భూసురోత్తములం గాంచి, వారలు తమ్ము పరివేష్టించి యుండఁగా తాము చేయఁబూనిన కార్యము నమ్మహాత్ములకెఱింగింపఁ దలంచి, కరంబులు మొగిచి సవినయంబుగ నిట్లని పలికిరి.

## పాండవులు బ్రాహ్మణులకు తమ ప్రయాణముఁ దెలుపుట

"బ్రాహ్మణోత్తములారా! దుష్టచిత్తుండగు దుర్యోధనుండు మాకుం గావించిన యపకారము మీ కెల్లరకును బాగుగఁ దెలిసినదె

యున్నది. ఎఱింగిన విషయమును మరలఁ జెప్ప నేమిటికి? మాకు చాలని కాలం బగుటచే ఋష్యోఘమున నడవులలో వసించి యిడుములు బడఁ బాలైతిమి. మీరలన్ననో మేము వచ్చినది మొదలుగ [illegible] మాతోడఁ గూడి వర్తింపుచు, సకల కష్టములు ననుభవించితిరి. ఎట్టులనో యొక విధముగా మన మిప్పటి వరకును కాలమును గడపితిమి. పన్రెండేడులు చెల్లినవి. ఇది పదమూడవ సంవత్సర మగుటచే నా యొడంబడిక ప్రకారము మే మజ్ఞాతవాసముఁ జేయవలసినది విధియైయున్నది. మా ప్రవర్తన మొరులెఱుంగ కుండు భంగి నీసంవత్సరము గడుప వలయును. దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణ ప్రముఖులైన మా జాడలు దెలిసికొని మమ్ముఁ జెఱుపనెంచి యాలోచించు చున్నవారే కాని యూరకుండువారు కారు. ఏ మాత్రము తెలిసినను మిగుల గొప్ప కీడు వాటిల్లుట నిశ్చయము. కాబట్టి మీరు కరుణాయత్త చిత్తులరై, మా రహస్య వర్తన మొరులకుఁ దెలియకుండునట్లును మా ప్రయత్నము నిర్విఘ్నముగా నెఱవేరు నట్లును నాశీర్వదించి మమ్ము బనుప వలయునని మిక్కిలి ప్రార్థించు చున్నారము'' అని చెప్పిరి.

అపుడు ధర్మనందనుం డత్యంత వ్యాకులంబు నొంది దీనవదనుండై విప్రులం జూచి ''అక్కటా! ఇంతటి దుర్దశపాలై, కష్టముల ననుభవించుచున్న మాకు మంచి కాల మెన్నటికైనం గలుగునా? ఈ యిడుములు గడచి, మేము మీవంటి భూసురోత్తముల సాంగత్యంబున, చుట్టములతోఁ గూడి సంతోషముతో సౌఖ్యము ననుభవించు కాలము మాకు సంఘటిల్లునా? ఎన్నఁడు? నా బుద్ధికిఁ దోఁచకున్నది. ఎందైన నెవ్వరైన నిటువంటి వెతలొంది కుందిన వారు లోకంబునందు గలరా? ఏమి చేయుదుము?'' అని గద్గద స్వరంబునఁ బలికెను. ఆలాగున దుఃఖాక్రాంతుండై నుడువుచున్న పాండవాగ్రజుని విషాదంబుఁ జూచి, యమ్మహీసుర వరులును, నతని తమ్ములును, ఖిన్నులై, సుగుణ రత్నాకరుండైన యా యజాత శత్రునకుం బొడమిన వ్యాకులంబు బోసంగి ధైర్యము, గలుగు భంగి నూఱట మాటలం బలికి శాంతినిఁ బొందించుచుండిరి. కాని, వారి పలుకులవలన, కష్టానుభవంబుచే నొదవిన యతని మనోవ్యాకులం బడంగకుండెను.

## ధౌమ్యుఁడు ధర్మజు నూరార్చుట

ఆ సమయంబున నొకవైపున నుపవిష్టుండై యున్న వారి పురోహితుండగు ధౌమ్యుండు ధర్మపుత్రుని మనో వ్యాకులమును, చింతయుం దొలంగింప నెంచి "ఓయి పాండునందనాగ్రణీ! నీ విధంబును జూడఁగా నామనంబున నాశ్చర్యము గలుగుచున్నది. ఏలననఁగా ధర్మము నెఱింగి నిర్ణయించి పలుకుట యందును, ధైర్య స్థైర్యముల యందును, సదాచార సంపద యందును మించి చెడుగుల నెఱుంగుట యందును, వివేకమందును, చాతుర్యమందును, లోకమున ధర్మజునకు సమానుండని చెప్పఁదగినవాఁడు మఱియొకండు లేఁడనెడి ప్రసిద్ధినిఁ బొందినవాఁడవగు నీవు విధికృతంబున తటస్థించిన యిడుములం దలంచి యివ్విధంబున చింతాక్రాంత హృదయుండవై పరితపించుట యుచిత మగునా? ఇట్టి రీతి సామాన్యులకుఁ దగినదిగాని నిన్నువంటి యుత్తమ పురుషున కర్హముగాదు. మహీవల్లభా! వినుము, దేవతలకైనను, నొక్కొక్క కాలమున తమ వైరుల నడంప ననువగు సమయము తటస్థించు వఱకును తామెంతటి వారైనను స్వశక్తినిఁ జూపఁ దొడరక కాలము నరయుచు నడఁగి యుండవలయును, అలాగున నగుటచే వారి నధములని యెవరైనం బలుకుదురా? లేదు. కష్టముల నోర్చినవానికే శాశ్వత సౌఖ్యము లభించును. మున్ను దేవేంద్రుఁ డంతటివాఁ డొక కాలమున నిషధ పర్వతమునందుఁ జేరి గహ్వర ప్రకారమున వర్తించుచుండెనని యును శ్రీమహాపతి యాదితి గర్భమున జన్మించి వామన రూపముతోఁ జరిగించెననియు, బడబాగ్నియైనట్టి యౌర్వ్యుండు పరుల కెఱుక రాక తల్లి తొడయందు దాగియుండె ననుటయును. గాథా ప్రకారమున సూర్యుండు గోవు శరీరంబుఁ జొచ్చియుండె ననుటయును, మఱియు నిట్టి వెన్నియో వృత్తాంతములను మనము వినియుండలేదా? ఆలాగున వర్తించినంత మాత్రమున వారలు శక్తిహీనులని పలుకఁ దగినవార లగుదురా? ఆలోచింపుము. ఇపుడు నేను చెప్పిన యింద్రాదులు చెడు కాలమును దెలిసి యడఁగి యుండి సమయము వచ్చినపుడు విజృంభించి ప్రబలులగు శాత్రవులను జయించి యున్నత స్థితినిఁ జెందలేదా? నృపాలోత్తమా! ఈవిషయంబులం దలంపున నిడుకొని, ధైర్యంబును విడువక యెన్ని కష్టములు కలిగినను, మంచికాలము వచ్చువరకును సయిరించి సమయమును

పార్థుండు నుడివిన యుచిత వాక్యంబులు యుధిష్ఠిరుండు సంతసించి, యతనితో "సోదరా! ఔను. నీవు చెప్పినది పొల్లుగాదు. కృపాయత్తచిత్తుండై ధర్మదేవత యొసంగిన వరంబు ఫలింపక మనకుఁ దప్పిపోవునా? యెన్నటికిని నటుల సంభవింపదు. దీనిని గూర్చి మన మింక విచార మొందవలసినది యేమిలేదు. కాని, భయములేక మనకు నివసింపం దగినచోటు నొకదానిని, నీవే నిర్ణయించి పలుకుము. తడవు చేయక పోవుట మంచిది. నా బుద్ధికిఁ దోఁచిన విధంబుఁ జెప్పెదను వినుండు. ఇపుడు పేర్కొనఁబడిన దేశములలో మత్స్యదేశ మత్యుత్తమమైనదనియు, ఆ రాజు బాహుబల పరాక్రమ సంపన్నుం డనియు జనులు జెప్పుచుందురు కావున మన మతని యొద్దకుం బోయి యాశ్రయించి తగిన పనులయందు నియుక్తులమై గూఢ ప్రకారంబున వర్తించుట యుచితంబై యుండునని తలంచెద. ఇంక మీకుం బోలిన విధంబును పలుకుఁ" డనుటయు భీమార్జున నకుల సహదేవులు "తత్ప్రకారంబునం జేయుటయు మాకు సమ్మతం" బని తమ యంగీకారమ్ముం దెలియఁ బలికిరి.

ధర్మపుత్త్రుఁడు తన యభిమతాను సారులై వర్తింప సమ్మతించిన యనుజులం గాంచి "తమ్ములారా! సరి! నివాస స్థానమును నిశ్చయించుకొంటిమి. ఇంక మన మా విరటునిబారి కరిగినపు డెవ్వఁ డెవ్వఁ డేయే తెఱంగున నతని మది కెక్కులాగున నటించి కార్యసాఫల్యంబును బడయవలయునో తమకు తమకుఁ దోఁచిన యాయారీతుల నిపుడే నిర్ణయించుకొనవలయును. కాఁబట్టి మీకు మీకుం గల తలంపులను యుక్తులకు దృఢంబుగాఁ దెలియఁ బలుకుఁ" డని యడిగెను.

ఇవ్విధంబున నడుగుటయు నతని వాక్యంబులు విని, యర్జునుండు మిక్కిలి శోకమును బొంది యొక్కింత తడవాలోచించి ధర్మస్వరూపుఁడైన యగ్రజుని ముఖంబు నుపలక్షించి, స్వరంబు రాల్పడగా "రాజకుల సార్వభౌమా! కాలవైపరీత్యంబున కేమన వలయును? ఆహా! దైవసంకల్పమున కన్యథా జరుగదుగదా? అయ్యో! నీవంటి మహాపురుషున కిటువంటి దుర్దశ గలుగవచ్చునా? మహనీయ స్వరూపమును, మానవ వైభవమును, సౌకుమార్యమును, వీరత్వమును, మృదుభాషణములును, ప్రభుత్వమందలి యున్నతియును నిష్కళంకచిత్తమును

గౌరవమును, శాంతియు, దాంతియు, త్యాగంబును, భోగంబును, కరుణయు సత్యశీలత్వంబును, సంతోష విలాసంబులును నిత్యాది సర్వలక్షణంబులకు నునికిపట్టయియుండి రాజ్యపాలనం బొనరించుచుండఁ దగిన నీ వన్యులను గొలిచియుండుట నెన్నండును నెఱుంగవు. ఇంతటి మహానీయుండవు భవదీయ తేజంబు నడంచుకొని దైన్యంబున విరాటునాశ్రయించి యనుసరించి మెలంగ నేర్తువో తెలియకున్నది. ఈ చింతయే నన్ను మిక్కుటముగాఁ గలిగించుచున్నది. నరేంద్రా! ఏలాగున ప్రవర్తించెదవు? తెలియఁబలుకు" మని యడిగెను.

## ధర్మజుఁడు తనప్రవర్తన ప్రకారముఁ దెలుపుట

విషాద పూరిత చిత్తుండై యిట్టుల నర్జునుండు బలుకుటయు నతనికి గలిగిన వగపును దనలో నెఱింగికొనియు దానిం గణింపక ధర్మజుండు తెలియనట్లు నటించుచు నప్పటి కార్యక్రమ ప్రకారంబు నిరూపింపం గడంగి "సోదరా! నా విషయంబుం గూర్చి మీరు చింతింపకుండుడు. మదీయ ప్రవర్తనమునకుం దగిన రీతిని నేను నిశ్చయించుకొని యున్నాను. ఎట్లనఁగా, సన్యాసి వేషమును దాల్చి, విరటునియొద్ద కరిగి యతని కింపు గలుగ సంభాషించి యలంచిరి, సభ్యత్వమును బొంది సేవించుచు, నయ్యవనీపతి మన్ననకు బాత్రుండనై యుత్సాహ సమయంబుల నెఱింగి కాలానుగుణ్యముగ పుణ్యకథా ప్రసంగంబుఁ జేయుచు సంతోషమును గలిగించుచుండెను. మఱియు నావేళలం దగినట్లు శ్రుతులు స్మృతులు, జ్యోతిషము మొదలుగాగల విద్యలయం దతని మనంబు లగ్నం బగునట్లుచేసి చాతుర్యం బతిశయింప తత్తద్విషయంబులు వివరించి యలరించుచు నొక్కొక్క సమయంబున నుత్సాహంబును బుట్టించి ద్యూతక్రీడకు బురికొల్పి తద్విద్యా విచక్షణతకుం దగినవియు, మణిమయములును సువర్ణమయములునైన నాయొద్ద నుండెడి పాచికలం గొనిపోయి యతనికి జూపించి మనంబున నాహ్లాదంబు గలిగింపుచు మెలంగెద. మఱియు, నప్పటప్పటికి కాలానుసారంబుగా ననువైన వినోదంబులం బ్రమోదంబుఁ బుట్టించుచు నతని దయకు పాత్రీభూతుండనై కంకుఁడను నామధేయంబుతో చరించుచుండుదును. ఒకవేళ నయ్యూరిలోనెవ్వఁడు నాపూర్వవృత్తాంతంబు నెఱుంగఁదలంచి యడిగెనేని

ధర్మపుత్రునితోడ మైత్రిగలిగి యతనియొద్ద వసియించి యుంటి నని పలికెద, ఇది మదీయ ప్రవర్తనప్రకారం" బని వివరించి యనిల సుతుని ముఖంబును పరీక్షించి ఖేదంబు మీఱచి కనులఁ దొఱఁగనుండెడి శోకాంబువుల నడంచుకొనుచు, నిట్టూర్పుల నడగించి ధైర్యా బవలం భించి యిట్లనియె.

"మహావీరాగ్రేసరుం డగు నిమ్మారుతాత్మజుని విషయంబుఁ దలంచినచో నామనంబు తల్లడిల్లుచున్నది. ఇతండు సామాన్యుండు గాఁడు. భుజబలపరాక్రమం బతిశయింపఁగా నసాధ్య శౌర్యధనులైన యక్షుల మదమడంచి సౌగంధిక పుష్పములఁ దెచ్చి పాంచాలికొసంగెను. దుర్వర్తనుండగు కిమ్మీరుఁడనెడి రాక్షసునిజంపి యరణ్య ప్రదేశమును భయవిరహితము గావించెను. పాపశీలుండైన బకాసురుని యసురులు దొరంగించి, యేకచక్రపురవాసులను రక్షించెను. ప్రబలుఁడగు జటాసురుని దండితుం జేసి, మనలను సంరక్షించెను. హిడింబుని జంపెను. ఇంత మాత్రమే కాదు ఇతఁడు పుట్టినది మొదలు దర్పముతోడనే ప్రవర్తించు చుండును. ఈయుదగ్రమూర్తి యిపుడు కాలమున కగ్గిపడి, యల్పుని వలె నన్యునకు లొంగి సేవింపుచు నెవ్విధంబున వర్తింపఁ గలవాఁడో తోఁచకున్నది" యనఁగా, భీముఁడిట్లనియె.

## భీమసేనుఁడు తన ప్రవర్తన ప్రకారమును ధర్మజున కెఱింగించుట

"అన్నా! నన్నుఁగూర్చి నీవు విచార మొంద వలదు. ప్రవర్తింపవలసిన రీతిని నేను స్థిరపఱచికొని యున్నాను. ఎట్లనఁగా విరాటు నొద్దకు వంటలవాని వేషముతోఁ బోయి, యతనికిఁ బ్రీతిగలుగునట్లు బలికి యనుజ్ఞ వడసి మహానసనందుఁ జేరి కోరిన చందమున మనంబున కింపు గలుగునట్లు పలు చందముల కూరలు మొదలైన పదార్థముల నొనరించుచు, గరగరగా నొప్పువానిని భుజించి మెచ్చుకొను నటుల నా నేర్పును జూపి యతనిం గొలుచుచు, తగినతీరున మెలంగుచుండెదను. ఆఱువిధముల రసములునుఁ దగిన తెఱంగునఁ గూర్చి, దినదినమును క్రొత్తక్రొత్తగా పాకములు జేసి, రుచ్యములైన యా వస్తుచయమును భుజించినపుడు ఆహా! ఇటువంటి పాకశుద్ధిగల నేర్పఱియగు వంట వానిని చూచి యెఱుంగను. కలఁడని చెప్పగా వినియు నెఱుంగను.

ఈ పురంబున నింతటి వాఁడు లేనే లేఁడు' అని యా నరేంద్రుండు పొగడు లాగున వండి పెట్టుచు నెంతకష్టమైనను వగవక యోర్చి జాగరూకత గలవాఁడనై మెలంగెదను. మఱియును, కట్టెలను చీలవేయవలసి యుండును. విఱువ వలసి యుండినను గొడ్డలిఁగాని కత్తిఁగాని కావలయు నని యడుగక నే యా రెండుపనులను నా కాళ్ళతోడను, చేతులతోడను చేసి యనువు పఱచుకొని పొయ్యిలోఁ బెట్టుదును. అచట వంటల వారి కధ్యక్షుండుండెనేని యతని యిచ్చ నెఱిఁగి, యేయే పనుల నియమించునో యాయా పనులను జాగ్రతగా నొనర్చి మెప్పించి యతనితో సఖ్యముగలవాఁడనై వర్తింపుచుండెద. అంతియగాదు, రాజునకు వేడుక సమయములందు సంతోష మతిశయించునట్లు మల్లులతో పోట్లాటఁ బెట్టుకొని, యాఱితేఱిన మల్లునివలె పట్టుపట్టి నా భుజబలమును, నేర్పును మెఱయ నెఱపి, యెంతటి జట్టియైనను జయించి మనుజపతి మెప్పు వడయుచుండెదను. పెక్కండ్రు నామీఁద నడరి యొక్కసారిగా వచ్చినను, నేను వారి నెదిరించి పోరి బలహీనులంజేసి యోడించి రాజును, మఱియు నచట చూచుచుండు వారును నాశ్చర్యమును జెంది మెచ్చుకొనునట్లు నా చాతుర్యమును గనబఱతును గాని యాగ్రహమును బొంది మల్లులను జంప నొల్లను. సింహము, పెద్దపులి, మదపుటేనుఁగు కారుదున్నపోతు మొదలైన మృగముల నెదుర్కొని వానితో నత్యుగ్రముగాఁ బోరి కాళ్లచేతను, చేతులతోడను, నాబలంబు దెలియునట్లుగ వానినిఁ గదలనీయక, విరాటుండు గాంచి యాశ్చర్యమొంది పొగడుచుండ నడంచి యతనివలన మెప్పు వడయుదును. ఈ క్రమంబున నానాప్రకారంబుల వర్తింపుచు నమ్మహీధవునిమన్ననకుఁ బాత్రుండనై వలలుండను పేరుఁ బెట్టుకొని యుచిత భంగి కాలంబుఁ బుచ్చెదను. ఒకవేళ విరటుండు 'నీవింతకు మున్నెచ్చటనుంటివి? ఎవ్వరివాఁడవు?' అని యడిగెనేని 'వంట చేయుటయే వృత్తిగలవాఁడ' ననియు, 'నింతకు మున్ను ధర్మపుత్రునకుఁ బానసంబుఁ జేయుచుంటి' ననియుఁ జెప్పి నమ్మికఁ గలిగించెద. ఇది నేను వర్తింపఁబోవు విధంబు'' అని చెప్పెను. అతని నిశ్చయంబు నెఱింగి, ధర్మతనయుం డది యతనికిఁ దగియుండు తెఱఁగని నిశ్చయించి సమ్మతించి

భీభత్సుని వంకజూచి దుఃఖాతిశయంబున చిత్తంబు గలంగ దైన్యంబు రెట్టింప నిట్లనియె.

"ఈ యర్జునునిం జూచిన నాలో నంతంతకు శోకం బతిశయించు చున్నది. ఇతండసాధ్యంబైన ఖాండవ వనమును దహింపఁ జేసెను. దేవతలు నయితము దర్శింపలేని పరమేశ్వరుంగాంచి తత్కృపా పాత్రుండయ్యె. బలవంతులైన భయంకర రాక్షసుల నుక్కడించి దేవేంద్రునకు మనః ప్రియంబుఁ గావించి, యతనితోడ గద్దియపైఁ గూర్చుండి గౌరవింపఁ బడియెను. ఇంతటి పరాక్రమ, తేజో, బల, యుక్తుండైన యీ యసామాన్య పురుషుఁడు హీనుని చందంబున నన్యుండగు మనుజు నొకని నాశ్రయించి సేవించుటకుఁ దగిన వాఁడగునా? అకటా! ఏరీతిన నితండు కాలము గడుపఁగలఁడో తోఁచకున్నది, ఏమి చేయుదును?" అని వగచి పలుకుటయు, నమ్మాటలు విని యర్జునుం డతని కిట్లనియె.

అర్జునుఁడు తాను వర్తించు విధమును ధర్మజున కెఱింగించుట

"అగ్రజా! వగపు విడిచి, దైవికంబుగా నాకుఁ దటస్థించి యున్నయొక విషయంబును జెప్పెదను వినుండు. నేను దేవలోకమునకుఁ బోయి నపు డచ్చటి యచ్చర కాంతలలో మిన్నయయిన యూర్వశి ఒక కారణంబున నన్ను నపుంసకుఁ డగునట్లు శపించినది. దేవేంద్రుం డది యెఱింగి 'అర్జునా! ఒక సంవత్సర కాలము వరకును నజ్ఞాతవాస మొనరింపవలసిన సమయము తటస్థింపఁగలదు. ఆ సమయమున నీ వీ శాపఫలము ననుభవించి యనంతరము శాపమోక్షణంబు వడయుము. ఇదియును నీకు ననుకూలముగనే యేర్పడినది' అని కరుణాయత్తచిత్తుండై వరం బొసంగెను. కావున, తచ్ఛాప ప్రకారముఁగ నేను బేడి యాకృతిం దాల్చి, గాండీవమును ధరించిన, కాయలేర్పడియున్న నిడుదలగు నా బాహువుల మరుగుగ రవికయు, చేతులకు దంతపు గాజులును ధరించి విరటుని పాలికేగి, 'నరేంద్రా! గొప్పవారైన మీవంటి రాజుల యింట్ల లోని కన్నియల కాటపాటలు నేర్పుటయందు నేను మిగుల నేర్పు గలిగి యుండుదు. మీయొద్దఁ జేర్చుకొని యా కార్యంబునకు నియమించిన యెడల మీ యిష్టానుసారముగ పనులు చేసెదను' అని చెప్పి

యమ్మహీసుని చిత్తమున కెక్కునటులొకి యతనిఁ గొలిచి యుండెదను. బృహన్నల యను పేరుఁబెట్టుకొని, కన్యాకాంతఃపురమున వసించుచు నాటక స్త్రీయ వలెనటించుచు, నతనిని మెప్పించెదను. విరటుం డెప్పుడు నింతకు మున్ను నీవు వసించుచుంటివి? ఎవ్వరిదానవు? అని య్యేదేని నడిగిన యెడల నృత్తగురుపునై నేను ద్రౌపతి యొద్ద నామె సమ్మాన మును బొందియుంటిని' అని పలికెదను. ఇదినా నిశ్చయంబు తెఱంగు ఇటుల వర్తించుట తగునో తగదో మీర లాలోచించి తగువిధంబు నిర్ణ యింపుఁ "డని చెప్పెను.

అర్జునుండు చెప్పిన పద్ధతి యుక్తముగాఁ దోఁచుటయు, పాండ వాగ్రజుం డియ్యకొని 'సరి ఈరీతి నీకుం దగినదిగానే యున్నది. అటు లనే చేయు' మనిచెప్పి, నకులుని మొగంబుచూచి నెమ్మనంబున నుమ్మ లికం బతిశయింపఁగా, గద్గదకంఠ స్వరముతో "కటకటా! దైవతంత్ర మిట్టి దయ్యెను గదా? చక్కని దేహమును, గొప్పతనమును, గొప్ప బుద్ధియు, నాగరికమును, నిపుణతయును, నితనిం జూడంగనే, చెప్పకనే, తోఁచుచుండును. ఇటువంటి సుకుమారమూర్తి యగు విరాటుని పురం బున నన్యులకుఁ దనచొప్పు తెలియకుండు లాగున నెవ్విధంబున జరుపఁ గలఁడు? ఈ దుఃఖము నాలోఁ బాదుకొని మిక్కిలి బాధించుచున్నది. దీనికేమి చేయుదును?" అని పలికెను. ఆపలుకులు విని నకులుఁ డన్న మదిలోని విచారంబు దొలంగ నిట్లనియె.

## నకులుఁడు తన ప్రవర్తన ప్రకారమును ధర్మజునకుఁ దెల్పుట

అన్నా! నేను విరటునొద్ద నశ్వశిక్షకుఁడనై కుదిరి వర్తించె దను. గుఱ్ఱముల లక్షణంబులును వానిని శిక్షింపవలసిన విధులును నేను బాగుగ నెఱింగి యున్నాఁడను. వినుము, గుఱ్ఱములతో మొగ. మెంటి జతలు తగిన లాగున నేర్పరచి వానిం గూర్చు తెఱంగును, త్రాళ్ళచేఁ గట్టఁదగిన యీడుగల గుఱ్ఱపుబిళ్ళలను బట్టి వానిజాడలు తెలిసికొని మాఱపెడు విధమును, కళ్ళెముల తాకున కోర్వని తురంగం బులనుక్రమముగా నలవాటులచే నోర్చునట్లు చేయురీతియును, చెడుగు ణంబులు గలవై లోఁబడని వారువములను శిక్షించి బాగుచేసి మంచి దారికిఁ దెచ్చురీతియును, నేను చక్కఁగ నేర్చియున్నాను, లాయమునఁ [illegible] నెట్టి సంకటమును గలుగనీయక, యప్పు

డపుడును వానిని చూచుకొనుచు గుఱ్ఱపు వాండ్రందఱకును నూఱట గలుగు భంగి వర్తించుచు రాజు మన్ననకుఁ బాత్రుండనై యుండెదను. పేరును నునికి పట్టును నతం డడిగెనేని దామగ్రంథియను నామము గలవాఁడ ననియు ధర్మజునియొద్ద నశ్వశిక్షకుఁడనై యుంటి ననియుం జెప్పెదను '' అని పలికెను. అదివిని ధర్మనందనుఁడు 'మంచిది. ఈ పద్ధతి యుక్తముగనే తోచుచున్నది. అటులనే చేయు మని యూఱడిల్లి పలికి, పిమ్మట తనదృష్టులను నిరుపమాన తేజోధనుండైన సహదేవుని వైపు నకు మరలించి, తొందర పాటున దైన్యముఖుండై యిట్లనియె.

'కపటములేని మానసము గలవాఁడును, పెద్దల కెంతయుం బ్రియముగలుగ వర్తించువాఁడును, గర్వము లేనివాఁడును నీతిమంతుఁడును, దోషరహితమగు నడతగలవాఁడును, ధర్మమునందే దృష్టి గలవాఁడును, సుందర కోమల దేహుండును, కుంతీదేవికి మిక్కిలి ముద్దుగా నొప్పుచుండు వాఁడును నైన, యీ సహదేవుండు హీనుని వలె నన్యుని సేవింపుచు, తన తెరంగును పరులు తెలిసికొనకుండు విధంబున చరింప నేర్చునా? అయ్యో! ఇటువంటి వానికా యింతటి యవస్థ గలుగుట? దైవమెవ్వరి నెంత సేయుదు?' అని వగచుచున్న జ్యేష్ఠుంగాంచి సుగుణశీలుం డగు సహదేవుం డిట్లనియె.

## సహదేవుఁడు తనప్రవర్తన ప్రకారమును ధర్మజునకు దెల్పుట

అన్నా! నన్నుగూర్చి నీవు వగవవలదు. నేను గొల్లవానివలె వేషముదాల్చిపోయి విరాటునియొద్ద పసులకాపరినై యుండి పరు లకుఁ దెలియని విధంబున చరించు చుండెదను. ఆ పనియందు నాకు మిగుల నేర్పుగలదు. వినుము, గొడ్డుపోతు పసులను సయితము తగిన యుపాయంబులచేత చేపునట్లుచేసి పాలు పిదుకఁగలను. బక్కచి క్కిన యావులను పరీక్షించి యనువగు పద్ధతులచే కండఁబెట్టి బలియు నట్లు చేయగలను. రోగములచేఁ జిక్కి చావనైయున్న తెగులు గొడ్లకు తగిన చికిత్స లొనరించి, వ్యాధిని దొలఁగించి, తేకొని మునుపటివలె నగునట్లు చేయుగలను. పాలు పిదుకనీయక మకరుచేయు గోవునైనను, నుపాయంబున నడకువకుఁదెచ్చి సులభముగా పాలు పిదుకఁగలను. సమీపమున కరిగి నిర్భయముగా నురుగుగట్టి విడుచుట యును, బెదరుఁ బోగొట్టుటకును, మంచినీరును, తగిన మేపురు గలిగి



పాండవుల జ్ఞాతవాస క్రమము నిర్ణయించుకొని మునులకుఁ దెలుపుట

యుండెడి చోటులకు మరలించి మేపుటకును, సింహము పులి మొదలైన దుష్టమృగ బాధలు గలుగకుండునట్లు చేయుటకును, దొంగల జేరనీయక తరుముటకును, నేను బాగుగా నెఱింగి యుండెదను. కావున నా కార్యమును సులభముగనే సాధింపఁగలను. విరాటుండు నన్ను 'ముందు నీ వెందుంటివని యడిగినచో 'యుధిష్ఠిరుని యావుల మందలం గాంచుచుంటి' ననియు, 'నాపేరు తంత్రీపాలుం' డనియుం జెప్పి, మన రహస్యంబు దెలియకుండు లాగున నప్రమత్తుడనై వర్తించుచుండెదను" అని యిట్లు సహదేవుం డగ్రజన్ముని మదిం బొసఁగిన వెఱపు తొలంగునట్లు పలికెను.

యుధిష్ఠిరుండా పలుకులు విని యాఱడిల్లి "ఈ పద్ధతి యుచితంబు గాఁ యున్నది. సరి! ఆలాగుననే చేయుము" మని యనుమతిఁ జేసి పిమ్మట పాంచాలి వదనం బవలోకించి మించిన దుఃఖంబున "ఈయతివ మిక్కిలి ముద్దరాలు. ఎన్నఁడును సేవనలుసుం జేసి యెఱుంగదు. కోమల శరీరము గలది. కష్టమున కోర్వఁ జాలదు. గొప్ప తనము నందే దృష్టిగల బుద్ధిమంతురాలు. ఒంటరియై యుండినది గాదు. ఏ కార్యమెటుల చేయవలయునో యదియునుం దెలియనిది. నీచపు పను లొనరింప నొల్లదు. ఇట్టి యీతరుణీమణి మనల నెడబాసి పరుల పంచం జేరి సంకటములకోర్చి యుండ్లచిత్తంబెఱింగి తగిన విధంబున మెలంగ నేర్చినదగునా? అయ్యో! ఈదుర్దశం దలంచిన నాగుండెలు ప్రేలుచున్నవి. ఏమి చేయవలయునో తోఁచకున్నది" అని హీనస్వరంబుతోఁ బలికెను అతని చిత్తంబున హత్తుకొనిన యుత్తరపాటు తొలగింప నన్నువైన వచనంబులతో ద్రుపదనందన యిట్లనియె.

### ద్రౌపది తాను వర్తించు రీతిని ధర్మజునితోఁ జెప్పుట

"నేను గట్టువాలు వేషంబుఁదాల్చి విరాటరాజు భార్యయుండెడి యంతఃపుర సమీపమునకుం బోయి యామెకు గనఁబడు నట్లు నటింపుచుండి యామెయే తనయొద్దకు నన్నుఁబిలిపించుకొనునట్లు చేసి యచ్చట కొలువుఁ గుదురుపరచుకొని మాలిని యను నామముతో వర్తించుచుండెదను. 'ఇది యుత్తమకాంత. కావున హీనములగు నీచకార్యములు గావించునది కాదు, సుగుణవతి' యని రాజపత్ని బుద్ధికి దృఢముగాఁ దోచు లాగున చరించెద. అచట నేను చేయఁబోవు పను లెట్టివనఁగా, క్రొత్త

క్రొత్తదగు పలువిధంబుల పరిమళ చందనంబులును సిద్ధపరచి, యింపు బుట్టుభంగి దేహంబున నలందుదును. మంచి కస్తూరిని మెత్తగా మెదిపి యందముగా మొగంబునఁ బొట్టుఁబెట్టుదును. మేలైన పూవులను ప్రతి దినమును వేరు వేరు రీతుల దండలుగట్టి, యెట్టిముడి కేసరము తగియుండునో చూచి యది యొసంగుదును. హారములు మొదలగు సొమ్ములను మిగుల నాశ్చర్యకరముగాఁ గనుపట్టు చాడ్పున నలంకరింపుదును. నానా విధంబులను శృంగారించుట యందు నేర్పుగలదాననై రాజ కాంతలంపు నకుం బ్రియంబులగు పనులను గావించి యమ్మానినీ మణికి నాపై నెక్కుడు మక్కువ గలుగునట్లు చేసి మరియాద గలుగఁ గొలుచు చుండెదను. 'పూర్వము నీ వెచ్చోట నుండిన దాన' వని యడిగిన యెడల 'నేను పాంచాల రాజనందన యొద్ద పనికత్తెనై యామె గౌరవముతో చెప్పిన పనులను చేయుచుండిన దాన' ననియు 'మాలిని యనుపేరు గలదాన' ననియును జెప్పెదను'' అని పలికెను.

ద్రౌపది యివ్విధంబునఁ జెప్పిన విని యుధిష్ఠిరుండు సమ్మతించి సుంత యోచించి 'సుందరీ శిరోమణి! నీవు మన వంశమును, గౌరవమును, కులాచార ధర్మమును రక్షింపవలసిన దానవు. పుణ్యశీలవైన యుత్తమ కాంతవని యెరుంగుదునుగాని, అయినను, దుష్టశీలురగు తులువల వంచనలకు లోఁబడక, వారి చిత్తవృత్తులం దెలిసికొని యప్రమత్తవై మోసపోవక మెలంగుచుండ వలయుం జుమీ! ఇదియె నేను చెప్పవలసిన తుదిమాట'' అనుటయు నామె యతని యభిప్రాయమును దెలిసికొని, వెగటు దనంబుతోఁ గూడిన చిరునగవు మొగంబునఁ దోఁపగా ''మహీ వల్లభా! యుత్తమకాంతలు కారణ వశులై సైరంధ్రీవృత్తి నవలంభించినంత మాత్రమున తమ గౌరవమును బోఁగొట్టు కొందురా? పతివ్రతలు పతివ్రతలుగానే చరింపుదురు. కాఁబట్టి యట్టియల్పవృత్తి నవలంభించినను, ఆకార్యములందుండు నపుడు మితముగా మాటలాడుటయు, వ్రతముగల దాననై గౌరవమునకు భంగము గలుగని విధంబున పాప భయంబుతో చరించుటయు, నావశ్యకములని నేను చక్కఁగా నెఱింగి యుండెడి దానను'' అని బదులు చెప్పెను. అంతట నతం ''డది యట్టిదియ యగుం బో''మ్మని చెప్పి తమ్ముల గలయఁ గనుంగొని ''అనుజులారా! మనము గూఢ ప్రకారమున చరింప వలసిన విధంబులను నిర్ణయించు

కొంటిమి. ఈ క్రమంబుననే ప్రవర్తింపుదము. ఇదియ కార్యనిశ్చయ ప్రకారంబు. మఱలి మనము వచ్చునంతవరకును నగ్నిహోత్రములను ధౌమ్యులు వారు. రక్షించుచుండ వలసినది వంటలవారును, పాకశాలాధికారియును, పాంచాలి పరిచారికలును ద్రుపదుని పురంబునకరిగి యచట నుండవలసినది. ఇంద్రసేనుఁడు మొదలగు సారథులు రథంబులుదోలుకొని ద్వారకాపురంబునకుఁ బోవలసినది. వీరిలో నెవరినైనను, నెవ్వరేనియు మన వృత్తాంతముం గూర్చియడిగిన యెడల 'వారు మమ్ము ద్వైతవనంబులో విడిచి పోయిరి. ఎందరిగిరో పిమ్మట వారిజాడ నెఱుంగమని చెప్పవలసినది' అని తగిన ఏర్పాటులు గావించి లోపలి పరిజనంబును నిలువ నియోగించి యందరను వీడ్కొలిపెను. ఆ సమయమున ధౌమ్యుండు పాండుపుత్రుల కిట్లనియె.

## ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మము లెఱింగించుట

పాండురాజ నందనులారా! తెలిసిన వారికిఁగూడ హితులు యుక్తాయుక్తములను జెప్పుదురు. కావున, మీరు బుద్ధిమంతులైనప్పటికిని నేను మీకు హితమును గోరుచుండు వాఁడ నగుటచే సందరకును సమయమునకుఁ దగిన బుద్ధుల నుపదేశించుచున్నాను. వినుండు, కౌరవవంశములోఁ బుట్టి గౌరవముగాఁ బెరిగిన మీరు మానావమానములకోర్చి యుపేక్షవ గలిగి యొరు సేవించుట మిగుల కష్టముగా నుండును. ఒకవేళ నవమానము తటస్థించి మీర లోర్వలేక, రహస్యవర్తనముం దలంపక బయలుపడి పరాక్రమించిన యెడల మీకార్యము చెడి చేటు వాటిల్లును. కాఁబట్టి యీవిషయంబునఁ బెద్దయు నోరిమి గలిగియుండవలయును. ప్రమాదము గలుగకుండుటకై నాకుఁ దెలిసినవరకును మీకు బోధింపవలసినది నావిధి. రాజులను గొలిచి యేవిధమునంగాని బ్రతుకఁదలంచిన మనుజులు కీడుఁబొందక వర్తింపవలసిన సాధారణమగు నీతిని సంక్షేపముగాఁ దెలిపెదను. రాజానుగ్రహమును బడయఁ గోరినవాఁడు, సభకు యోగ్యమగు విధంబునఁ బోయి తనకుఁ దగినచోటఁగూర్చుండి, యుచితమయిన వేషముతో రాజును సందర్శించిన యెడల నతనికిఁ బ్రియంబు గలుగును. రాజునకు తనపై నభిమానము గలిగినపుడు 'నేను రాజానుగ్రహ పాత్రుఁడను. నే నవ

నికిని వెఱచు వాఁడను గాను అని తలంచి గర్వించి మరియాజ్ఞ దప్పి వర్తించిన యెడల ప్రభుని యనుగ్రహంబు తొలంగుటయుగాక, యాపదను బొందుటనిశ్చయము. తనకు మహీపతితోడ నెంత చనవు గలిగి యున్నను, రాజగృహంబునకు సమమైన మందిరమును గల్పించు కొనుటయు, రాజు వలెనే వేషమును దాల్చుటయు, రాజు విహరించు దాని వంటి విహారము గలిగియుండుటయు రాజుమాటలాడినట్లు మాటలాడుటయు, నెవ్వనికిం గూడదు. రాజులు తమ యాజ్ఞ తప్పి వర్తించిన వారిని కొడుకులైనను, మనుమలైనను, సోదరులైనను నాప్తులైనను తమ మేలుకొరకై నిర్దయగా శిక్షించుదురు. గనుక వారి స్వభావముం దెలిసికొని ప్రవర్తింపవలయును. ఎవఁడుగాని తనవలెనే రాజున కిష్టుఁడై సమర్థుఁడైన మఱియొకండు పూని చేయుకార్యమున కడ్డము వచ్చి యాపనిని తాము చేయఁబూనినచో, రాజునొద్ద తనకు మునుపు గలిగియుండినమరియాద తొలఁగుటయే గాక ముప్పునుగూడ సంభవించును. రాజునొద్ద నుండెడి యనేకులకు కష్టము గలిగించునది యెంతటి గొప్ప కార్యమైనను నదిముందు కీడునుగలిగించును. కావున నట్టిపనిని బుద్ధిమంతుఁడు విడువవలయును. ప్రభుని దగ్గఱపలుకక యూఱకుండరాదు. అందరితోడను గట్టిగ మాటలాడ తగదు. యెవరియందు రాజు మనస్సు గలిసియుండునో వారితో మాత్రము మితముగా మాటలాడుటమంచిది. ఇతర ప్రదేశములలో జరిగినవియు, తనకు బాగుగాఁ దెలిసినవియు చెప్పుటకును వినుటకు తగినవియైన విషయములను రాజుతో చెప్పవలయునేగాని, రాజసదనంబునందలి వృత్తాంతములు తానెంతెఱిగియుండినను, రాజుతోడగాని యన్యులతోడఁగాని చెప్పకూడదు. మాటిమాటికి నంతఃపురమునకు పోవుట వచ్చుట యచ్చోట వర్తించు పరిచారికాది జనులతోడ స్నేహము గలిగియుండుట, మొదలగు కృత్యములు సేవకులకుం దగినవి కావు. అటుల ప్రవర్తించుచుండినచో తప్పక కీడుమూడును. ఉత్తములైనయాసనములును, వాహనములును; తమకు రాజుదయతో నొసంగిననేగాని, నృపతి మన్ననకు పాత్రుండై యుండుటకై యట్టివానిని తానుగానే యెక్కఁజనదు. రాజుమన్నించినపుడు సంతసించుటయు గర్వించుటయు, నవమానించినపుడు ఖిన్నుండై దుఃఖించుటయు, సేవకునకు కూడదు. భూపాలుం డెవ్వరికైనను, మేలుగాని, కీడుగాని, చేయదలంచి యుండుటతనకు దెలిసియున్న యెడల సేవకుఁడు దానిని పరులకుఁ దెలుపక, తెలియని

హాని చందముననే మెలంగవలయును, కాని యితరులనుగాని, యామేలు కీడులను పొందఁబోయెడి వారితోగాని చెప్పతగదు. ప్రభుండేదైన నొక పనిని చెప్పి చేయుమని నపుడు, దూరస్థలముల కేగుట కష్టమనిగాని, యాకలి కోర్వఁజాలననిగాని నిదుర వేళ తప్పుననిగాని, మఱియెట్లుగాని బదులాడక ఎంతకష్టమైన వహించి చేయవలయును. తన కెంత చనవు గలిగియున్నను నృపతి తనపై నెంతదయగలిగియుండినను, రాజుసొమ్ము నెప్పుడును ముట్టక కడు జాగ్రత్తగా నుండవలయును. ఆవులించుట, తుమ్ముట, ఉమియుట, నవ్వుట, ప్రక్కగనుండు వారికిగాని రాజునకు గాని రోతను బుట్టించును. కావున నటువంటి కార్యములు రాజసభలో నుండునపుడు రహస్యముగా జరుపుకొనుచుండవలయును. శత్రువుల సేవకులతోడను నేరము మోపఁబడియుండు వారితోడను నిరాకరింపఁబడి యున్న వారితోడను స్నేహముకలిగియున్నచో చేటుకలుగును. రాజు మన్ననునకు ప్రతిష్ఠ తానెంతటి యున్నతస్థితియం దుండినను. నరపతియొద్ద నుండునట్టి యధికులతోగాని యల్పులతోడగాని యెపుడును వైరమును బెట్టుకొనరాదు. అందరితోఁడను స్నేహము కలిగి యుండ వలయును. భాగ్యము గలిగియుండుట యనుభవించుటకే కదాయని యెంచి బాహిరముగా భోగములొంద తగదు. అడఁకువతో, తన భోగము లన్నియు రహస్యములుగా జరుపుకొనుట మంచిది. మీరు పోయి నచోట నాయుపదేశంబును మఱవక యీపద్ధతులం దెలిసి మెలంగితి రేని మీకు సౌఖ్యంబు నొందఁ ననువగునని యిట్లు పురోహితుండు సేవా ధర్మంబుల నెఱింగించిన, ధర్మజ భీమార్జున నకుల సహదేవులు, సంతృప్తియు సంతోషమునుం గలవారై "మహాత్మా! మాకు తల్లియైనను తండ్రియయినను దైవంబైనను గురుండైనను చుట్టమైనను, స్నేహితుఁడైనను, సర్వమును మీరేకాని యితరులు లేరు. మాయందు కృపగలవారై తెలియనివారమగు మాకు సేవాధర్మంబు లెఱింగించి మమ్ము ధన్యులను గావించిరి". అని పలికిరి.

ధౌమ్యుఁడు వారితో "మీరు యిన్ని సంకటములు కలిగినను నోర్చి మడఁగి యీయొక్క సంవత్సర కాలమును జాగరూకత కలిగి లయును. అటుపిమ్మట నెట్లువర్తించినను భయము లేదు" అను నట్లే చేసెదమనిపలికి పాండునందనులు నమస్కరించుటయు, కార్యసాఫల్యం బగునుగాక యని వారి నాశీర్వదించి, వారికి

శుభముగలుగుటకుగా నచట నగ్నిని ప్రతిష్ఠించి నియమముతో తత్కాలమునఁ జేయవలసిన పూజలుగావించి ప్రమాణ సమయోచిత మంగళప్రద మంత్రములను చదువుచుండెను.

## పాండవులు ప్రయాణమై పోవుట

పిమ్మట పాండవులు ప్రీతి హోత్రునకును, పురోహితునకును ప్రదక్షిణ నమస్కారములొనర్చి యమ్మహీసుర వరేణ్యుని యనుమతిఁబడసి, యతండును తమవెంట వచ్చుచుండగా పాంచాలీ సహితులై యటనుండి కదలి శుభ శకునంబులు గనుపట్టుచుండగాఁ జని చని, దశార్ణ దేశమున కుత్తరమందును, పాంచాల దేశమునకు దక్షిణమునను, శల్వ శూరసేన విషయంబులలోన కాళిందీతీర మార్గంబుఁబట్టి కందమూల ఫలాదుల నాహారించుచు చాల దూరమరిగి, యట నట, కొండలును, నదులును, రమణీయములైన యడవులను, కొలంకులును, పచ్చిక బయళ్ళునుం గనుచు వానిని నిర్గమించి మత్స్యదేశపు టెల్లంజేరి "స్వామీ! ఇంక మీరు నిలువుం" డని ధౌమ్యుని నిలువరించిన, వల్లెయని వారల వీడ్కొలిపి యతం డచ్చట నొక్క పుణ్యాశ్రమంబుంగని యందు నివసించియుండె.

పాండుసుతులు గ్రామంబులు సొరక యడవి దారులంబట్టి పోయి పోయి విరాటుని పురంబునకు కొంతిదూరముననుండెడి యడవిం జొచ్చి నడచుచున్న సమయంబున, కంటక శిలామయంబులైన ప్రదేశములందు బహుదూరము నడచుటం జేసి, సుకుమార గాత్రయయిన ద్రౌపది పాదంబులునొవ్వగా నడువలేక యలసి వాడిన మేనుతో కట కట పడుచు పతులంజూచి "అయ్యో! ఇట చూడుఁడు. కాలి వ్రేళ్ళు పగిలినవి. కాళ్ళును ముండ్లును గ్రుచ్చుకొని నెత్తురులు గారుచున్నవి. ఆయాస మధికమైనది. విరాటుని పురము దగ్గఱగా చేరవచ్చునని యాసగలదానినై యింతవరకును కష్టమునకు సహించి యెట్లో నడిచితిని. ఆపట్టణ మింతవరకునసం దోఁపకున్నది. ఎంతదూరము మఱియుంగలదో తెలిసినది కాదు. ఏమిచేయుదును? ఇప్పటి నాస్థితిలో నేనింక నొకయడుగైనను నడువజాలను. మిక్కిలి కష్టముగానున్నది" యని కడుదీనముగా పలుకుచు నడక మందగింపఁగా, తప్పటడుగులు పెట్టుచుండుటయు చూచి ధర్మనందనుం డామె పడుచున్న బాధలం దలంచి తనలోకరుణయు 'నెటులనైనను విరాటునినగరమును చేరవలయుననెడి తలంపు గల

వారమై యెచ్చటను నిలువక కడుదవ్వు బహువేగముగా నడచి వచ్చి నారము. మన వెంట నడచుటచే కుసుమ కోమలగాత్రయయిన పాంచాలి మిగుల డస్సినది. అటుచూడుము. అయ్యో! పాపము! అడుగు నిడలేక వందురుచున్నది. కాఁబట్టి నీ వీలతాంగిని కొంతదూరము భుజములపై నిడుకొని మోసి తెమ్ము, లేనిచో మనము శీఘ్రముగ పోవఁజాలమని” చెప్పెను.

అన్న యాజ్ఞప్రకారముగా వల్లెయని నకులుండా సుదతీమణిం డన భుజంబున నెక్కించుకొనినడువసాగెను. కాని నడిచివచ్చిన యలసట పెంపున నతండును, మందగమనుండై వెనుక జిక్కుటయు, ధర్మజుండు నకులుండు నయితము డస్సి నడువలేకుండుటం దెలిసికొని పాంచాలిని మోసి తెచ్చుటకై సహదేవుని నియమించెను. అతండు కొంచెము దూరము కొనివచ్చి పిమ్మటనడువలేకుండుటయు, నతనికిని శక్యముగాకున్న దని ధర్మరాజెఱింగి వివ్వచ్చుఁ బిలిచి “అర్జునా! ఇదిగో! కనుము ద్రుపద నందనయలసి నడువలేకున్నది. మోసి తెచ్చుటకైనను శక్తిచాలక మేమందఱము ను డస్సి యున్నారము. ఇపు డిచ్చోట నెందైనను మనము విడిసి యుండుటకును వలనుగాదు. ఎల్లెనియుం బోయి తెఱవఁసియున్నది. ఇంక నీవైనను ద్రుపద నందన నెత్తికొనివచ్చి విరాటపురసమీప భూమిం జేర్పుము. కాదేని మన ప్రయాణంబు సాగనేర” దని చెప్పెను. అతం డట్లె కానిమ్మని యామదిరాక్షిని నిజాంకతలం బెక్కించుకొని నడువఁ దొడంగెను.

ఈ ప్రకారముగా వెతలుబొందుచు వారలు కొంతదూరంబు బోయినంతటఁ వారికి విరాటుని పట్టణము దృగ్గోచరంబయ్యెను. నగరంబు కనుపట్టుటయు దాపునకు వచ్చుట నెఱింగి కౌంతేయాగ్రజుండు తమ్ములం జూచి “అనుజులారా! అదిగో! మత్స్యపురముచూపట్టుచున్నది. దాపునకు వచ్చినారము. మనమిపుడీ యాయుధములతో నిట్టి వేషములతో బోయినయెడల నితరులు సులభముగా మనలం దెలిసికొనఁగలరు. కాఁబట్టి యన్యులెఱుంగకుండుటకై, ఇచ్చోట నిలిచి మన యాయుధము లెందైనను గుప్తముగాదాచి, ఈ వేషములు మార్చి వేఱు వేషములు ధరించి పురప్రవేశముఁ గావింత”మని చెప్పిన యదియ మంచి కార్యంబని యందఱును సమ్మతించి నిలిచిరి.

అపుడు సవ్యసాచి యాజ్ఞసేని నొకచోటనిసుక నేలలోడించి నిలిచె. ధర్మజుఁడతనిఁజూచి ''సోదరా! తక్కిన మనయాయుధములమాట యెట్టులనైనను నగునుగాని నీచేత యీగాండీవము కలిగియుండినచో మనల నుదుర్యోధనుండు నిశ్చయముగా కనిపట్టఁగలండు. దీనిని విడిచియుండుట నాచిత్తంబునకు సమ్మతముగా నున్నది. ఐననేమి చేయుదుము? కార్య సందర్భమును బట్టి యీవిల్లును దాచిపోయిననే కాని యత్నము కొనసాగనేరదు. జను లీగాండీవమును చూచి కేని భయపడుదురు. మనయొద్ద నిది యుండిన కార్యము చెడునని చెప్పెను.

ఆ విల్లును విడిచియుండుటకు తనకు నిష్టముగాకున్నను నగ్రజుని యాజ్ఞను బట్టియు, సందర్భమును బట్టియు నర్జునుండు తనమనంబు బదిలపఱచుకొని యన్న చెప్పిన చొప్పునఁ జేయుటకు నిశ్చయించి నతం సమ్మతిఁ దెలియఁబలికి యాయుధంబులు దాచుటకు తగినచోటు కనుంగొన నెంచి నలుదెసలంజూచి, స్మశానభూమికి దగ్గరగా నుండెడి యడవిలో ఆకాశమును మీఁదికి త్రోయుచున్నదో యని తోఁచునట్లు కడు ప్రోడిగా మింటికిం బెఱిగిన నిడుపులైన కొమ్మలుగలదియు, దిక్కులు కొలుచుచున్నుదనట్లు నిడుపులగు ప్రక్కశాఖలు గలదియు, రెమ్మలు దట్టముగా నొకవానితో నొకటి కలసి జొంపములై యుండుటచే పగలు సయితము చీకటి గలిగియుండునదియు ఆకులచే నిబిడమై సూర్యరశ్మి జొరరాని విధంబున నుండినదియు, గాలిసొచ్చుటకుగాని వీచుటకుగాని సాధ్యము గానట్లుండునదియు కాకులు గుడ్లగూబలు మొదలగు వాని ధ్వనులచే సమీపమునకుఁబోయిన వారికధికమైన భయమును గలిగించుచుండునదియు ఇతరులు చేరనొల్లనిదియును నైన గొప్పదగు జమ్మిచెట్టు నొకదానిని జూచెను.

ఆ వృక్షమును ధర్మసుతునికిం జూపించి ''ఇదిగో! ఈ జమ్మిచెట్టు ప్రేతభూమికి దాఁపున మొలచి వర్ధిల్లి కాకఘూకములకును, పిశాచములకును నునికిపట్టయి చూపరులకు భయంకరముగా కనుపట్టునదిగా యున్నది. మనయాయుధము లీవృక్షముపై బెట్టవచ్చును. చూడుము. మిక్కిలి యెత్తుగలిగి విశాలమగు కొమ్మలతో పఱపు గలిగి యున్నందున యీచెట్టు నెవ్వరును నెక్కజాలరు. ఎవరికిని దీని నెక్కవలసిన యావశ్యకము కలిగియుండదు, మన యాయుధములం జేర్చి శవాకారంబుగా నిచోటంబడియున్న వెండుకలు చర్మము మొదలగువానితో

చేర్చి కట్టిపెట్టినయెడల నిజముగా పీనుంగని తలంచి చూచినవారు చేర నొల్లక పోవుదురు. కావున మనము భయ మొందవలసి యుండదు. కావల
లసి నపుడు వచ్చి తీసుకొనవచ్చును" అని చెప్పెను. అతండు చెప్పినట్లు జమ్మిచెట్టు సర్వవిధములం దగియున్నందున నటుల చేయుట కందఱును సమ్మతించిరి.

## పాండవులు తమ యాయుధములు జమ్మిచెట్టుపైఁ బెట్టుట

అపుడు ఫల్గునుండు గాండీవమువంకఁగని మిక్కిలి చింతాక్రాంతుఁడై "గాండీవముచేతనే, దేవతలు రాక్షసులు మొదలగు వారల నెల్లరను జయించితిని, అటువంటి యీవిల్లు నిపుడు వృక్షముపై గట్టి పెట్టి విడిచిపోవలసినట్లు నిర్ణయించెను. ఏమి చేయవచ్చు" నని ఫలికి యల్లెత్రాటిని యెక్కుడించెను. ధర్మసుంతుడును తన విల్లు నటుల వేసి భీమ నకుల సహదేవుల వంకఁజూచి వారి విండ్లను ప్రతాపమును బొగడి మీరును నెక్కుడింపుఁడని చెప్పిన, వారును నల్లెత్రాళ్ళు సడలించిరి. ఇట్లు వారంఱుం జేయుటయును, ధర్మనందనుండు వానినన్నిటినిం దీసి కొనిచేర్చి పూర్వోక్తక్రమం బునఁ గట్టి, తాను ధర్మదేవతచే వరమును పొందినాఁడు. కావున యాకట్టనుంగొని శమీవృక్షంబుపై నెక్కి బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, దిక్పాలురను, సూర్యచంద్రులను. పితృదేవతలను భూమ్యాకాశంబులను స్తుతించి యెత్తున నొక కొమ్మకు వ్రేలగట్టెను.

పిమ్మట నాయా యాయుధంబుల యధి దైవతలంబుల నుద్దేశించి నమస్కరించి నిర్మల మనస్కుండై "ఓ యాయుధములారా! మీరు మాలో నాకును నర్జుననకును దప్పయొండ్లకు మేమువచ్చికై కొనునర కును కనుపడ కూడదు. పరులు మిమ్ము చూచినపుడు గాని ముట్టవచ్చిన పుడుగాని భయంకర సర్పరూపములతో కనుపట్టవలసినది. మాలో భీము నకు కోపమధికము. అతండెపుడునుదుర్యోధనాదులధ్వంసముఁ జేయుటకు కోరుచుండును. ఒకవేళ నెపుడైన వారిమీదరోషముమించి కైకొనవచ్చు నేని యతనికి మీరు స్వాధీనులుగా కూడదు. ఏక సంవత్సర కాలము వరకును నిర్విఘ్నంబున నుండ వలయును" అని యివ్విధమున ప్రార్థించి చెట్టుదిగి దానికి ప్రదక్షిణముఁగావించి యాయుధములం గూర్చి తాను చెప్పిన పలుకులకై భీముండు మనంబున గినుకఁ జెందునేమోయని యత నిలో కళంకము లేక లేకుండునట్లు చేయుటకై కౌఁగలించి మంచి మాట

లాడి యనునయించి, యచ్చోట తా మొనరించిన కృత్యంబు నయ్యెడ సమీపమునుండి చూచుచున్న పశులమేపరులు మొదలగువారికి తెలియకుండునట్లు మరుగు చేయనెంచి వారలంజూచి "గోపాలులారా! మాతల్లి నూఱేండ్లునిండిన ముసలిది, చనిపోయినది. చచ్చినవారిని దహింపకయు, పూడ్చకయు, చెట్టుపై వ్రేలఁగట్టుట మాకులాచారము. కావున మేమును నిట్లు చేసినాము"మని నమ్మునట్లు చెప్పి, దాపున చచ్చిపడియున్న యెద్దునొకఁగని దానితోలు నొలిచి తెచ్చుటకు సహదేవునిం బనిచిన యతండట్లు కావించెను. ఆయుధములు, శీతాతప వర్షంబులకు చెడకుండుటకై వానిపై యాచర్మమును పొదివి తత్సమీపమున దిక్కులేక చచ్చి పడియున్న యొక పేదవాని కళేబరము నందుబెట్టి కట్టుటకు నియమించెను.

నకుల సహదేవులా ప్రకారముగనే కట్టి చెట్టు దిగివచ్చిరి. తమ యాయుధంబు లివ్విధంబున గుప్తంబులగుట కెంతయు వార లూఱడిల్లుచుండ యుధిష్ఠిరుం డనుజులతో "దీనిదగు దుర్వాసన కెవ్వరును నిచ్చోటికిఁ జేరరానొల్లరు. ఇంక భయంబు లే"దని మందహాస వదనుండై పలికిన, నందరును నిజమేనని పలికిరి. తరువాత వారు విరటుని పురమున కభిముఖులై యచ్చోటు వాసిపోవుచు తాము రహస్యముగా వర్తించుట కనువుగా నైదుగురును తమ పేరులు వరుసగా జయుండు, జయంతుండు, విజయుండు, జయత్సేనుండు, జయద్బలుండు నని సంకేతనామము లేర్పఱచుకొని, ఎదుట పారుచున్న యేటినీటిలో స్నానముచేసి, జలపానం బొనరించి, ద్రౌపదీసహితులై కొంతదడవు పథిశ్రమందు దొలంగ నిలిచి యుండిరి.

తదనంతరము కౌంతేయాగ్రజుండు శుచియై నిర్మల చిత్తంబులో, దేవర్షి పితృతర్పణములును మంగళ జప హోమాద్యనుష్ఠానంబులును గావించి పూర్వ మొగంబుగా తిరిగి భక్తితో ధర్మదేవతను తనలో ధ్యానించి "దేవా! నీవు నాకొసంగిన వరము చొప్పున మాకు మేము వర్తించునట్టి యజ్ఞాత చర్యలందు కష్టములు గలుగకుండునట్లు మమ్ము రక్షింపుము. స్వామీ! నాతమ్ములు మున్ను యక్షాకృతినుండి నీచే హరింపఁబడినపుడు నిన్ను ప్రార్థింపఁగా పొడసూపి వారిప్రాణములొసంగి రక్షించినాఁడవు. ఇపుడును మాయందు కరుణింపు"మని చేతులు ఫాలమున [illegible] ఘటించెను.

తదనుగ్రహంబుచే ఆ క్షణంబ ధర్మరాజునకు తటాలున సన్యాసి రూపంబు కలిగి, కావి గుడ్డలును, దండకమండలువులును, పొసంగెను. అట్లె తక్కిన వారికిని వారివారికిం దగిన చందమున తమంతనే వస్త్రములును శస్త్రములును గలిగి వేషములు మారిపోయెను. అంత నాశ్చర్యమగ్నమానసులై తమ కెంతయుం దగియున్న రూపంబు లొండొరులు మెచ్చుకొనుచుండ ధర్మజుం డనుజులనుజూచి "మన మందరము నొక్కసారిగా జనుట కర్తవ్యంబుగాదు. ఒక్కడొక్కఁడుగా పోవుట యుక్తం"బని చెప్పి మొదట తాను పోవువాఁడై, పాచికల నొడిలో నిడుకొని ప్రయాణంబై పోవఁదొడంగెను.

## ధర్మజుఁడు సన్యాసి వేషమున విరటునిఁ గొలువవచ్చుట

తత్సమయంబున దైవికముగా విరాటుండు బయట కొలువు దీరియుండుటం జేసి యుధిష్ఠిరుం డదియు నొక శుభ సూచనంబుగా నెంచి చేరఁబోయెను. అతుల వచ్చుచున్న తేజోమూర్తియైన యతనిని మత్స్య మహీవల్లభుండు చూచి మిగుల నాశ్చర్యంబు జెంది సభ్యులతో "అహా! ఈ వచ్చుచున్న వాఁడెవండో మహాపురుషుఁడుగా కనుపట్టుచున్నాఁడు. ఇతని యాకారమును తేజమునుం జూడఁగా మహా పురుషుఁడుగా నున్నాఁడు. బ్రహ్మవిష్ణు మహేశ్వరులకు సమానుఁడై లోకములనన్నింటిని పాలించుట కర్హుఁడుగానున్నాఁడు. ఇతఁడు సామాన్యుఁడు గాఁడు. ఎల్ల రాజులును నమస్కరించుటకు తగినపాదములుగల చక్రవర్తి గానుండుట కర్హుఁడుగానున్నాఁడు ఇతఁడు సార్వభౌమత్వమున కర్హుఁడు. ఈ మహాపురుషుఁడిపుడు మనయొద్ద కేల వచ్చుచున్నాఁడో తెలియలేదు. ఇతనిని చూడఁగానే నాలో నధికమైన భక్తి యంకురించుచున్నది. ఏమికోరినను నితని కివ్వవలయునని కోరిక పుట్టుచున్నది. నేను పాలించు దేశమంతయు నడిగినను నేనతని కొసంగి మంత్రులంగూడి యీ యుత్తమ పురుషుని సేవించుచుండెదను." అనుచున్న యవసరమున ధర్మజుండు చేర వచ్చెను.

అపుడు విరటుండు లేచి మంత్రులతోడ నెదురుచని నమస్కరించి యాశీర్వదించిన యతనిం దోడ్కొనివచ్చియున్న యాసనమునఁ గూర్చుండ జేసి గౌరవం బతిశయించునటుల వినయముతో "మహాత్మా! మీరు జన్మించిన దెచ్చట? మీ కులమును, నివసించుచోటును, మీ పేరును

ఇచ్చోటి కిపుడువచ్చిన నిమిత్తమును నెఱింగింపవలయునని కోరుచున్నాఁడ" నని యడిగెను. ఆయతీశ్వరుఁడు రాజుంజూచి మందహాస మొనరించి మృదుభాషణల నిట్లనియె.

"మహీవల్లభా! లోకములో యథార్థమే పలుకువారలు గలుగరు కాని, తోఁచినట్లు చెప్పినచో నెట్లు కావలయునో యటుల కాఁగలదు. ఈ విషయము నంతగా నెవ్వరును విచారింపరు, విచారింపకూడదు. దేహమన్న పంచభూతమయమైనది. మానసము చంచలము. ఇట్లగుటచే సత్యముఁబలుకువాఁడు దుర్లభుఁడు. నేను ద్విజుఁడను, కురుదేశమునఁ బుట్టిన వాఁడను. ఎల్లపుడును రాజులకుఁ దగిన పలుతెఱంగుల వేడుకల నెఱింగి యుండువాఁడను. నాకు జూద మాడుటయందును కొంత నేర్పు కలదు. విరోధులు కపటోపాయంబుచే నాధనము నపహరించి యవమానించినందున, విసుగుటచే నేనచ్చోటునువీడి వచ్చినాఁడను. నేను ధర్మపరులతో సహవాసముఁ జేసినవాడగుటచే కొంతపట్టు రాజనీతి సయితము తెలిసియున్నది. నాపేరు కంకుఁడు. నీచకార్యము లెవ్వియుం జేయువాఁడను కాను. రాజులలో నీవు మిగుల గొప్పవాఁడనియు, కీర్తిమంతుఁడవనియు, మంచివాడవనియుం జెప్పగా నీప్రఖ్యాతివిని; నిన్నుఁ గొలిచినీయొద్ద నుండదలచి వచ్చితిని. రాజేంద్రా! ఒక సంవత్సరకాలము నేనొక వ్రతమునుబూనియున్నాను. అది తీఱు నంతవరకును, నీయొద్ద కాలమునుగడపి, పిమ్మట నాకు చెఱుపుచేసిన దుర్మార్గులను జయించుటకై పోయెదను. కాబట్టి యంతవరకును మీయొద్దనుండుట కంగీకరింపవలయునని కోరుచున్నాను."

ఇట్లు సన్యాసి శేఖరుండు బలుకుటయు విని సంతోషమును జెంది విరాటుం డతనింజూచి, "స్వామీ! మీకెటుల యిష్టమగునో యటుల చేయుండు. ఎంతకాలము మీరు వసించియున్నను నాకు సంతుష్టియే! కొంతయుని తోఁచదు. సకల విధములను నాకెట్లో యా రీతిగానే మీకును సమస్తభోగములును జరుగుచుండునట్లు చేసెదను. ఇదియును గాక, నా సేవకులలో నెవ్వఁడైనను, మీయెడ భక్తిలేక మెలంగెనేని, యట్టివాఁ డెంతటి గొప్పవాఁడుగా నుండినను వానిని కఠినముగా శిక్షింపుదును. ఇంకొక మాటఁ జెప్పెదను వినుండు. ఈ మత్స్యదేశమంతయును, మీరు, పాలనఁజేయఁగా తలంపు గలదేని యవశ్యకముగా నాధిపత్యమును గైకొనుఁడు, నేను, నాభార్యా పుత్రబంధుమిత్రామాత్య భృత్య

సహితముగా మిమ్ము పరమ సంతోషముతో సేవించుచు కాలముం గడ
పెదను. ఇట్లు చేయుట నాకెంతయుం బ్రియంబు కావున కరుణించి ఈ
ప్రభుత్వముం గైకొనుండు" అని వినయంబుతోఁ బలికెను. ధర్మనందనుం
డతనితో మందహాస వదనుండై యిట్లనియె. "భూనాయకా! బిచ్చ మెత్తి
కొనిన యన్నమునుదప్ప యన్యమును భుజింపను. భూమియే నాకు
శయ్య. ఇటువంటి వ్రతంబు గలవాఁడనైన నాకు రాజ్యమును భోగము
లును నేమిటికి చెప్పుము? ఏవియును నేను కోరెడివాడను గాను. సర్వ
సంపదలతో నొప్పు మహాప్రభుండవైన నీ యొద్దనుండుటయే భోగము
లన్నియుం జేకూరుట యని నా నిశ్చయం" బని పలికెను.

విరాటభూపతి సంతోషించి "సరి మీకు యెట్టులనుండుట యిష్ట
మగునో యట్లును ఎంతకాలము నిలువనిచ్చగలదో యన్నినాళ్ళును మీ
రిచ్చోట నుండుడు. అది మాకు శుభస్కారంబు. జూదము నాడుటయం
దును నాకు కొంచెము ప్రియము గలదు. అదియును మీకు తెలిసియున్నది.
లేకున్నను గొప్పవారగు మీరిచట నుండుటవలన సంతోషమును
బొందగలము" అని యిట్లు చెప్పి యా ధరానాథుండు కొంతే యగ్రజుని
సంతుష్టాంతరంగుం జేసి, తనయొద్ద నిలువరించి, మాటిమాటికి నతని
మూర్తిని విలోకించి యాశ్చర్యముఁ జెందుచు, నతని పలుకులు జాగ్రత్త
గా విని యభిప్రాయము గ్రహించుచు, ప్రియమతిశయించి యతని చేయిం
దన చేతితో పట్టుకొని వేడుకగా మాటలాడుచు నెల్లప్పుడు నతనిని
తానును తన పరివారమును మిక్కిలి గౌరవముతో సంభాషించుచు
మెలంగుచుండెను.

## భీముఁడు వంటలవాఁడై విరటునిఁ గొలువవచ్చుట

ధర్మరాజు యివ్విధంబున విరటునియొద్ద చేరుటయు నటుపిమ్మట
ఒక చేత గరిటయు, నొక చేత కట్టెలుచీల్చు కత్తియుఁ బట్టుకొని, నల్లని
వస్త్రమును దట్టిగట్టి యందు చురకత్తిని చెక్కుకొని, నానావర్ణములుగల
చర్మము నుత్తరీయంబుగాఁ దాల్చి ధర్మరాజు పోయిన దారిని తప్పించి
వేరుమార్గమున, తన యాకృతింజూచి జనులు మిగుల నాశ్చర్యము నొందు
చుండగా మదించిన యేనుంగువలె నడచుచు, రాజుకొలువునకు వచ్చు
చున్న విరాటుఁ డతని యాకారమును, భుజములును విశాలమగు
రొమ్మునుం జూచి భయమొంది నిశ్చేష్టితుండయ్యె. ఈ ప్రకారము

వెఱఁగొంది చూచుచు, తనలో 'ఔరీ! ఈతఁడు మానవాకృతితో భూమిపై విహరించుటకై యవతరించిన సూర్యుఁడో, చంద్రుఁడో, దేవేంద్రుఁడో కావలయును గాని సామాన్యుఁడుగా నుండలేదు. వీని కులమెయ్యది? పేరు యేమైయుండును? ఇతని నెఱింగినవారు నాపరివారమం దెవ్వరైన నుండుదురా?' యని విరాటుఁడు తలంచుచుండగా భీముఁ డతని సమీపంబునకు వచ్చి నమస్కారముచేసి వినయముతో యిట్లనియె.

"రాజేంద్రా! నేను శూద్రుఁడను. నిపుడు కొలువు యుండుటకై యిచ్చటికి వచ్చితి. వంటచేయుటతప్ప మఱియేపనియును నాకు తెలియదు. వంటయందన్నను నావంటి సమర్థుం డెచ్చటనుం గలుగఁడు. నాపేరు వలలుండు. అన్న వస్త్రము లిచ్చిన నాకుఁజాలును. మీ యిష్ట ప్రకారము వంటచేయుచు మీయొద్ద నుండెదను" అనిన విరాటుం డచ్చెరువొంది "ఎట్లూ! నీవు శూద్రుఁడవా? నీ స్వరూపంబును లక్షణములును చూడగా నిన్ను శూద్రుండవని తలంచుటకు వలనుగాకున్నది. రాజ్యమును పాలింపఁ దగినవాఁడవుగా యున్నావు. నీకు వలయు వస్త్రాభరణ వాహనాదుల నొసంగెదను, కైకొని భోగంబుల ననుభవింపుము. నీచమైన వంటపని నీవు చేయువలసినది లే" దని చెప్పిన భీముఁడు మూర్ఖునివలె నటించుచు తల యడ్డముగా వలదనుటకు గుఱుతుగా నాడించి, మోటుకాండ్రు భయమెఱుగక పలుకు చందమున నడ్డులేని మాటలతో నందఱును వినుచుండ నిట్లనియె.

"మహాప్రభో! అవి యన్నియు నాకువలదు. వంటయందే నాకు మిక్కిలి ప్రియము. మీబోఁటి మహారాజులకు సంతోషము కలుగునట్లు నేను వంటచేయగలను. మున్ను ధర్మరాజు నావంటకు మెచ్చుకొనినన్ను తనయొద్ద నుంచుకొనెను. ఆయునయొద్ద నుండినట్లు మిమ్ము కొలిచి యుండెదను. నావలన నుపయోగము కలదనితోఁచెనేని పెట్టుకొనుము. నేను మిక్కిలి భుజబలము కలవాఁడను. పనిలేని సమయములందు కారు మెనుబోతు, పులులు మొదలైన జంతువులతోడను, బలియులైన జెట్టిల తోడను పోరి జయించి నీకు సంతోషమును గలిగించుచుండుదును. అయ్యా! నన్ను నిలుపుకొనెదవో, పొమ్మనియెదవో చెప్పుము. నీకు యిష్టము లేకున్నయెడల మఱి యెచ్చటికైన బోయెద" నని యడిగెను.

మత్స్య మహీపాలుండామాటలువిని "ఓయీ! నీరూపమునకుఁ దగినట్లు చెప్పితివి, కాని, నాబుద్ధికి తృప్తికరముగా నుండలేదు అయినను నీవు నాయొద్ద నుండుటయే మాయిష్టము. నీవని యొండైనను సామాన్యులవలె గాక వంటచేయు వారలకు నాయకుండవై యుండుము" మని యనుజ్ఞ యొసంగెను. ఇట్లు విరాటుని యనుమతిఁబడసి భీముండతని దగ్గఱ వంటవాఁడై నిలిచెను.

## అర్జునుఁడు పేడిరూపమున విరటునిఁ గొలువవచ్చుట

అట్టి సమయమున ఆమకట్టు మొదలగునవి తనపురుషరూపమును మాటుపఱచి శంకపు గాజులును, బంగారు పట్టెడయు, రవికయు, పసుపు పూతయు స్త్రీరూపమును దోఁచఁ జేయుచుండ, మంచుగప్పిన సూర్యునివలెను, నివురు గలసిన నిప్పు చందమునను, మోహినీవేషముఁ దాల్చిన విష్ణువువలెను, అర్జునుండు మఱియొక వైపునుండి యవ్విరాటుని సభకు వచ్చెను.

తిన్నని నడకతో వచ్చునట్టి యర్జునునింజూచి విరాటుం డాశ్చర్యము జెంది, "సభ్యులారా! ఈ వచ్చుచున్న వ్యక్తిని చూడుఁడు. వేషము స్త్రీరూపమును దెలుపుచున్నది గాని లక్షణములు మహా పురుషునకుఁ గలిగియుండునవిగా గనఁబట్టుచున్నవి. ఈయాకృతి యెంతయు వింతగా నున్నది. యెవరుగా నుండునో యాలోచింపుఁ" డనిన నచ్చటి వారలెట్టులుం బలుకలేక యట్టె కనుచుండిరి. తత్సమయమున కుంతీ నందన మధ్యముండు రాజును జేరవచ్చి మ్రొక్కి వినయముతో "రాజేంద్రా! నాపేరు బృహన్నల. నేను పేడిని. బాలికల కాటపాటలునేర్పుట యందు నాకు మిక్కిలి నేర్పుగలదు. మీబిడ్డలకు నృత్యమును గఱపుచు మిమ్ముఁ గొలిచి యుండగోరి యిట వచ్చితి" ననిన యా వాక్యములు విరాటుండు విని "ఆలాగా! ఔరా! నీదేహము పొందికయు, నిడుదులైన చేతులును, మేనికాంతియుంజూడగా, చక్కదనమున మన్మథునికన్నను, గొప్పతనమున నింద్రుని కన్నను నధికుఁడవని తోఁచుచున్నది. ఇటువంటి చెప్పలక్షణములు నీకుకలిగించి విధాత పేడితనముఁ గల్పించుట కేమి కారణమో తెలియకున్నది. ఇది యన్యాయము. నావిండ్లలో నుత్తమమైన విల్లును బాణములును రత్నభూషణాంబర వాహనములును నొసంగి నిన్ను మదీయ రాజ్యమునకెల్లను నిర్వాహకు

నిగాఁ జేయవలయుననెడి బుద్ధికలుగుచున్నది. ఇదియెట్లు? నీకోరికకు నాతలంపు విరోధమైనదిగదా!'' యనెను.

అర్జునుండు ''క్షితీంద్రా! నేను పురుషుండుగాకయు నాడుదానను గాకయు నిట్లు పేడినై యున్నాను. ఇది మత్పూర్వకర్మ ఫలము. అనుభవింపక తప్పినది కాదు. ఒక నిమిత్తమున శాపముచే ఈరూపము సంప్రాప్తించినది. ఇతర కార్యములకు నేనుపయోగపడను కావున చిననాటనుండియు నానా విధముల నృత్యములు నభ్యసించు ప్రవీణతను సంపాదించినాను, నాకువాద్యములు వాయించుట నృత్యము, గానము అభినయించుట చక్కగా దెలియును. నరేశ్వరా! ఎంతటి తెలివిలేని బాలికనైనను నాచాతుర్యము పెంపున విద్యగఱపి ప్రవీణతగలుగజేయగలను రాజగృహము లలంకరించుటయందును, రాజస్త్రీల కాటపాటలు నేర్పుటయందును మిగుల ప్రఖ్యాతి గడించియున్నాను. అటువంటినేను మీకొసంగు పనికి తగియుందును కాబట్టి యక్కరగలదేని మీ కూతుంద్రకు విద్యజెప్పుటకై నన్ను నియమించినయెడల మీకొలువు జేయుచుండెద'' నని చెప్పెను. అట్టిపలుకులు తనకిష్టముగాకున్నను విరాటుండు కొంచెము యోచించి, యర్జునుని వాక్యములు నిర్దోషములుగాఁదోచినందున, తనకుమార్తె నాతనియొద్ద నృత్యము నేర్చుకొమ్మని చెప్పుటకై పిలిపించెను.

పాదములనడకకొక విధమైన యందమును గలిగించుచున్న నూతనముగా నలవడుచుండెడి మందగమనమును, సొగసుగా నేర్పడుచుండెడి యుదరము మీఁదిముడతలకు నాణెముగా నొప్పునూగారును, ధావళ్యమునుం గప్పును విశాలములునునైన కన్నులయందు మనోజ్ఞముగాసొంపుగను పట్టుచుండ అప్పుడప్పుడే వికసించుచున్న పూఁదీగెయుం బోలె యొప్పు మిగులనూతన యౌవనముతో నలరారుచున్న విరాటుని కూతురైన యుత్తరయను చిన్నది తండ్రియాజ్ఞ చేసభకరుదెంచి సఖులను దూరమునసనిలిపి, రాజును సమీపించి నమస్కరించెను.

విరాటుండు కుమార్తె నధికమైన ప్రీతితోఁ గౌగిటఁజేర్చి యాదరించి బుజ్జగించి మొగంబున జిఱునగ వంకురింపగా ''అమ్మా ఇదిగో యీమె నీకు నృత్యంబును గానమును నేర్పును, నేర్చుకొనెదవా?'' యని యడిగి తద్వాక్యంబులకలరి యుత్తర తన యంగీకారమును సూచించుటయు, సంతోషించి యాధరావరుండు బృహన్నలకు కప్పురపు వీడెంబును

మణిమయాభరణ చీనాంబరములొసంగి మిగులసమ్మానము గావించి, "ఓ బృహన్నలా! నీవు మిక్కిలి చతురుడవు. కావున యీ బాలిక విషయమై నీకు చెప్పవలసిన దేదియు లేదు. అయినను నొప్పగించునపుడు నాకు తోచిన మాటను జెప్పెదను. దీనియందు నాకు ప్రీతి యధికము. యుత్తర యిప్పటి వరకును, చెలులతోఁగూడి యాటలాడు చుండినదియే కాని, శిక్షలోనుండినది కాదు. అట్టిపైఁగల బుద్ధిని మరలునట్లు చేసి చదువం దుత్సాహమును గలిగించి, మంచిమాటలతో ననురాగమును జూపుచు, విద్యగఱపు"మని సముచితంబుగా బలికి యుత్తర చేయిబట్టుకొని ప్రియంబునిండారగా "అమ్మా! నీవు గురుభక్తిగలిగి చెప్పినట్లు వినుచు చేయుచు శ్రద్ధతో విద్య నేర్చుకొనుము. నీ గురువునకు భోజన పానాసన శయ్యాదుల విషయమున నీవే శ్రద్ధవహించి కొఱంతకలుగనట్టు చూచుకొనుచుండును. తల్లియు, దండ్రియు, దైవము, దాతయు సర్వము విద్యాగురుండే యనియెంచి తగినరీతిని ప్రవర్తింపుము" అని దిట్టము చేసి యామె చేయి బృహన్నల చేతిలోనిడి యప్పగింత చేసి పసితనంబు కతన నీ బాలిక యేదేనియుం దెలియక నీయెడ నొకయపచారం బొనరించినను గినియక సయిచి రక్షింపు"మని వెండియు బృహన్నలతో చెప్పి "ఈ బృహన్నల మన యంతఃపురములో తనకిష్టమైనచోట వసించి యిష్టమైన చోట తిరుగవచ్చు"నని యనుమతి నొసంగి వారి నిరువురను వీడుకొలుపుటయు నుత్తర బృహన్నలను దోడ్కొని సంతోషముతో నంతఃపురంబున కేగెను

## నకులుఁ డశ్వపాలకుఁడై విరటునిఁ గొలువవచ్చుట

అంతట విరాటరాజు లాయములోనుండి గుఱ్ఱములను దెప్పించి వానిని పరీక్షించుచుండెను. ఆ సమయమున సూర్యోదయ కాలమున కమలములు వికసించునట్లు తనరూపమునుజూచి జనులు ప్రీతినొందుచుండగా అశ్వపాలకుని వేషముతో నకులుండు విరాటుని సభ కేతెంచెను. వచ్చి యట గుఱ్ఱంబులను పరీక్షించుచున్న రాజతనిం గని పరిజనంబుల కతనిచూపి "రూపమును లక్షణములును గనినచో మిక్కిలి బుద్ధిమంతుడనియు గొప్పవాఁడుగా నుండుననియు దోచుచున్నది. ఇతఁ డెవ్వడో తెలియలేదు. తురంగముల పరీక్షించుటకు చూడగా యితం డశ్వశాస్త్ర కుశలుండనియు, పరాక్రమవంతుఁ డనియుం దలంప వలసియున్నది. ఇతనిని

మీలో నెవ్వడైన నెఱుంగుదు రేమో చెప్పుఁడు. ఎఱుంగ రేని విచారించి తెలిసికొని చెప్పుఁడు" అనిపలుకుచుండు సమయంబున నకులుండు రాజును సమీపించి మ్రొక్కి "దేవా! నేను రాజు లెక్కఁదగిన శుభ లక్షణ యుక్తములైన వారువముల నెఱుంగఁగలను. నాపేరు దామగ్రంథి. అశ్వ శాస్త్రము నాకు కరతలామలకము. నే నెఱుఁగు విషయంబులు జెప్పెద నవధరింపుడు. గుఱ్ఱములయొక్క యవయవ లక్షణమును, వాని యాయుః ప్రమాణమును, తీరును వివేకమును పరిమాణ భేదములును, వయసు నిర్ణయించుటయు దేశకాలములకు తగినట్టి యాహారములనిచ్చుటయు జాతికితగిన శిక్షణమును, రోగంబులు త్వరితముగా తొలంగఁజేయు చికిత్సలును వ్యాయామ శ్రమను పొలంగించునట్టి యౌషధములును, సంతోషమును దుఃఖము మొదలగువాని యభిప్రాయంబు నెరుంగుటయు, పోషించువిధమును, రూపమును, రేఖలునుం దెలిసియుండుదును. వలయు నేని చూచి చెప్పెదను. యుద్ధము పొసఁగిన యెడల మదీయ పరాక్రమమును గనంబఱతునుగాని యూరకుండెడి వాఁడనుగాను" అని యివ్విధమున బలుకుటయు విరాటుండు సంతోషించి "నీవు నారాజ్యమంతయుం బాలింపఁదగిన వాఁడవుగాని నీలక్షణములం జూడఁగా యశ్వశిక్షకుఁడవై యుండదగిన వాఁడవుగావని తోచుచున్నది. నీకు తగిన యధికారము నొసంగెదను" అని చెప్పెను.

నకులుం డతనిజూచి "అయ్యా! అల్పజనులు తమకు తగినట్టి పని నొనర్చుచు జీవింపవలయునుగాని యెక్కుడు కోరరాదు. నేను సైంధవ శాస్త్రమందు కడుసమర్థుండనని యెఱింగి ధర్మరాజు నన్నుతనగుఱ్ఱముకెల్ల నధికారినిగాఁ జేసి, నాయందెక్కుడు ప్రీతిగలవాఁడై దాన మానంబులచే మన్నించుచు తన తమ్ములలో నొకనినిగా జూచుచుండెను. ఇపుడుధర్మరాజు రాజ్యమును బంధువులను విడిచి యెచ్చటికో పోయెను. అందువలన నుదరపోషణమునకుఁ దగిన చోటును వెదకుచు బహుదేశములు తిరిగినిలువఁదగిన చోటుఁ గానక 'విరాటరాజు ధర్మరాజుతో సమానుడని' జనులు పొగడుచుండగా విని తుదకు నీయొద్దకు నిన్ను కొలిచియుండఁగోరి వచ్చితిని. నిన్నుచూచి నాయభిప్రాయమును విన్నవించినాను. ఇంక నన్ను మీచెంత నుంచుకొనుటకు మీకిష్టముగా నుండినచో నిలిచెద, లేక వలదు పొమ్మనినఁ బోయెద" అని చెప్పెను.

## సహదేవుఁడు గోపవేషమున విరటునిఁ గొలువవచ్చుట

విరాటుఁ డతని పలుకులు విని "అశ్వరక్షకుఁడవుగా నుండుటయే నీకు యిష్టముగా నుండినయెడల నట్లునే చేయుము. ఇదివరకును నాయొద్ద నుండెడి యశ్వపాలకుల కందఱకును నాయకుఁడవై వారిని నీ నెట్లో యట్లుల పాలించుచు వారివలన పనులుగొనుచుండుము." అని సమ్మానపురస్సరంబుగా బలికి యతనిని తనయొద్దఁ జేర్చుకొనియెను. ఈప్రకారముగా నకులుండచ్చటఁ జేరుటయు, నంత శాంతమైన మనస్సు గలిగియుండుటచేత మనుష్యాకృతిం దాల్చిన చంద్రుండో యనునట్లును, మానసమున ప్రతాపము గలిగియుండుటవలన నట్టి యాకృతి ధరించిన యగ్నిహోత్రుఁడో యనునట్లును, జూపట్టుచు గొల్లవేషమున తగిన చందమున భుజములపై నొకవంక పలుపులును, నొకవంక దామెనయు, నొప్పుచుండగా, మొలకొక పెద్దత్రాటినిజుట్టుకొని, చేత ములుకఱ్ఱఁ బట్టుకొని తన యాకృతియు లక్షణమును చూచి రాజును జనులును; నాశ్చర్యపడుచుండగా, విశాలమైన తనకన్నులు గొప్పతనమును వెల్లడించుచుండ సహదేవుండు మెల్ల మెల్లగా విరాటుని సమీపమునకువచ్చి యతనికి భయపడినట్లు నటించుచు నెఱకు చూపులును, తొట్రుపాటునుగలవాఁడై రాజావంక్షం గని వినయముతో "మహాప్రభో! నేను గొల్లవాఁడను. మీ పసులకాపరిగా నుండఁగోరి వచ్చితిని, యుంచుకొనుము. నేను రక్షించుచుండిన యెడల మీపశువులు రోగముదప్పి కలిగి కృశింపవు దొంగలుహరింపలేరు. పశువులు తప్పించుకొని పోకుండునట్లును, పులులు మొదలగు క్రూరమృగములకుఁ జిక్కకుండునట్లును పాడితగ్గకుండునట్లును, నావంటి గొల్లవాండ్రం దఱును మెచ్చునట్లును మీకు సంతోషము గలుగునట్లను చేయుచుండఁగలను" అని పలికెను.

ఆశ్చర్యకరములైన యతని మాటలువిని విరాటుం డతనిం జూచి "ఓహో! ఇవి యెక్కడ మాటలు? నిన్ను చూడగా గొల్లవాఁడవుగా తోఁచుటలేదు. నరులలో శ్రేష్ఠుఁడైనవాఁడా! సూర్యచంద్రుల వంశములలో నొకదానియందుజనించిన యొకమహారాజు పుత్రుఁడవుగా కనుపట్టుచున్నావు. నీవు గొప్ప యధికారపదవిని వహించినా రాజ్యమంతయుం బాలించుట కర్హుఁడవు. ఇంతటి సమర్థుండవై యుండియు హీనమైన పశుపాలకత్వమును గోరెదవేల? ఇది నీకుదగునా? ఇదివినుము. ఉత్తమ వాహనంబులును, బహు విధములైన యుత్తమాయుధంబులును,

నొసంగెద. మదీయదేశంబులోనీకెచ్చోట నభిమతంబగునో యాప్రదేశం బునిచ్చెద, సంతోషముతో నీవు సేనానాయకుండవై యుండు'' మనిన సహదేవుఁ డతనికి మరల మ్రొక్కి ''రాజచంద్రా! నేను తక్కువజాతిలో పుట్టినవాఁడను, పసివాఁడను. ఇంతవరకు నెన్నఁడును నిటువంటి గొప్ప పనులు చేసి యెఱుంగను. ఇదివరకును నేను పశుపాలకుఁడనుగా నుండియే బ్రతుకుచుంటిని. మావంశము వారలెల్లరును కౌరవులకుభృత్యులు. నేను ధర్మరాజు పశువులనుగాచి యతని మన్నన వడసినవాఁడను. నా పేరు తంత్రీపాలుండు. నాచేతగోవులు వృద్ధిఁబొందుచుండును. మీపశువులనతి కాలమున వర్ధిల్లఁజేయుదును. మీయొద్ద బెట్టుకొనినచో నేనాబోతు పంచితమును వాసనజూచినను, నాపై గాలిపీచినను, గొడ్డావునకైనను పాలు నిలుచును. ఉంగడి, యదురు త్రిక మొదలగు పశురోగములకు నా పేరు చెప్పినఁజాలు. మఱియుం బసికిపలయు తెఱంగు లన్నియు నెఱుంగుదు. ఇతర కార్యములు నేనుచేయ నేరనుగాని, పశులకాచు విషయంబున నా నేర్పుఁజూపి మిమ్ముసంతోషించు నటులగావింప గలను. నన్ను మీయొద్దఁ బెట్టుకొనుటవలన మీకెంతయులాభకరంబై యుండునని' చెప్పెను.

మత్స్యమహీపాలుం డతనిఁగని తనకిచ్చ లేకున్నను నయ్యువకుని విడుచుటకొల్లక ''నీకు గొప్పపనులు చేయుటకు సమ్మతిగానిచో నీ యిష్ట ప్రకారముగానే గోవులకు సంరక్షకుఁడవై నాయొద్దనుండుము. ఇదివరకు పశువులగాచుచుండెడి గొల్లలకెల్లరకును నాయకత్వము వహించి వారివలన వలసిన పనులఁగొనుచుండుము. ఏవిధమునైనను మా కొలువున నుండినఁజాలును అదియ మేలు''అని యతని యభిమతంబు భంగి నయ్యధికారము నొసంగి తనయొద్దనుంచుకొనియెను. పూర్వోక్తప్రకారము పాండుకుమారులైదుగురును విరాటుని కొలువున నిలిచిరి.

## ద్రౌపది సైరంధ్రి వేషమున సుధేష్ణనుఁ గొలువవచ్చుట

పాంచాలి యంతటి గట్టువాలు వేషమునకుఁ దగినట్లుతన జడను విప్పి, కొప్పుబెట్టుకొని కొంచెము కుడివైపునకు వ్రాలునట్లుగా తానుగట్టిన మాసినచీరయొక్క పైటకొంగును కట్టియుండుదోపి పరిచారికలుండు రీతిగా కనుపట్టుచు, యావేషమున కనుగుణ్యమైన భావముగలదై మందగమనంబుతో విరాటరాజు నగరము ప్రవేశించివచ్చెను.

కొంచెము కుడివైపునకు జాఱునట్లు పైట వేసుకొని మాసిన చీరనుగట్టి మంచుగప్పినశోభాహీనమైన కమలమువలెను, మేఘముచే క[illegible]

డిన చంద్రబింబమువలెను, దుమ్ముగప్పినతీఁగవలెను, పసికట్టె వేషము వాల్చినద్రౌపది తన సహజ సౌందర్యరేఖ మరుఁగుపడఁగా మాత్స్యపుర రాజవీథినిఁ జొచ్చి వచ్చుచుండగా పురజను లామెనుజూచి 'ఆహా! ఈతరుణీమణియెవ్వతెయైయుండును? ఈమె యరుంధతియో, రోహిణియో, కావలెను కాని సామాన్య మనుజకాంత కాదు. మానవాంగనలుయిట్లుండుదురా?'' యని యచ్చెరువొందిచూచుచుండ కొందఱామెను సమీపించి ''అమ్మా నీవెవరు'' అని ప్రశ్నించిరి. ఆమెవారితో ''నేను గట్టువాలుదానను. ఎవ్వరేనియుం దమయొద్ద నుంచుకొని కూడును గుడ్డయునిచ్చెడి పక్షమున వారికి పనులు చేయుచుండెదను. ఇందెవ్వరైన నటువంటివారలుందురేమో యను తలంపుతో వచ్చితి'' నని చెప్పెను.

ఆమెపలుకులు జనులు విన్నంత ''సఖీ! ఇటువంటి యందకత్తె సుకుమారగాత్ర యొకరివద్ద కడుపు కూటికై పని చేయుచుండునా? ఇవి వింత మాటలుగా యున్నవి'' యని యొండొరు లనుకొనుచు చుట్టును మూఁగివచ్చుచుండిరి. ద్రుపదనందన రాజమందిరమునకు సమీపముగా బోయిన, విరాటునిభార్యయగు సుధేష్ణ తనసౌధంబున మేడపై సఖులతోఁగూడి విహరించుచుండి రాజవీథిలో నరుగుదెంచుచున్న పాంచాలకుమారింజూచి, యాశ్చర్యమును, కుతూహలము నతిశయింపగా, సఖులతో ''అదిగో! ఆవచ్చెడి సుందరాంగిని చూడుఁడు. ఆబిడ చూచుటకెంతయు గౌరవమును నడకువయుం గలదిగాతోఁచుచున్నది. అయినను నీచస్త్రీలు బలుకునట్లు మాటలాడుచున్నది. పౌరు లాశ్చర్యముతో చూచుచు ముసరుకొని వచ్చుచున్నారు. ఏజాతియో, యెవ్వతెయో తెలియలేదు. ఎచ్చటికి పోవుచున్నదో తెలిసికొని యామెను నాయొద్దకు పిలుచుకొనిరండు'' అని యాజ్ఞాపించెను.

రాణి యుత్తరవు మేరకు చెలికత్తెలిద్దరు త్వరితముగాఁబోయి ద్రౌపదినిచూచి ''అమ్మా నిన్ను విరాటరాజు భార్యపిలుచుకొని రమ్మని మమ్ముఁబంపగా వచ్చితిమి. మావెంట రమ్మని'' చెప్పిరి. ద్రుపదపుత్రి రాణిచెలికత్తెల మాటలువిని తనకోరిక ఫలించినదని తలంచి వారివెంట నంతఃపురంబున కేగి, యచట నతికోమలమ్ములైనయెఱ్ఱని చిగురుటాకులవంటి పాదముల కాంతినెఱసి మేడయందు కెంగెంపుపూలుపూసినట్లుగను పట్టుచుండఁగా, దేహకాంతులు బచ్చగోడలు బంగారు చాయతో మెఱయుచుండగా చూపులు ప్రసరించి పూవులు చల్లినట్లు తోఁచుచుండగా,

కప్పుకొప్పు తళుకు ప్రసరించి నీలంపు మేల్కట్టు కొమరు గానంబడుచుం డఁగా, తన ప్రవేశముచే సుధేష్ణమందిరమున క్రొత్తయొప్పు దనర మెల్ల మెల్లగా, రాజపత్ని యున్న యెడకు పోయెను.

## సుధేష్ణ పాంచాలిని తనయొద్ద నుంచుకొనుట

సుధేష్ణ యామెను చూచి యధికమైన మరియాదతో సంతోష మినుమడించఁగా నొక్కింత ముందుకువంగి గౌరవభావమును, నాదరమును దోఁచునట్లు చేయిచాచి తనయొద్దకు రమ్మనిపిలిచెను. ద్రౌపదియు వినయముతో సమీపించి నిలిచెను. అపుడు రాజపత్ని యామెలావణ్యము నాపాదమస్తకముం జూచుచు మిక్కిలి కుతూహలముతో యిట్లనియె.

"ఓ సుందరాంగీ! ఎవ్వతెవు? నీకులమును, పేరునుం జెప్పుము. ఏకార్యార్థ మెచ్చటికిఁ బోవుచున్నావు? ఈనగరమునకు రాఁగతంబెద్ది? దాపక నీవృత్తాంత మెఱింగింపు"మని యడుగుటయు, ద్రౌపదియామెను చూచి "దేవీ! నేను సైరంధ్రి కులసంభూతను, నాపేరు మాలిని. ఐదుగురు భర్తలు నాకుగలరు. ఒకానొక కారణముచే గర్వితులైన పగవారిచే నాపతులు చూచుచుండగా తలపట్టి యీడ్వబడినదాననై పతులతోడ వనంబులకరిగి కాయగసురులు దినుచు కొంతకాలము వ్రతంబాచరించితి. ఇంకనొకయేడు నావ్రతంబునకు కొఱతయున్నది. తల్లీ! నీవు ధర్మవర్తిని యనియు, నుత్తమశీలవనియువిని, యీసంవత్సర కాలమును నీకు పనులు చేయుచు నిన్ను సేవించి కాలము గడుపనెంచి వచ్చితి. ఇదియె మదీయ వృత్తాంతం" బని పలికెను.

ఇట్లు చెప్పిన యాజ్ఞసేని పలుకులాలించి సుధేష్ణ విస్మయచిత్తయై "అలాగా! సుర గరుడోరగాదులయిన దేవజాతుల యువతులలో పుట్టినదానవని తలంచుచున్నాను. నాబుద్ధికి మానవాంగన వని తోఁచ లేదు. నిజముగా నీవృత్తాంతమును చెప్పు" మనిన ద్రౌపది [illegible] చిఱునగవుతో కూడిన మోముతో "తల్లీ! నేను చెప్పినది సత్యమేకాని పొల్లు గాదు. మున్ను శ్రీకృష్ణుని భామయొద్ద పనులు చేయుచుంటిని. పిమ్మట పాంచాలియొద్ద నుంటిని. ఆమె నన్ను నీచకార్యములకు వినియోగింపక మరియాదగా చూచుచు కడు నాదరమున ప్రీతి కలిగియుండెను. కానే నేనుగా నెంచిపోషించుచుండెను. కాలవశమున నిల్లు రావలసినట్లు [illegible] వచ్చితిని. ఆమె వలెనే నీవును, నీచములైన పనులకు నియోగింపక,

అట్టి కార్యములు చేయుటకు తగినదానను కానను టనెఱింగి మరియాదతోడ నాదరించుచుండవలయునని కోరుచున్నాను. నేనుసలు తెలుఁగుల చందనములు తయారుచేయుదును. వింతవింతగా పూవులుగట్టఁగలను. తిలకములుదిద్ది పూవులు తలయందు ముడిచి బహు చాతుర్యముగా నలంకరింపుదును. పూవులదండలు కట్టుటయందు నానేర్పు నిరుపమానమైనది. నన్ను నీయొద్ద కొలువునకు చేర్చుకొంటివేని నాశక్తి తెలిసికొనఁగల" వనియిట్లు పలుకుటయు సుధేష్ణ యచ్చెరువొంది యామె వంక నట్టెచూచి తల యూఁచి యిట్లనియె.

"ఓ సుందరాంగీ! నీ వన్ననో కడు నందకత్తెవుగా యున్నావు. నీచక్కదనమును చూచి స్త్రీలు సయితము మోహించుచున్నారు. ఇంక పురుషుల మాట చెప్పవలయునా? ఇటువంటి యసమానసౌందర్య కలితవగు నిన్ను నాయొద్దఁ జేర్చుకొనిన యెడల నొకవేళ మా రాజుగారు నీరూపమును చూచి మోహించునేమో యని భయము కలుగుచున్నది. ఎట్లు నాయొద్ద నుండ ననువగును? చెప్పుము? ఎండ్రి చూలు దాల్చి తాను వచ్చినట్లుగా, నద్వితీయ లావణ్యరాశివైన నినునాయొద్ద జేర్చుకొని నీమూలముగా నన్ను నేనే చెఱచుకొనుటకు నాబుద్ధి యొప్పకున్నది. సాధారణముగా పురుషులు చలచిత్తులనుట ప్రసిద్ధముగదా!" యని యిష్టములేని మాటలు బలికిన, ద్రౌపది తనపన్నుగడకు భంగము గలుగునేమోయనెడి తలంపుతో యుక్తిగా రాజపత్ని కిట్లనియె.

"అమ్మా! ఆవిషయమున నీవు భయమొందవలదు. నా పతులైదుగురు గలరని మున్నే చెప్పియున్నాను. వారు నిరుపమాన బలపరాక్రమ కలితులు, గంధర్వులు. సదా నన్ను కాచియే యుందురు. ఎవఁడైనను నీచమతియైనాయందు మోహమును జెందిగవయఁగోరినచో వారైదుగురు నటువంటి వానిని నాఁటి రాత్రియే హరిహరాదులడ్డము వచ్చినను విడువక పొరిగొందురు. కాఁబట్టి పురుషులితరులెవ్వరును, నావంక తేరి పాఱఁజూడ నొల్లరు. భయపడుచుందురు. అదియునుంగాక యటువంటి హీనకృత్యములకు నేను లోఁబడుదాననుగాను. నీకు తెలియదుగాని నాకుల మంతటి నీచమైనది కాదు. అట్టి యనర్థపు నడవడిగలదानననియెంచి నన్ను చులకనఁగా బలుకుట న్యాయము కాదు. దీనికై యిసుమంతయును నీవు సందేహముగాని భయముగాని చెందవలసి

వదిగోలేను. నా ప్రవర్తనమును చూచి సత్పురుషులును, పెద్దలును మెచ్చుకొందురుగాని నాయందొక లేశమైనను తప్పును గణింపజాలరు. నీవు నన్ను మెచ్చుకొనంగలవు. నీచమైన పనులకు నన్ను నియమించక యెంగిలి తినుట మొదలైన యనుచితములు కలుగనీయక తల్లీ! నీయొద్ద చేర్చుకొనుము. ఎవరు నాయందు మరియాద గలిగియుందురో యట్టివారి యెడల నాపతులు ఎక్కువ గౌరవము గలవారై యెంతటి సహాయమైనను జేయుచుందురు" అని యామెకు గలిగిన సంశయము నివారణమగునట్లు చెప్పిన సంతసించి సుదేష్ణ సమ్మతించి సంతసముతో మంచి మాటలతో సమాధాన పఱచి పాంచాలిని తనయొద్ద నుంచుకొనెను. ఇట్లు రాజపత్ని యొద్దఁజేరి ద్రుపదపుత్రి తగిన పనులు చేయుచు, సంతోష చిత్తయై యుండెను.

పూర్వోక్త ప్రకారముగా పాండుకుమారులైదుగురు ద్రౌపదియును, విరాటరాజు పట్టణమందుఁ జేరి తమజాడ యొరులకు తెలియకుండు చందమున రహస్యముగా వాసముఁ జేయుచు సంతోషముతో కాలముఁ గడపుచుండిరి." అని యీప్రకారము వైశంపాయనుండు చెప్పిన జనమేజయుండు విని "మహాత్మా! అటుపిమ్మట మత్ప్రపితామహులు వర్తించిన తెఱంగును వివరింపుఁ"డని యధిక కుతూహలముతో నడిగెను.

మొదటి ప్రకరణము సంపూర్ణము

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.

# పంచమ ప్రకరణము



క॥ శ్రీకంఠమిత్ర ! మిత్రసు
ధాకరయుగ నేత్ర ! దోషహర చారిత్రా
కాకోదరేంద్రగిరి వా
సా ! కోమల నీలగాత్ర ! సన్మునిపాత్రా !

దేవా ! అవధరింపుము. వైశంపాయన ముని శేఖరుండు జనమే జయమహీనాథున కిట్లని చెప్పదొడంగెను. “రాజేంద్రా ! పాండవులు సతీయులై విరాటునియొద్ద నానావేషంబులు ధరించి కొలువుండిరని చెప్పినాఁడను కదా ! అటుపిమ్మట జరిగిన వృత్తాంతమును సావధానమనస్కుండవై వినుమా.

విరాటరాజునొద్దఁ జేరిన ధర్మసుతుండు సభాజనంబుల చిత్తంబులు రంజిల్లునట్లుగా ననేకవిధంబుల రాజునకు సంతోషము గలిగించుచు నొక్కొక్కసమయంబున వేడుకార్థము తాను రాజుతో జూదమాడి గెలిచిన విత్తమును తమ్ముల కొసంగుచుండెను. భీముండు వండగా మిగిలిన పదార్థములను తెచ్చి విక్రయించు నెపంబున సహోదరుల కిచ్చుచుండెను. బృహన్నల సంగీత ప్రసంగమున మెప్పుగాంచి తనకొసంగిన నగలు వస్త్రాభరణముల ననుజుల కిచ్చుచుండును. నకులుండు గుఱ్ఱముల పాలించుటయందు రాజు బహుమానముగా వచ్చిన ధనంబును తోడఁబుట్టువుల కిచ్చుచుండెను. సహదేవుండు గోరక్షణయందు నిజశక్తిం గాంచి మెచ్చి రాజు తనకొసంగిన యర్థము నన్నలవశంబుఁ జేయుచుండు. ద్రౌపది తనయందు కన్నుగలిగి వర్తించు పతులం గన్నులారఁ జూచుచు నుచితంపు నడవడిగలదై వర్తించుచుండును. ఈ ప్రకారముగా వారు సకల జనులకును హృదయానందకరంబుగా నేర్పున నెల్లరునుం దమ్ము పొగడునట్లు మెలంగుచుండిరి.

అట్టియెడ నానాదేశముల నుండియు వచ్చియున్న మల్లులు రాజసభలోకూడి యొండొరులు మాటలాడుకొనుచుండిరి. వారిలో నొకఁడు తక్కినవారితో “ఓమల్లులారా ! నేను సకల దేశములును తిరిగి చూచి

నాఁడను. ఎందఱెందఱో ప్రసిద్ధులైన జట్టీలుగలరుగాని వారిలోనొకఁడును నాతో పోట్లాడఁగలవాఁడు కానము. అందఱును నన్ను చూచిన భయపడి పోవుచుండిరి. ఇంక నీరాజుదగ్గఱ నుండెడి మీరెన్నఁడో నాకు లెక్కలోని వారుగాతోఁచలేదు. అల్పసత్త్వులకు మీవంటివారితో నేను జగడమాడుట యుక్తముగాదు. సమాన బలము గలవానితో పోరినగదా సామర్థ్యము వెల్లడికావలయును'' అని సగర్వముగా పలుకుచుండెను. అతని మాటలువిని విరాటరాజు తనయొద్దనుండెడివారిని వచ్చినవాడు చులకఁజేసి పలుకుట కెంతయుం జింతాక్రాంతుఁడయ్యెను. అప్పటి మల్లులన్నరో వాని గంభీరవాక్కులువిని, యాకారమును చూచి ''వీనితో మనము పోరాడఁజాల''మని భయంబుఁ జెందియుండిరి, తత్సమయమున ధర్మరాజు విరాటభూపతికి యుత్సాహము చెడినదనుటఁ దెలిసికొని యతని కిట్లనియె.

'రాజశేఖరా! ఈక్రొత్తమల్లుఁడు కడుగడుసువాఁడుగానున్నాఁడు మనసభలో నుండెడి జట్టీలు వీనితోఁ బోరజాలరు. వీనిని జయింపఁ గల వానిని మున్ను నేను ధర్మనందనుని కొలువులో నుండగా నొకనిని చూచియున్నాను. వాఁడిపు డిచ్చట మనయొద్దనే యున్నాఁడు. వంటచేయువాఁడైన వలలుండే నేను చెప్పిన మనుష్యుఁడు. వానిశక్తియసాధారణమైనది. రప్పించినయెడల నతఁడు మీకు సంతోషమును గలిగించు''నని పలుకుటయు సంతసించి విరాటరాజు తక్షణమే యతని కొలువునకుఁ బిలిపించెను. భీముఁడు రాజసభకరుదెంచి యచ్చోటనుండు మల్లులం జూచి, రాజు పిలువఁబనిచిన సందర్భమును దెలిసికొని యుత్సాహముతోనుప్పొంగిన చిత్తముగలవాఁడై యెఱుఁగనట్లు రాజునకు మ్రొక్కి భయభక్తులతిశయింపగా నించుకతొలంగి నిలిచెను.

## భీముఁడు మల్లులతో యుద్ధముఁ జేయుట

విరాటమహారాజు పవనతనయు నవలోకించి ''వలలా! నీవు మల్లయుద్ధమునందు కడునిపుణుండవనివింటిని. నీ చాతుర్యమును చూడవలయు ననెడి కోరికగలిగినది. ఇపుడిచ్చోట నుండువారిలో నొకనితోడ జగడము నకుఁదొరకొని నీసామర్థ్యమును ప్రదర్శించి మాకు సంతసము గలిగింపు'' మని చెప్పి మహాబలీయుఁడైన నూతన మల్లునిం జూపెను. వృకోదరుండపు డన్న మోమువంకకని యతండు నేత్రసంజ్ఞ మూలమున ననుజ్ఞ నొసంగుటయు, నుత్సహించి విరాటునిఁజూచి వినయముతో ''మహాప్రభో!

మున్ను నేను ధర్మనందనుని యొద్ద నుండినపు డయ్యవనీపతికి వేడుకఁ బుట్టించుటకై యపుడపుడు నిట్టిజట్టీలతో పెనంగు చుండుటగలదు. అటులనే మీకు వేడుకగలుగునట్లు నేను శక్త్యానుసారముగా పెనంగెదను'' అని పలికి, యొకపాటి మానిసియుంబోలె నకార్యమున కియ్యకొని సింహనాదంబుచేసి మదించిన యేనుంగువలె నడచి, రాజుముందట నిర్ణీతప్రదేశంబుఁ జేరి, భుజములు తట్టుచు నిలిచెను. తత్పూర్వమే యామల్లుడును యుద్ధమునకు తగినట్లు పరికర సంసిద్ధుండై నిలిచియుండెను. అంతట వారిరువురును నొండొరులంజూచుచు యుద్ధరంగమున మున్నుఁగొని ఫాలప్రదేశముల ధరించి, కొంచెము తమదేహములపైఁ జల్లుకొని ఒకరిచేతముని వ్రేళ్లొకరు పట్టుకొని వెనుకకు త్రోసి తమతమ తొడల నొక్కమారుగా తట్టుచు, భుజంబుల నప్పళించుచు కదిసిరి.

సమర్థులును, బలవంతులు నైనవారలు పెనంగు నప్పుడందు భీముఁడు మల్లశాస్త్ర ప్రకారము తోరహస్తమనెడి బంధవిశేషమును ప్రయోగించుటకు సమయము లభించినపుడు దానిని చూపియు ప్రయోగింపకయే, వెనుకకరిగి వెండియు తానా మల్లుని సమీపించును. మల్లుఁడు వడిగామించి తనపైకి వచ్చినపుడు కడుచాతుర్యముతో వంగి తప్పించుకొనును. అదనారసి తటాలున వాని నదిమిపట్టి లాఘువంబున మీదికెత్తి పడవేయును. చడికి, పట్టిసము మొదలగు మల్లయుద్ధోపాయము లుపయోగించుటకు సమయము తటస్థించినను, వానిని ప్రయోగింపకయే యుండును. కాళ్ళసందునఁజొచ్చినట్లు నటించి యటులచేయక, సీనమనెడి మల్లబంధమున బట్టుకొని మరల విడిచి వానిని తొలఁగిపోవ నిచ్చును. వాఁడు తనమీఁదికి వచ్చినపుడు పట్టుకొనుటకు వలనుగానట్లు నటించును ఈప్రకారముగా విరాటరాజునకు వినోదముఁ బుట్టించుటకై వెంటనే యీమల్లునోడింపక, కొంతవడి వేడుకగా వానితో పెనగులాడుచు, పోరుచుండెను.

ఇట్లు కొంతవడి గడపి, యంతట వానినోడింపనెంచి మదపుటేనుఁగునుంబోలె మల్లుని నడుముదట్టిన బట్టుకొని కాళ్ళను చేతులను వ్రేలుచుండగా రెండవ చేతితో ముక్కునను నోటను నెత్తురుగారు చొప్పున పోటుఁబొడిచి మీఁదికెత్తి పడవైచెను. పిమ్మట తనమోకాలు వానిఱొప్పునఁబెట్టి యదిమెను. మల్లుఁడు బలముచెడి, తాళమనెడి మల్లబంధమును ప్రయోగింప యత్నించియు భీముఁడు శక్తిహీనుని, గావించుటచే వలను

గాక, చేతితో నేలనుతట్టి తన పరాజయమును దెలియఁజేసెను. సభ్యులందరును నుత్సాహముతో భీముని సామర్థ్యమును కొనియాడసాగిరి. అపుడు మల్లుని విడిచి భీముఁడు రాజునకు మ్రొక్కి నిలిచెను.

విరాటరాజు మహానందమునుఁజెంది భీమసేనుని మెచ్చి పెక్కులు బహుమతులొసరించిన యతండు తనకివ్వఁబడిన వానినచ్చటి యర్థిజనంబులకునిచ్చి నివాసంబునకుఁబోయెను. మఱియు నిటులనే యపుడపుడును, మల్లులు లేని సమయములలో పులులు, సింగములు మొదలగు వానితో పోరి యంతఃపుర స్త్రీలకును రాజునకును సంతసముఁ గలిగించి వారిమెప్పు నందుచుండెను. ధర్మరాజాదులు నయితము తమతమ చేయుపనులయందు పెక్కు తెఱంగుల నేర్పుచూపి విరాటుని మెప్పించి యతని మన్నన వడయుచుండిరి.

## ద్రౌపదింగని సింహబలుఁడు మోహించుట

ఇట్లు ప్రవర్తించుచు పాండవు లచ్చోట కొన్నిదినములు తక్కువగా సంవత్సర కాలమును గడపినంతట యొకనాఁడు విరాటరాజునకు మఱఁదియు, మఱియు సేనానాయకుఁడు, చక్కనివాఁడును, కీచకులయందు పెద్దవాఁడును నగు నతండు తన తోబుట్టువును, విరాటుని భార్యయునగు సుధేష్ణను చూచుటకై యామెయున్న యంతఃపురమునకు వచ్చి యక్క కేలసమీపంబునందున్న ద్రుపదరాజనందనను చూచి యామె సౌందర్యాతిశయంబున కెంతయు నాశ్చర్యముఁజెంది మెచ్చి ధైర్యముబూని, తన గౌరవమును గోల్పడి, చేష్టలుదక్కి యధికమైన మోహమునకు లోనై పూవువిల్తుని యలరుదమ్ముల వ్రేటులకు సహింపలేక తత్తరింపుచు పాంచాలిపైఁ బ్రసరించినలినచూడ్కులు మరలించుకొనఁజాలక యట్టెజూచుచు నివ్వెఱపాటుతో నిలిచి తనలో ఆహా! ఇది యెక్కడి చక్కదనము? ఏమి సొగసుదనము? ఎంతటి లావణ్యము? ఇటువంటి యువతీరత్నము భూలోకములో మఱియొకర్తుక కలుగునా? ఎవ్వరైనం జూచియున్నారా? బాగు బాగు! యతివ లనిన నిట్లుగదా యుండవలయును. సౌందర్యమున ప్రసిద్ధుఁడైన జయంతు నంతవాఁడైనను, నియ్యబలను గనినచో మితిలేని మోహమును బొంది కుందునుగాని తాలిమినుండఁజాలఁడు. భువనత్రయంబునను దీనికి సాటివచ్చు మచ్చకంటియుండ దనుట తథ్యము, ఈ మనోహరాంగిని పొందుటయే జన్మసాఫల్యము. ఎవఁడయ్యెందు వదనంగూడి

సుఖించునో వాఁడు మహాపుణ్యవంతుఁడు. ఈయువతియొక్క ప్రాపుచే మన్మథుండు శివునిసయితము లోఁబఱచుకొనఁగలఁడు. దేవేంద్రుండైనను నియ్యువిద సొబగుం జూచెనేని మోహపాశబద్ధుఁడై తల్లడిల్లును. కాంతాతిలకమైన దీనికింక సరివచ్చువారు లేరని బ్రహ్మదేవునితో పందెము వేసినను వేయవచ్చును. ఏ పురుషశ్రేష్ఠుఁడీ సుగుణ భర్తయో, యతండు శ్రీమహావిష్ణువును గూడ మెచ్చఁడు, అలఁతిగా తలంచును. బళీ! పార్వతియు, శచీదేవియు, భారతియు, లక్ష్మియు నెట్లును నిమ్ముద్దియకు సమానులుగారు. కాముని బాణముల నైదింటినింగలిపి కరగించి, నేర్పుతోకరువునఁ బోసి, లోకోత్తర సుందరాకృతిం గల్పించి, ప్రాణము గలుగఁ జేసిరేమోయని తోఁచుచున్నది. కాదేని యింతటి సౌందర్యరేఖ పొసంగుటెట్లు? ఈనెలఁతను చూచినచో దర్పకుఁడైనను మోహతాపమునుజెంది తన తాపశాంతికై చిగురుటాకు గొడుగును పూవుటమ్ములను పాన్పునుం జేయ నియమించును; బలా! స్త్రీరత్నమును గనిన పుణ్యాత్ములైన తల్లిదండ్రులెవ్వరో, దీని పేరునకుఁ దగియున్న మనోజ్ఞములైన యక్షరము లెవ్వియో నేయుత్తమ పురుషుఁడీయంగనను మగండగుటకు మహాతపముఁ గావించి పడసియుండునో, ఇదివసించు రమణీయంబైన మందిరంబెద్దియో, ఈలతాంగిని పొందుభాగ్యము నాకుఁ గలుగునా? దీనితోడ నన్నుఁగూర్చి పుణ్యముఁగట్టుకొను వారిచ్చట నెవ్వరుగలరు? ఎట్లు నాకోరిక దీరును?" అని యివ్విధమున నళినాంగియు తన లక్షణముల నెఱింగి రోతపడుచుండు నదియునుగాక ద్రౌపదినిఁజూచి యధికముగ వలపునకు గురియయి తల్లడపాటునుజెంది చూపులం ద్రిప్పుకొనలేక, తన తీఱునఁగని యచ్చటివారెట్లు దలంతురో యనెడి సందియము మనంబున సంచరింపఁగా యధికమైన కళవళపాటు నొందసాగెను.

అట్టియెడ పాంచాలి యాకీచకుఁడు నిర్భయముగా నాలాగున తన వంకఁజూచుట కెంతయుంగినిసి కోమలంబైన తనశరీరమున చమటఁగారుచుండ, బ్రహ్మయిటువంటి యకార్యపరులను సృజించుచున్నాఁడుగదా. యనెడి తలంపుచే నిశ్చేష్టయు, నచ్చోట తనకెవ్వరును రక్షకులు లేమిచే నేమి కీడుమూడునో యను భయమును, తాను తప్పించుకొని యప్పటిలో తొలంగిపోవుటకుం దగిన యుపాయము తోఁపమిచే తల్లడపాటును గదుర తత్తఱపడుచుండెను.

వివేకహీనుఁడైన కీచకుండు వివర్ణముఖియైయున్న యామెలక్షణమును చూచి, యసహ్యాభయంబులచే గలిగినవని తెలిసికొనలేక యామె తనపై వలపునొంది యున్నదనియు, నందువలననే యటువంటి గుఱుతులు కనుపట్టుచున్నవనియు నిశ్చయించి మఱియు నెక్కుడు మోహమునుబొందెను. అతనికి కన్నులుదప్ప తక్కినయింద్రియములు తమవ్యాపారము నే విడిచియుండెను. పూజ్యురాలైనయప్పయు, నీచులైనపరిచారికాజనంబులును తనతీరుం గనుచుండగా యోగ్యాయోగ్యతలును సంశయ భయంబులును లేనివాఁడై, మనోవేదన యతిశయింపగా యాకోమలాంగి సౌందర్యప్రవాహములో పూర్ణముగా మునింగెను. యరుణకాంతు లెసగించుచున్న యామె చేతులరుచులు తనపైఁ బ్రసరించుచుండ, కన్నులందామె ధరించిన కాటుకకాంతి యనెడి చీకటులు వ్యాపింపఁగా నటునిటుఁ గదలలేక యప్పటప్పటికి నధికమగుచున్న మోహతాపముచే పరవశుండై యుండెను. కొంతవడి యువ్విధంబున నలయుచుండి, తనయక్కను విచారించి యామె యథార్థస్థితిని తెలిసికొనవలయుననెడి తలంపుతో సుధేష్ణను సమీపించి, మహాకష్టముతో, ద్రౌపది సైతమువిన తనదృష్టిని కొంచెము మరల్చుకొని, యా దేవికి నమస్కరించెను.

## కీచకుఁడు ద్రౌపది వృత్తాంతమునుగూర్చి సుధేష్ణ నడుగుట

సుధేష్ణ తమ్మునిపై ప్రీతి యతిశయింపఁగా యతనికి బంగారపుపీట వేయించి మిక్కిలి గౌరవించెను. అపుడతండు పాంచాలనందన నామెకుఁ జూపి యిట్లనియె. "అక్కా! ఈ స్త్రీరత్నము పేరెయ్యది? కులమేది? దీనిమగఁడెవ్వాఁడు? నడతయెట్టిది? ఇది యెచ్చటనుండును? ఇపుడిచ్చోటి కేలవచ్చినది? నీకు దీనిపైఁగల ప్రీతియెట్టిది? ఈకాంత వృత్తాంతమును వినఁగోరిక పొడముచున్నది చెప్పుము?" అని యడిగెను.

అతండిట్టుల ప్రశ్నించుటయు, సుధేష్ణ తనలో 'ఓహో! ఈమెనుగని యితఁడు మన్మథావస్థలోనైనాఁడు. వీనిచిత్తవృత్తిని మరల్చుటకుం దగిన యుపాయమెట్లు? ఏమిచేయుదును?' అని యాలోచించి, యతం డడిగిన మాటలకు బదులు చెప్పక యనాదరము చేసి, యితరసంభాషణము జరుపుటయు, మోహాయత్తచిత్తుండై యున్న కీచకుఁడొండు పలుకు తనకురుచింపక మరల ద్రౌపదికి సమీపమునకు బోయి యామెనుచూచి "ఓ కాంతా

మణీ! లోకములో నీవంటి చక్కదనమే యువతులకును గలుగదు. ఇట్టి యందగత్తెవైన నీవు యెవ్వరి కుమార్తెవు? నీకు పెండ్లి యయ్యెనా? నీపేరేమి?" యని ప్రశ్నించెను. నిర్వికారచిత్తయైన యా రాజ్ఞి వాని పలుకుల ననాదరముచేసి మారుపలుకక వినియు విననట్లు మిన్నకుండెను.

చపలాత్ముఁడైన కీచకుఁ డామె యభిప్రాయమును తెలిసికొనఁజాలక మరల "శుభాంగీ! బదులు పలుకకుండెదవేమి? యందములైన తెల్లని విశాలములగు నీకన్నులు విచ్చి యొక్కించుక నావంకను చూడుము. సొగసగు నీమోమును మందహాసము వెలయునట్లు ద్రిప్పుము. ముత్తెములకైన నగు నీదు దంతముల కాంతులు వెలయునటుల నాతో భాషింపుము. నీలో నడంచుకొనియున్న యనురాగరసము వెల్లివిరియ ప్రియకరంబుగా నాచే యిఁబట్టుకొనుము" అనిపలుకుచు నయ్యబల నట్టె చూచుచు, నవ్వుచు, చేయిఁబట్టుకొనఁదివురుచు, నిటుల తనకుఁ గలిగియున్న యనురాగము నామె యెఱుంగునట్లు నటింపఁ దొడంగెను.

అతఁడు తనలోఁ బొడమిన మక్కువను మఱియుఁ దెలియఁ జేయనెంచి "సుందరవదనా! దృష్టిదోషమున లోపముకలుగు నేమోయని నీయందమును కన్నులఁజూచుటకు భయపడుచున్నాను. ఏమి? నీవు కోపగింతువోయని నీతో వెలచి మాటలాడుటకు సంశయించుచుండెదను, ఇదేమనుము? నీ చెయ్యి బట్టుకొనఁదలఁపఁగా నాచేయి గడగడ వడంకుచున్నది. నా స్థితి యిట్లున్నది ఇంతకును నీయభిప్రాయమిట్టిదనుటను నేను తెలిసికొనఁజాలకున్నాను. ఈప్రకారముగనే నన్నాదరింపక యింకను గొంతుకాలము మిన్నకుందువేని జీవింపను. మదనుఁడు నన్ను తప్పక చంపివేయును. అటులయినచో నామేను గూడి సుఖించుటకు నీకు శక్యముకాదు. ఎన్నివిధములనైనను నన్ను వద యాలేవు" అని తన యభిప్రాయంబు నామెకు తేటపడునట్లు పలికెను.

వాని మాటలువిని ద్రుపదపుత్త్రి తనలో మిక్కిలి కోపగించియు, నసహ్యతయుం జెందియు, వాఁడు పలుకుచున్న మితిమీఱిన మాటలను సహింపలేక "ఓహో! వీఁడు దురభిమానియు కామాంధుఁడును మంచి చెడ్డ నెఱుంగని తెలివిలేని వాఁడుగా నున్నాఁడు. వేగిరపడి వీనితో నేమియు నెక్కువ మాటలాడఁగూడదు. నేర్పుతో తప్పించుకొనవలయు'నని యెంచి యాగ్రహమును మీఁదికిఁదోఁపనీయక, లోలోన నడంచుకొని యతనితో మృదువచనంబుల నిట్లనియె.

## ద్రౌపది కీచకునకు యుక్తముగా బదులు చెప్పుట

"అయ్యా! మలినమై యసహ్యముగా నుండు నా శరీరమును, నా వస్త్రమునుం జూచి, నాపై వలపుఁ గొనుట యుక్తమగునా? ఇటువంటి దుస్థితి యందుండెడి యువతిని మీవంటివారు గోరదగురా! సత్పురుషులైనవారు యిట్లు పలుకరాదు. అదియునుగాక, నీవు నావంటి తోడఁబుట్టువులను గలిగి యుండియు, హీనజాతిలోఁ బుట్టిన పరస్త్రీని నన్ను యోచింపక యివ్విధమునఁ బలుకుట యక్రమము. గొప్పవారి కిది యనుచిత పథముగాని మంచిది కాదని" విడఁబలికిన నంతటనైనను నామె తలంపును దెలిసికొనలేక మనుజాధముఁడును, నల్పమతియునగు కీచకుఁడు మదనశరపీడిత మానసుండై యామెతో నిట్లనియె.

"సుందరాంగీ! ఆహా! తామర రేకుల మెత్తదనముం గూర్చి యచ్చులోఁ బోసి చేసిన విధంబున నొప్పుచున్న మృదువులగు నీపాదముల యందమును, చక్రవాకముల పొలుపుం దెచ్చి కుప్పలుగా నిడిన చందంబున నమరియున్న నీ చన్నుదోయి సొబగును, కళంకమును తొలగించి బాగు చేయఁబడిన చంద్రబింబము వలె నుండు మొగంబు సోయగమును తుమ్మెదల యందలి నలుపునంతయుం గొని నారుబోసి మొలపించిన తెఱఁగున చెలువుమించు నీ కుచభరంబును, చూచినచో యేపురుషుండు నీపై మోహమును జెందకుండును? ఇటువంటి సౌందర్య రేఖగల శుభాంగి భోగింపఁదగినది కాక యుండునా? ఓ చంచల లోచనా! నీచజాతియంటివి ఎట్లు? నీరూపమును, లక్షణములును చూడఁగా హీనకులసంభవవు కావని తోఁచుచున్నది. తోఁచుట యేల? తథ్యమేయగును. పరకాంతవగు నిన్నుఁ గోరుట దోషమని చెప్పితివి. అయిననగునుగాక, పరస్త్రీసంగమము చే గలిగెడి పాపమైనను సహించెదనుగాని యధికమైన మదనతాపమునకు నేనోర్వజాలను. నాయందు ప్రియముగలదానవై కోరికఁ దీర్పు" మని పలికెను.

అనుచితములైన యిట్టిమాటలు కీచకుఁడు పలుకుటయు ద్రౌపది మిక్కుడు కోపముఁగొని తనలో "వీఁడు నీచుఁడు. తరాతరంబు లెఱుంగక ప్రేలుచున్నాఁడు. యిటువంటి వారలను శిక్షించినంగాని తొలంగి పోఁజాలరు. ఇపుడు వీనిని వెఱఁగు పడఁ బలికి తప్పించుకొని పోయెదనుగాక" యని తలంచి యిట్లనియె.

"ఓయీ కీచకుఁడా! హానివృద్ధులం దలంపక నన్నుఁ గవయఁగోరి యిట్లు నట్లు పలుకుచున్నాఁడవు. ఇది నీకు క్షేమకరము కాదు. అధికమైన పరాక్రమము కలిగి ప్రసిద్ధినొందినవారును, బలియులైన శత్రువులను జయించి గర్వముతో నొప్పుచుండు వారునునగు నాపతులైదుగురు గంధర్వులున్నారు. వారు సామాన్యులు గారు. నీవు నాపై వలపుఁగొనుట నెఱింగిరేని యాప్రతాపవంతులు నిమిషములో నీప్రాణములు హరింపుదురు సుమీ! ఇంక నన్నుఁ గూర్చి యేమియుం బలుకకుము, నీ దురభిమానము నడంచుకొనుట మంచిది" యని చెప్పెను.

ఆమెమాటలకతంబు వెఱవక "ఏమీ! అయిదుగురు గంధర్వులా? ఐన నేమి? వారికి నేను భయపడువాఁడను గాను. వారే కాదు, నన్ను జయింపఁగల శక్తి యుంటెుడు మూడులోకములందును లేఁడు. ఈ విషయమై నీవు ఇసుమంతయును వెరవవలసినది లేదు. నాయందు కనికరించి నన్ను పాలింపు" మనెను. వాని పలుకులకు పాంచాలి కధికమైన కోపము కలిగెను. ఆమె తనలో తత్పూర్వపు తాలిమిం గోలుపోయి యతనిని ధిక్కరించి నిర్లక్ష్యముగా "ఓయి మతిహీనుఁడా! తగుసు తగదనుటఁ దలంపక, యోగ్యతాయోగ్యతల నెఱుంగక కామాంధుండవై యిట్లేమిటో బలుకుట యుచితము గాదని తెలిసికొనుము. పూర్వము పరకాంతలం గోరిన రావణాదులు మొదలగు వారి గతి యేమయ్యెనో యెఱుంగవా? వినియున్నాఁడవు కావా? అందని మ్రానిపండ్లకు కఱ్ఱుసాచెద వేల? ఇక నీప్రసంగమును జాలించి మరియాదతో తొలంగి పొమ్మని" కఠినముగా చెప్పెను.

ఈప్రకారమామె తనయభిప్రాయమేర్పడునట్లు స్పష్టముగా చెప్పి నను తెలిసికొననేరక యధికమైన పరితాపముఁ జెంది యంతం డటనుండి మరలి యక్కయగు సుధేష్ణకడకేగి నిజయత్నము విఫలమాగుటవలన గలిగినచింతచే చిన్నబోయిన ముఖముతో నిట్టూర్పులు పుచ్చుచు, కుసుమసాయకుని యసమశర నిసరంబుల తాఁకునకు నిలువఁజాలక యామెను జూచి యిట్లనియె.

కీచకుఁడు తన కామోద్రేకము తెఱఁగును సుధేష్ణతో చెప్పుట

"అక్కా! ఇంతకుమున్ను నీకుచూపిన పేరును కులమును విచారించిన లతాంగియందు నాచిత్తంబు లగ్నమై మరలక నన్ను కలంచుచున్నది.


సుధేష్ణతో కీచకుడు మాటలాడుట,


విరాటుని కొలువు.


ద్రౌపదిని కల్లునకై పంపుట


నకులుని అశ్వశిక్ష.


భీముడు వంట జేయుట


సహదేవుడు

దానిం గూడకున్నచో నేనిఁక బ్రతుకుట కష్టము. ఇంతేసి చెంత నింతవర
కును మెలంగుచుండుఁ గదా! అది తొలంగి యిపు డెచ్చటికి బోయినది?
దాని బొందు నాకు సమకూరు టెట్లు?'' అని యాడఁగను, సుధేష్ణ యతని వేఁడ
పాటును, పరితాపమును గాంచి తనలో 'ఓహో! మోసము వచ్చెనే!
ఎట్లు? ఇతఁడు చెడుతలంపు గొని వలపున హాని వృద్ధులం దలఁపక పలుకు
చున్నాఁడు. దీని కుపాయంబేమి?' యని చింతించి, శిరఃకంపం బొనర్చి
యతని దురభిప్రాయంబు నెటులనైనను మానునట్లు చేయువలయు
ననెడి యుద్దేశము కలదై యతని కిట్లనియెను.

"తమ్ముఁడా! రాయంచల పగిది నింపుగా మట్టియలు మ్రోయ నడు
చుచు డాయవచ్చి, నెత్తావులు గుబులుకొనుచుండెడి మైపూఁతల చేఁ గొప్ప
లతలవంటి శరీరము లింపు గలిగింపఁగా నొయ్యారము మతిశయింపఁ జేఁత నవ్వు
మొగంబులు వెలయ సరసంపుఁ బలుకుల చేతను, ప్రియము చేతను, సొగయఁ
జేయుచు, నెంతేని యానందము నొదవించుచు, నన్నివిధంబులను వినుతింపఁ
దగియున్న సౌందర్యవతులైన తరుణీరత్నము లెందఱో నిన్నుఁ గూడి భోగిం
చువారు కలిగియున్నారు. అటువంటి యుత్తమాంగనలతో గలసి సుఖించు
రీతిని మఱచి మలినగాత్రయు, మలినాంబర ధారిణియు నగు పరిచారికను
చూచి దానిపై మోహమును జెందికుందెదవేల? ఇది నీవంటివానికి దగునా?
ఈ వెఱ్ఱిభ్రాంతి నీకిపుడేల కలిగినది? మనయొద్ద పనులు చేయుచు వర్తించు
చున్న దానిపై వలపుఁ గొనుట నీకు మరియాద యగునా!'' యని పలికెను.

ఇట్లు చెప్పిన తనయక్క మాటల నాదరింపక కీచకుండు మోహపాశబద్ధుఁడై
"అక్కరో! నా యొద్దనుండెడి చేడియ లేకాదు, దేవేంద్రుఁడు గొలుచు
నచ్చర మచ్చెకంటులందైనను, యీనాతికి సరిపోల్పందగిన యువతులు గా
రుండరు. ఇది సత్యము. గండుమీనతోడను, మన్మథుని శాణమ్ము
తోడను, పొందుపడునట్టి మోహనంపుచూడ్కులును, తామరతూండ్ల
లేఁదీవియలను, కోమలత్వమున మించు కరములును, చిగురుటాకు
తామరపూవులను గెలుచునట్టి మెత్తని పాదములును, కోకిల
యొక్కయు వీణెయొక్కయు నాదమును మెచ్చని యెలుఁగును,
రూపరేఖలందును, కలిశీతనమందును, గరువమందును, నప్రతిమాన
తఁగాంచియున్న సైరంధ్రికెనయగు వనితలెందు గలరు? బళీ! పరిచా
యని నీవు మిగుల నలఁతిగా యెంచి పలుకుచున్నావు. సైరంధ్రిఁ
సకల సౌందర్య శృంగార లక్షణములను నెలకొనియున్నవి. అక్కా!

మాటననాదరింపక యేయుపాయము చేతనైనను, దానినినాతోడఁ గూర్చు భారము నీపైఁ బెట్టుచున్నాను. ఇటుల చేయవైతివేని నిక్కముగా నేను జీవింపను. మన్మథార్తిం జెంది ప్రాణంబులను గోల్పోవుదుం జుమీ! నన్ను రక్షింపు' మని వేడెను.

కామాంధుండై కీచకుం డిట్లు పలుకుటయు, సుధేష్ణ యతనిం జూచి ''తమ్ముడా! నీవు దుష్పథంబును ద్రొక్కఁ జూచుచున్నావు. ఇది యుక్తమైన కోరిక కానేరదు. వివేకహీనుఁడవు కావుగదా? నా వాక్యములు విని బాగుగా నాలోచనఁ జేసికొనుము పరస్త్రీల సంగమము వలన, నాయువును సిరియు కీర్తియు నశించును. అది కేవలము ధర్మ విరుద్ధమైన కార్యము, మహా పాప హేతువు. కావుననే బుద్ధిమంతు లగువారు పరాంగనా సంపర్కంబున కాసఁ గొందక బరిహరింతురు. ఈధర్మము నీవెఱుంగనిది కాదు. కనియు వినియు నుండియు నవివేకివలె హీనమైన పనికి ప్రియముఁ జెందుట నింద్యము. అన్యాంగనల పొందునఁ గలిగెడి సంకటము లెన్నియునుం గలవు. అదియొక గొప్పసుఖముగాఁ దలంచుట వెఱ్ఱితనమే గాని యన్యము గాదు. పరస్త్రీకి తాను చేయు కార్యమును మగఁ డెఱుంగునేమో అనెడి భీతిచే మానస మదరుచుండును. ఇతరులు చూచినచో పరువునకు హాని కలుగునని యెడి సంకోచమున మోము వెలవెలఁబోవుచుండును. చెలులకుఁ దెలిసిన యెడల నవమానము గలుగునను వెఱపున విలాసచేష్టలు లేకుండును. బంధువులు గనిన తనయందు రోతఁ జెంది బహిష్కరింపుదురను సంశయ భయంబులు మించి యొడలు చెమటబుట్టుచుండును. ఇటువంటి లక్షణము లెన్నియునుం బొడము చుండుటవలన క్రీడయందు సుఖిత మిచ్చలేనిదై కలంగిన చిత్తముతో పురుషునిపై ప్రియంబులేక యాదరింప కుండును. కాబట్టి పరస్త్రీల పొందుటవలన నించుకేనియు సౌఖ్యము గలుగదు. మింట నెఱింగియే దెలిసినవారు దానియందు తలంపుఁ జొరనీకుందురు. సాధారణముగా లోకమున పరకాంతల విషయమై కలుగు చుండు ముప్పులనుగూర్చి మాత్రమే యిపుడు చెప్పితిని. సైరంధ్రి విషయమైన నన్ననో, యంతే కాదు. మఱియొక గొప్పయుపద్రవము గలదు. వినుము, సోదరా! మిక్కిలి బలపరాక్రమవంతులైన దాని పతులు గంధర్వులై దుగురున్నారు. వారు సామాన్యులుగారు. వారిం దలంచిన భయముచే నాగుండెలు నీరగుచున్నవి. అయ్యో! బలీయులైన యందఱుపతులుగల దానినా కోరుట? అపేక్షింపవచ్చునా? ఏమి ముప్పు గలుగునో

నెవరైయుండుదురు ? చెడుదారింబట్టుట ప్రాణహానికి హేతువు. ఎట్టివానికిని ప్రాణము తీపిగదా! బుద్ధిపూర్వకముగా హానికలుగు నెఱింగియు, ప్రాణములు గోల్పోవుట కెవఁడు సాహసించును? బుద్ధిమంతులు హితవాక్యముల ననాదరింపరు, కావున నీ మేలును గోరి నేను చెప్పెడి పలుకుల ననాదరింపక విని సైరంధ్రిమాట నింక కలనైనం దలంపక జాగ్రతగా వర్తింపుము. దానిజోలి నీకు వలదు. అది క్షేమకరముగాదు'' అని తెలియఁ జెప్పెను.

సుధేష్ణ చెప్పిన హితోక్తులు కీచకున కామోదకరములు కావయ్యెను. ఆపలుకు లాదరింపక పెడచెవినిడి కామానలపరితప్తహృదయుండై తపించుచున్నవాఁడు. కావున, ఇంచుకయు వెఱవక గర్వముతో ‘‘అమ్మా! సైరంధ్రి మగలైదుగురు గంధర్వు లున్నారనియు, వారివలన ప్రాణహాని కలుగుననియు, కడుభయంబుతో నేను వెఱచునట్లు బలుకుచున్నావు. నాశక్తి నెఱింగిన దానవయ్యు నీవిట్టుల బలుకుటఁ దలంపఁగా నెంతయు నాశ్చర్యము పుట్టుచున్నది. ఈ విషయముగురించి నీవు చింతింపవలదు. లేశమైనను నాకు భయము లేదు. మూఁడులోకము లందును నన్ను జయించు బలవంతుఁడు లేఁడు. ఆగంధర్వులకు నేనే వెఱచువాఁడనా? వారు లెక్కలోని వారుగా దలంపకుము. ఒకవేళ నాప్రతాపమును సామర్థ్యమును దెలియక వచ్చి యెదిరించిరేని యింద్రుఁడు వజ్రాయుధముచే కొండలను ధ్వంసముఁ జేసినట్లు నాదృఢములైన బాహువుల సత్వమేర్పడుచందమున యాగంధర్వుల రూపుమాపెదను. బుద్ధిమాటలు చెప్పుటనువిడిచి నిజముగా నామేలుఁగోరుచుండుదానవైనచో, నొండుమాటఁ బలుకక నాకోరికఁ దీర్చుటకుఁ బ్రయత్నింపుము. కానిచో జీవముల భరింపనోపను. ఇప్పుడే దాసి నిచ్చోటికి రావించి, నన్ను నిందింపక, యాకోమలాంగిని నాయపేక్షఁదీర్చునట్లు నియమింపుము. నీవింక నేవిధమున నెన్ని చెప్పినను నవి నాయడలుఁదొలగింపఁజాలవు. అక్కా! నాయందు పూర్ణానుగ్రహము గలదానవై రక్షింపుము'' అనిపలుకుచు దీనవదనుండై దగ్గఱవచ్చియామె పాదములపై సాగిలఁబడి మ్రొక్కి లేవకయట్లేయుండెను.

## సుధేష్ణ కీచకుని దైన్యముఁగాంచి చింతించుట

ఈరీతిగా కీచకుఁ డడుగులపైఁబడుటయు, సుధేష్ణ వాని దీనస్థితిం జూచి చింతాక్రాంతస్వాంతయై తనలో ‘అయ్యో! ఎట్లు చెప్పినను నాహి

తోఁక్తులు వీని చెవులకెక్కకున్నవి. ఏమిచేయుదును? పిమ్మట సంకటము లెన్నిగలిగినను యిపుడు సైరంధ్రిని వీనితోఁగూర్చిననే కాని వ్యర్థపు మాటచే ప్రయోజనముగలుగదు. మహోగ్రవిష్టుఁడగుటచే నామాట నాదరింపకున్నాఁడు. కర్తవ్యంబెట్లు? సైరంధ్రి మూలమున వీనికి కీడుమూడునని యూహించుకున్నచో లాభ మేమిగలదు? ఇప్పటి యితని వేదనం గాంచిన మన్మథుని చేతనైనం దనువు గోల్పడువాఁడుగాఁగనుపట్టుచున్నాఁడు. నిజముగా జీవింపఁడు. ఈ సందర్భమువలన నేమి యుపద్రవము తటస్థింపనున్నదియో తోఁచ లేదు' అని తలంచుచు, తమ్ముని విషయమైన చింతచే కన్నుల దుఃఖబాష్పములు గ్రమ్ముచుండఁగా దానణంచుకొనుచు నిజపదంబులమీఁద వ్రాలియున్న యతనిని మెల్లగా లేవనెత్తి యుపవిష్టుం జేసి యనురాగంబు పెంపున నిట్లనియె.

"తమ్ముఁడా! ఇట్లు చింతనొందకుము. ధైర్యము నవలంభింపుము. ఊరటనొంది నీవింక నింటికిఁబొమ్ము. ఎట్లయిన నొప్పించి సైరంధ్రిని నీతోడ కూర్చెదను, నమ్ముము. నేను సారాయమును కొనిరమ్మని సాయంకాలము లోపల సైరంధ్రిని నీయింటికి పంపెదను. అపుడు నీయిష్టమును నెఱవేర్చుకొనుము" అనియిట్లు చెప్పుటయు కీచకుండు ప్రమోదితచిత్తుండై సుధేష్ణకు మ్రొక్కి నిజసదనంబున కరిగి వివేకహీనుండగుటచే పాంచాలికి తనయందు మోహమెక్కుడుగా గలిగియున్న దని తలంచుచు నయ్యబల రాగలదనియు దనకోరికలీడేరఁగలవనియు నిశ్చయించి యామె వచ్చుటకు పూర్వమే తానుచేయవలసిన కార్యముల దలపోసి, వివిధములైన భక్ష్యములును, మద్యపుదినుసులును సిద్ధముఁ జేయించి కామవికారమగ్న మానసుండై తలంపులకుం జొచ్చి తనలో 'ఆహా! ఆ సుందరాంగి ధైర్యవంతుఁడనగు నన్ను నెట్లు చేసినది? వాలుగ చేపకును, తామర రేకులకును, మరుని దూపులకును మెఱుపునకును, సిగ్గు బుట్టింపఁజాలిన మెఱయుచున్న కన్నులయొక్క మోహనంపు చూపులచే నన్ను చూచి నాపైఁదనకు గలిగియున్నయనురాగాతిశయమును దెలుపుచు పూర్ణముగా నామానసమును హరించినది. ఇంతటి ప్రియము నాయందు తనకు కలిగియున్నను, స్పష్టముగా నిజాభిప్రాయము తెలుపదయ్యెను. ఏమి కారణమనగా క్రొత్తగా చూచుటచేతను, సిగ్గుచేతను, నాతోడ ధైర్యముగా మాటలాడుటకును, మనోభావము నెఱింగించుటకును సాహసింపలేక యటుల నుండెనుకాని వేఱు

గాదు' అని కొండలపాటు గదిరినచిత్తంబుతో ద్రౌపదియందలి మోహాతిశయంబున మనంబు పోయినపోక ననుసరించుచు, వెండియు నామెను గూర్చియు, నామె లక్షణములగూర్చియుం దలపోతలకుం జొచ్చి 'అయ్యో! సైరంధ్రిమీఁది వలపు నన్నుతికమక పెట్టుచున్నది. ఎపుడు నన్నుఁ గూడునో నాకోరిక దీఱు నెపుడో తెలిసినది కాదు. దైవమా! ఎంతతడవు సైరించియుందును! ఆకాంతారత్నము నాకన్నులకుఁ బొడకట్టినయెడల నదియే నాకు నేత్రోత్సవము. మోహంపు జూపులతో నన్ను జూచెనేని నేను ధన్యుండను. అమృతాభిషేకమైనట్లు తలంతును. చిఱునవ్వు మోమున వెలయు తిన మృదుమధురములైన పలుకులతో నాతోడ మాటలాడినచో నెంతయు శ్రవణానందముగా నుండును గదా! నన్ను సంతోషింపఁ జేయ దలంచిన మదీయ పరమానందమునకు మేర యుండునా! నాపై నంతంతకుఁ బ్రేమ హెచ్చుచుండఁగా, కామోద్రేకంబున నణఁగి పెనఁగి సురతక్రీడలచే నన్ను సంతుష్టాంతరంగునిఁగావించెనేని యదియు జన్మసాఫల్యము. తెలివే గలదు? ఇటువంటి యదృష్టము నాకు చేకూఱుట యెపుడు?'' అని మఱియు ననేకవిధంబులం దలంచుచు మించిన వలపు పేదుర్భావంబున తలంపులకుం జొచ్చి వెతను పొందుచుండెను.

## సుధేష్ణ సైరంధ్రిని కీచకుని గృహమున కనుపుట

ఈప్రకారము సింహబలుండు పరితపించుచున్న సమయమున నట సుధేష్ణ తమ్మునకు దానొసంగిన వాగ్దానమును నెరవేర్చుతలంపుగలదియై తనకు మిక్కుటమైన దాహముకలిగిన చందమున నభినయించుచు, సైరంధ్రిని చేరఁజేరి యిట్లనియె. ''అమ్మా! నేఁడు యేలనో కాని దప్పియధికమైనది. నాలుక యెండిపోవుచున్నది. మంచిమద్యమును ద్రావవలయునని యాసబొడమినది. నాతమ్ముఁడగు కీచకుని యింటిలో యెపుడును మేలైన మద్యముండును. కావున నీవు శీఘ్రముగా నచటికరిగి దానిని నాకొఱకై యడిగి కొనిరమ్ము. ఆలస్యముఁ జేయకు'' మనెను.

ఆ పలుకులు ద్రౌపది చెవులకు ములుకులవలెఁ దోచెను. ఆమెకధికమైన భయము గలిగి మనస్సు చలింపఁ దొడంగెను. ముఖము వెలవెలఁ బోయెను. మిక్కుటమైన చింతగదిరి తనలో 'అకటా! ఇదియొక యుపద్రవము తటస్థించినదే! దీని కేమి చేయుదును? మద్యము కొఱకై నేను కీచకుని యింటి కరుగుట యుక్తము కాదు. ఒంటరిదాననై యెటులపోవు

దున? పోఁజాలనని యీమె యాజ్ఞ నుల్లంఘనచేసి పలుకుటయు మంచిది కాదు. ఏదైన నుపాయ మరసి యీసంకటమును తప్పించుకొనవలయు నని విచారించి డోలాయమాన మానసయై సుధేష్ణతో "దేవీ! ఇపుడు నీకు కల్లు దెచ్చుకొఱకు మఱియెవ్వరినైన బంపుము. నేను నీయొద్ద యుక్తమైన పనులు చేయుచు గౌరవముగా వర్తించుచుండెడి దాననుగాని, యిటువంటి పరిచారికలు చేయవలసిన యల్పకార్యములు చేయుటకుఁ దగినదాననుగాను. అమ్మా! నీవుమిక్కిలి యోగ్యురాలవనియు, నిర్మలమైన గొప్పమనస్సుఁ గలదానవనియుం దలంచి, సదాచార ప్రవర్తనకుఁ దగినచోటని నాపతులు చింతలేకుండినను, నేను మిమ్ము నమ్మి మీచెంత గౌరవముగా వర్తించుచుండగా ఆ మరియాదను తప్పించి యిటువంటి పనులకు నన్ను నియమించుట న్యాయమగునా? సజ్జనులైన వారలు తమ సదాచార పద్ధతులను రక్షించుకొనుటకై పెద్దవారి నాశ్రయించి నప్పుడు వారిని వారు తగిన చందమున నన్నివిధములను నాదరించి రక్షించికీర్తిని పొందవలయును. అటులచేయని యెడల నిందకు పాలగుదురు. మొదట నేను నీయొద్ద చేరినపుడే నీచకార్యములు చేయుదానను కాననియు, అట్టి పనులకు నన్ను నియమింప వలదనియుం జెప్పినందుకు నీవు సమ్మతించిన దానవుగదా! అదిమఱచి, దేనికొఱకో యెవ్వనియింటికో పంపుట ధర్మమగునా? చెప్పుము. ఎట్లుపోవుదును? ఈలాగుచేయుట నావ్రతనకుము భంగముకాదా? అని యాపనిచేయుటకు తనకు సమ్మతముగా కుండుట తెలియునట్లు వచించెను.

అపుడు సుధేష్ణ పాంచాలి వాక్యములు న్యాయమైన వనుటం దలపోసి యించుక యాలోచించి యెట్లైనను దనతమ్ముని కొసంగినమాట చెల్లించవలెననెడి తలంపుగలదగుటచే ద్రుపదసుతం జూచి, "ఔరా! ఇట్లునుంగలదా? నేనుమిక్కిలి దాహముఁగొని యధికమైన యాశతో మద్యముం దెమ్మనఁగా, నీవిది నీచకార్యమనియు, చేయఁదగినది కాదనియు. వాండ్లను అంపుమనియు, నధికదుఃఖముతో పలుకుచున్నావు, నీప్రవర్తనము, ప్రియంబునకును, స్నేహమునకునుం దగినది కానేరదు. నిన్ను నేను వేఱొక చోటునకుఁ బొమ్మనలేదు. నాతమ్ముఁడైన కీచకుని యింటికి బోయిరమ్మని చెప్పితిని. అది యన్యగృహమగునా? సంశయింప నేమిటికి? అపుడప్పుడును నీనడవడియు సద్గుణంబులును నందఱితోడను నేను వర్ణించి పలుకుచుందును. కాబట్టి యెలరను నీశీలమును బాగుగా నెఱుంగుదురు.

మఱియాదగాఁ జూతురు. భయమేమిగలదు? నిన్ను తెలియని వారలచ్చోట నెవ్వరున్నారు? ఈపని చేయుటకై యింత చెప్పవలయునా! త్వరితముగాఁ బోయి కొనిరమ్ము. వ్యర్థముగా కాలమును గడపకు'' మనిపలికెను.

తానేపోయి మద్యమును కొనిరావలసినట్లు పలుతెరంగుల సుధేష్ణ తనతోఁ బ్రార్థించి చెప్పుటవలన మఱియెట్లును నడ్డుమాటలు పలుకుటకు పాంచాలికి వలనుగాదయ్యెను. తనలో 'ఎట్లు చెప్పినను పట్టువీడక యీమె నన్నే పొమ్మనుచున్నది. ఇంక నూరక పోజాలనని పెనగుంటచే ప్రయోజనములేదు. ఎట్టి విపత్తు తటస్థించినను పోవకతప్ప'దని నిశ్చయించి యామె విచారచిత్తయై వివర్ణమైనముఖముతో సుధేష్ణతో ''ఓయమ్మా! ఈ పనిని నేను చేయుట సముచితమని నీకుతోఁచెనేని భవదాజ్ఞానుసారముగాఁ గావించెదను'' అని చెప్పెను.

ఆ మాటలకు రాజమహిషి హర్షమునుజెంది బంగారుపాత్రము నొకదానిని యామెచే నొసంగెను. ద్రౌపది దానిని పుచ్చుకొని మిక్కిలి విచారముతో తత్పూర్వము నీచమనస్కుండైన కీచకుఁడు తనతోఁ బలికిన దురాలాపంబులందలంచి యప్పుడువాని యింటికి సుధేష్ణపనుచుట పిడుగు పడిన వానిని కొఱవితోఁ గాల్చినట్లుగా నేర్పడుట కెంతయుంగుందుచు ప్రయాణంబై పోవుచు తనలో 'హా! ఇటువంటికష్టములొందనైతిగదా!' యనిపొగలుచు దైవమును దూఱుచు యట్టిసమయంబున దిక్కెవ్వరును లేమికిఁగన్నీళ్ళుగార్చుచు, పదంబులు వడకుటచే యడుగులిడంజాలక తొట్రిలుచు, మరల 'నెవ్వరును నన్ను డాకఁజాలరు, వెఱపేల?' యని తనకుదాన ధైర్యమును పురికొలుపుకొనుచు, పోవఁదొడంగెను.

ద్రౌపది మద్యముఁ దెచ్చుటకై కీచకుని యింటికేగుట

ఆసమయంబున సందేహమును, దైన్యమును నతిశయించి తనలోని ధైర్యముతొలంగుటచే ముఖము వెలవెలఁబోవుటయును, భయాతిరేకంబున మేనువడంకుటయును, దేహమునకు శ్రమదోఁచుటచే తొట్రుపాటుగదురుటయు, దేహమున చెమట బట్టుటయు, దుఃఖము సంకటము, నిశ్చేష్టత మనోవేదన, మొదలైన లక్షణము లంకురింపఁ దొడంగెను.

ఇవ్విధంబున యాసాధ్వి దురవస్థంబొందుచు, సర్వసంకటములును హరించునది భగవన్నామస్మరణంబనియు, తత్సమయంబున పరమేశ్వరుండే తనకు రక్షకుఁడనియు నిశ్చయించి, మనంబున జనార్దనుని నిక్షేపించుకొని స్మరించి నమస్కరించుచు పోవుచుండి సూర్యభగవానునింజూచి వినయం

బును భక్తియు నతిశయింపఁగా చేఁదోయి మోడ్చి ప్రమొక్కి తనలో 'ఓ మూర్తిత్రయాత్మకా! పావనస్వరూపా! కమలమిత్రా! నేను పాండవుల యెడతప్పనిమానసముగల పతివ్రతనగుదునేని నాయందు కరుణించి దురాత్ముండైన కీచకునివలన నాకు కీడేదియుం గలుగకుండునట్లు చేసి నన్ను రక్షింపు''మని ప్రార్థించెను.

తత్సమయంబున సూర్యుండా సాధ్విని రక్షింపఁదలంచి యామెపైఁ గనికరించి, యా కీచకునివలన నెట్టి యుపద్రవంబునుం బొరయక రక్షించుటకై బలాఢ్యుండైన రాక్షసునొక్కని నామెకు సహాయముగాఁబనిచెను. ఆరక్కసుఁడు ద్రౌపదికి గోచరుండుగాక యదృశ్యాకారుండై యంబరమున నయ్యబలననుసరించి వచ్చుచుండెను. ఈవిధంబున సూర్యుని ప్రార్థించి ద్రుపదనందన మహాప్రయాసముతో నడచిపోయి భయమును బొందుచు క్రూరమైన పులియున్న పొదనుఁజొచ్చు లేడివలె దుష్టుండైన కీచకుని మందిరముం బ్రవేశించెను.

ఆమె రాకను కామవహ్నిచేఁ గ్రాగుచున్న కీచకుండు చూచి, తన పరితాపమును, చింతయుం బ్రయత్నమున నడఁచుకొని వేగిరపాటును సంతోషమును గలవాఁడై మిక్కిలి చలించు చిత్తముతో తొట్రుపాటు గదురుచుండఁగా సొమ్ములను సవరించుకొనుచు, తనయొడలి కలంకారంబొడగూర్చుకొనుచుండెను. అపుడు మందగమనంబున పాంచాలి యతని యున్నెడ జేరఁబోయి, చూచి ''అయ్యా! మాయజమానురాలైన మీయక్కగారు మిగుల దాహముఁ జెందినదై మద్యమును గొనిరమ్మని యిచ్చోటికి నన్నుఁ బంపగా వచ్చితిని. ఇప్పింపుఁడు, త్వరితముగా కొనిపోవకున్న యామె కోపగించుకొను'' ననియడిగెను. ఆమాటలు విని యతఁడామెయందు తనలోఁగల మోహ మతిశయింపఁగా యాసుందరీమణి మోమునందె తన దృష్టులు నిలిపి మందహాసవదనుండై యిట్లనియె.

''కాంతాశిరోమణీ! నీవు వచ్చుటవలన నెంతయు సమ్మోదముగలిగెను మంచిదిగా? నాతోఁడఁబుట్టువునకు దాహముగలుగగా దానిఁదీర్పదలంచి గదా వచ్చితివి. ఆమె తమ్ముఁడనగు నాకుఁ దొడరినదప్పికమాత్రము పోఁగొట్టవలదా? చెప్పుము! సరసములైన నీను మృదుభాషణములచే నాతాపమును సయితమపనయింపుము. నీకటాక్షమునకు పాత్రుఁడనుగాకుండుటవలనఁ బొడమిన దేహతాపమును, మధురములగు నీమాటలు వినకుండుటచే కలిగిన కర్ణముల తాపమును, నీను విలాసములైన చేష్టలను

చూడకుండుట కతనం బొడమిన నేత్రముల తాపమును నిన్నుంగూడి సురతకేళిం బెనంగకుండుటచే సంభవించుమనస్తాపమును నిపుడుపోఁగొట్టి, నా జన్మము సఫలముఁగావింపుము. నన్ను నీబంటుగాఁ గైకొనుము. ఇటులసిగ్గు జెందనేమిటికి? చేరవచ్చి నీయాలింగన సౌఖ్యమున నానందమగ్నునింగా వింపుము" అని తోఁచినట్లు పేలదొడంగెను.

పాంచాలి దుర్మతియైన వానిపలుకులకు లక్ష్యముచేయక యనాదరంబునఁ జెడచెవులనిడి, ధైర్యముగలదియు, నెట్టివికారమును మనంబున గలుగనీనిదియు నగుటచే వానింజూచి "అయ్యా! ఈ మాటలు చాలించి తొందరగా మద్యమును బోయింపుము. తడవునిలుచుటకు వలనుగాదు. మాదేవి మిగుల దప్పిఁగొని యున్నది. వేగముగా నేను పోవలయును. ఆలస్యమైనచో యామె నాపైఁగోపించు"నని చెప్పెను.

వ్యామోహా పీడితమానసుండై యున్న కీచకుండా బింబాధరపలుకులువిని "లతాంగీ! దీనికై నీవుభయమునుపొందవలదు. నాసహోదరికి త్వరితముగా నొండ్లచే మద్యమును బంపెదను. ఇదిగో! ప్రసిద్ధమైన సువాసనగలదియగు మంచి మద్యమున్నది. దీనిని నీవుద్రావి మరిమరి యుక్తమైన నీముఖంబున మోముఁజేర్చి నీయధరామృతము నన్ను గ్రోలనిమ్ము. దానివలన నాలోనితాపమును చల్లార్పుము. ఈసమయంబున నాకోరిక తీర్చితివేని నీకుకలుగు మేలుకడుగొప్పదిగానుండును. ఎట్లనిన, నాకుంగల, కరితురగరథ దాసదాసీజనంబులకును, సకలభోగభాగ్యములకును నిన్నే యధికారిణినింగావించెదను. నాకుగలిగియున్న మణులను భూషణములను, మందిరములను నుద్యానవనాదులను, సేవించుటకుం దగిన వేశ్యాజనంబులను నొప్పించి నిన్ను తృప్తినొందించెదను ఇంతి మాత్రమేకాదు. నాభార్య లందఱును నీకు పరిచర్యచేయు చుండునట్లును, నీయాజ్ఞాబద్ధులై యుండునట్లునుఁ జేసెదను. నేన్ననో నీకనుసన్నను మెలంగుచు, యెట్లు చెప్పుదువో యావిధమున ప్రవర్తించు చుండెదను, వేయేల? సకల కార్యంబులను నీవే యిచ్చవచ్చిన చందమున సవరించుచుందువు. నీమాటకు వ్యతిరేకముగా నొక్కటియు జరుగనేరదు" అని యొడలెఱుంగని మోహముతోఁబలుకుచు, కీచకుండు యుక్తాయుక్త వివేచనాశక్తి తొలంగి వేగిరపాటుతో తటాలున నామెను పట్టుకొనెను. అటులఁజేయుటయు, పాంచాలి మహాకోపమునుజెంది, తత్సమయంబున తనకు సహాయార్థమై సూర్యునిచే పంపబడి యదృశ్యుండై వెంటనుండిన

యసురుని బాంబు తనలో నావహిల్లుటయు, నయ్యరవిందవదన కీచకుని చేయిని విదల్చివదలించుకొని బిరబిర నతని మందిరమును విడిచి వెలువడియెను.

అంతట కీచకుండు తనపట్టు విడిపించుకొని పోవుచున్న ద్రుపదపుత్రింగని యొడుపుదప్పిన భుజగంబు పగిది నూర్పులు నిగుడించుచు నెట్టకేలకుం బట్టుకొని తనకోరికం దీర్చుకొన వలయునని తమకం బగ్గలింప వెన్నంటి త్వరితగమనంబున వచ్చుటయు, ద్రౌపది మరలిచూచి వాఁడు పట్టుకొనుటకై వచ్చుచుండుట నెఱింగి భయభ్రాంత చిత్తయై యేమి చేయుటకుందోఁచక 'అయ్యో! పాపాత్ముండైనవీఁడు నావెంటఁబడివచ్చుచున్నాఁడు. వీనిచేఁజిక్కితినేని హానికలుగుట నిశ్చయము. దీనికెట్లుచేయుదును? ఉపాయమెయ్యది? ఈదుష్టునిబారినుండి తప్పించుకొను టెట్లు? ఇప్పుడునన్ను రక్షించుట కిచ్చోట నెవ్వరుగలరు? ఏవంకఁ బోవుదును? ఎవ్వరి మరుగుఁ జేరుదును? దైవమా! గొప్పసంకటములోఁ దగుల్కొంటి' నని తత్తరపాటుతో వానికిం జిక్కక బిరబిరఁ బోవసాగెను.

ఆ సమయంబున విరాటరాజు దైవయోగంబున బయలుకొలువున నుండుటం జేసి యామెయును ధైర్యము నవలంభించి వేగముగా తత్సభ వంకకు పరుగెత్తిపోయెను. తన సేత యన్యులెఱుంగకూడదని రహస్యమైనదనియు, బహిరంగము గాఁదగినదికాదనియు నున్మత్తచిత్తుండైనకీచకుండు లేశమైనను తలంచి సంశయింపక, కామాంధకారమున జిక్కియున్నవాఁడు కావున, రాజసభా జనంబులనుగాని తదితరులైన ప్రజలనుగాని గణింపక యుద్రేకంబును నిబ్బరమును నతిశయించి, కూడనుట్టి సభ్యులాశ్చర్యముతోఁ జూచుచుండగా, మదించిన యేనుఁగు కదలుచున్న కోమలమైన తీఁగనుపట్టినట్లును, క్రూరుఁడైన రాక్షసుఁడు భూలోకములో సంచరించుటకై వన దేవకాంతను పట్టుకొనిన చందమునను, నతిశయమైన యాకలిగొనియున్న గ్రద్ద పామును కబళింపఁ బట్టుకొను విధంబునను, గండుబిల్లియుండమైన గోరువంక పిల్లను పట్టుకొనిన లాగునను వెంటఁ దగిలి మిక్కిలి కోపముతోఁ దలఁబట్టుకొని ద్రౌపదిని ఈడిచి తన్ని నేలఁబడం ద్రోసెను. తత్సమయంబున పాంచాలిక రక్షకుఁడై వచ్చుచున్న రాక్షసుండుగ్రుండై దురాత్ముఁడగు కీచకుని గ్రుద్ది నేలఁ గూలఁబడ నేసెను.

ఇట్లు రాక్షసునిచే ద్రేటువడి నేలఁబడి యాసింహాబలుండు తనపడిన రీతి నొరు లెఱుంగ బోయెదరని తటాలున లేచి యటువంటి యవమానము

తనకు గలుగుటకు కారణం బెఱుంగలేక వెఱగొంది, కోపాతిరేకంబున నూర్పులు నిగుడించుచు నిలిచెను.

## ద్రౌపది పరిభవంబుఁగని భీమసేనుఁడు గ్రుఁడగుట

అయ్యెడను విరాటుని సభలో ధర్మరాజ వృకోదరు లిరువురు నుండిరి. భీముండు తన భార్యయగు ద్రౌపదికిఁ గలిగిన యవమానమును, దుష్టబుద్ధియగు కీచకుని మదవిజృంభణమును జూచి సహించలేక యత్యంతమైన కోపవేగముచే కన్నులనుండి నిప్పులు రాలుచుండఁగా, దేహము పదర చెమట లంకురింప కనుబొమలు ముడివడ, పండ్లు పటపటఁ గొరుకుచు, భయంకరమైన యాకారముగలవాఁడై, భూమ్యాకాశములు రెండును తాళములుగాఁ జేసి వాయించుటకును, పర్వతములన్ని యవియొగిరి యొండొంటిందాకి పొడియగునట్లు చేయుటకును, సముద్రజలంబుల నెగయఁజల్లి యడుగు బురదను దేహమున నలందుకొనుటకును, దిక్కులనన్నింటి నొకటిగఁ జేసివిండుటకును తగిన తనశక్తి యధికరింపగా, ప్రళయకాలానలతుల్యంబగు నత్యుగ్రతత్వముతో లోకంబును గబళించు రుద్రునిభంగి చూపట్టెను.

ఇట్లు మించిన యాగ్రహముతో కీచకునిఁ జంపుటకు యత్నించితము గూఢవర్తన ప్రకారమును సయితము మఱచి, దురాత్ముఁడైన కీచకునితో బంధుత్వముగలవాఁడును, వాని యాజ్ఞలకు సమ్మతించి నడచువాఁడును, నప్పటిప్రవర్తనంబు నట్టిదనుచు మిన్నకున్న వాఁడునైన విరాటుండును తన కోపానలంబుచే భస్మీభూతుండగుట కర్హుండేయని తలంచి యటను సమీపంబుననుండెడి యున్నత వృక్షంబు నూడంబెఱికి దానితో వారలమర్దించుతలంపున యాచెట్టువంక దృష్టిసారించి నిజాననంబరుణ కాంతులనీనుచుండ, ననుజ్ఞార్థముగా నన్నవంక చూచెను.

భీముని యుగ్రాకృతియు నతని యుద్దేశంబును ధర్మనందనుఁడు తెలిసికొని సమయభంగమగుటకు వెఱచి, కనుసంజ్ఞచే, కోపమునడంచుకొనుమనియు, నుద్రేకమునకు తరుణము గాదనియుం దెలిపి, యందరు విన, గూఢంబైన తనయభిప్రాయంబు తన తమ్మునకు మాత్రము తోఁచు విధంబున ప్రకాశంబుగా నిట్లనియె.

“ఏమీ? వలలుఁడిచ్చోట నొకచెట్టును చూచుచున్నట్లున్నది? వంటికి కావలిన చెట్లు మఱియొకచోట గలుగవా? ఈ మొదటి వృక్షము కదు

విశాలమైన ఫలపుష్పసంభరితమై పెక్కండ్రకు నీడనిచ్చునదియైయున్నది. ఇట్టితరువును నంటకట్టెలకొఱకు తెగఁజూడఁ దలంచుట యనుచితము" అనిచెప్పి యుధిష్ఠిరుండు వృకోదరుని కోపవిజృంభణము నడంగఁజేసిన,యగ్రజుని యాజ్ఞాబద్ధుండై యమ్మహావీరుండు చేయునదిలేక యాగ్రహము నుడిగియుండెను.

అపుడు పాంచాలి యాయన్నదమ్ములవర్తనంబుఁగని వానిసంభాషణంబులనువిని, మెల్లగాలేచి దుమ్ముగప్పిన తీఁగయుంబోలె కోమలమైన దేహముక్రిందబడుటచే భూపరాగంబంటియుండఁగా, సంపెఁగపూవునుండి వెడలువాసనవలె ముక్కునుండి శ్వాసలెసఁగుచుండఁగా, తామరపూవు రేకులకొనలనుండి మంచునీరుకారునట్లు, కనుఁగొలంకులశోకభాష్పములు జాఱగా, చంద్రునిలో కళంకమువలె సుందరమైన మోముపై ముంగురులుచెదరి వ్యాపింపగా, నత్యుత్తమురాలైనయాద్రౌపది మహాదైన్యముతో దిక్కులేనిదానిచందమున విరాటరాజుసభయొద్దకు వచ్చినిలిచెను. తనలోనొకవైపున నధికమైనకోపమును, మఱియొకవైపున తమయజ్ఞాతవాసరహస్యము బయలుపడునేమోయనెడిభయమును నతిశయింపఁగా యచ్చటనుండెడిభర్తలను సభ్యజనులం జూచినట్లుగాజూచుచు పతులకు నిజక్రోధావేశం బెఱుకపడునట్లుగా నిట్లనిచెప్పెను.

## ద్రౌపది తన భంగపాటును విరాటునితో చెప్పుట

"ధర్మాధర్మములను బాగుగా నెఱింగినవారును, శిష్టులను రక్షించుటయు దుష్టులను శిక్షించుటయును దీక్షగాఁగలవారును, శస్త్రాస్త్రవిద్యలందసమాన పాండిత్యముఁ గలిగియున్నవారును, దుర్మార్గులైనట్టి శత్రువులం బరిమార్చుశక్తిగలవారునునైన, నామగలు వంధర్మ పంచకము తమధర్మపత్ని నగునన్ను దుర్మార్గుండగుకీచకుండివ్విధంబుననవమానింపగా చూచుచు మిన్నకున్నవారు. ఇదిమహాదాశ్చర్యము! లోకములో మఱెవ్వరి భార్యలు తామవమానింపఁబడక యింక రక్షింపఁ బడఁగల వారలు? ఇందరు గొప్పవార లింతయుం గనుచున్నారుగదా! ఈసభలోని మహాజనులలో నొకఁడేనియు, నిదితగును తగదని నోరెత్తి యొకమాటయైనం బలుకకుండెదరు. ధర్మజ్ఞులైన యిందఱి యెదుటచే కీచకుఁడ నిర్లక్ష్యముగను, నిర్భయంబుగాను, ఇంతవరకు నెందును నేపురుషుండె స్త్రీకినిఁగలిగింపని యవమానమును కలిగింపఁగా నట్లె చూచుచుండుట

మెంతయు నాశ్చర్యము. ఈ మహాసభలో నాపరిభవ విషయమై నేను యిపుడు దూఱందగిన వాఁడీ విరాటరాజు మాత్రమేయని తలంచుచున్నాను. ఇతఁడొక్కరుఁడే నిందకు పాత్రుఁడగుటకేమి కారణమనగా, తన దేశమందెవ్వఁడైనను తప్పుచేసిన యెడల రాజైన వాఁడటువంటి దుష్టుని శిక్షింపవలయును. ఇట్లు చేయవలసిన, బాధ్యత రాజునందుగలదు ఇప్పుడన్ననో, తాను కనుచుండగానే కీచకుండు నన్ను పరిభవించెనుగదా! అది యధర్మమని యెఱింగియు నిమ్మహీపాలుండు వానిని శిక్షింపక యూరకున్నాఁడు. ఇది న్యాయమనవచ్చునా?'' ఈప్రకారము బలుకుచున్న పాంచాలిపలుకులు వినగా యామెయందు విరాటునకు కనికరముగలిగి తనలో మిగుల చింతనొంది, యాకీచకుని శిక్షించునంతటి బలము తనకు లేకుండుట వలన నేమియుం జేయఁజాలనివాఁడై, ద్రౌపది చిక్కుఁ దప్పించుకొనుటచే నత్యంతాగ్రహమును జెందియున్న కీచకుని నేదియు ననక, మంచి మాటలచే వానికోపంబుఁదొలంచి శాంతచిత్తుం జేసెను యతఁడు నిష్ఫలమనోరథుండై యటనుండి మరలి నిజమందిరమునకుఁ బోయెను.

తత్సమయమున్నన సభ్యులామెకు తొడరిన యవమానమునుజూచి సహింపలేక యేమిచేయుటకును తాము శక్తిలేని వారగుటచే నొండొరులు తమలో 'అయ్యో! ఇంతటి యన్యాయ మెందైనంగలుగునా? పరకాంతను దుశ్శీలుఁడైన కీచకుండిటులవమానింపవచ్చునా? పతివ్రతయు, చక్కనిదియు, సుకుమార గాత్రయునగు నియ్యబల కెంతకష్టముగలిగెను? ఇంతటి యుత్తమురాలు గట్టువాలెట్లనో తెలిసినది కాదు. దైవమీయామె కీలాగున సంకటమును గలిగింపదగునా? దురాత్ముఁడించుకయు భయము లేక రాజునకెదుటనే యింతకార్యమును చేసెను. వాని ధైర్యసాహసముల నేమనవచ్చును? ఛీ! ఆసుధేష్ణ యుపేక్షయే ఇంతటికిని కారణము. ఇటులసంభవించెను. ఏమిచేయవచ్చు' నని గుసగుస లాడుచు దుఃఖించుచుండిరి. కాని తద్విషయమై యిదమిద్ధమని పలికినవారు కారు.

## ధర్మజుఁడు ద్రౌపదికి జవాబు నొసంగుట

అపుడామె పలుకులు వినుచున్న ధర్మరాజు కోపమును జెందియు, తన మనోబలంబుచే పొడమిన యాగ్రహమును లోలోన నడంచుకొని యెపుడును తానచ్చోట మాటలాడుచున్నట్లే యెఱుంగును గాని, యభిప్రాయముగాని భేదముగాతోఁచకుండురీతిగా యామెవంకఁజూచి ''ఓసైరంధ్రీ!

వల నీవిచ్చోట నిలిచి సభవారియెదుట నూరక ప్రేలెదవు? చాలు చాలు, నీవృత్తాంతము సభ్యులందఱకుం దెలిసినది. అందఱు నెఱింగి యుండెదరు. ఇంక నేమియుం బలుకక సుధేష్ణయింటికేగుము. నీపతులైన గంధర్వులు సామాన్యులు గాకుండుటయు, నిదిసమయముగాదని యెంచి యూరకున్నారు. వారికిని నీకును నేదియో సంకేతము కలిగియుండవలయును. ఆ కారణమువలన వారిపు డాగ్రహింపకుండెదరు. దీనికై వారిని నీవు నిందించుట పాడిగాదు. పతివ్రతయైన యాడుది తన కెంతటికష్టము కలిగినను గొప్పవారు వినఁగా, సభలలో నిర్భయముగా నిట్టివిధమున మాటలాడుట యుక్తము కానేరదు. కులస్త్రీనని చెప్పుచు, నాట్యము చేయుదాని భంగిని సభలోనుండుట నీకు తగదు వెడలిపొ"మ్మని చెప్పెను.

ఆ రీతిం జెప్పిన యుధిష్ఠిరుని మాటలు విని యామె కోపంబున నతని నుద్దేశించి నిజాభిప్రాయం బెఱుకపడులాగున "ఓయి కంకభట్టుఁడా! నీవు సరిగానే చెప్పితివి. భర్తనటుడుగానుండిన భార్య మాత్రము కాక పోవునా? నామగండు నటుండు, కావున నేనును నటినైతిని. ఇందు వింత యేమియు లేదు. నాకు నాట్యమందునుం గొంత పరిచయముగలదు. జగంబెఱుంగును గాక. నటుండు మాత్రమే గాక మత్పతి జూదరి, జూదగాని భార్యకు గౌరవము గలుగునా? ఇచ్చోట నిలువరాదని పోయెదఁగాక" యని పలికి యటనుండి కదలిపోవుచు తనలో, 'కల్లు దెచ్చు నెపమున తనతమ్ముఁడును దురాత్ముఁడునునైన కీచకుని యింటికి నన్నుఁ బంపినట్టి దుష్టురాలగు సుధేష్ణ యొద్దకుఁబోయి నాకు సంభవించిన యవమానమును, ఆ యవివేకినియైన హీనుని చెడునడతయుం జెప్పెదనుగాక' యని మహాదుఃఖముతో కన్నుల నీరు కాఱుచుండగా, మైజెమటలు పొడమ నొడలు వదర, పదములు తొట్రుపడఁగా నడచి కడుదైన్యముతో రాజపత్ని మందిరమునకుం జనియెను.

ఆప్రకారము వ్యసనాక్రాంతయై తనయొద్దకు వచ్చిన పాంచాలిం జూచి, సుధేష్ణ తానొక్కటియు నెఱుంగని దానిచందమున నటించుచు లేనివగపుం దెచ్చుకొని దిగులొందినదియుఁబోలె డగ్గుత్తికతో "అమ్మా! ఇట్లుండెద వేమి? దేహమంతయు ధూళిగ్రమ్మి నీయందము చెడియుండుటకును, దుఃఖాతిశయంబుచే ముఖంబు సొంపు తొలంగి వాడియుండుటకును, చెమటకతంబున ముంగురులు మొగంబున నంటియుండుటకును, జొటజొట కన్నులనుండి శోకాంబువులురులుచు చెన్నుదరిగియుండుటకును, నేమికార

ణము ? ఇట్టులనెచ్చోట నెవ్వఁడు నీకు నపకృతి గావించి దుఃఖమును గలుగఁ జేసెరో త్వరితముగా దెలియఁ జేయుము. ఆదురాత్ము లెవ్వరైనను నిపుడె వారిని శిక్షింపఁ జేసెద" నని యడిగిన, యామె కపటవర్తనం బెఱిఁగి యున్న ద్రౌపది యామాటలు విని తలయూఁచి 'ఓయమ్మా! ఈవృత్తాంత మంతయును నీవు యెఱింగినదియే యయ్యుఁ దెలియనిదానివిధంబున నడుగుచున్నావు. ఇంక నీకుఁ జెప్పవలసిన దేమి? ఏమని పలుకఁగల దానను? అయినను, నడిగితివిగావున, నేనే యావృత్తాంతము నెఱిఁగించెదను. నీవలననే యిట్టి దుర్దశ తటస్థించినది వినుము" అని యిట్లనియె.

"నన్ను నీవు కీచకుని యింటికిఁబోయి మద్యమును దెమ్మని చెప్పితివిగదా! నీయాజ్ఞప్రకారముగా నేనతనిమందిరమున కరిగినంతట నతఁడు నాపై వలపుఁగొని యవమానింపఁదొడగిపట్టుకొనెను. నేను తప్పించుకొని పరుగెత్తి బయటకొలువున్న విరాటరాజు సభయొద్దకు వచ్చితిని. అతఁడు నన్ను వెంబడించి తరుముకొనివచ్చి కొలువుదగ్గర నన్ను నేలఁ బడద్రోసి తన్నెను. ఇంకేమి కావలయును?" అనియేడ్చెను.

సుధేష్ణ యామె దుఃఖమును జూచి సహింపకున్నదియుం బోలె నటించి "అమ్మా! చింతనొందకుము. కీచకుండు వివేకహీనుండై తెరం బెఱుంగక గొప్ప నేరముఁ జేసెను. అయిననిపుడేమియును మించిపోయినది లేదు. నేను వానికిం దగిన శిక్షను చేయించెదను. ఊఱటనొంది శాంతచిత్తవై యుండు"మని యనునయోక్తులు బలికిన, యామె కపటవాక్యంబుల నెఱింగి ద్రౌపది యామాటల నాదరింపక యామెతో "తల్లీ! నాకొఱకై నీవింతయాగ్రహమును పూని యీకార్యమునందు జోక్యము కలిగించుకొనవలదు. ఏలన, దీనికి దగినవిధము వేరువిధముగాఁ గలదు. నాకు కలిగిన వ్యసనమును నాదుస్థితింజూచి నగుచున్న పట్టణవాసుల చింతయును, గంధర్వులైన నాపతులు త్వరితముగా తీరునటుల నింతటి పరిభవమును గలిగించిన వానికిఁదగిన శిక్షను జేసి తమ పగందీర్చుకొనఁ గలరు" అనెను.

ఆమాటలు వినగానే సుధేష్ణకును, నచ్చటనుండు తక్కిన స్త్రీలకును నధికమైన భయము గలిగెను. గంధర్వులరుదెంచి యెవ్వరికేమి కీడుచేయుదురో యనెడి సందేహముగలదై రాజపత్ని యేలాగు నేనియు సైరంధ్రిని సమాధాన చిత్తయగునట్లుఁగా జేయనెంచి యామెకోపము నివారించుటకై పెక్కు తెఱంగుల నూఱడించి మాటలాడెను. కాని యావాక్యం

బులవలననయ్యబలసంతుష్టినొందక యెప్పటివలె గజ్జనభోజనాది క్రియలు చేయుటనుమాని వ్యసనాక్రాంతయై యొకచోట కూర్చుండి వగచుచుండెను.

అపుడు సుధేష్ణ చేయునదిలేక తమ్మున కేమి యాపద సంభవించబోయెడినో యను సంశయ భయంబులు మనంబునఁ గలంప నుపాయంబు దోఁచక తత్తరమును బొందుచుండెను. అచట వర్తించు పరిచారికాదులు దుశ్శీలుండైన కీచకుని వర్తనంబును, సైరంధ్రి పరిభవ ప్రకారంబును దలంచి యామత్తునకుం దగిన శిక్షకలుగుటయే మంచిదనియు, పరసతులను భంగపరచనెంచు దుష్టులకిఁక మీఁదట బుద్ధివచ్చునియు నొండొరులు కలిసి పలుకుకొనుచుండిరి.

అట్లు పరిభవింపఁబడి వ్యసనాక్రాంతయైయున్న ద్రౌపది తనవిడిది పట్టునకుఁబోయిశయ్యపై బడి పరితాపం బతిశయిలుంపగా వగచుచు,తనలో 'కలుష హృదయుండైన కీచకుం డెక్కుడు బలముగలవాఁడు. ఇతరులెవ్వరును వాని గర్వం బడంచి వధింపఁజాలరు. ఆపాపవర్తనుని భీముఁడు మాత్రమే చంపగలవాఁడు. భీమునకు దైవము సయితము తోడ్పడును. సంశయింపవలసినది లేదు. కాఁబట్టి యమ్మహాబలుని యొద్దకేగి నా యవమానంబు తెలుఁగును జెప్పి యెట్లనో పురికొల్పి రోషముఁబుట్టించి యతనిచేత కీచకునిం జంపించెదగాక' యని యాలోచించి నిశ్చయించియున్న సమయంబు ప్రొద్దుగడచి నంతట సకల జనులును నిద్రించుచున్న సమయంబున శయ్యాతలంబు విడిచి లేచి మేనఁగదిసిన ధూళిం గడిగికొని శుభ్రవస్త్రంబుఁ దాల్చి యటనుండి వంటశాలకు పయనంబై వెడలిచని యచ్చోటఁ బరుండి నిద్రించుచున్న వృకోదరుని కడకుఁబోయి "ఆహా! వీరాగ్రేసరా! నీదుపత్నినైన నన్ను నీవు చూచుచుండఁగా నే యవ్విధమున పరిభవించిన యాదురాత్ముఁడైన కీచకుండు నిర్భీతుండై నెమ్మదిగా నిద్రించుచుండఁగా రోషంబిసుమంతయు మదినిడక శాంతచిత్తుండవై వానియట్లనీవునునిద్రించుచున్నాఁడవుగదా! ఎట్లునీకండ్లకు నిద్రపట్టినది? నీచిత్తంబునం దేవిధంబున శాంతము కలిగెను? సభలో మీయన్నగారు చెప్పిన మాటలు విన్నవాఁడవై నాపైఁగల దయవిడిచితివా! అటులనే తోఁచుచున్నది. అయ్యో! ఇంక నెవ్వరు నాకుదిక్కుగలరు? నా యవమానము నెవ్వరితో చెప్పికొందును?" అనిమెల్ల మెల్లగాఁబలుకుచు చేతులతట్టి మేల్కొలిపిన యతండు తుళ్ళిపడిలేచి "ఎవ్వరు? ఏమి సమాచార" మని నిద్రమబ్బున

నడిగిననామె యతనిపత్ని యగుటం జెప్పిన కంఠస్వరముం బట్టి పాంచాలపుత్రి యగుటం దెలిసికొని తనలో 'సరి! ఇంతరాత్రిలో యీమగువ రాగతం బేమైయుండును? కీచకుం డొనరించిన దురాచరణంబును నాతోడ చెప్పి నావలన వానికి శిక్షఁ జేయింపవలయునని వచ్చినదికాఁబోలు. మఱి యేకారణముసు గనుపింపదు. ఏలవచ్చినదియు నీయువిద నోటనుండియే వినియెదను గాక' యనితలంచి "లతాంగీ! చాల రాత్రియైనది. ఇంత ప్రొద్దు జరిగినంతట నొంటరిదానవై యిచ్చోటికేల వచ్చితివి? ఇట్లు రాఁదగునా యక్క! ఆయిపుడేమి కలిగినది? నీవు వచ్చునపు డన్యులెవ్వరును నిన్ను జూడలేదగదా?" యని యడిగెను.

## ద్రౌపది తన భంగపాటు తెరంగు భీమునితో చెప్పుట

అపుడు ద్రౌపది యతనితో "సర్వమును నీవు యెఱిఁగియుండియు నెఱుంగని వానిచందమున నడుగుచున్నాఁడవు. తెలిసియున్నట్టి సంస్కార జూచిన వృత్తాంతము నింతలో మఱచియున్న యెడల తద్విషయమును నీతోడ చెప్పినను లాభము కలుగదు అటులగాక యావృత్తాంతమును నా నోటనుండియే వినవలయుననెడి తలంపుతో నడిగెదవేని మొదటినుండియు జరిగినదంతయుం జెప్పెదను వినుము. ఎట్లనగా - విరాటుని పరవద్యమైన కీచకుఁడు తన యక్కను చూచుటకై వచ్చియుండి యచ్చోటనుండిన నన్ను చూచి మోహావశుండై తపించుచు తన యభిప్రాయమును లజ్జాసంకోచ గౌరవంబులు విడిచి నాతోడ నెఱింగించి నన్ను ముట్టవచ్చెను నేను మిగుల నసహ్యతఁజెంది తత్సమయంబునఁ బొడమిన యాగ్రహంబు నడంచుకొనుచు వానితో స్పష్టముగా యాదురుద్దేశము మంచిది కాదనియు, నటులఁ బలుక వలదనియుం దెలియఁజెప్పితిని. కామానల పరితప్తుండై మిగుల చెడియున్న యామత్తుఁడు నాయభిప్రాయము దెలిసికొనలేక నన్ను తొందర పెట్టఁదొడంగెను. అంత నతనికి భయము కలుగునట్లుగా "ఓయి, కీచకా! కన్నుగానని కామోద్రేకముచే తారతమ్యము నెంచక హానివృద్ధులం దలంపక నన్నుఁగని యిటుల బలుకుచున్నాఁడవు. ఇది నీకు క్షేమకరముగాదు. ఇది యెఱింగితేని మహాబలవంతులైన నాపతులు గంధర్వులైదుగురు నుగ్రులై నిన్నుఁ జంపి వేయుదురు. రిత్తకు నీ ప్రాణములు గోల్పోవుదువు జుమీ! నీదురపేక్ష విడిచి మిన్నక చనుట మంచిది. ఎంతటి బలవంతుఁడవైనను వారిని జయించుటకు నీకు శక్యము కాదని పలికితిని.

కాని నామాటలకు వాఁడు చలింపక ప్రల్లదములు పలుకఁ బోడంగెను. ఎట్లయినం దప్పించుకొనుటకై కాలోచితంబులైన మాటలచేఁ ద్రోసి పుచ్చితిని. వాఁడు తనయక్కదగ్గర కేగి యామెతో రహస్యముగా సంభాషించి తన యింటికరిగెను. అంతట పాపాత్మురాలైన సుధేష్ణ తనకు దప్పి పుట్టినట్లుగా నభినయించి మదిరారసంబుఁ దెచ్చుటకై నన్ను కీచకుని యింటికిఁ బొమ్మని చెప్పెను. నేను దానికొడంబడక నావలన నైనంతవరకును నితరులను బనుపుమని పలికిన నామాటల కన్నింటికి నన్ని చెప్పి నేనే పోయి తేవలయునని నిర్బంధించెను. ఆమెతోడ మారొడ్డి మూర్ఖంబుగా పెనంగుట మంచిది కాదని యెంచి విధిలేక సమ్మతించి కలశంబుఁ బుచ్చుకొని మీలావు గలిగియున్న నన్ను నెవ్వరు నేమియుం జేయజాలరనెడి ధైర్యము తోడుగా సూతుని మందిరమునకుఁ గల్లుఁ దెచ్చుటకు బోయితిరి. అచట వాఁడు నన్ను చూచి, కామాగ్ని పరితప్తమానసుండై తుచ్ఛపుమాటలు బలికి మోహావేశంబున కన్నుఁ గానబడక పైబడిపట్టుకొనవచ్చెను. అపుడు నిస్సహాయునై యున్నదాన నగుటచే భీతిల్లి, వాని చేజిక్కక తప్పించుకొని యిల్లు వెడలి పరుగెత్తుచుండగా వెంబడించి రాఁదొడంగెను. వానిబారిం బడకుండుటకై యిపుడు మీరుండిన చోటున కతివేగమున వచ్చితి. వాఁడు నా వెంటనే వచ్చెను. అంతట జరిగిన దంతయును నీకుఁ దెలియును. మీయన్నగారి గొప్పతనమును తెలిసినది. పరిభవమొందిన నన్నుం గూర్చి మీయన్న చెప్పినమాటలను నీవును వింటివిగదా! పూర్వము మహాసభలో మదోన్మత్తుండైన దుశ్శాసనుండు మీరు చూచుచుండగనే నన్ను అవమానించెను. అరణ్యములో నుండగా భయము లేక సైంధవుండు నన్ను పట్టుకొనిపోయెను. నేఁడు ధర్మనందనుండును, విరాటరాజును చూచుచుండగా కీచకుండు ధైర్యముతో నిట్లు జేసెను. అంతయుం జూచుచుండియును మీరు యేమి చేయగలిగితిరి? మీకు పరాక్రమంబులు గలిగియున్నందు కేమి ప్రయోజనము? వ్యర్థమేకదా! అకటా! నాదుస్థితి నింకెవ్వరితో చెప్పి మొఱబెట్టుకొందును! అవమానము జెందితినని నాయందు జాలిపడువారెవ్వరున్నారు? ఈప్రకారము పరిభవింపబడుట నాకు పరిపాటియైనది, గనుక దీనికై నేను దుఃఖించుట నిరుపయోగమైనపని. ఆడువారి మొఱయు నావుల మొఱయు వినినపుడు యెంత కఠినచిత్తులైనను, ఇతరులుగా నుండినను కనికరించి రక్షింపవలయునని పెద్దలు చెప్పుదురు. అట్లు ధర్మము గలిగియుండగా, నేఁడు తనయెదుటనే పాపాత్ముఁడగు కీచకుఁడు

నన్నుఁ గ్రిందఁ బడఁద్రోసి తన్నుచుండఁగా ధర్మనందనుం డూరక చూచుచుండెను గదా? దీనిని మించిన యాశ్చర్యమేమియున్నది?" యని పలికి జొటజొట కన్నులనుండి శోకబాష్పము లురులు చుండఁగా నేడ్చెను.

## భీముఁడు ద్రౌపది నూరార్చుట

వృకోదరుం డాయువిదకుఁ గలిగిన దుఃఖమునకై చిత్తంబున జాలిఁ జెంది "ప్రాణనాయకీ! ఊఱటనొంది నామాటలను వినుము. దుశ్శీలుండగు కీచకుఁ డావిధముగా భయంబుఁ దీక్కి నిన్ను పరిభవించుచుండఁగా నేను మిక్కిలి కోపమునుజెంది యపుడే యమపురి కనుప యత్నించితిని. కాని ధర్మజ్ఞుండైన ధర్మనందనుఁడు వారించుటఁ జేసి యేమి చేయుటకును వలనుగాదయ్యెను. ఆలోచింపఁగా నాయన్న యాతరుణమున నన్ను నడ్డపెట్టి వారించుట యుక్తమనియె తలంచుచున్నాను. ఏలనఁగా, అపుడు నేను విజృంభించి కీచకుఁడు మొదలైన వారింబట్టి సంహరించి యుండినచో మనలను పదుగురును ఫలానివారని తెలిసికొని యుండుదురు. అపుడు మన యజ్ఞాతవాసమునకు భంగము గలిగి వెండియుం బూర్వపురీతి నరణ్యవాసాజ్ఞాతవాసములు చేయుటకు పాల్పడవలసి యుండునుగదా? అటువంటి సంకటము నీవలనను, నావలనను తటస్థించినదని యెల్లవారును మనల సిరుష్ణుగను నిందింప కుండుదురా? ధర్మసుతుండిది యెఱింగినవాఁడు కావుననే నన్ను నివారించెను. ఆమహాత్ముఁ డొనరించినది తప్పుగాదు. అతఁ డటుల చేసినందున నియమభంగము కలుగుట తప్పినది. అది క్షేమకరము. సర్వజ్ఞుండైన యుధిష్ఠిరుండు హింగ ద్దకర్ముండుగాని నిందింపఁ దగినవాఁడు కాఁడు. మిన్నక జూచుచుండెనని నీవతనిపై కోపమును జెందుట పాడి గాదు. పదుగురునుం జూచుచుండగా నిన్ను గర్వంబున నవమానించిన యాకీచకుని జంపువిషయమున నిపుడు మించిపోయినది యేదియును లేదు. దుఃఖపడకుము. నేను వానిని వధించి నీపరితాపమును తొలగించెదను. ఈకార్యమును శీఘ్రముగానే జరిగించెదను. అన్యులు మనలం దెలిసికొనకుండునట్టి తెఱంగును తలంపవలయును, కాని పగవారలఁ జంపుట యొక గొప్పకార్యము కాదు. అది యెంతపని? దీనికై నీమనంబున నం బొగిలుటయు ధర్మసుతునిఁ దూఱుటయుం దగదుసుమీ!" యని యూరడిల్లం బలికెను.

ద్రౌపది యతని మాటలచే కొంతపరితాపంబు తొలంగుటయు నిట్లనియె "నాథా! నేను పొందుచున్న కష్టములు చెప్పిన తీరునవి కావు.

పనులు చేయుచున్న సమయమున కుటిలచిత్తయైన సుధేష్ణకు నేను భయపడుట యింతింతయన సాధ్యము కాదు. అత్తగారైన కుంతీదేవికిగాని, పతులైన మీకుగాని, వేయేల! దైవమునకైనను, విరటుని భార్యకు నేను వెఱచి వర్తించునట్లు భయమొందియుండలేదు. ఎన్నికష్టములు కలిగినను వానిని గణింపక సహించి కోపమును జెందక నెట్లో కాలముం గడపుచుండినను, నా కష్టములన్నియు వ్యర్థమై తుదకు కీచకునివలన నవమానమును జెందవలసి వచ్చెనే యనునెడి దుఃఖమువలన చిత్తంబు కలగి యాడుదానను గాన మేలుకీడు లాలోచింపలేక యిటుల ధర్మనందనునిం గూర్చి యాగ్రహించి పలికినాను, కాని నేనా మహాత్ముని గొప్పతనమును, మహిమయు గుణములుం దెలియక చెప్పిన దానను గాను, ఇది సత్యము. సకల జనస్తవనీయుండైన పాండవాగ్రజుండు పూజనీయుండగుటను నేనెఱుంగుదును. అతని సద్గుణ విశేషములును, ధర్మావర్తనమును వర్ణించుటకెంత వారికిని సాధ్యములు గానేరవు. ధర్మనందనుని యొక్క సత్ప్రవర్తనము వలననే మనము బ్రదుకుచున్నాము. ఇట్లనుటవలన నాశ్చర్య మొందవలసినది లేదు. ఎందువలన ననగా, యతని ప్రభావముచేతనే లోకము రక్షింపఁబడును. దిగ్విజయ మొనరించి కీర్తి గడించి యజాత శత్రుండనెడి పేరును చెందుటకును, రాజసూయమను మహాయాగమును నిర్లోపముగా చేయుటకును, ధర్మజ్ఞుఁడనియు, ధర్మ ప్రవర్తకుఁడనియు పేరుపొందుటకును, సత్యవ్రతంబును విడువక జరుపుటకును, లోకమున ధర్మసుతునొక్కనికిఁ దక్క యన్యులకు సాధ్యమగునా? ఇవి యన్నియు నమ్మహాత్మునకొకనికే చెల్లును. అతని గాంభీర్యమును, ధైర్యమును సుగుణ సంపదయు నితరులను గలుగునా? యశోవంతుఁడును, బ్రాహ్మణ భక్తి గలవాఁడును, పరోపకార శీలుఁడును, వంశభూషణుఁడునైన యాపవిత్ర మూర్తికి సమానులగువారు లోకంబున లేరు. తన సంపదకుఁ దగినట్లు పరివారముం గలవాఁడై ప్రజలకు విస్మయము కలుగునట్లు వర్తించుటకు ధర్మరాజు లోకమున తానొక్కఁడే తగినవాఁడు. ఏ రాజశ్రేష్ఠుని మొగసాలయందు యేనుంగుల మద జలధారలచే దడిసి బురదయైన ప్రదేశము దర్శనాగతులైన రాజుల సమ్మర్దాధిక్యంబువలన నొండొరుల సొమ్ములు రాచుకొని యొరయించే రాలిన రజము నెరసి, యడుసు లేక యడఁగుచుండునో, ఏమహామహుని సత్ప్రవర్తనమును చూచి లోకులు ధర్మమును నేర్చుకొనుచుండుదురో, ఎవని కరుణాదృష్టి ప్రసరణమువలన నిరుపేదలు

సయితము ధనవంతులగుదురో, ఏయుత్తమగుణునికీర్తి సప్తద్వీపములను దాటి యావలనయితము ప్రకాశించుచుండునో, ఎవని పాదములపై ప్రసిద్ధులైన నృపతుల కిరీటములలో పొదుగఁబడిన వెలలేని మణుల కాంతులు వ్యాపించి రమణీయముగాఁ గనుపట్టుచుండునో, యట్టి యాభూపాలమౌళి ధర్మసుతుండు గాక మరి యెవ్వఁడున్నాఁడు? ఇటువంటి సకల సుగుణ శుభలక్షణములు గలిగి యొప్పు పవిత్రశీలుండు తన రూపమును, పరాక్రమమును, మరుఁగు జేసికొని యల్పునివలె కూడు గుడ్డలకై సామాన్యుఁడైన రాజునొకని నాశ్రయించి, యతని దయనుగోరి, కుల గోత్రములు తెలియకుండునట్లు వర్తించుచున్నాఁడు. ఈవిషయము నాలో నెంతయు దుఃఖంబును గలిగించుచున్నది. ఇది కాల మహిమగదా! నీవిషయమును చెప్పుము? నీవు యెటువంటి వాఁడవు? నీదు భుజబలముచే భూమిని మోయుచున్న యాదిశేషుఁడు తనయలసటఁ దీర్చుకొనుచుండును. నీయనుగ్రహ మొక్కింత గలిగినచో ప్రజలెల్లరును సంతోషమును బొందుదురు. కోపము నీకు గలిగెనా? ఎంతటి గొప్ప శత్రువులైనను నాశమగుదురు. బక, జరాసంధ, హిడింబాదులైన మహాబలవంతుల నిశ్రమంబున సంహరించిన శూరాగ్రేసరుఁడవగు భవత్ప్రతాపము నెవ్వరు వర్ణింపనేర్తురు? ఆహా! నీవు కావించిన కార్యము లసాధారణములు, నత్యద్భుతములునైనవి. అటువంటి శక్తియుక్తుండవై యుండియు, నీవన్నినో వంటకట్టెలు విరుచుచు, పాచకవేషముతో దిరుగుచుండినపుడు చూచి నేను పొందుచుండెడి దుఃఖ మింతింతయని పలుకుటకు సాధ్యముకాదు. అయ్యో! ఆదయా రహితుఁడైన విరాటుఁడు తన వేడుకకొరకై నిన్ను రావించి ఎనుబోతులు, సింగములు, పులులు, మొదలైన వానితో పోరించుచున్నప్పుడు నాకుఁ బొడముచుండు వ్యసన మిట్టిదనుటకు శక్యముగాదు. నీదేహము లోకులు కొనియాడఁదగినదయ్యు నిర్విఘ్నమున నీచకృత్యము లొనరించుటకు పాలు గావలసి వచ్చినది. అప్పటప్పుడును, రాజు కొలువులో నీవు క్రూరమృగములతో పోరాడుచుండగా సుదేష్ణతో మేము మేడపైనుండి చూచుచుందుము. ఆసమయమున క్రూరజంతువుల బోరాటములో నీకు కష్టముగా నుండునట్లు తోఁచినపుడు చింతయు, నీవు జయించు నట్లున్నప్పుడు సంతోషమునుం జెందుచుండుదును. సుదేష్ణ నావంక గనుగొని నాముఖ లక్షణములనుబట్టి రహస్యముగా 'చూచితిరా! ఈమాలిని కనుపడినపుడెల్లను

వలలునివంక నట్టె చూచుచుండును. దీనినిఁబట్టి యోచింపగా యతనిపై నిది యనురాగము గలిగియుండునదిగా తోఁచుచున్నది. ఇందలి యాంతర్యం బెట్టిదియో తెలియదు. ఈ పట్టణమునకు వీర లిరువురు నేక కాలముననే వచ్చిరి. దీనిచే నొండొరులకు వీరి కేమేనియు సంబంధము గలిగి యుండవచ్చునా? యనెడి సందేహము పొడముటకు కారణ మేర్పడుచున్నది’ అని గుసగుస లాడుచుండును. నీవంకనే చూచుచుండెడి నేను నా తెరంగునుగూర్చి వారలేమిగాఁ దలంతురో యని తటాలున వారికి సంశయము తోఁలంగుటకై వారి వంకచూతును. అపుడు నన్నుగూర్చి వారొండొరులు బలుకుకొనెడి రహస్యోక్తులు నాకు తెలియుచుండును. వారి సంజ్ఞలంబట్టి భావమును గ్రహింపుచుండుదును. కాఁబట్టి ఈపరిభవ ప్రతీకారమునకుఁ గడంగి నీవు ఉద్రేకించితివేని జనులు మనలనెఱుంగఁగలరు. తెలిసికొనిరేని సమయభంగంబు వాటిల్లును. అటుల గాకుండు లాగు దలంచి, యుపాయముగలుగునేని తగినట్లు రహస్యముగా శత్రువును భజింపుము’’ అని మఱియును కవ్వడిం దలంచి నెవ్వగ నివ్వటిల్లగా నిట్లనియె.

## ద్రౌపది యర్జునుని శక్తిని వర్ణించి భీమునితో చెప్పుట.

‘‘బలిమిచేతను, పరాక్రమమువలనను, శివునినైనను మిగిలి పోవ నివ్వడనెడి ప్రసిద్ధమగుమాటయు, దేవేంద్రుని యర్ధాసనంబునఁ గూర్చుండుట కర్హుండనెడి సాధు వాక్యమును, యమలోకముఁ జేరినను, నెట్టేనియుం బూనెనేని ప్రాణినైనను రక్షించుననెడి మేలుమాటయు తాను గావలచి వచ్చిన యూర్వశిని నయిశమ మెచ్చని పరాంగనాపరాఙ్ముఖుండను యుచితవాక్యమును, తగియుండ ఇటువంటి శుభగుణంబులన్నియుం దనరి యొప్పుచుండు విజయునకు సాటివార లెవ్వరుగలరు? ఇట్టి యుత్తమ లక్షణోపేతుండును, భరతవంశ దీపకుండునునగు పార్థుండు కష్టము లొందుటకు పాత్రుడై పేడివేషముతో విద్యా గురుత్వంబునకు సమ్మతించి కాలముఁ గడపుచున్నాఁడు అయ్యో! అతని వైఖరిం జూచినప్పు డంతయును ‘ఓ విధాత! ఇంతటి యుత్తమునఁ కిటుల పేడిరూపముఁగలిగించి వెతలఁబెట్టుట న్యాయమమా?’ యని దైవమును దూఱుచు, ఈవ్రతాంతకాల మెప్పటికి రాగలదియో యని తలంచుచు నాలోనఁ బురపురఁ బొక్కుచుండుదును. విధికృతం బిటులనుండగా నేమి

చేయగలము? తన చక్కదనము నొకపూరు చూచినవారు మరల మరల
చూడవలయునని కోరుటకుం దగిన యందము గలవాఁడును, ఋజువులైన
నుందన నడవడి నేర్చుకొనఁ గోరునట్లు వర్తించువాఁడును, శత్రువులు సయి
తము కనిమెచ్చుకొనదగిన శౌర్యముఁ గలవాఁడును, కల్పవృక్షముయొక్క
మహిమను హీనమనిపించఁజాలిన యౌదార్యవంతుఁడును నగు నకులుం
డొక సామాన్యుండైన రాజునొద్ద నశ్వశిక్షకుండై యుండుటకు విధిం
చిన దైవము నేమనవలయును? అనుగుణ విశారదుని జూచినపుడును,
తలంచినపుడును, నతని దుస్థితికై నేనెంతయుం బరితపించుచుండుదును.
గంభీరమును, మంచిరూపమును, నిగర్వ ప్రవర్తనమును, నిరుపమాన
పరాక్రమమును, దయయు శౌర్యమును, పాండిత్యమును, పెద్దలయెడ
పూజ్యభావమును, మఱియాదయు, వీనియందలి యుత్సాహమును, శాం
తమునుం గడు సుకుమారుఁడును, మాద్రీదేవియొక్క చిన్న కుమారుం
డునునైన సహదేవుఁడు సామాన్యుఁడనఁదగినవాఁడా? అటువంటి యు
తఁడు పరునియొద్ద పసుల కాపరియై దినములు గడపుచు కష్టములను
భవించుచున్నాఁడు. అతనిదుస్థితినిఁ గనినపుడు నాకేకాదు. పగవారికై
నను సంతాపము గలుగును. అక్కటా! ఇది యెంతటి దుఃఖకరమైన
వలయును? నేనును మీరును వనవాసమునకు వచ్చునప్పుడు కుంతీదేవి
నన్ను బిలిచి 'ఇతఁడు కడు సుకుమారగాత్రుఁడు కష్టములఁ కోర్వఁజాలని
పసివాఁడు. అడవులలో నెట్లు వర్తించఁగలఁడో యనెడి దుఃఖము నన్ను
మిక్కిలి కలఁత పెట్టుచున్నది. నీవు గలుగుటంబట్టి నిన్ను నమ్మి నేనితని
కానన ప్రయాణమునకు విధిలేక సమ్మతించినాను. ఇతనియెడ కన్నుకలి
గియుండు'మని ప్రత్యేకముగ చెప్పి కన్నులనుండి దుఃఖాశ్రువులు గారు
చుండఁగా నాకొప్పగించెను. నేనన్ననో, మీకందఱకును గారాబుతమ్ము
డైన యతనిని సర్వవిధములను మీకెల్లరకంటె నెక్కువగా చూచుచు,
కష్టములు చొరనీయకుంటిని. ఇపుడజ్ఞాతవాస కాలమగుటచే నాతని
ననుసరించుటకు వలను గాకుండుటంజేసి చిక్కి చూచిచూచి యిట్టి దుస్థి
తికి మిగుల వగచుచున్నాను. నాదుర్దశను వినుము, సంపన్నుఁడైన ద్రుపద
రాజు, కొడుకులకంటె నధికముగా బెంచుటంజేసి గోమునఁ బెరిగినాను.
మిమ్ము చేపట్టి మీ ప్రేమంబునకు పాత్రురాలనై మీచే మన్ననఁ బొం
దినాను. కుంతిదేవి తన కోడండ్రలో నన్నే యెక్కుడుగా నెంచియుండు
టకుఁ దగినచందమున మెలంగుచుండినాను. ప్రజలు తల్లిదండ్రులవలె

తలంచి భక్తిగలిగి ప్రవర్తించులాగున వర్తించినాను. ఉత్తములైన కొడుకులం గాంచి భరత వంశములో నావంటి యుత్తమశీల మఱి కలుగదని బంధువులలోఁ బొగడ్తఁ జెందినాను. రాజసూయయాగంబున బ్రాహ్మణులను వాంఛితార్థము లొసంగి సంతుష్టులం జేసి పాండురాజు కోడలైన ద్రౌపది రాజస్త్రీలందఱియందును, శిరోమణి వంటిదని లోకులవలన వినుతిని గడించినాను. ఇటువంటి దాననయ్యు, కడుపుకూటికై నేను సుధేష్ణకు పరిచారికనై యీమె కనుసన్న నెఱింగి పనులొనరించుచు, భయభక్తులతో జాగ్రతగలిగి మెలంగుచు, కష్టముల ననుభవించుచున్నాను. నా యవస్థం జూచుచుండియు లేశమైనను మీకు నాపై జాలిబుట్టకున్నది గదా! ఏమి చేయవచ్చును? నేను పనుల నొకరిచేత చేయించుకొనుచుండిన దాననేగాని యొకరికి పనులు చేసినదానను గాను. మీతల్లి సయితము యేదయినను పని చెప్పుటలో నావిషయమున నెంతయో సంకోచముతో చెప్పుచుండును. నీవు నెఱుంగుదువుగదా? ఆ విరాటుని భార్యగాని, విరాటుఁడుగాని యితరులు నూరిన గంధమును పూసుకొనుట కొల్లరు. ఏమి చేయవచ్చును? నేను నూరిన దానినే కోరుదురు. నిలిచి నిలిచి దేహమంతయుం జెమటపట్ట గంధమునూరి మీతల్లి కిచ్చుచుండిన విధముగా వారలకిచ్చుచు, అటువంటి దుర్దశను కలిగించినందుకై నాలో దైవమును దూఱుచుండుదును. నలుగుపిండి గంధము మొత్తముగా నూరినూరి మృదువులైన నా చేతులు పొక్కి కాయలు గాచినవి. ఇదే, యెట్లున్నవో చూడుము.'' అని యివ్విధముగా చెప్పిచెప్పి కన్నులనుండి శోకబాష్పము లురులుచుండఁగా తనముఖమును భీముని యొమ్ముపై జేర్చెను.

ఆ యబలకు పొసఁగిన కష్టమును, కలిగిన దుఃఖమునుం దలంచి భీముఁ డెంతయు జిత్తాక్రాంతుఁడయ్యెను. అంతట నతఁడు తన్నుఁ దానే యోదార్చుకొని దుఃఖము నడంచికొని ద్రౌపది ముఖమును దుడిచి తన చేలంబుచే దానును మోముఁ దుడిచికొని ప్రియంబుగ దుర నామె చేతులు నిజముఖంబునం జేర్చి నిట్టూర్పులు విడుచుచుండఁగా వగచుచున్న యతని కామె యిట్లనియె.

''ఇప్పు డిందఱకు నిన్ని కష్టములును దుఃఖమును ధర్మనందనుండు దెచ్చిపెట్టెను. ఇంతకు నతఁడే కారణము. దాయాదుల కపటతంత్రము తెలియంగజాలక మాయజూదమనెడి వలలోఁ జిక్కి యిటువంటి దుర్దశను

నొందించెను. అయ్యో! ఎప్పటికైనను, సౌఖ్యము గలుగఁబోవునా? యనెడి యాడియాసఁ బెట్టుకొని ఇంతవరకును బ్రతికియున్న దాననుగాని కానిచో ప్రాణములు నిలిచియుండవు. పూర్వము ఘోరమైన పాపము లెన్నియో చేసియుంటిని. తత్ఫల మనుభవించు చున్నాను. ఈ పాపాత్మురాలికి సుఖము యెట్లు గలుగును? మీమువ్వురు నాపతిగ కలిగియుండఁగానే దుష్టుఁడౌ కీచకుఁడు సభాస్థలమున నన్ను పరిభవించెను గదా? ఇది నా కర్మఫలము కాదా? దీనికి మీ రేమి చేయుదురు? మిమ్ము నననేమిటికి? దైవసంకల్ప మిట్లుండఁగా మీ రేమి చేయగలరు? పూర్వకర్మానుసారముగా సంసారులకు మంచి చెడుగులు తటస్థించుచుండును. దాని నడ్డగించుట కెవరికి సాధ్యము? అయినను మీ కెట్టులనైన శుభముగలుగ వలయుననెడి తలంపుతో కష్టము లెన్ని తొడరినను సైఁచి యున్నాను. కాని దురాత్ముండైన కీచకుండు చేసిన దుష్కార్యమునకు మాత్రము నా హృదయంబున నోర్వ లేకున్నాను. ఆదుష్టుని నాలోఁగల పగం దీఱునట్లు నీవు వధింపకుండినచో, నీటిలో పడిగాని, నిప్పులలో దూకిగాని, విషముఁ దినిగాని, యురిపైచికొనిగాని, నీవు చూచుచుండఁగానే ప్రాణములు విడిచెదను. నీపాదములు సాక్షిగా యీమాట నిజము." అని యిట్లు ద్రుపదపుత్రి పలుకుటయు నామె మాటలువిని భీమసేనుండు చిఱునవ్వు నవ్వుచు నిట్లనియె.

## భీముఁడు కీచకునిఁ జంపెదనని ద్రౌపది నూఱడించుట

"తలోదరీ! ఆ నీచుండైన కీచకునిం జంపు విషయమునకై యిటుల నీవు తకనాడవలయునా? ఇది గొప్ప పనియని తలంచితివా? వాఁడు నేను చూచుచుండఁగానే నిన్ను నవమానించి యింకను భూమిలో బ్రతికియుండెనేని భార్యల నవమానించిన వానిని పీచ మడంపకుండినది నాయందుఁగల గొప్పనేరము. రేపటి దినము వాఁడెచ్చటికి పోయినను మాయన్న యడ్డుపడి వలదన్నను కనికరించి నీవే వచ్చి విడిచి పుచ్చుమని చెప్పినను నేను నిశ్చయముగా కీచకునిఁ జంపెదను, వినుము. ఇంక వానినిఁగూర్చిన విచారము నీకు వలదు. ఊరటనొంది శాంతచిత్తవై యుండు"మని పలికి దుర్దశలం దలంచి వందురుచున్న యామె దైన్యమున కుందు మాన్పుటకుం దలంచి "కాంతామణి! విధికృతంబైన యాపదలం గూర్చి మనము చింతింపరాదు. నీవుపడు సంకటంబులు నే నెఱుంగనివాఁ

డనుగాను. కాలము ననుసరించి తాలిమితో వర్తించి సౌఖ్యమును బొంద వలయును గాని దుఃఖించుటవలన గలిగెడి మేలెయ్యది? మున్ను సంయాతి కూతురు సుకన్య యడవులలో చ్యవనునకు సేవ గావించుచు నానా కష్టములు ననుభవించెను. మహాసుకుమారగాత్రయగు జనకరాజనందన పతితోఁగూడి యడవులకుబోయి పడరాని వెతల ననుభవించెను అయిననేమి? ఎన్ని కష్టములు కలిగినను సహించియుండి పిదపవారు సౌఖ్యవంతులు గాలేదా? అట్లే నీవును నేర్పుతో కాలమును గడుపుము. పిమ్మట సుఖము నొందఁగలవు. ఒక్కమాటఁ జెప్పెదను, వినుము. దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని, సైంధవ ప్రముఖులైన దుర్మార్గుల నధోలోకమునకుం బంపువరకును, నాలో పొడమి వృద్ధియగుచున్న చింతాభరంబును, నవమానజనిత వ్యాకులమును, నత్యంతంబైన యాగ్రహంబునుం దొలంగదు. వారి నాశ మొనరించుటకై నాయంతరంగంబు వేగిరపడుచున్నది. ఇప్పుడన్ననో మనకు శత్రువులైన దుర్యోధన ప్రభృతులకు కాల మాసన్నమును, మనకీ యజ్ఞాతవాస కాల పరిపూర్తియుం గడు దాపుననే గానున్నది. మన సమయకాలంబులో పదునొకండు నెలలు గడచి పండ్రెండవ మాసము జరుగుచున్నది. ఇంక నల్పకాలము మాత్రమే కొలఁదియున్నది. కావున యీకొలఁది దినములు గడచునంతకు నీవంతయు దీర్చుము. సంతోషము దుఃఖములు విడిచి యూఱట నొందియుండుము. కీచకుఁడు నీపై నెక్కుడు మోహముఁ గొనియున్న వాఁడగుటచే, ఇంతటితో మారకుండక, రేపటిదినము సయితము నిన్ను గోరి నీయొద్దకు రాఁగలఁడు. వచ్చినపుడు నీవు కడు చాతుర్యముతో మాటలాడి సమ్మతించిన దానవుం బోలె నటించి, రేపటిరాత్రికి వానిని నర్తనశాల సంకేతప్రదేశంబుగాఁ జెప్పి యచ్చోటికొక్కరుండు వచ్చునట్లు నియమింపుము. అచటికి వాఁడు వచ్చినపుడు నాప్రతాపంబు తెలియునట్లు చేసెద. ఈ యుపాయంబు దక్క వానిని వధించుట కీసమయమున వేఱు విధము గలుగదు. ఇదియ మనము చేయఁదగినరీతియు, నిశ్చయమును, కావున నింక తత్ప్రయత్నముఁ జేయుట మంచిది. ఇపుడు తూర్పు తెల్లవారుచున్నది. ఇంకను మన మిట్టుల మాటలాడుచున్నచో యన్యు లెవ్వరైనం జూచిరేని యజ్ఞాతవాస భంగంబు కలుగుటయేగాక నీచాత్ముఁడగు సింహబలుని వధించుటకు నిశ్చయించియున్న నాయత్నమున కంతరాయము తటస్థించి కార్యము చెడును. కాఁబట్టి నీవు త్వరితముగా నీయుండు చోటున కేగి కీచక

వధోపాయమునందు జాగరూకతగలిగి నేను చెప్పినట్లు గావింపు, మింక బొమ్మ"ని చెప్పి వృకోదరుం డామెను వేగిర పెట్టి ప్రయాణముం జేసిపంపుటయు, ద్రౌపది యచ్చోటువిడిచి నిజ నివాసస్థలంబునకుం బోయి కలంగిన చిత్తంబుతో సంశయమున పలు తెఱంగుల నాలోచింపుచు శయ్యపైఁ బరుండి నిద్దుర రాక పొరలుచుండెను. భీముండును తన శయ్యాతలంబును జేరి కీచక వధోపాయంబునుగూర్చి యాలోచించుచుండెను.

## ప్రభాతకాల వర్ణనము

ఆసమయమున ప్రభాతమగుడును, ద్రుపద పుత్రి దుఃఖమును చూచి వ్యసనాక్రాంతలై కొలననెడి యువతివేడి నిట్టూర్పులు పుచ్చుచున్నదోయనునటుల యపుడపుడే వికసించుచున్న తామర పూవులనుండి వాసనలు వెలువడెను. క్రమముగా చీకటులు తొలంగెను. తుమ్మెదలు ఝుమ్మని చెలరేగి కమలములపై ముసరుకొనసాగెను. చక్రవాకపు పక్షుల కానంద మతిశయిల్లెను.

దంపతులు రాత్రియంతయుం బ్రియంబతిశయింపంగా సురతసుఖము ననుభవించి తృప్తినిం బొంది, యొకళ్ళ నొకరు కౌఁగలించుకొని నిద్రించి వేకువజామున వీచు చల్లగాలి తాకుడువలన మేల్కాంచి పరస్పరాను రాగము మించుటంజేసి మరల భోగాపేక్షఁ గలవారై తివనుకూల వస్తువులను కొంచెముగా నాదరించి గృహదీర్ఘికలందలి తామరల వాసనలవలె నిశ్వాసవాయువులు వెలువడుచుండఁగా కేళీలోలురై యుండిరి. అంతలో తెల్లవారెను. ఆకాశమున నక్షత్రము లన్నియుం బోయి చూచుటకు పుష్పములు విదిలించి చక్కచేయఁబడిన పానుపువలె నొప్పుచుండెను.

సముద్ర ముప్పొంగి పొరలినపుడు నీటిలో మునింగియుండి నీరు విరిసినపిమ్మట తెల్లగా కనుపట్టు కొండలో యనునట్లు చీకటులు విరిసినంతట దిక్కులు విశదములై చూపట్టెను. చక్రవాక దంపతులు రేయెల్ల నెడబాసియుండి చోటులం దెలిసి యొండొకళ్ళంగలిసికొని యానందములో నుండెను. అవి పూర్వ రాత్రమున తామరతూడులను నేకముగా భక్షించి యక్కడక్కడం దునుకలు పడవేసి యుంచుటచే యా కొలంకులు బాలచంద్ర రేఖలుధరించిన శివుని జలమూర్తుల విధంబున నొప్పుచుండెను. ప్రాతఃకాలమునెడి మనుష్యుడు చీకటులు విరసినంతట

ముసుగుదీసి యితరులను మేలుకొలుపుచున్నావో యనునట్లు పక్షులు చెట్లపైఁగూండ్లలో మేల్కాంచి యొక చెట్టునుండి మఱియొక దాని బిలుచు ధ్వనివలె కూయఁదొడంగెను. అరుణోదయ కాంతివలె నెఱ్ఱదామర కాంతులొప్పఁగా వానియందు సంచరించుచున్న తుమ్మెదల ఱెక్కలలో వంటి విచిత్ర శోభను గలిగించుచుండెడి పుప్పొడిని రాల్చుచు వీచు చున్న మందమారుతముచే గదలుచున్న తీఁగెలనుండి రాలిన పూవులు గలసగుటచే పొదరిండ్లు మదనుని ప్రాఁతబడిన బాణగృహంబుల చంద మున నుండెను.

ఉదయకాల సంధ్యావందన సమయమున జనులు సూర్యునుద్దే శించి చేతులుమోడ్చి నమస్కరించు విధంబుగా కలువలు ముకుళించి యుండెను. ఒకరినొకరు పరిహాసవాక్యములచే మేలుకొలుపు కొనునట్టి నాయికా నాయకుల చిఱునవ్వుల కాంతిచే తెల్లనైన రీతిగా దీపములు వెల్లబాఱెను. వేగిరముగావచ్చి తమ్ము లేపలేదను కోపమునంబోలె నిద్రలేచినపుడు కన్నుల కాంతి యెఱ్ఱగా నొప్పుచుండఁగా, కనుపట్టు నేత్ర ములంజూచి, యేటుల నెఱుపు గలిగియుండుట తమకొరకై రాత్రి యంతయు నిద్రలేక కాచియుండుటయె కారణమని నిస్సందేహముగా తలంచు నటులను, దమయొద్ద కాకర్షించుచుండెను. వేగుటయు తత్పుర లక్ష్మిని వనలక్ష్మి యలంకరించునో యనునట్లు పూచినపూవుల వాసనలు పట్టణ మంతటను వ్యాపించెను.

తత్సమయంబున తామరలు చేసిన తపఃఫలమో యనునట్లును, చక్రవాకములందు ప్రియంబుఁజూపు దివ్య స్వరూపమో యనునట్లును, మువ్వుర్త్రుల ప్రభావమునుఁజేర్చి కరఁగి చేసిన సిద్ధగుళికయో యను నట్లును, లోకమంతయు గన్నుఁదెఱచిన చందమున మహా తేజస్వియగు సూర్యుండుదయించెను. అపుడు జనులా పావన స్వరూపునకు నమస్క రింపఁదొడగిరి. ప్రపంచమంతయును వికాసమును పొందెను.

ఈ ప్రకారముగా సూర్యోదయంబగుటయు, సింహబలుండు తత్కార్య కరణీయంబు వేగిరంబ నిర్వర్తించి, తోట్రుపాటుతో నలంకారముఁగావించుకొని తనలో ద్రౌపదియందలి మోహ మగ్గల మగుచుండఁగా, చీకటిపడుచు, నయ్యెవిదం దక్కయన్యులను గనుటకును, పరులమాటలు వినుటకును నొల్లక పరవశచిత్తుండై త్వరితముగా సుధేష్ణ మందిరమునకేగి యచటనుండెడి పాంచాలిం జూడవలయునని తలం

పుత్తో ప్రయాణంబై పోవుచు తనలో, 'నేను శీఘ్రముగా నాయక్క యింటికరిగి యచ్చోటనుండు సుందరాంగియగు సైరంధ్రిని చూచి మంచి మాటలాడి దాని చిత్తంబు నావంకకు మరలునట్లు చేసెదను పిమ్మట నామందిరమునకుం దోడ్తెచ్చి హాయిగలుగ ప్రియంబునం గూడి సురతసుఖంబుల ననుభవించి యానందాబ్ధి నోలలాడెదను గాక' అనితలంచియు వ్విళ్లూరు చిత్తంబుతో సుధేష్ణ గృహంబునకుం బోయి, యచ్చోట తగిన కృత్యములందు నిమగ్నయై యున్న ద్రుపదనందనం జూచి, యానందమును నపేక్షయు నతిశయింపంగా విధిప్రేరితుండై, తత్సమీపమున నిలుచుండుట నయితము లెక్కచేయక వేటకాడై యొద్దకరుగు మృగంబు చాడ్పున, నామె సమీపమునకుం జనియెను. అపుడాయువిద వానిని చూచియుం జూడని దాని విధంబున భీముని మాటల బలిమిచే జంకక తన పనులయందు నిమగ్నయై యుండెను.

కీచకుం డాసమయమున నచ్చటివారితో కారణము లేని వ్యర్థపు మాటలు పలుకుచు తన కాలిపట్టీలు శబ్దించునట్లు మునుంగాళ్ళను నేలపైం దట్టుచు, దేహమును విఱుచుకొనుచు, నావలించుచు, నిమిత్తము లేకనే నవ్వుచు చేతితో స్తంభముల మీంద తాళము వేసి పాటలు పాడుచు అంతంతకు నాపునం దిరుగుచు, నిటుల పలు తెఱంగుల వికార చేష్టలు చేయుచుండినను, నామె తనవంక గనకుండుటయు నధికమైన మోహముచే తల్లడపడుచు, వాండా తరుణీమణి నట్టు చూచుచుండెను.

## కీచకుండు ద్రౌపదితో సంభాషించుట

అతండు కొంతతడవు వికారంపు చేష్టల నాచరించుచుండియు పాంచాలి వాని పనులం జూడనట్లుండుటయు వాండామెను డాయంబోయి తానుగానే పలుకరించి "ఓయింతీ! నోటి ముత్తెములు రాలిపోవునని కాంబోలు, చూచియుం గననట్లు పలుకకున్నావు? నేను నీకు సేవం జేయుట గలిగిన యెడల యది నాపూర్వ పుణ్యావిశేషముగాం దలంపుదును. ఎంత బ్రతిమాలినను నీమనసు గరుగకున్నది. ఇంచుకైనను కరుణ జనింపలేదు. ఇట్లుండుటకు యేమి కారణము? నీకు నామీంద మాత్రమే మోహము కలుగకున్నదా? లేక మార సుఖ భోగానుభవమందే యిచ్ఛ లేదా? అదియైనం జెప్పుము? నీవిధంబెంతయు వింతగా దోంచుచున్నది. ఎంతో యపేక్షతో బ్రతిమాలుచుండినను నించుకేనియు

నాస్థితింగూర్చి తలంపకున్నావు. నీపై నెక్కువ వలపుఁజెంది తపింపఁ చుండెడి నాయాసను వ్యర్థముచేయుట సరికాదు, నీవు తెలియని దానవు. తెలిసియుండినచో యిటుల నన్ను దలంచుటకుఁ బూనవు. ఇప్పటికేనియు నాపై ననుగ్రహమును చూపుము. నాకోరికఁదీర్చి సాటి లేని సౌఖ్యము లనుభవింపుము నాసంపద కంతటికిని రాణివై యిష్టానుసారముగా పాలింపుము. ఈపట్టణంబు నందలి స్త్రీలందఱును నీకు కొలువుచేయునట్లు గావించెదను. ఎల్ల యువతులును సేవింపగా యింద్రాణివలె భోగములు మీరఁగా సంతసింపుము. కోమలీ! అల్పుఁడనని నన్నుఁ దలంచితివి కాఁబోలు, ప్రతాపముచే నేను పేరుపొందిన రాజుల నందఱను జయించి, ఈదేశమునకు దేశమందలి ప్రజలకును రాజనై రాజ్యతంత్రములు నడుపుచుండు వాఁడను సుమీ! విరాటుఁడే రాజని తలంచితివేమో, అది పొరబాటు. అతనిని నామమాత్రము రాజను పేరుఁబెట్టి నిలిపి కూడు గుడ్డయు నిచ్చుచున్నాను. అంతియెకాని నేనే మత్స్యదేశమున కధిపతిని అతఁడుకాఁడు. నిన్నుమాత్రమే కాదు, నేను వలచి యేస్త్రీని పట్టినను వలదని యడ్డుబడి వారించు శూరుండెవ్వఁడును లేఁడు. విరాటరాజును, సభ్యులును చూచుచుండఁగానే యందఱి యెదుట నిన్ను ద్రోసి యిటుల తన్నుచుండఁగా, యట్టె యెల్లరుం జూచుచుండిరేకాని, వారిలో నొకండైనను నన్ను ఆక్షేపించెనా? అంతటిశక్తి వారికెక్కడిది? అది యట్లుండ, నీకు భర్తలైదుగు రున్నారనియు, మహాబలవంతులనియుం జెప్పితివి, వార లిపు డెక్కడనుండెదరు? ఏమైనది? నీపతుల బల శౌర్యములు సయితము తెలిసెనుకాదా? ఇంక నిన్ను రక్షించు వారెవ్వరున్నారు? ఎచ్చటికి పోయినను నేను పట్టుకొందును గాని నిన్ను విడువను. కాఁబట్టి యిటుల విరోధముగా నిన్ను బట్టుకొనకుండునట్లు సమ్మతించి ప్రియంబుతో నాకోరికం దీర్పు'' మని యివ్విధమున కామోద్రేకం బతిశయింపఁగా పలికెను.

అపుడు ద్రౌపది వాని తొందఱపాటుంజూచి తనలో 'ఓహో! వీఁడు తమకించుచున్నాఁడు. నేను పన్నదలంచియున్న యుపాయ కనుగుణ్యమైన మాటలం జెప్పుటకు మున్నుగానే పట్టుకొనునేమో, యట్లు చేసిన కార్యంబు దప్పును కనుక తడవుచేయక నాతంత్రము నుపయోగించి వీని యుద్రేకము నడంచుటయె కర్తవ్యం' బని యెంచి, వానిని

క్రీగంటం జూచి యామాటలన్నియును విని తనలో యతని యిష్ట ప్రకారము వర్తించుట కంగీకరించిన దానివలె నటించుచు నిట్లనియె.

"ఆహా! కామకుఁడా! ఈపని తగదనియు, నలఁగినను నెంతో చెప్పినను నామాటలు వినక మాటిమాటికిని నన్ను వేధించుచున్నాఁడవు. నీమనస్సు మన్మథవశమైనట్టె యితరుల మానసములను సమ్మతము చేయుట యుక్తమగునా? ఆలోచింపుము. ఆశ కలిగినను తాలిమి యుండవలయును గదా! లోకములో స్త్రీపురుషుల కిదియే భేదము. ఏమనగాఁ పురుషులు తాలిమి వీడి తమ వలపును వెల్లడిఁ గావించుకొందురు. భామినులట్టుల చేయరు. ఎంత మోహము కలిగినను, తమలో నడఁచుకొని సమయము నారయుచుందురు. గుప్తమైన నాయభిప్రాయంబు తెలిసితిగదా! వేయిమాట లేమిటికి? నామాటల యర్థమును గ్రహించి మన వర్తనమన్యు లెఱుంగకుండు విధంబున రహస్యముగా నీకోరికను దీర్చుకొనుము. ఊరక త్వరపడి పలుకుట లాభకారి కానేరదు" అని యిట్లు చెప్పిన ద్రౌపది పలుకులు విని యావనిత తనయందు వలపు నొందియున్నదని భావించి కీచకుండలరి యామధురోక్తిం జూచి మిక్కుటమైన మోహముతో,

"వనితామణీ! ఏమి చేయుదును? అయ్యో! క్రూరుండైన మారుండు నాధైర్యమును పోఁగొట్టెను. అధైర్యచిత్తుండనై యున్న నేను సందర్భాసందర్భములను యోచింపనేర్తునా? నా హృదయము నన్ను మిగుల బాధించుచున్నది. కురంగనయనా! ఇంక నన్ను వెతల నొందంపకుము. ఎటుల నీవు చేయుమనియెదవో యవ్విధమున నొనర్చెదను. ఎచ్చోట నెపుడు నే యుపాయముచే నాకోరికఁ దీర్చుకొనవచ్చునో, యావిధమును తెలియఁజెప్పుము" అని పలికెను.

వాని తీరుంజూచి ద్రౌపది తనలో కీచకుండు తనకు వశ్యుఁడయ్యెనని తలంచి, యతనియందు ప్రేమంబు గలదియుం బోలె మోహనకటాక్షదృష్టులఁ గనుచు, చిరునగవు పెదవులపై మొలకలెత్తఁగా మధురంపు పలుకులతో "ఉత్తర మొదలైనవారు పగలంతయు నాటపాటలు జరిపి పోయినంతట యామందిరము రాత్రికాలమున జనవిరహితమైయుండును. కాఁబట్టి రహస్యకార్యమున కాచోటు మిగుల ననుకూలమైనది. అచటికి రాత్రికి యొంటరివాఁడవై యరుగుదెంచితివేని నీకోరిక నెరవేరఁగలదు. ఊరక పరితపింపక యోరిమితో నుండి నేను చెప్పిన కాలమునకచటికి రమ్ము పొ"మ్మని చెప్పెను.

ఆ మాటలు చెవుల సోఁకగానే పరమానందమును బొంది, కీచకుం డుప్పొంగి యామెతో "లతాంగీ! ఇంతమాత్రము నాపై నీకు దయ గలిగినదిగా? ఇంతయే చాలును. నీ యిష్టప్రకారముగానే చేయు చున్నాను. నేఁటి రాత్రికి యొంటరినై నాట్యశాలకువచ్చెద. సరి! ఇదియే నిశ్చయము. నీవు ఈమాటలు మరువకుండ వలయుంజుమీ!" యనిన "అట్లేగాని. అయిననీవు యొంటరివాడవై రావలయును. వెంట నెవ్వ రైనను నుండిరేని యచ్చోట నేనుండఁజాలను. అట్టుపై నాపై నాయా సము ను చెందిన లాభములేదు. మొదటనే చెప్పుచున్నాను. మన కూడిక కడురహస్యముగా జరుగవలయును. ఇటుల మనము పెద్దకాల మిరువురమును మాటలాడు చుండకూడదు. చూచినవారు దురభిప్రా యము నొందుదురు. కాఁబట్టి యింక నీవు పొమ్ము. నేనును నాపనులలో నిమగ్ననై యుండెదను" అని చెప్పెను.

ఆమె సంకేతము నేర్పాటుచేసి చెప్పినంతట కీచకుండు సంతుష్టుండై సంతోషముతో తనయింటికిఁ బోయెను. ద్రౌపదియు నానచ్చోటఁ జేయవలసిన పనులను త్వరితముగాముగించి, వంటయింటిలోనికరిగి, భీము నింజూచి కొంచెము చిరునగవుతోఁగూడిన ముఖముగలదై యతనిలోని కోపాగ్నిని రగులుకొలుపునదియుం బోలె మెల్లగా, నేర్పుగల మాట లతో యిట్లనియె.

## ద్రౌపది కీచకునిఁ జంపుటకై భీమునిఁ బురికొల్పుట

"వల్లభా! నీమాట ప్రకారముగా నేను జేయవలసిన కార్యమును చేసినాను. ఇంక నీపని కొరంతయున్నది. ఇవి చీకటి రాత్రులగుటచే రహస్యముగా కీచకునిఁ జంపుటకు చీకటియు ననుకూలముగనే యుండె డిని. చేయవలసిన విధంబెట్లో యోచించి కార్యంబు నెరపు" మనియెను. అతఁడు చిరునగవుతోఁగూడిన ముఖముగలవాఁడై "తామరలవంటి కన్నులుగలదానా! ఆ విషయమునుగూర్చి యడుగవలదు. కాని యా నీచుఁడైన కీచకుఁడును, నీవును నేమి మాటలాడితిరో దానినంతయు నాకుఁ జెప్పు"మని యడిగెను.

ఇట్లడుగుటయు యాజ్ఞసేని యతనితో తాను సుధేష్ణ మందిర మున పనులవెంటఁ దిరుగుచుండుటయు, వాఁడు మోహాతిరేకంబుతో పెకు్కలు పలుకుటయు, నంత తన మాటలకు సమ్మతించిన విధంబు

నటించి నాట్యశాల సంకేతముగాఁజెప్పి యొంటరిగా నేఁటిరాత్రికి యా నచ్చోటికి వచ్చునట్లు నియమించి యొప్పించి పంపుటయు తనయిష్టప్రకారము చేయుట కొడంబడి కీచకుండు పరమానందంబుఁజెంది తనయింటికిఁ బోవుటయుం దెలియఁజేసెను.

ద్రౌపది తెలిపిన వృత్తాంతమును విని వృకోదరుండు మిక్కిలి సంతోషమునుజెంది, "అబలా! నీచాతుర్యము శ్లాఘ్యమైనది. ఇంతటి శీఘ్రముగా పని చక్కబెట్టు శక్తి నీకేతగును. ఓర్వరాని క్రోధముగలవాఁడనై యుపాయాంతరముంగానక చింతిల్లుచున్న నాకు పరమసంతోషము కలుగునట్లు నీవీ కష్టకార్యమును సమకూర్చి చాల మేలుచేసితివి. ఈప్రకారముగా ధర్మరాజు మెచ్చునట్లు శత్రుహరణోపాయముఁబన్నుట మిగుల కష్టము. నీవు చేయవలసినంతయుం జేసితివికాని, వాఁడు నీ చెప్పినట్లు చేయునో, భయమొంది వెంట నెవ్వరినైన దోడ్కొనివచ్చునో, యది తెలియకున్నది. ఒకవేళ మనరహస్యములు బయలుచేయునో యనెడి సంశయము కలుగుచున్నది. అటులచేయునా? చేయఁడు. నీవు సంకేత మేర్పరచి చెప్పినపుడు, సంశయింపక సమ్మతించి పోయెనంటివి గదా, అట్టివానికి వేఱువిధముగా తలంపుకలుగుటకు కారణమేమిగలదు? వాఁడు సందేహించవలసిన యంశమెద్దియు నుండదు, కాఁబట్టి యచటికి తప్పక రాగలండు. సరి! వానికి కాలము తీఱియే వాఁడు వచ్చును. నాట్యశాల కరుదెంచి యందు నిన్నుగానక నన్నుంగని నాతోడపోరాడి మదీయ శౌర్యజ్వాల సామగ్రికి లొంగి నాచేఁజచ్చును. ఇది నిశ్చయము. ఇంక వాఁడు చచ్చినట్లే! సంశయింపనలసినదిలేదు. లతాంగీ! కీచకుఁడా చీకటి యింటిలో ప్రవేశించి నన్ను తడవిచూచి నీవు కాకుండుట నెఱింగి కలత నొందును. అపుడు కఱ్ఱతో కొట్టఁబడిన పులివలె కోపముతో విజృంభించెదను. వనితామణీ! వాఁడు నన్నుమెఱింగి యొకవేళ వెనుదీసి జడిసి పోవ దలంచినయెడల నేను విడువను. మదించిన డేగ కాకిం బట్టుకొనినట్లు పట్టుకొని ప్రాణంబులు దీసెదను. అటులగాక నాతో నెదిరించి బలముగలవాఁడై పోరాడుటకు బూనెనేని యాగ్రహముతో రౌద్రరస మధికరింపఁగా భూమి చలింప క్రిందఁ బడఁద్రోసి చంపెదను. ఇంక వాఁడు జీవింపఁజాలఁడు" అని మహా క్రోధముతో పలికెను.

పాంచాలి యుమ్మహావీరుని కోపోద్రేకంబును జూచి తనలోభయ మొంది, 'ఇతని తీరుంజూడఁగా రహస్య ప్రవర్తనమునకు భంగము గలిగించునని తోఁచుచున్నది. ఇంతటి యాగ్రహముఁ గలిగియుండువాఁడు తన గుప్తవర్తనంబును పాటించునా? పిమ్మట కార్యము చెడును. కాఁబట్టి తత్ప్రకారంబు ప్రబోధించి కొంత యడకువఁ గలిగించుట మంచి' దని యెంచి యిట్లనియె.

"ప్రాణనాథా! శత్రుసంహారమునకై నీవు పట్టుదలఁ గలిగియుండుటకు నేను సంతోషించుచున్నాను. నీసామర్థ్యము నే నెఱుగనిది కాదు. కాని అయినను కోపమునించి మంచిచెడుగులం దలఁపక, మన వైరులైన కౌరవులు పరిహసించునట్లును, ధర్మనందనునకు కార్యభంగము వాటిల్లెననెడి దుఃఖము గలుగునట్లును, మనగుప్తను రహస్య ప్రవర్తనము నీవలన బయలుపడెనని నిందించునట్లును చేయుకూడదు. అలాగున చేసిన యెడల నీవు నాకు ప్రియంబు నొనరించియు నది నిష్ప్రయోజనమగును. కనుక నీకు మన రహస్యము బయలుపడకుండు విధంబున శత్రుని వధింప వచ్చునని దృఢముగా తోఁచిన నే యీ కార్యమునకుఁ గడంగుము. అటుల సాధ్యముగాదని తోఁచినచో నివీపనికిఁ బూనవలదు. ఎట్లును రహస్యమన్యులకు తెలియరాని విధంబున నడచుకొనవలసినది ముఖ్యము. త్వరపడి యొక కార్యముంజేసి, పూనిన మన నియమమును చెడగొట్టుకొనకూడదు సుమీ!" యని చెప్పెను.

ఆమె పలుకులువిని భీమసేనుండు తలయూఁచి "లతాంగీ! నీవు చెప్పుట యుక్తమే కాని అయినను దురాత్ముఁడైన యాకీచకాధముఁడును నేనునుం బోరాడునపుడు, రహస్యము బయలుపడునని యాలోచించుటకు నాకు అవకాశము కలుగనేరదు. అట్లు యేర్పడినప్పటికిని, నేను సాధ్యమైనంతవరకును నెటులనైనను వానిని గూఢముగానే వధించెదను. భయపడకు" మనెను. అతనిని వేగిరపడి కష్టము సంభవించునట్లు చేయవలదని దిట్టముచేసి, జయలక్ష్మిం జేకొనుమని దీవించి "వల్లభా! కేకయరాజనందనయగు సుధేష్ణ నన్ను గానక విచారించుచుండు. ఇచ్చటికివచ్చి చాల తడవైనది. ఇంక నేనిచ్చోట నుండతగదు, పోయెదను. జాగరూకతతో కార్యంబును సాధింపు"మని చెప్పి యనుజ్ఞఁ గైకొని వెడలిపోయెను. ద్రౌపది చనినంతట వృకోదరుండు కీచకునిం జంపుటకు కృతనిశ్చయుండై నాని యాగమనముం గోరుచుండెను.

ఇట్లుండఁగా నట కీచకుండు సైరంధ్రిపై గలిగిన మోహంబంతం తకు నతిశయింపఁగా సహింప లేక తన పరిచారకులు మొదలగువారి నేమరించి యొంటి నొక యేకాంత ప్రదేశంబునఁ జేరి యా సుందరాంగిం దలంచి తనలో పలు తెఱంగుల తదీయ లావణ్య సౌకుమార్యౌదార్యాది విలాస విశేషములను వర్ణించుచు, తహతహతో మిక్కిలి తాపమును బొంది యలయుచు చలనము, దుఃఖము, సౌఖ్యము, తాపము, మూర్ఛ, నిశ్చేష్టత, తొట్రుపాటు, భయము, సంశయము, కష్టము మొదలైన లక్షణములు పొడముచుండఁగా మదనబాణ పరంపరలకు గురియై, నిలిచినచోట నిలువనొల్లక వితర్కించుచు డోలాందోళిత హృదయుండై 'అకటా! ఏమి చేయుదును? ఏలీల నీ కష్టమును సహింపుదును? ఆ సుందరాంగి సంకేతస్థలంబును జెప్పి యూఱడిల్లఁ బలికి పంపెనుగదా! తాను పలికిన విధమున నచ్చోటికి వచ్చునో, లేక రాదో, సంశయము! ఒక వేళ వచ్చి మునుపటివలె నా కోరికను నిరాకరింపక సంతోషముతో నన్నుఁ గూడునా? తలంచినట్లు జరుగుట కేమి విఘ్నములు వాటిల్లునో యెట్లు చెప్పవచ్చును? తనను. గంధర్వులైదుగురు పతులు గలరని చెప్పినదిగదా? ఆమాట నిజముగానే యుండునా? నావలన నష్టమేమైనం బొసంగునా? మాయక్కయగు సుధేష్ణ యీయంగన నాయెడ చిడిముడిపాటుఁ జూచి, సందర్భమును దెలిసికొని పనులు చెప్పకమానని విడచునో విడువదో, నావలెనే చిత్తజ తాపాయత్తయై తపించుచున్న యీయన్నులమిన్నను మదనుండు నాయొద్దకుఁ జేర్పకుండునా? అటుల గాదేని నేను బ్రతుకుట దుర్లభము. ఆలోచింపగా యీమగువ యింత కఠినచిత్తగాదనియే తోఁచుచున్నది. తనపై మితిలేని వలపును జెంది వెతలొందుచుండెడి నన్ను నిర్దయగా నన్యాయముఁ జేయునా? అటుల చేయఁదలంపదు. అయినను కాలవైపరీత్య మెటుల పరిణమించునో, యెవరెఱుంగఁగలరు? స్త్రీల చిత్తము లగోచరములుగదా! అది తన సత్యమును గాపాడుకొనునని నమ్ముటయెట్లు? ప్రతిజ్ఞా కాలము వరకును యెదురుచూచుచు కష్టములఁ బొందనేమిటికి? ఇపుడేయది యున్నచోటు నకుఁబోయి దానింబట్టి తెచ్చి, మదనకేళియందు నానేర్పుఁజూపి సంతోషమును బొందించెను. ఇట్లు చేయకూడదా? చేయగలనుకాని, అయినను నయ్యబల తలంపునకు వ్యతిరేకముగా నాచరించుట యుక్తముకాదు అది చెప్పియున్న కాలమువరకును వేగిరపాటు నడంచుకొని, ధైర్యమును

వహించియుండుటయే మంచిది. ఏపనికిఁగాని తొందఱపాటు కూడదు' అని పలుతెఱంగులం దలంచుచు, తాలిమి దూలిన చిత్తముతో, నానా విధములైన సంకటములను బొందుచుండెను.

అట్టి సమయమున కీచకుని విభ్రమం బతిశయించుటంజేసి, తన ముందట ద్రౌపది కనఁబడినట్లు తోఁపగా మహా ప్రియంబుతో దానిం బట్టుకొనుటకై చేతులు చాచి యది కల్లయగుటచే తెలివిఁదెచ్చుకొని తపించుచు, తనకెలనం దిరిగినట్లు తోఁచి మాటలాడుటకుం దిరిగి పిమ్మట భ్రాంతియగుట నెఱింగి చింతించుచు, తనయొద్దకుఁ జేరినట్లు కనుపట్టినఁ గౌఁగలింప యత్నించి లేమిచే గుందుచు, తన కోరికం దీర్చుటకు ద్రుపద సుత సమ్మతించినట్లు కనుపట్టి పొందుటకుం బూనికచేసి భ్రమయగుటకు నలరి, నానావిధముల విలాస క్రీడలకుం దనయొద్దకు వచ్చిన చంద ముగా గనఁబడుటకు, నానందముకుజెంది చేపట్ట నెంచి యసత్యమనుట తోఁచుటయు కలఁతనొంది వెలవెలంబోవుచు ఇవ్విధమున పెక్కులగు మదన వికారంబులకు లోనై యెనలేని వేదనలు గుడుచుచు, పరిచారికా జనంబులు ప్రార్థించుటంజేసి, యెల్లనివాడయ్యు స్నానంబును, భోజనం బును, నొకలాగున జరిగించి మనో వేదనా వినోదార్థంబుగా నటనుండి యుద్యానవనంబునకుం బోయెను.

విరహవేదనచే కీచకుఁ డుద్యాన వనంబున విహరించుట

అటుల వన విహారంబు సలిపి తనతాపము కొంత శమింపజేసు కొననెంచి, కొంతసేపు కొలంకులందలి తామరలమీఁదుగా వచ్చుగాలిని సేవించి, యది వెట్టగాదోఁచుటయు, సహింపలేక, తియ్యమామిడిచెట్లు క్రిందికరిగి నిలిచి యచ్చటను సయితము హితవుగా నుండమిచేపొదరిండ్ల లోదూఱి యందును ప్రయోజనము గలుగక వెలువడి పూఁదీఁగెల యొద్దకేగి పూవులనుండి రాలు పుప్పొడియు, పుష్పములనుండి కారియు చున్న పూదేనె బిందువులును తనపైఁ బడుచున్న బెదరి యులికిపడుచు, నివ్విధమున నిలిచినచోట నిలువలేక మదనతాపదోధూయమాన చిత్తుండై వనంబున నంతటనుం గ్రుమ్మరుచు, అవ్వనంబున తనప్రియురాలికి తృప్తిగా తేనెనొసంగి మిగిలిన దానిం ద్రాగు తుమ్మెదను, ననుంగు సతిని తన ఱెక్కలచేఁ గప్పి యనుసరించి యనురాగం బుట్టిపడఁగా లోఁబరచుకొను రాజహంసను, మధుర ఫలరసంబునిచ్చి మచ్చిక మీఱ

ముచ్చటలాడుచున్న చిలుకజంటను, ఏకాంతంబున నొండొంటి మేను లొరయందరిసి తిరుగుకోయిల దంపతులను చూచి యట్టుల తానును సైరంధ్రితోఁగూడి వర్తించుటకుం గోరికతీరిక తత్తరచిత్తంబు తత్తర పాటున గదిరి వెతనొందఁ దొడంగెను.

ఈ రీతి నతండు మోహాతిరేకంబునం గుందుచు నక్కడక్కడం దిరుగుచు తుదకొక పొదరింటిలోఁగల చంద్రకాంతపు టరుగుపై నమర్పఁబడియున్న శయ్యంజూచి యక్కడికిఁబోయి యా పానుపుపై మేనుసేర్చి యటునిటుం బొరలుచు, ద్రౌపదిందలఁచి విభ్రాంతి యతిశయించి మనఃస్వాస్థ్యంబుదప్పి తలంపులకుంజొచ్చి 'నా మనోహారిణియైన సైరంధ్రి నన్ను, జేరవచ్చెనేని ముచ్చటదీర దాని చేయిఁబట్టుకొని ప్రియముతో సంభాషించెదను. దాని కుచములు నాయురంబు దాఁకునట్లు బిగ్గఁ గౌఁగలించెదను. నాకొనగోళ్ళచే ముంగురులను చక్కఁజేసి యామె యతి కోమలమైన యధరమునొక్కి సురత క్రీడకు దిగుఱునట్లు కళలఁ దేలించెదను. మా యిరువురికిని చిత్తంబు లొక్కటియగునట్లుగాఁ జేసి యనురాగంబుతో సురతకేళిం దేల్చి మెప్పించెదను. ఎట్లైనను నేనా ముద్దుగుమ్మను స్వాధీనముగాఁ జేసికొని యభిమతి సుఖంబు లనుభవించెదను' అని తలపోయుచు, సంతంతకు నతిశయించు మనోరథంబులను, భావతరంబులను, శిశిరోపచారములనుం బ్రొద్దుగడపుచు, తన వెతకు కడగానక, 'అయ్యో! క్రూరుండైన యీ సూర్యుం డింకను గ్రుంకక పగతుండై నన్ను బాధించుచున్నాఁడు. నేఁడు శీఘ్రముగా నస్తమింపరాదా? రవిగ్రుంకుట కీదిన మింత తడవగుట కేమి కారణము? నన్ను వెతపెట్టుటకై దివాకరుండు మందగమనుండయ్యెనా? లేక నేఁడు మొదలుకొని పగలేకాని రాత్రి లేకుండునట్లు దేవుఁడు చేసినాఁడా? నాకొరకై యీదినమిట్లు పగలు గడియ లెక్కుడయ్యెనా? ఇంకను నెంతతడవునకు సూర్యాస్తమానంబగునో తెలియలేదు. ఏమి చేయుదును? ఎట్లు? ఈ మోహసాగరము నెవ్విధంబున తరింపుదును?' అని వెతనొంది తపించుచుండి, పానుపుపై బొరలాడుచు, ఆరాటముమించి దేహము తాపమును బొందుటచేతను, ఇంద్రియములు పలువిధములైన కోరికలకధీనములగుటచేతను, మానసము చింతాకుల మగుటచేతను, ధైర్యము క్రమముగా గ్రుంకుచుండుటచేతను, నతనికి ప్రాణములు ధరించుటయే మహా కష్టముగా నుండెను.

తత్సమయమున కామాగ్నిదగ్ధ హృదయుండగు కీచకునకు కొంత శాంతి వాటిల్లునట్లును కమలములు ముగుడునట్లును, వికసిత పుష్ప సంతతులచేత వనములు శోభించునట్లును సూర్యుం డస్తమించెను. రవి గ్రుంకుటంగని త్వరితముగా తనకు సైరంధ్రిపొందు ఘటిల్లునని తలంపు గలవాఁడై సింహబలుండు సంతోషముచు జెందెను.

## సూర్యాస్తమయాభి వర్ణనము

మెల్లుగా లోకము చల్లగాఁజొచ్చెను. అపుడు పడమటి దిక్కు-యొజ్జని కాంతులచే విలసిల్లెను. జనులు సంధ్యావందనాది కృత్యములు జరుపఁదొడంగిరి. క్రమక్రమంబుగా మింట నక్షత్ర సమితి పొడకట్ట సాగెను. ప్రమదంబు తొలంగ చక్రవాకములు విరహవేదనఁ బొందుటకు పాలయ్యెను. ప్రపంచంబంతయు సంధ్యారాగ కాంతులచేత నెఱ్ఱగా నొప్పుచుండెను. దీపములకు కాంతి యతిశయించెను. రాత్రియగుటచే పట్టణవీధులందు జనసంచారము సన్నగిల్లి నిశ్శబ్దముగానుండెను. విట జనులు తమ ప్రియురాండ్ర సమాగమంబు గలుగుననెడి యపేక్షతో సంతోషమును పొందిరి. అపుడు కండ్లుమూసినను, తెరచినను, నొకటిగానే లోకమెల్లను గాఢమైన చీకటులు వ్యాపించెను. చూచువారికి మిట్టనియుం బల్లమనియు నెఱుంగుట కష్టముగానుండెను. చోరులును జారులును మిక్కిలి యుప్పొంగి తమ కృత్యంబులకు యత్నించుచుండిరి.

ఆ తరుణంబున కీచక సంహార కార్యాసక్తయైయున్న ద్రౌపది రహస్యముగా వృకోదరుండున్న యెడకుఁజని యతనింగాంచి, యెచ్చరించి "దురాత్ముండగు సింహబలునిం జంపుటకు సమయంబయ్యెను. ఇంక నీవు తడయక యప్రమత్తుండవై! తత్కార్యంబున కుద్యోగింపు"మని చెప్పెను.

ఆమె పలుకులు విని భీమసేనుం డుత్సహించి పెండ్లికిఁ బోవువాని వలె సంతోషముతో లేచి తలకు వస్త్రమును జుట్టుకొని యాయితంబై "పాంచాలీ! నీవు నా వెనుకగా మెల్లమెల్లగాఁ రమ్ము, నేను ముందు నడచెద" నని ప్రయాణంబై, యామె తన వెంట వచ్చుచుండగా తననడక వలన నొరులకు చప్పుడు వినకుండులాగున నడుగులు బెట్టుచు, తానొనరింపఁబోయెడి కార్యమునుగూర్చి మనంబునందు పొడమిన యుత్సాహము బయలు కాకుండునట్లును, నిజరోషకోపంబులు వెల్లడి కానట్లును, జాగ్రతగా నాట్యమందిర మార్గమునుబట్టిపోయి, తెలివిలేనివాని మనస్సువలె, చీక

టిచే కప్పఁబడినదియు, ప్రౌఢనాయిక యనురాగంబునుం బోలె తెలియ రాక యుండునదియు, భయంకరమైన యడవీప్రదేశంబు వడువున నిర్జ నమ్యముగా నొప్పుచున్నదియు, అధికపు నీచపురుషుని సంపదవలె యుపయోగింపరానిదియు, తెలియని శాస్త్రంబు చెలువున ప్రవేశింపరాని దియు, తెలియకుండునదియు, స్వప్నదృష్టపు వస్తువు చందమున గానఁ బడనిదియు, క్లిష్టకావ్యంబు తెఱంగున, తెలియకుండెడి యలంకృతులచే నొప్పుచున్నదియు, వివేకహీనుని రాజ్యంబు పోల్కిని బాధలకును, చోరు లకును నింపు బుట్టించునదియు నైన, యానాట్యశాలం జొచ్చి ముందటి భాగంబునకు మదపుటేనుంగు తెఱంగున నడచుచు తన చేతుల సహాయ ముతో ద్రౌపది చేయిపట్టుకొని మెల్లగా నయ్యంధకారమున చీకటియే గోడలుగాగలదియు, పిరికివాండ్రకు భయంకరమైనదియు. గడువిశాలమై నదియునైన యాయింటిలోపల జంకులేక తడవుకొనుచుం బోయి యందొక చోట విరాటనందనయొక్క విలాసంపు పానుపుగలిగి యుండుటం దెలిసి కొని సంతసించి పాంచాలి నచ్చటికి కొంచెము యెడముగా తొలఁగి యుండునట్లు నియమించి తానా శయ్యపైఁ జేరి, నిజశత్రుండైన కీచకుని రాక కెదురు చూచుచుండెను.

## కీచకుఁడు రహస్యముగా నాట్యశాల కేగుట

అట్టియెడ ద్రౌపదీ సంగమాపేక్షావశ మానసుండై యున్న కీచ కుండు, వేగిరపాటనెడి సారాయిద్రాగి తహతహపడు చిత్తంబుగలవాఁడై యుండుటవలన శీఘ్రముగా నలంకరించుకొని, ఎప్పుడెప్పుడు పోయి సైరం ధ్రినిఁ గౌఁగిటం జేర్చెదునో యనెడి కోరిక లీరికలెత్తుచుండ నిలువిడి యెదవలి పోయి, మాలిని యిప్పటికి తప్పక వచ్చియుండఁగలదని తలంచుచు, సిం హము నివసించు గుహలో ప్రవేశించు మదపుటేనుగువలె భీముసేనుండున్న నాట్యశాలం జేరి కామోద్రేకంబున హానివృద్ధులందలంపక, సంశయరహిత చిత్తుండై యహంకార మతిశయింపఁగా లోపలఁజొచ్చి, తనకై యచ్చట ద్రౌపది వచ్చియున్నదనెడి నిశ్చయముతో చేతులు చాచి వెదకుచు శయ నముంగని యధికమైన సంతోషమునుజెంది దానిమీఁదికి చేయిసాఁచెను.

ఆసమయమున రౌద్రరసంబు మూర్తీభవించినట్లు మించిన కోప మునుజెంది తత్కారణమున మేనుపదరుచున్నను, భీముఁడు వానిమాటలు వినవలయుననియు, చేష్టల నెఱుంగవలయుననియు నెంచి వేగిరపడక యూరి

యుం జేయక తనరీతి తెలియకుండునట్లు నిర్వికారుండై జాగ్రతగాయుం డెను. అపుడు కీచకుడు భీమునిపైఁ జేయువైచి మాలినియే యనెడి తలంపుతో నత్యంతమైన మోహమున నొడలు పులకరించుచుండఁగా యిట్లనియె.

“ప్రియురాలా! మాలినీ! ఇదిగో! మేలిమియైన వస్తువులు నీకొరకేర్పరచి తెచ్చితిని, వీనిని గైకొనుము. నీకొకదానికిఁ దక్క— యిటుల నేను నిదివరకును యే స్త్రీకిగాని యిచ్చినదిలేదు. నాపై వలపుఁజెంది నన్ను గోరిన కాంతలు లంచముగా ననేకవిధంబులైన వస్తువులు తామే నాకుఁ దెచ్చి యిచ్చుచుండుదురు. నీయందు నాకుంగల ప్రేమాధిక్యంబు కతన నిపుడు నీకు నేను గొనివచ్చి యిచ్చుచున్నాను. దీనివలన నీపై నెంతటి ప్రియముఁ గలిగియుండెదనో తెలిసికొనుము. ఎంతటి చక్కని యువతులుగాని నాకు తాముఁ లోబడుదురుగాని నేను వారికి లోఁబడెడివాఁడనుగాను. నీవుమాత్రమే నాచేఁ బ్రార్థింపఁబడి నన్ను లోఁబరచుకొంటివి సుమీ!” యని పలికెను.

భీమసేనుండు కీచకుని మాటలువిని తనలో నుక్కిలి రోతనుజెంది, యిస్సీ! యని యనాదరము చేసియు ద్రౌపది తమ ప్రసంగ మొక్కింత వినుట యుక్తముగా నుండునని యెంచి, యెలుంగు మారుబాటుచేసి యాఁడుది పలుకు విధంబున గూఢార్థము గలుగు మాటలతో వాని కిట్లనియె.

“ఓహో! అలాగా! ఇంతటివాఁడవు గావుననే నిన్ను నీవేపొగడు కొనుచున్నాఁడవు. అయినను, నావంటి యువతి యెచ్చట వెదకినను నీకు లభింపదు. ఇది తెలియక యివ్విధముగఁ జెప్పితి” వని యాత్మస్తుతి జేసికొనుటచే నీచుఁడగుటయు, తాను పురుషుండగుటం దెలిసికొనక పరగుచుండుటచే తనవంటి పురుషుఁడు స్త్రీయగుట దుర్లభమనియుం దన రహస్యాభిప్రాయమును వానితోఁ జెప్పెను. అపుడును కీచకుండు తెలిసికొనఁ జాలఁడయ్యెను.

మఱియు వృకోదరుండు వానితో “ఓయీ! ఇన్నిమాటలు పలికితివిగదా! ఇంక నా దేహము నీశరీరమునకు తగులగానే నీకుఁ గలుగఁ బోయెడి సుఖమును, నానందమును నెట్టిదగునో తెలిసికొనఁగలవు. సాధారణ స్త్రీలతో నన్నుఁ బోల్చుట తప్పుసుమీ!” యని గూఢార్థము

గలుగ, 'నాదేహమును తాకగానే నీవు మృతినొందఁగల' వనెడి తన యభిప్రాయమును దెలిపెఁజెప్పెను. కాని యపుడును నతండా తాత్పర్యము గ్రహింప లేడయ్యెను.

వెండియు నతనితో "ఓయి కీచకుఁడా! నేఁడు నీతోడ సమాగమము కుదురుట నాజన్మఫలమని తలంచుచున్నాను. నన్ను ముట్టినంతట నీవు మఱియొక యతివఁ బొందను గోరజాలవు. నీలోఁగల మన్మథ వికారమునకుం దగిన లాభము ననుభవించెదవుగాక" యనితనచే నతఁడు చచ్చుట నెఱింగించెను. అయినను భీముని మాటలందలి యంతరార్థము మోహావేశ పరవశుండై యున్న కీచకునకు స్ఫురింపకుండెను.

పూర్వోక్త ప్రకారంబుగాఁ బలికి వృకోదరుం డాగ్రహోదగ్రమూర్తియై కన్నుల నిప్పుక లొలుకుచుండఁగా, వానిగుండియ లదరునట్లు వికటముగా నవ్వి తటాలున లేచి బాహుబల మతిశయింపఁగా యతని తలనుబట్టి క్రిందికివంచెను. అపుడు కీచకుఁడు సైరంధ్రి మగఁడగు గంధర్వుఁడని తలంచి అటుల వంచఁగా నతండు మహాకోపమును జెంది తన చేతులతో భీముని చేతులను గట్టిగాపట్టుకొని క్రిందికిలాగి నేలఁబడవైచి తన మోకాళ్ళతోఁ ద్రొక్కి యదిమిపట్టెను. అపుడు భీమసేనుండు కఱ్ఱతోఁ గొట్టిన పెనుబామువలె కోపాతిశయముచే బుసగొట్టుచు తప్పించుకొని లేచి, దేహముప్పొంగుచుండఁగా, కీచకునిఁబట్టి నేలం బడద్రోసెను. వాఁడును కినుక రెట్టింపఁగా భీమునిం ద్రోసెను.

ఇట్లయ్యిరువురును బలంబులు రెట్టింపఁగా నొకరినొకరు మీఱఁజాలక కొంతతడవు ఘోరముగాఁ బోరిరి. అటుల వారిరువురుం బెనఁగుచుండునపుడు, తన దుష్ప్రవర్తనమును లోకు లెఱింగినచో నిందింతురనియు, తన గౌరవమునకు హాని గలుగుననియు, కీచకుఁడును, పరులు తన ప్రవర్తనముచేత నిజమును దెలిసికొనిరేని యజ్ఞాతవాస రహస్యవర్తనమునకు భంగము వాటిల్లుననెడి భయముచే భీమసేనుఁడును తలంచినవారై యాచీకటింటిలో నిశ్శబ్దముగా నొరులకు తమ జాడ దోఁచకుండునట్లుగా నొండొరుల నొప్పించుచు పెనఁగుచుండిరి.

## భీమసేనుఁడు కీచకుని సంహరించుట

ఆలాగునఁ గదిసి, ఒకఁడుఁబట్టి యీడ్చినపుడు కదలక నిలచి మఱియొకఁడు వానిఁబట్టుకొని లాగును, నొకఁడు గ్రుద్దినపుడు వెనుదీయక

రెండవవాఁడు వానినిగ్రుద్దుచు నొకఁడు నేలఁబడఁద్రోసి యదిమిన తప్పించుకొని మఱియొకఁడు వానిని త్రోసియదుముచు, నొకఁడడఁచిన రెండవవాఁడు నటులనే చేయుచు, నంతంతకు హెచ్చుచున్న కోపముగల వారై పిఱుదివియక యాయువుపట్టుల నొప్పించుచు తమశక్తి సామర్థ్యంబుల కొలందియు మల్లయుద్ధమున సమముగాఁ బోరాడుచుండగా నయ్యవసరమున క్రమముగా భీమసేనుని బలం బధికమగుచుండెను. కీచకుని త్రాణంబు తగ్గిపోవఁ దొడంగెను. తన శత్రునిబలంబు తగ్గుటం దెలిసికొనినవాఁడై వృకోదరుండు సింహము జింకను బట్టుకొనిన విధంబున కీచకునిం బట్టుకొనిన, వాఁడు పరాక్రమించి పట్టుదప్పించుకొని యెగసెను, అందుచే భీమునకు కోపము యెక్కుడయ్యెను. అంతట నత్యుగ్రమూర్తియై సింహబలుని తనబలము కొలందిని బట్టిగ్రుద్దెను. ఆగ్రుద్దువలన బలమఱి వాఁడు క్రిందఁబడ కనుగ్రుడ్లు వెలికివచ్చి గిజగిజఁ దన్నుకొన సాగెను. అప్పుడు ఫలపుష్పపత్రభరితమగు వృక్షమును మదపుటేనుంగు కూల్చు రీతిగా భీముండు కీచకునిం జంపెను. కాని యంతటితో కోపము చల్లారక వానిని చిత్రవధ చేయవలయునని యెంచి కాళ్ళను చేతులనువిఱిచి పొట్టలోనికి జొనిపి పిసికి ముద్దగాఁజేసి పడవైచి యత్నికృతకార్యసాఫల్యత వడసి, భీముని బలమునందు నమ్మకముగలదయ్యును నట నొకయోర నిలిచి యాకీచకుని నతండు చంపఁగలఁడో చంపఁజాలఁడో యనెడిసందేహము మనంబున సంహరించుటం జేసి, కీచకుని చావుం గోరుచున్నదియగు ద్రౌపదిం బిలిచి "కాంతామణీ! పాపాత్ముండగు సింహబలుండు మృతినొందెం జూడు" మని చెప్పి తటాలున పోయి రహస్యముగా నిప్పు దెచ్చి తగిలించి వెలుతురు గలిగించిచూపెను.

ఆ వెలుతురులో ద్రౌపది చచ్చిపడియున్న కీచకుని వాడున్న యాకృతిం గని సంతోషమును భయమును, నాశ్చర్యమును జెంది దగ్గఱఁగాఁబోయి నెత్తిఁగాలుపిఱిచి, ముక్కుమీఁద వ్రేలుఁబెట్టుకొని వానినుద్దేశించి "ఓరీ పాపాత్మా! నీవు చేసిన దంతయు నిట్టిదశను పొందుటకేరా! చేసినకార్యమునకుఁ దగిన ఫలంబును జెందినాఁడవు. ఇటువంటి యకృత్యముల నొనర్చినవారి కిటువంటి గతిగాక మఱియేమి కలుగును? ఇంక నీకోరికల ననుభవింపుము. ఛీ! దుశ్శీలా! లోకమున నీవలె చేయరాని యకార్యములం జేసినవార లందఱును, నీవలెనే ఫలము ననుభవింపక పోఁజాలరు" అని పలికి భీముని దెస మొగంబై నయతండా

వనితారత్నముంజూచి వికసితముఖుఁడై "కమలవదనా! ఇప్పుడు నీదుఃఖము తీఱె, సంతోషము కలిగినదా? నీలోఁగలిగియుండిన కోపము శాంతించెనా? నాబాహుబలమును తెలిసికొంటివా? వీఁడెచచ్చి ముద్దగాఁ బడియున్న యీదుష్టుండైన కీచకునింజూడుము. సంతసింపుము. నీయొద్దకు దుర్బుద్ధితో నెవఁడువచ్చునో వాఁడు యివ్విధముగఁ నాచే జచ్చును. కాని బ్రతికిపోవఁజాలఁడు" అనెను.

## ద్రౌపది భీమసేనునిఁ బ్రశంసించుట

"నిన్నటి దినము సభలో కోపము వచ్చినపుడు సంచలింపక లోలోన నడంచుకొని యుండిన నీధైర్యమునుచూచితి, నేఁడుపరులకెఱుంగఁబడని చందమున నిచ్చోటికి వచ్చిన గొప్పతనమును చెప్పుటకును, మనవారిలో నొకరినైన సహాయముఁగోరక నీచేఁగావింపఁబడినట్టియీ సాహసకార్యమును మెచ్చుటకును, ఎవ్వారికిని జయించుటకు సాధ్యుఁడుగాని కీచకునింజంపిన భవత్సామర్థ్యంబును వర్ణించుటకును, నేను శక్తురాలనుగాను. నీవు చేసిన యీ మహాత్కార్యముంజూచి పరమాశ్చర్యమును, పరమసంతోషమునుం జెంది పరవశురాలనైతిని" అని యాపెం యతనికి బదులుచెప్పెను.

మిక్కిలి యింపుగానుండినట్టి ద్రౌపది వాక్యంబులువిని వృకోదరుండు సంతసించి "లతాంగీ! ఇంక మనమిచ్చోట తడవునిలుచుట క్షేమకరముకాదు. నేనుపోయెదను. రహస్యముగాఁజని నీవును నీస్థలంబునుం జేరు"మని చెప్పి యతం డచ్చోటనుండి కదలిపోయెను."

అని యిట్లు వైశంపాయన మునిశ్రేష్ఠుండు చెప్పిన విని, జనమేజయుఁ డచ్చెరువొంది, యమ్మునికుల చంద్రుం జూచి "మహాత్మా! మీరు తెలియజేసిన చరిత్రం బత్యద్భుతఁబుగాఁదోచుచున్నది. అటుల సింహబలుండు చచ్చినపిమ్మట జరిగిన వృత్తాంతమును వినుటకు కుతూహలముఁగలవాఁడనై యున్నాను. నాయందు కరుణించి వక్కాణింపుఁ"డని ప్రార్థించెను.

రెండవ ప్రకరణము సంపూర్ణము

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు





భీముఁడు కీచకుని చంపి ముద్దగాఁ జేయుట



రాక్షసుఁడు కీచకుని పదఁద్రోయుట

# మూడవ ప్రకరణము



క॥ శ్రీమత్పయః పయోనిధి
ధామా! తామరసనేత్ర! దళితనిశాట
స్తోమా! యలమేల్మంగా
వామాంకీ. ప్రాణలోల! వరగుణశీల!

దేవా! అవధరింపుము—వైశంపాయనుండు జనమేజయునకుఁ దదనంతర వృత్తాంతంబు నిట్లని చెప్పఁదొడంగె,

"రాజేంద్రా! వినుము. పవనతనయుం డట్లు నాట్యశాల వెలువడిపోయి, వంటయింటి సమీపంబున నొడలు గడుగుకొని, మైపూఁతచేత తనువుల నంటుటచేఁ గలిగిన నెత్తురు వాసనను పోఁగొట్టుకొని, తన యుద్దేశించిన కార్యము నెఱవేరుటవలన సంతుష్టుఁడై తనయొక్క శయ్యమీఁదికరిగి కూర్చుండెను.

## కీచకుఁడు మృతినొందుటను ద్రౌపది కావలివారితో చెప్పుట

అతండు పోయినంతట, నర్తనశాలయందున్న ద్రౌపది, యప్పటికి భీమసేనుండు వంటయింటికి జేరియుండునని నిశ్చయించి యా మందిరము వెలువడివచ్చి కావలివారల నందఱఁ బిలిచి "ఓ సేవకులారా! నాయొక్క పతులైన గంధర్వులచే, సింహబలుండు చచ్చిపడియున్నవాఁడు. వీనినిఁ జూడుఁడు. ఈ పాపాత్ముఁడు దుర్వ్యవసాయమునకుఁ గడంగి నాశనము నిర్విఘ్నముగఁ బొందెను" అని యఱచి బిగ్గరగాఁ జెప్పెను. ఆమె పలుకులు విని కావలివారలు భయాశ్చర్యమానసులై, త్రొక్కుపాటుతో, వేగముగా దివ్వటీలను చేతఁ బూని కేకలు వెట్టుచు నాట్యశాలకుఁ బోయిరి. అంతలోన నాయల్లరిని విని సింహబలుని తమ్ములైన యుపకీచకులు త్వరితముగా నర్తనాగారమున కరుదెంచి, యందు తమ యన్నయొక్క దేహము రూపు చెడి పడియుండఁ జూచి మిక్కిలి దుఃఖింపఁదొడంగిరి. వారిలో కొందఱు హాహాకారములొనరించిరి. కొందఱు నిశ్చేష్టులైరి. కొందఱు తమ యన్నపైఁబడి మూర్ఛనుబొందిరి. మఱికొందఱు కొంచెము దూరముగా నిలిచి చూచుచు వాపోవుచుండిరి.

ఆసమయమున తద్వృత్తాంతముం దెలిసికొని బంధుజనంబులప్పటికివచ్చి ముద్దగాపడియున్న కీచకుని కళేబరంబును గాంచి యుచ్చైః

నొందుచు, నొండొరులు తమలో "ఆహా! మనుష్యులలో నిటువంటి వింతచావు జచ్చినవారిని నేమును జూచి యెఱుంగము. అయ్యో! వ్యర్థముగా నితం డిట్లు నాశనమయ్యెను. ఇతం డిందు చేయనెంచినది దుష్కార్యము కావుననే తా నెంతటి బలసంపన్నుఁడై యున్నను నట్టి బలము నిష్ప్రయోజనమైనది. కడు మూర్ఖుఁడగుటచే తనకంటె నధికులు లేరనెడి గర్వముతోఁ గలుగఁబోయెడి కీడును తెలిసికొనలేక చేతులఁ దెచ్చుకొని ప్రాణములు గోలుపోయెను. ఈవింత జూడుఁడు. ఇతని చేతులును, కాళ్లును, తలయుం గానరాకున్నవి. గంధర్వులచేతఁ జచ్చువారి కిటులనే చత్తురో, లేక వీనిమీఁద యాగ్రహమువలన నిట్టి విధమునం జంపిరో తెలియరాకున్నది" అని యిట్లు తమకు తమకు తోచినవిధంబుగా బహు ప్రకారంబులం బలుకుకొనుచుండిరి.

అయ్యవసరంబున శోకించుచున్న యుపకీచకవర్గంబులో నొకండు తన సహోదరులం బిలిచి "సోదరులారా! మన మెంత దుఃఖించినను నేమి ప్రయోజనము? మనయన్న యింక బ్రతుకఁబోవునా? వృథా వాపోవుటయె కాని యిందుచే గలిగెడి దేమియును లేదు. శోకంబు నడంచుకొని యితని కగ్ని సంస్కార మొనరించుట కర్తవ్యము. శాంతినొందితత్కార్యమునకుఁ బ్రయత్నింపుఁడు, ఊరడిల్లుఁ"డని చెప్పెను. వాని పలుకులు విని తక్కినవారు సమ్మతించి యుచితప్రకారంబున సంస్కార క్రియకుం బ్రయత్నించుచుండఁగా, తత్కాలమున వారు చేయుపనులను చూడవలయుననెడి తలంపున ద్రౌపది యొక యోరనిలిచి వారి పనులు గనుం గొనుచుండెను.

## ఉపకీచకులు ద్రౌపదిని కీచకుని దేహముతోఁ గట్టికొనిపోవుట

ఆ యుపకీచకు లాసమయంబున నామెను గని యధికమైన కోపగలవారై "ఓహో! మనయన్న చావునకు కారణభూతురాలైన పాపశీల, ఇదిగో! ఇచ్చట నిలిచియున్నది. దీనికొఱకే గదా! యీ మహావీరుండు ప్రాణములు తొలంగెను? ఇటువంటి దానిని విడువకూడదు. బ్రతికియుండునపుడు సంభవింపకున్నను, మన యగ్రజుని దేహ మిపుడైనను దీని మేనితోఁ జేరునుగాక. ఈ చెడిపెను యీ సింహబలుని కళేబరంబుతో చేర్చి కట్టికొని పోయి యితని దేహముతోడనే దహింపుదుము, విడువకూడ"దని కలియఁబలుకుకొని, తటాలున నయ్యబలను బట్టి తెచ్చి

తామువేయు కార్యంబును విరాటరాజుతో చెప్పి చేయుట యుక్తంబని యెంచి యతని పాలికరిగి, సైరంధ్రినిఁ గూర్చి తామొనరించిన వృత్తాంతమునుఁ జెప్పి "బలవంతుఁడైన మాయన్న చావునకిదియే హేతువైనది. దీనిని మేము విడువనొల్లము. మా నిశ్చయంబు జరిగి తీరవలయును. ఇక్కార్యమున కొడఁబడు" మని పలికిరి.

వారి మాటల కులికిపడి, కీచకుని మరణవార్తవిని తత్పూర్వమే మనంబు కలంగియున్న విరాటరాజు తనలో 'వీరియుద్రేకమును చూడఁగా, యీయకృత్యంబును చేయఁదగదని చెప్పినను, నామాటను పాటింతురని తోఁచలేదు. సైరంధ్రి మగలైన గంధర్వులు బలవంతులగుటచే, వీరికి తమయన్నగతియె సంప్రాప్తింపగలదు. దీనికి నేనడ్డు పెట్టు నేమిటికి? ఎట్లును సైరంధ్రి కపాయంబు వాటిల్లదని తలపోసి, వేగిరపడుచున్న యుపకీచకులం జూచి "సరే! మీ మెట్లు తోఁచునో యవ్విధమునఁ జేయుం" డని చెప్పెను. ఉపకీచకులా వాక్యమునే సమ్మతించుటగాఁదలంచి వేగిరముగావచ్చి మృతుండైన కీచకుని కళేబరముతో ద్రౌపదిం జేర్చి బిగియఁగట్టి దయారహితులై బంధువులు మొదలైన వారలు రోదనముఁ జేయుచుండఁగా దివిటీలతో ప్రేతముఁగొని స్మశానమునకుఁ బోవఁదొడంగిరి.

నీచుఁడును, పాపాత్ముఁడునగు కీచకుని మేనితో నత్యుత్తమురాలైన పాంచాలి యివ్విధమున చేర్చి కట్టఁబడినదియై భయంబు నొంది కన్నుల శోకబాష్పములు గారుచుండఁగా నేడ్చుచు యామె బిగ్గఱగా "అయ్యో! దిక్కులేని దానినై యిటుల వీరిచే జిక్కుకొంటినే! ఇపుడు నన్ను రక్షించువా రిచ్చోట నెవ్వరుగలరు? ఓ నాపతులైన గంధర్వులారా! మహా బలవంతులైన మీరు కలిగియుండియు, మీ భార్యనగు నన్ను దుష్టులైన యీ యుపకీచకులు కట్టి నిర్భయచిత్తులై కొనిపోవుచున్నారు. ఇపుడు మీరలు మిన్నకుండుట యుక్తమగునా? కటా! మీసతి నన్యులు భంగపఱచుచుండఁగా, యూరకుండెదరేల! ఇట్లు మీరుపేక్షించి యుండవచ్చునా?" అని పలుకుచు తన పతులంగూర్చి వారి సంకేత నామములం బేర్కొని "ఓ జయా! యోజయంతా! యో విజయా! యోజయత్సేనా! యోజయద్బలా! అధికమైన పరాక్రమము గలవారును, గర్వించిన దుష్టులం జంపువారును, శత్రుజనులకు భయమును గలిగించువారును, నెదిరించిన నెంతవానినైనను ధ్వంసముఁ జేయు

వారును, అసమాన బల సామర్థ్యంబులందు పేరొందినవారును, నైన మీరు సామాన్యులు గారు. ఆరంభించిన కార్య మెంత గొప్పదైనను విడువక పట్టుదలగలిగి సాధించువారు. ఎదుర్కొని పోరాడవచ్చినచో కాలునినైనను లెక్కచేయక యోడించి జయమును బొందునట్టిశక్తిగల వారు. శరణుజొచ్చినయెడల యెంత గొప్ప శత్రువునుగానియు, వాని దోషము నెంచక కృపజూచి రక్షించువారు. అడిగినవానికి కాదనక సంతోషముతో ప్రాణంబులనైన నిచ్చునట్టివారు. సర్వవిధంబులను బ్రసిద్ధినొందిన యోగంధర్వులారా! పతులారా! యీ దుష్టచిత్తులైన యుపకీచకులు నన్ను తమయన్న మృతకళేబరంబుతో చేర్చికట్టి దహించుటకొఱకు కొనిపోవుచున్నారు. మీరు త్వరితముగావచ్చి వీరి బారినుండి తప్పింపుడు. తడవుచేసితిరేని నాప్రాణంబులు దక్కుట దుర్లభము. నన్ను రక్షింపుడు రక్షింపుడు" అని పలవింపుచూ గూతలు పెట్టుచుం బలుకుచుండెను.

## భీముండుపకీచకులంజంపి ద్రౌపదిని విడిపించుట

ఇటుల వాపోవుచున్న పాంచాలి కంఠధ్వనిని విని మహానస గృహమందున్న వృకోదరుండు 'ఓహో! దుష్టులైన యుపకీచకులు సయితము తామింతపనిని చేసినారా?' యని యత్యంతమైన యాగ్రహమును జెంది, రహస్యముగా కదలి వేగముగాపోయి వారిని సంధించుటకై దిగ్గునకోట గోడనుయెక్కి వెలుపటికి దూకి పరేత భూమియొద్ద కరిగి నలువంకలం జూచి యటనుండిన పెద్దచెట్టు నొకదానిని పెరికి భుజముపైం బెట్టుకొని, దేహము చమరించుచుండంగా, కనుబొమలు ముడిపడంగా, పెదవులు చలింపంగా, శరీర మున్నాంగ మూర్తీభవించిన కోపమోయన భయంకరాకారముం దాల్చి, యచ్చోటికి వచ్చుచున్న యుపకీచకుల దారి కడ్డముగా నిలిచెను.

అపుడు కీచకశవము వెంటవచ్చుచున్న యతని బంధుజనంబులు రౌద్రరూపంబుతో ముంగుతోచిన భీమునిగని ముందునకుం బోవుటకు వెరచి దవుదవ్వులనే తొలంగి నిలిచిరి. కొందఱు 'అయ్యో! గంధర్వులు వచ్చినారే! ఇంక తప్పించుకొనుటయెట్లు? మనగతి యేమగునో కదా' యనెడి భీతిచే మేనులు గంపింపంగా, కొందరు పల్లములలో డాగి కొందరు చెట్లెక్కిరి. కొందరు తొందరపాటుచే నేమియుం దోంచక

సీళ్ళలోఁ జొచ్చిరి. మఱియుం గొందఱు భయమువలన నడుగులు తడబడఁగా నడువలేక కూలఁబడిరి.

భీముని యుగ్రాకృతిని జూచి యుపకీచకసంఘసముతము భయభ్రాంతులై ద్రౌపదీ సహితముగా కట్టబడిన తమ యన్న కళేబరము నట్లె విడిచి త్వరితముగా మరలి పట్టణము దెసకుఁ బరుగెత్తిపోవఁ దొడఁగిరి. వారిం జూచి భీమసేనుండు మహావేగముతో పోనీయక యడ్డపడి యొకని నైనను విడువక కసిదీర చేతనుండు చెట్టుచేఁ గొట్టి యందరను జంపెను. ఈప్రకారముగా నూటయైదుగురు సంఖ్యగల యా యుపకీచకులను సంహరించి వృకోదరుండు శమితక్రోధుండై, వచ్చి పాంచాలి కట్లనూడ్చి విడిపించి ''ఇంక భయంబు నొందవలసినది లేదు. నిశ్చింతగా సుధేష్ణమందిరమునకుం బొ''మ్మని చెప్పి, యా నెలఁతను వీడ్కొలిపి, తాను వేఱొక మార్గంబున వంటయింటికి బోయెను.

ఆసమయంబున కీచకు లందరును గంధర్వులచే నిహతులైరనుట నెఱింగి విరాటరాజు భయాకుల మానసుండై, సుధేష్ణయొద్దకుఁబోయి సహోదరులుమరణించుట కెంతయు వంతనొంది శోకించుచున్న యామెకు శాంతిగలుగ నుచితాలాపంబులంబలుకుచు ననునయించి యిట్లనియె.

''జీవితేశ్వరీ! సైరంధ్రి యిచ్చటనుండుట కడు నుపద్రవములకు హేతువగుచున్నది. ఎటులనైనను. నింక నయ్యతివ నిచ్చోట నుండనీక పంపివేయుట క్షేమకరమని తోఁచుచున్నది. కాఁబట్టి మన మిపుడట్లు చేయవలయును. పురుషు లామెతో మాటలాడినచో మిగుల నపాయము గలుగుచుండుటచే నేను భాషించుటకు తెగింపఁజాలను. స్త్రీలే మంచి మాటలతో చెప్పవలయును. ఆ సైరంధ్రి మిగుల చక్కదనము గలదగుటచేతను, పురుషులు భోగాసక్తులగుటచేతను, మన్మథుండు దుర్జయుండగుటచేతను, ఎట్లును మన పట్టణములోని వారి కామెమూలమున ముప్పు గలుగుననుట నిశ్చయము. కాఁబట్టి యామె పొత్తు మన కెంత మాత్రమును పనికిరాదు. నామాటలుగా చెప్పి నేడే యామెను పంపివేయుము. చెప్పుటలో కఠినముగా మాటలాడక యుక్తియుక్తముగా సమయానుగుణ్యమగు పలుకులతో మదీయాభిప్రాయంబును దెలియఁజేయు''మని చెప్పెను.

తన మగనికిఁ దోచినట్లే తాను నెంచుటవలనను, నతఁడు చెప్పి నట్లు చేయుట తనకును సమ్మతముగా నుండుటచేతను, పతియాజ్ఞ ప్రకారముగా నొనరించుటకు సుధేష్ణ యొప్పుకొని "నాథా! మీరు చెప్పినది నిజము. అలాగే నేనామెను నా మందిరమునుండి వెడలిపొమ్మనియెద" నని పలికెను.

## ద్రౌపది సుధేష్ణ మందిరమున కేగుట

అంత పాంచాలికిఁగలిగిన చింతయు నెడి చీకటితో రాత్రిపోటీపడి, యాంమెకా వ్యసనము తొలంగగానే, తానునుందొలంగిపోయినదో యను నట్లు తెల్లవాఱెను. పద్మినీ ప్రియుండును నుదయించెను. తత్పూర్వమున నే ద్రౌపది సచేల స్నానంబుఁ జేసి, రాగాది వికారరహితమైన బుద్ధి యుంబోలె నిర్మల తరాంగియై, సింహ బలాదులైన కీచకులెల్లరుం బొలియుటచే, నిశ్చలమైనట్టియు సంతుష్టినిఁ జెందినట్టియు మానసముతో. కదలి సుధేష్ణ గృహంబునకుఁ బోవునదియై రాజవీధిని వచ్చుచుండఁగా, పురజను లామెనుచూచి వెరచి దూరదూరముగా తొలంగినిలిచి "మన కీచకులనందరనుం జంపిన మృత్యుదేవత పోవుచున్నది" యని పలుకు వారును, యామెవంకం గనినచో యుపద్రవంబు వాటిల్లునని చూచువారిని వలదని విచారించువారును, ఆకస్మికముగా గన్నవారు భయంబు నొందిపెడ మొగముపెట్టి చనుచుండగా, వారలను వేగముగాతొలంగి రండని సైఁగలు చేయువారును, ఎదురై తటాలున నెడముగాఁజని పెడదారుల నడచువారును, చూడక దాఁపునకుఁ వచ్చినంతటచూచి వడ వడ వడంకుచు నొదిగి యొదిగి పోవువారును, కొందరు తమ యొమ్ములుం బొట్టలుం గొట్టుకొనుచు భీతిచేతస్కులై "ఈయాడుది యుగ్రరాక్షసి గాని మానవ స్త్రీగా"దని పలుకువారును, నగుచు పురజనులు పులిని చూచిన లేళ్ళనుబోలె పరుగులెత్తుచుండఁగా, ద్రౌపది వారి చర్యలం గాంచి నవ్వువచ్చినను నదివెలుపటికిఁదోఁపనీక లోలోన నడంచుకొనుచు చని తన రాకకు నెదురుచూచుచు, వంటయింటి వాకిట నిలిచియున్న భీమసేనునింగని యతనియందు ప్రేమ యతిశయింపగా, తనకృతజ్ఞత్య తను తెలియఁజేయ నెంచి చూచియుం జూడనిదానివలె తనకు దాను చెప్పికొను విధంబున నిజాభిప్రాయం బతనికి తేటపడులాగున నిట్లనియె.

"కీచకులవలనఁ గలిగిన యపాయమును తొలఁగించి నన్ను రక్షించిన పరమ ధార్మికుఁడైన గంధర్వపతికి నమస్కరించెద" ననుటయు రహస్య సంభాషణాతిచాతుర్య ధుర్యుండైన వృకోదరుండా యువతీలలామవాక్యంబునకు బదులు చెప్పఁ దలంచి "భార్యకేదేనియు నపాయము గలిగినపుడు రక్షించుట భర్తకు పురుషధర్మమును, లోకధర్మమును నగుటచే, వారు నిన్నుగాచుట ప్రియుడగుటకుఁ దగిన కార్యమేయగును. స్వభావముగాఁ జేయవలసిన పనినిఁ జేసినదానికై వారిని పొగడవలసినది లేదు" అనెను. ఇటుల గూఢముగా మాటలాడుకొని నంతట యామె నాట్యశాల యొద్దకుఁబోయెను.

## సుధేష్ణ మందిరమున కరుగుచున్న ద్రౌపది యర్జుననిఁగని భాషించుట

అచ్చట విరాట పుత్రికాదుల యాటపాటలం జూచుచునుండియుం బోలె నిలిచి యర్జునుని గనుచున్న యామెనుగాంచి కన్యకాసహితుండైన పురందర నందనుం డామెకు నెదురుగా వచ్చెను. అప్పుడా కన్నియలు ద్రౌపదినిఁ గూర్చి ఓయమ్మా! కీచకులవలనం గలిగిన యపాయమునుండి తప్పించుకొనివచ్చితివిగదా! నిన్ను బాధించిన సింహబలుండు హతుండగుటయేగాక, నీకపాయము గలిగింపఁబూనిన యుపకీచకులు సయితము నీపతులచే వధింపఁబడిరి గాదా!" యని తామువినిన కీచకుల వృత్తాంతమున కనుగుణముగా నామె కుపచారవార్తలు పలికిరి. అయ్యెడ బృహన్నల యామెతో నిట్లనియె.

"మాలినీ! నీచులైన యాకీచకు లొనర్చిన దుష్కార్యములను, వారు చంపఁబడిన తెఱంగును, నీవు చెప్పఁగా, నీవలననే వినవలయునని కోరుచున్నారము. కాఁబట్టి తద్వృత్తాంతమును మాకెఱింగింపు" మని యెను. అటుల నతండడుగుటయు, నిజాభిప్రాయంబు తెలుగుపడునట్లుగా "ఓబృహన్నలా! నీవుపడుచుల కాటనేర్పుచు, సైరంధ్రి కేమికష్టము గలిగినను నాకేమని కొంచమైనను చింత మనస్సునందు లేనివాఁడవగుటచే సంతోషముతో నిట్లు వృత్తాంత మడుగుచున్నాఁడవు." అని పలికినయు బృహన్నల "సైరంధ్రీ! నీవు దుఃఖమును పొందుటచే నాకును నధికమైన చింత గలిగియేయున్నది. లేకపోలేదు. అయిన ? ఏమి చేయఁగలను? ఇటువంటి వ్యర్థజన్మము గలిగియుండుటవలన నేను వ్యసనముఁ

జెందియును లాభము గలుగదు. ఇంతకాలమున్న నీతో చెలిమి గలిగి నీ గుణంబులు బాగుగా నెఱింగియుందును. కావున నీయందు లేశమైనను దోషము గలుగ నేరదనుట నేను దృఢముగ నెఱుంగుదును. నీవును నాస్వరూపమును చక్కగా దెలిసియుండెడి దానవే! అటులనయ్యు, నీవు గలిగిన యిడుములకై నేను చింతపడకున్నట్లు పలుకుచున్నావు. ఈలాగున చెప్పుట న్యాయముకాదు'' అని తాను సోదరులవలె వేషాంతరమును దాల్చియుండుట మాత్రమేగాక యూర్వశి శాపముచే మూఢ దేహము నయితము పొందియున్న కారణమున శత్రువుల గర్వంబడంచుటకు తనకు సాధ్యముగాకుండుటను గూఢవాక్యములచే నెఱింగించిన, యమ్మాటలకు పాంచాలి సంతసించి యాలక్షణములు వెలిగోఁ దోఁపనీక యతనిం జూచి ''బృహన్నలా! ఊరక నేనట్లు నంటినిగాని, దీనికై యింతదూరము నీవు చెప్పవలసినది లేదు. నీస్వభావమును గుణంబులును నెఱుఁగనిదానను గాను. ఎటులనైన నేమి? రాజాంతఃపురంబులోని బిడ్డల కాటలు గరపుచు నీవు క్షేమముగానుండిన చాలును. ఇదియె నాకు యిష్టము'' అని చెప్పి యచటనుండి కదలి కొందరు కన్నియలు తనవెంటరాగా యామె యున్న మందిరమున కరిగెను.

ఆ సమయమున సైరంధ్రి సంతసముచే ముఖంబునందోఁచు వికాసము నడంచుకొని, విలసిల్లు చెలువంపు చూపుల నడంచుకొని, సంతోషాతిశయముం దెలుపు చేష్టల నడంచుకొని, తలంపునందలియానందము వలన వెడలుమాటల నడంచుకొని, తనకుగలిగిన యుత్సాహమునించుకయును వెలుపలికి గనుపట్టనియుక, ధైర్యముతో నెప్పటియట్ల నిర్వికార చిత్తయుంబోలె నేమియుం దెలియని దాసి చందంబున రాజమహిషి యొద్దకుఁ జేరెను.

సోదరుల మరణించుటకై దుఃఖించుచున్న సుధేష్ణ యామెను చూడఁగానే, తనతమ్ములను జంపినగంధర్వులేమి చేయుదురో యనెడి భయము మనంబున నతిశయింపగాఁ దత్పూర్వము వలెగాక యపుడు సైరంధ్రినెంతయును గౌరవించి తనకు సమీపమునఁ గూర్చుండ జేసి, యామె ముఖంబునఁ జూడ్కులునిలిపి, ''అమ్మా! సైరంధ్రీ! నీవు కడుచక్కని దానవు. నీలావణ్యమునుం గనిన పురుషులు నీపై వలంపుగొని సంకటముల పాలగుచుండుదురు. ఇది కడు నుపద్రవ హేతువుగా నుండుటం

జేసి, మా రాజు యీ విషయమును జెప్పి యిచ్చటికై నను [illegible] వచ్చినచోటికిఁ బోవలయునని ప్రార్థించి సంతుష్టుని [illegible] యున్నాఁడు. కావున నింక నీవిచ్చోటు విడిచి నీకుఁ దగిన స్థలమునకుఁ బోవలయునని వేడుకొనుచున్నాను" అని చెప్పి [illegible] టచే తనలో బొడమిన శోకం బధికంబగుచుండ, నామెతో [illegible] నిట్లనియె.

"సైరంధ్రీ! నీకు బలవంతులగు పతులు గలరని [illegible] సగా చంపించుట ప్రారంభించితివి. జనులు నిన్నుచూచి నీకు సమీపముగాఁ బోవుటకు సయితము ధైర్యము లేనివారై భయపడుచున్నారు. అమ్మా! ఇంతవరకు నిచట నుండినదియు నీవలనం గలిగిన [illegible] చాలును. ఇంక నిటనుండుటకు వలనుగాదు. శీఘ్రముగా [illegible] మా దేశమును విడిచి యెచ్చటి కేనియుం బొమ్ము. నీతో మాటలాడుటకే భయముగాయున్నది" యని పలికిన యామెతో సైరంధ్రి [illegible] నిట్లనియె.

"ఓయమ్మా! నాపతులు దుర్మార్గులు గారు. వారు మిక్కిలి యోగ్యులు, వారివలన మీకు కీడునుం గలుగదు. [illegible] విధంబున నింక పదమూఁడునాళ్ళు నేను మీ [illegible] టనుండుటకు [illegible] తింపవలయునని కోరుచున్నాను. అంతట నాకోరిక [illegible] అప్పుడు నాభర్తలు కనఁబడి మీకోరికలు నెరవేర్పఁగలరు. మీకు సంతోషము కలుగును. నాపతులు కృతజ్ఞతగలిగి యుపకారము చేయు [illegible] నుందురు. ఉత్తమ గుణ సంపన్నులును, దయా కలితస్వాంతులు [illegible] టచే మీరాజునకుఁగాని మఱి యెవ్వరికిని కీడునుం జేయనొల్లరు. ఇది సత్యము. ఏవిధముననేనియు, మీరాజునకు మేలునే [illegible]. కాన నా విన్నపము నంగీకరించి పదమూఁడు దినములు [illegible] నుండనిమ్ము. 'ఈసైరంధ్రి యిటుల పలుకుచున్నది. దీనికి [illegible] యుండునో' యని సంశయింపకుము. 'ఈచింత యంతయు నాకేల? నేను చేసిన యాదరమును చెడగొట్టక నామాటవిని నా యిష్టప్రకార మిచట నుండి పోవలయునని ప్రార్థించెద' నని నీవు నిశ్చయించుట న్యాయమును కాదు. ఇంతకాలము నీయొద్ద కాలము గడపుచుండిన [illegible] నన్ను కరుణించి నేనిపుడు చెప్పిన యల్పకాలము నిలుచుట కొప్పుకొనుము" అని వేడుకొనెను.

సైరంధ్రి యిట్లు ప్రార్థింపగా సుధేష్ణ యామెనుచూచి "సరే! ఇంతదూరము పడుచున్నావు కావున, నీవు కోరినట్లు పదమూడుదినంబు లుండుట కంగీకరించినాను. అంతవరకు నుండవచ్చును. ఇచ్చోట నీయిష్ట ప్రకారముగా నన్నియును నేను నడపుచుండెదను. ఎటుల తలంచెదవో యాప్రకారము వర్తింపుచు, నాకొడుకులను, నామగనిని కృపతో రక్షింపుము. ఇదియే తీర్మానము. నీవు కోరిన గడువు తీఱినంతట వెడలి పోవలసినది" యని చెప్పెను. ద్రుపదనంద యామె మాటల కొంబడి యొప్పుకొనిన సుధేష్ణయొద్ద పను లొనరించుచుండెను.

ఆ సమయమునందా పట్టణమందును దేశమందును జనఘోషగా, "విరాటరాజు మఱందియు, నధికమైన పరాక్రమము గలవాడును, శత్రుజన భయంకరుండును, తనకెదురు లేరనెడి కీర్తిని పొందినవాడును నైన కీచకుండు విచిత్రమైన మరణమును గాంచెను. అంతటి మహాబల వంతుడగు నతనిం జంపిన శూరు లెట్టివారో, యెంత సత్యవంతులుగా నుండువారో తెలిసినది కాదు. ఆ కీచకుండొక యాడుదానిపై వలపుం జెంది దాని నిమిత్తమున నటుల వింతచావుం జచ్చెనట. వ్యర్థముగా వాని వంశము నశించుటయేగాక విరాటరాజునకుంగల బలమంతయుం గ్రుంగిపోయెను" అని యెల్లవారును ప్రబలముగా నాడుకొనుచుండిరి.

ఈ వృత్తాంతము క్రమక్రమంబుగ నన్ని దేశములకును వ్యాపించి యత్యాశ్చర్యముగా మాటలాడుకొనసాగిరి. అట్టికాలమున పాపచింతం గల దుర్యోధనుండు యెటులనేని పాండవుల యజ్ఞాతవాసమును భంగ పరచవలయునను తలంపుగలవాడై వారి జాడ నెఱింగి వచ్చుటకొఱకు వేగులవారిం బంపెను. వారును నతని యాజ్ఞ ప్రకారముపోయి దేశము లన్నియును తిరిగిచూచి, పాండవులంగానక విసికి వేసారి దుఃఖాక్రాంతులై తాము వచ్చునపు డేర్పరచుకొనిన సంకేత స్థలంబున నందఱుంగూడి హస్తినాపురంబునకు మగిడివచ్చిరి.

అందు ఏనుగుల మద జలధారలు కలయంపిగాను, రాజుల సమూహములు తోసికొని రాలిన యాభరణముల రజము ముగ్గులుగాను, [illegible]చునప్పు డొండొరుల తనువులు రాచుకొనుటచే తెగి విడిన ముత్యములు పూవులు చల్లుటగాను, ఇతర దేశాధిపతులు కాను

నొప్పుగా సహజాలంకార పరిశోభితంబై సకల సంపత్కరంబుగా విలసిల్లు దుర్యోధనుని నగరవాకిలికి వేగులవారు పోయి యుచిత ప్రకారంబున లోపలఁ బ్రవేశించి కొలువుమందిరముం దరిసి ద్రోణ, భీష్మ, కర్ణ, కృపాచార్య, సుశర్మ దుశ్శాసన ప్రముఖులును, సేనాపతులును, సామంతజనంబులును, గొలుచుచుండగా, యెత్తైన రత్నస్థగిత సువర్ణమయ సింహాసనాసీనుండై యున్న రాజరాజును సందర్శించి జయజయ శబ్దపూర్వకముగా సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, చేమోడ్పులు ఫాలమునఁ జేర్చి, తాము పోయివచ్చిన వృత్తాంతమును విన్నవించువారై మిక్కిలి వినయముతో యిట్లని విన్నపముఁ గావించిరి.

## దుర్యోధనుని వేగులవారలు పాండవులనువెదకి కానంబడమి

"మహాప్రభో! దేవర యాజ్ఞ నొసఁగిన, ద్రౌపదీ సహితులగు పాండవులను కనుంగొనుటకై మేము మొదట వారున్న యడవులకేఁ బోయి యుంనారము. కాని వారచ్చట కానరారైరి. అంతట సయ్యడవిలో, పొద పొదయు, పల్లము పల్లమును ప్రయాసముతోడను, చొరరాని చోటులున్నియును, దొనదొనయును, గుహాగుహయును, పుట్టపుట్టయును, గుట్టగుట్టయును, నొకటియు విడువక యున్న చోటులందును చక్కఁగ వెదకితిమి. వారు కనఁబడలేదు. కాని యొకచోట రథముల జాడ కనుపించినందున యాజాడ ననుసరించి చాలదూరము పోఁగా నచ్చట సగ్గి రథములు సూతులు తోలుకొని పోవుచుండగా చూచితిమి. మేమా రథములను చేరఁబోవక, దూరదూరముగా నడచుచు, యవి యెచటికి పోవునో తెలుసుకొనవలయు ననెడి తలంపుగలవారమై వాని ననుసరించి వెనువెనుకనే పోవఁదొడంగితిమి. ఆ రథంబులు ద్వారకానగరంబునకుఁ బోయెను. అచ్చట పాండవు లుండుదురేమోయని యెంచి యచ్చట కలయ వెదకితిమి. వారు కనుపడలేదు. అంతట మేము వేరు వేరుగా విచ్చిపోయి యించుకయు నశ్రద్ధ చేయక దేశదేశములును తిరిగి పరిశోధించుచు, కష్టములు పాటిల్లినను లెక్కచేయక, వివిధ ప్రకారంబుల వెదకియు పాండవుల జాడ గానఁబడకుండుటంజేసి నిరాశులమై సంకేత స్థలంబున సంఘటిమునుం గూడుకొని, మేము కావించినట్టి పనులను దేవరకు విన్నవించువారమై చనుదెంచితిమి. దేవరా! మాకు చూడఁగా పాండవులు మృత

మాకు కానఁగఁబడకుండ పోయిరి. జరిగిన విధంబెట్లయినను, పాండుపుత్రులు కానఁబడకున్నను మాకు మఱియొక విశేషము తెలియవచ్చినందున సంతసించి వచ్చితిమి. అది యేమనగా మత్స్య దేశాధిపతియగు విరాటుని బావమఱిది కీచకుని నొక స్త్రీనిమిత్తము అర్ధరాత్రి కాలమున యాయువతి పతులైన గంధర్వులు చంపిరఁట. ఆవిధము కడు చిత్రము. ఆయుధములతోఁ గొట్టక వింతగా జంపి, తలయు, కాళ్లును, చేతులును పొట్టలోనికి జొనిపి, పీనుఁగును ముద్దగాఁ జేసిరనియు, నాటిరాత్రియందే వాని తమ్ములను నూటనొకనినైనను విడువక నిర్మూలనఁ జేసి రెవ్వరికిని దెలియ రాకపోయిరనియు వింటిమి. విరాటుండు మనకు సగతుఁడగుటచే, సుశర్మకుఁ గలిగిన మహావ్యసనంబు తెఱంగు నెఱింగింపవలయునని విన్నవించితిమి. ఇక పాండవుల నన్వేషించు విధంబు నాలోచించి యానతీయవలయు"నని విన్నవించిరి.

వారు చెప్పిన వృత్తాంతంబును విని "అలాగే! తద్విషయంబును గూర్చి తగిన విధము నాలోచించెదను. ఇప్పటికి మీరు చనుం"డని వారిని బోవంబనిచి, దుర్యోధనుండును కొంత తడవా విషయమును దలంచి చింతించి మంత్రులం జూచి యిట్లనియె. "మంత్రులారా! పాండవులను ప్రతిజ్ఞను నెఱవేర్చి వచ్చి రాజ్యభాగమును గోరుటకు పూర్వమే వారిని వెదకి కనిపెట్టి యెప్పటివలె నడవులకుఁబోయి వెత లొందునట్లు చేయవలయును. అటుల గాక యుపేక్షించి యుండినచో పిమ్మట హానిగలుగక తప్పదు. ఇపుడు వారిని వెదకి కనుపట్టుట మహాకష్టమై యున్నది. ఎట్లు మనము వారినిఁ గనిపట్టనచ్చునో, యేయుపాయమున కనంబడగలరో యోచించి కర్తవ్యాంశమును మీరు మీకుఁ దోఁచిన చందంబున నెఱింగింపుఁడు. మీరు చెప్పెడి పద్ధతులలో నేది యుక్తమని తోఁచునో యారీతిం జేకొని యాచరించెద"మని యడిగెను.

దుర్యోధనుం డీ ప్రకారముగా నడుగుటయు, కర్ణుం డతనిఁ జూచి "నృపశేఖరా! మనుష్యులకుఁ దెలియఁబడకుండు రీతిగా మారు వేషములు దాల్చి దేశములందంతటను బాగుగా వెదకునట్లు వేగులవారల నాజ్ఞాపించినచో వారు పాండవులను గనుఁగొనఁగలరని తోఁచుచున్నది. పాండవులున్న చోటులు దెలిసికొనుటకుం దగిన యుక్తి యదియ యని తలంచెద"ననెను.

దుశ్శాసనుండు మహా గర్వముతోఁ గర్ణుఁడు చెప్పినమాటలు సరకుఁగొనక మదవిలాసముఖుండై తనయన్న కభిముఖుండై "రాజేంద్రా! ఏదేని కష్టమునకుఁ బూని పైఁబెట్టుకొన నేమిటికి? ఇంక పాండవులను వెదకవలసిన యగత్యమే లేదు. ఇపుడు వారు బ్రతికియున్నట్లు మీరు భావించి పలువిధంబుల నుపాయము లరయుచున్నారు. ఇది వట్టి భ్రమ. అడవులలో నిడుమలనుభవించి దుష్టమృగముల వాతఁబడి వారలెన్నఁడో మృతినొంది యుండుదురు. ఇప్పటివరకును సజీవులై యుండుట కల్ల. చాలకాలమునకు పూర్వమే చచ్చియుండుటచే వారు చచ్చినచోట నిపుడు కసవుకూడ మొలచియుండును. ఈవిషయమును గూర్చి వ్యర్థమైన చింతలను బెట్టుకొని సంతోషమును విడుచుటనుమాని నీయిష్టప్రకారము నిశ్శంకముగా నిరంతరాయముగా రాజ్యభోగము ననుభవింపుము. పాండవులు వచ్చుటయు, రాజ్యభాగముం గోరుటయు నింకను గలదని తలంచుట వెఱ్ఱితనముగాని యొండుగాదు, నిష్కళంక మతినుండుము" అని పలికెను.

ఇట్లు దుశ్శాసనుండు చెప్పగా, యాచార్యుం డతని మాటలువిని మోమున చిఱునవ్వంకురింపగా దుర్యోధనునివంక మొగంబై "నీతమ్ముని మాటల కేమిగాని, పాండుకుమారులు సామాన్యులుగారు. శౌర్యబలంబును గౌరవ ప్రతాపములును, భ్రాతృస్నేహమును దైవబలంబును గలిగి దేవసమానులై యొప్పుచుండువారు. కాబట్టి వారి కాపదలు గలుగవు. వృథామాటలు వీడి యెట్లైనను చక్కగా వారిని వెదకి కనుంగొను విధంబు నీ యోచింపుఁడు. అదియె యుక్తమార్గ" మనియెను.

కుంభసంభవుండు చెప్పిన పలుకులువిని, భీష్ముండు సంతుష్టమానసుండై, "ఔను! ద్రోణుండు చెప్పినపద్ధతి యెంతయు నాచరణయోగ్యమైనది. ఈదుర్యోధనుని యెదుట గూడ డొక్కండుమాత్రమే సత్యము బలికినాఁడు. ఇతఁడనిన చందమున పాండవులు, బాహుబలమును బుద్ధిబలమును, దైవబలమును గలిగినవారు. కావున వారి కాపద లెప్పుడును గలుగవు. వారి మహిమచేత వారల గనిపట్టుట సయితము కష్టమే యగును. పాండవులును, కౌరవులును నాకు సమానులే యగుదురు. అయినను నిపుడు దుర్యోధనుండు నన్ను సయితము నడిగినాఁడు. కాబట్టి నేను యథార్థమును చెప్పవలయును. పాండవు లుండుచోటును దెలిసికొనుటకు కొన్ని గురుతులుగలవు. ఆ లక్షణములు గలిగి యున్నచోట

వారలుండుదురు. అవి - యెట్టివనగా—ధర్మావర్తనుండైన యుధిష్ఠిరుం డున్నచోట యధికమైన బ్రాహ్మణభక్తియు, దైవభక్తియు జనులకు గలిగియుండును. మఱియు మానవు లాదేశమున, సత్యప్రీతియు, ధర్మకార్యచింతయు, నతిథి పోషణాసక్తియు, నీతిలో ప్రసిద్ధియు, సాధుసేవ యందుత్సాహమును సన్మార్గవర్తనమును, దుర్మార్గుల శిక్షించుటయందు పట్టుదలయు, నభివృద్ధియు, బంధువులయం దనురాగమును, సంతోషమును, నైశ్వర్యమును, సదాచార సంపదయు, శాస్త్రధర్మముల నెఱుంగుటయు, శాంతమును, స్థైర్యము, ధనధాన్యాదులును సుగుణములును గలవారై విలసిల్లుచుందురు. అదియుంగాక యతండున్నచోట గోవులు మిగుల నభివృద్ధినిఁజెంది చీడ పీడలులేక యధికమైన పాడిగలవై యుండును. ఆదేశమున జనులకు రోగబాధలును, జార చోర బాధలునుం గలుగవు. కావున నటువంటి దేశ మెయ్యదిగా యుండునో యందు వారు నిస్సంశయముగా నుండుదురు. నీవు తగిన వారి నట్టిదేశములో వెదకుటకుఁ బనుపుట యుచిత''మని చెప్పెను. అప్పుడు కృపాచార్యుండు దుర్యోధనున కిట్లనియె.

## కృపాచార్యుఁడు నిజాభిప్రాయము నెఱింగించుట

''పాండవులు తమ ప్రతిజ్ఞ చెప్పిన వనవాసమును గడపిరి. అజ్ఞాతవాసము జేయవలసిన కాలము సయితము కొంచె మించు మించుగా ముగియవచ్చినది. వారికి దుర్యోధనునియందు కోపమధికము కాఁబట్టి యింక మీరు మిన్నక యుపేక్ష వహించియుండుట కర్జము కా నేరదు. లోకములో 'శత్రువైన నేమి దుర్బలుండైనను వాని నుపేక్షించకూడ' దని చెప్పుదురు. అటుల నుండఁగా, మహా బలవంతులగు పాండవుల విషయమున నుపేక్షించి మనమిట్లు నిబ్బరముగానుండుట క్షేమకరముగాదు. శత్రువు నెట్టిది? యనిన, మనకెంత సైన్యముకలదో యంతయును పగవాని సైన్యమునున్నట్లు నూర్చుకొని, ఎవ్వరెవ్వరు మనకు సహాయులు కాగలరో వారినందఱను రావించి, యొక్కఁడు సైన్యములుగలవాఁడై దుర్యోధనుం డిపుడు సన్నద్ధుండై యుండవలయును, ఇట్లుండినచో, పాండవులు తమ ప్రతిజ్ఞను నెరవేర్చి వచ్చినంతట ధర్మనందనుండు యుద్ధమును కోరకుండునేని యతనితో మనము సంధిచేయవచ్చును. ఒకవేళ నట్లుగాక వారుసమర మొనరించుటకే యత్నించినచో సంసిద్ధ

సైన్య సమేతులమై యున్న మన మిప్పటి కేదియు కర్తవ్యమో దాని ననుసరించి ప్రవర్తింతము. దుశ్శాసనుండు చెప్పినచందమున నొకవేళ పాండవులు సంప్రతించినను, మన కితర రాజులను వశ్యులుగాఁ జేసికొనుటకు సంయుతము సైన్యము లత్యావశ్యకములగుటచే సర్వవిధములను తగినంత బలమును చేకూర్చుకొనుట యెంతయు శ్రేయస్కరము. కనుక యిప్పటి సందర్భములనుబట్టి తగినంత సేనాబలమును గూర్చుకొనుట మంచి' దని చెప్పెను.

## దుర్యోధనుఁడు సభ్యులతో కార్యనిశ్చయము తెలుఁగుఁజెప్పుట

ఈప్రకారముగా కొలువునందున్న వారు తమతమకుఁ దోచినట్లుగా బలుకుటయు, నందఱి పలుకులును నాలకించి దుర్యోధనుండు వారల మాటలను గురించి తనలో చక్కఁగా నాలోచనఁ గావించి చేయవలసిన విధమును నిశ్చయించి యందరును వినుచుండగా నిట్లనియె.

"సభ్యులారా! నేను చెప్పెడి విషయమును సావధాన మనస్కులరై వినుండు. కీచకుఁడును, శల్యుఁడును, భీమసేనుండును, బలదేవుండును, సమానమగు బాహుబలముఁ గలిగినవారు. వారు మల్లయుద్ధములో మిగుల నేర్పరులు. ఒకరినొకరు జయింపఁగల యుత్సాహముతో నుండెడివారు. ఈనలువురి బాహుబలముతో సమానమైన బలము మఱి యెవ్వరికిని లేదు. ఇది సుప్రసిద్ధమైన విషయము. కాఁబట్టి వీరిలో నెవ్వరిని జయింపవలయుననినను, వారిలో వారే జయింపవలయును గాని యన్యులకు సాధ్యముగాదు. ఇపుడు కీచకుఁడు చచ్చిన వృత్తాంతమును వేగులవారు చెప్పగా వింటిరిగదా? వానిని యెవఁడు చంపియుండు ననుటనుగూర్చి మన మిపు డాలోచింపవలెను. అది యెట్లని నేర్పడినచో యున్న సందర్భమును సులభముగా తెలిసికొనవచ్చును. నాకుఁ దోఁచిన విధంబును జెప్పుచున్నాను. సింహబలుని శల్యుఁడో, బలరాముఁడో చంపి యుండుననుటకు వలనుగాదు. ఎందువలన ననఁగా, వారు చాలా దూరమున నుండెడివారు. అదియునుగాక కీచకుని వధించుటకు వారికి సందర్భ మెట్టిదియును గానరాదు. ఇంక నెవఁడు చంపియుండును? సింహబలుని భీమసేనుండు చంపి యుండవలయును. మఱియొకఁడు కీచకునిఁ జంప జాలఁడనుట మీరు యెఱింగియున్నవార లేకదా? ఈ సందర్భమును గూర్చి యోజింపుఁడు. వేగులవార లేమని చెప్పిరి? ఒక స్త్రీనిమిత్తము [illegible]
[illegible]

కీచకుండు వధింపఁబడినాఁడని కదా? ఆస్త్రీ ద్రౌపదియైయుండును. ఇతండు కీచకుని వాని తమ్ములనుం జంపనేర్పఁగలఁడు. కావున వానిని వధించిన వాఁడు వృకోదరుండే యని యూహింపవలసియున్నది. నాయూహా సరియైనదైనచో తప్పక భీముఁడు విరాటుని నగరమునందుండి తీఱవలయును. గంధర్వుఁడను పేరఁబెట్టుకొని భీముఁడు యితరులకు తెలియనట్లు చీఁకటిలో, కీచకుని వాని తమ్ములను జంపియుండునని నాబుద్ధికి దృఢముగాఁ దోఁచుచున్నది. కాదేని యెవఁడు వానిని వధింపఁగలఁడు? ఆలోచింపుము! ఇటియునుగాక, పితామహు లిప్పుడు చెప్పిన లక్షణములు సయితము మా దేశమునందు కలిగియున్నవని మనము వినుచున్నాము. ఈ గురుతులఁ జూచి బట్టి యాలోచింపఁగా, ఇది యజ్ఞాతవాస కాలమగుటచే పాండవులు మాఱువేషములు దాల్చి విరాటుని పట్టణములో నున్నవారని నిశ్చయింప వలసియున్నది. మనకు విరాటుండు సంతతము విరోధియై మనల లెక్కచేయకుండును. కాబట్టి యతనిమీఁది కెత్తిపోయి యతని యొక్క గోధనము నపహరింతము. విరాటునకు పశుధనం బధికముగాఁ గలదుగదా! మనమా పశువులను గ్రహించితిమేని యొకవేళ పాండవు లందే యుండిరేని యారాజునకు సహాయము జేయుటకై రాగలరు. అప్పుడు మనము వారిం దెలిసికొని యజ్ఞాతవాసము చెడుటను చెప్పి పూర్వమునందుంబోలె నేఁడియు పండ్రెండేండ్లు వనవాసమునకుఁ బంపుదము. అట్టుల చేసిన పాండవుల నడ్డము లేక యఖిల మహీరాజ్య సంపదయును ననుభవింప వచ్చును. కీర్తివంతులమై మనఁగల వార మగుదుము. పాండవు లొకవేళ నచ్చోట లేకుండినను మనకు లాభమేగాని నష్టము గలుగదు. విరాటుని సకలవస్తువులను కొల్లఁగొందము. ఎల్ల భంగులను నిదియే కార్యనిశ్చయమని నేను తలంచితిని. ఈ పద్ధతి యుక్తము గాదని తోఁచినచో యాలోచించి దీనినిమించిన మఱియొక తెఱంగును మీరు నిశ్చయించి పలుకుఁ" డని తాను తోఁచిన భంగిఁ దెలియఁ బలికెను.

## సుశర్మ తన యుద్దేశమును దుర్యోధనునితో చెప్పుట

అప్పుడు త్రిగర్త దేశాధిపుఁడైన సుశర్మ మొదట కర్ణ దుశ్శాసనులతో రహస్యముగా కొంత యా విషయమునుగూర్చి యాలోచన [illegible] ... బదులు [illegible]

మున్నే తానులేచి కడు గంభీరమైన వాక్కులతో రాజ రాజుంగని యిట్లనియె.

"కౌరవేశ్వరా! మున్ను కీచకుఁడు, కేకయ రాజ సాల్వరాజులం గూడుకొని వచ్చి వానితో నన్ను పరాజితుం జేసెను. పిమ్మట నతఁడు బ్రతికి యుండఁగా నతనికి నాకును మరల యుద్ధము తటస్థించలేదు. అప్పటి నుండియు తద్విరోధము నాలో రవులుకొనుచునే యున్నది. అవ్విధమున నవమానమును పొందియున్న వాఁడనగు నన్ను విరాటునిమీఁదికి బంపుము. అతని దేశపు సరిహద్దునకు వెంబడిగా నేను నా నౌకరులకొసంగిన గ్రామములుగలవు. వానినెల్లపుడును విరాటుఁడను నాశము జేయు సద్దేశముతో నచ్చటివారిని మిక్కిలి బాధించుచుండును. ఇది మంచిసమయము కావున నేనుపోయి విరాటుని గర్వము నడంచి వాని రాజ్యమును కొల్ల బెట్టించెదను. నాపరాక్రమము తెలియునట్లుగా పోయి యితని పశుధనం బును దోలి తెచ్చెదను. అతఁడువచ్చి యడ్డపడెనా? పొగరడంచెదను. ఒక వేళ పాండవు లచ్చటనుండి విరాటునకు సహాయులై వచ్చి రేనివారినికని పట్టెదను. ఎల్లవిధముల నీకార్యంబునకు నేనే తగినవాఁడను" అని పలికెను.

సుశర్మ చెప్పిన మాటలువిని కర్ణుండు మహాధైర్యముతో 'ఈ సుశర్మ చెప్పినరీతి యెంతయు నొప్పిదమై తోఁచుచున్నది. ఇఁక నీతద్విష యమునుగూర్చి కురునాథుం డెటుల నానతిచ్చునో భీష్మాదులైన పెద్దలు యెట్లు చెప్పెదరో, యాలాగున నీకార్యము జరుపవలయును. ఏది కర్తవ్యమో నిశ్చయించి పలుకుఁ'డని చెప్పిన దుర్యోధనుండు దుశ్శాసనునిం జూచి, "నీవు పెద్దల యనుమతిచొప్పున సైన్యములను సిద్ధముచేయుము. మన బలంబులను రెండు భాగములు గావించి మొదట నొకపాలు సేనతో సుశర్మను బోవ బనిచి పిమ్మట తక్కిన సైన్యంబులం గూడి మనము వోవు దము. ఇట్లు రెండు తెగలుగా పోవుట మనకు మంచిది" అని యాజ్ఞా పించెను.

తరువాత యన్నయొక్క యాజ్ఞప్రకారము చేయుటకై దుశ్శాసనుఁడు సంసిద్ధుండగుటయు, దుర్యోధనుండు తానొనర్చిన కార్యనిశ్చయము నందఱు నంగీకరించుటకును, తత్ప్రకారం బెల్లరకును బోధపడు టకును బంధువులను తక్కినవాలనుంజూచి యాదరమును, గౌరవమును సొప్పఁగా వారలకు కార్యప్రకారంబుల .

"ఇపుడు చేయవలసిన విధంబెట్లనగా ముందుగా సుశర్మ సేనలతో పోయి విరాటుని గోవులను మరల్పవలసినది. అటుల చేసినయెడల రోషముతో నతండు తనసైన్యములం గూడివచ్చి సుశర్మ నెదిరించును. అట్టియెడ మన రెండవ దళయందు మనము పోయి మఱికొన్ని గోవులను మరల్తము. అపుడు పాండునందనులచట నుండినచో విరాటుని సహాయార్థముగా మనతో యుద్ధమునకు రాగలరు. దీనికి సుశర్మ వెంటబోవు సేనలును, మనతో రావలసినదళంబులును, వేఱువేఱుగా నేర్పఱచి నిలుపవలసినది. ఇటులచేసి త్వరితముగా నరిగి యొక్కొక్కరొక్కొక్క గిఱుక్కనంగలగోవులను పట్టుకొనవలసినది. వెనుక నేపోయి మనము నవమినాఁడు పసుల మరలింతము, ఇదియునిశ్చయం" బని దృఢముగా చెప్పిన, యమ్మహీనాథుని పలుకు లాలకించి మహా సంతోషమునుజెంది. యెల్లరును నప్రమత్తులై తత్కార్యమునకు నుద్యుక్తులైయుండిరి. కాని యప్పటికి పాండవులయజ్ఞాతవాసకాలము పూర్ణంబయ్యెను. ఆ విషయంబును తత్సభలో నెవ్వరును తలంచి యోచించినవారు కారైరి.

## సుశర్మ దక్షిణ గోగ్రహణముఁ జేయఁబోవుట

అంత సుశర్మ కురునాథుని పనికిఁబూని, కవచములఁదాల్చి, గుఱ్ఱములను సంగీలును కైదువులును, వివిధములైన యాయుధములును సిద్ధముఁజేయించి సముచితాలంకారము లొనరించి, యత్యాశ్చర్యము గలుగునట్లుగా, మత్స్యదేశమును నీరుగ్రోలినట్లు త్రాగువాఁడునుంబోలె తన బలంబుల గజిబిజి నుడువుకొని సత్వరంబ ప్రయాణంబై పోవుచు గోగణంబులం బొదివి పట్టువిధంబు నూహించుచు, సైన్యములను నడచుట చేతను, నాహారాది విషయంబులందును వాడకుండనీయక యచ్చటచ్చటను తాను విడియునప్పుడును మరల బయనంబగునపుడును, రభసంబున యుద్ధవాద్యములు మ్రోయింపక యన్యులకు తనపోవువిధంబు ప్రకటంబుగాని విధంబున నడుచుచు మున్నుగా పంపఁబడిన వేగులవారు తెలుపుటచే విరటునిగోవులున్న ప్రదేశమును తెలిసికొని శీఘ్రముగా నచ్చోటికరిగి కార్చిచ్చు వనంబును జుట్టుకొనిన తెఱంగును దోఁపజేయుచు దళంబులం బొదివించి పశువులం జుట్టుముట్టి నిలిచెను.

అయ్యవసరమున పసుల కాపరులాగ్రహించి సుశర్మసైన్యములు భయముఁ జెందునట్లుగా నార్చుచు, పెక్కు, బాణంబులను వానిపైఁ

ప్రయోగింప మొదిరించి నొప్పించిన యది గని త్రిగర్తపతి [illegible] లను సేనలం బురికొల్పుటయు, శత్రుసైనికులా [illegible] నానావిధ శస్త్రాస్త్రములచే నవలీలాసముగ [illegible]. చేతగాని మోటు యుద్ధముఁ జేసి [illegible] నుండి నెత్తురులు గారుచుండఁగా శత్రువుల దెబ్బలు కోర్వలేక [illegible] పిక్కబలముగలవారై పారిపోవుచు పట్టణమునకేఁ [illegible] కొలువున విరటునిఁ జూడ [illegible] దుఃఖముతో [illegible] సభ్యులును, రాజును కారణమెఱుంగక వారి [illegible] చుండఁగా యాగొల్లలు గద్గద స్వరములతో [illegible] చెప్పనారంభించిరి.

"ఓ మహాప్రభో! త్రిగర్త దేశప్రభువు [illegible] యనునట్లు లెక్కించుటకు శక్యముగాని, చతురంగబలముతో వచ్చి దక్షిణ దిశయందలి మన గోవుల నాక్రమించి, తత్పాలకు లడ్డపడఁగా వారిని బాణాది సాధనముల చే నొప్పించి మోతయు గర్వముతో [illegible] ప్రదంజంపియు నొప్పించియుఁ జీకాకుపఱచిరి. అవ్వలను తోలుకొని పోవుచున్నారు. వారికే దెబ్బలుతిని యెట్లో తప్పించుకొని మేము ప్రాణములతో యిచ్చటికి వచ్చినారము. ఇప్పటికే వారుచాలదూరముపోయి యుందురు. త్వరితముగా మీరుపోయి యడ్డగించిన నో యావులను మరలించుకొని రావచ్చును. లేకున్న నవి దక్కనవి కావు. ఇక నీక్షణమైనను నాలస్యము చేసిన కార్యము తప్పు" నని పలికిరి.

వారి మాటనువిని విరాటుం డదరిపడి, కోపమును నాశ్చర్యంబును నతిశయింపఁగా "ఏమీ! ఆ సుశర్మ యింతటికార్యమును చేసినాఁడా? వాఁడు మున్ను చెందిన పరాజయము రీతినిమఱచి మరల సాహసించి మన గోవులను బట్టుటకువచ్చెనా? మంచిది వానిగతి పూర్వపు చందమునునే కాగలదు. మంచికాలము వానికి రామిచే యిటువంటి కార్యమునుఁ జేయుటకుఁ సాహసించినాఁడు, దీనిఫలమును వాఁడు శీఘ్రముగానే యనుభవించునుగాక" యని యుగ్రాననుండై పలికి, మంత్రులనుచూచి, "చూరకున్నారలేమి? ఇప్పుడే మనముపోయి యడ్డగింపకున్న నో, పశువులు శత్రువుల పాలగును. అంతియగాక యధికమైన నష్టమును, నవమానమునుం గలుగును. కాఁబట్టి శీఘ్రముగా పోవలయును. మీరు సేనానాయకులంబిలిచి సైన్యములను సిద్ధముగావించు నట్లాజ్ఞాపింపుఁడు" అని

నియోగించెను. వారును రాజశాసనము ప్రకారముగా సన్నాహమును గావించిరి.

అంతట సముద్రము సయితమును ఘూర్ణిల్లునట్లు సమరభేరి మొదలగు వాద్యములు ప్రయోగింపఁ దొడంగిరి. అప్పుడు విరాటుఁడు సంగరోత్సాహముతో యుద్ధవీరులకు వలయు కవచములు వస్త్ర శస్త్రాదులును దెచ్చి యొసంగుటకుం దగినవారిని నియోగించిన, వారట్లు గావించిరి. విరాటరాజు సారథింబిలిచి "సూతా! నీవు వీరాలాపములు పలుకుచుందువు. ఇప్పుడు నీప్రజ్ఞను చూపుటకు సమయము తటస్థించినది, భవదీయ చాతుర్యంబు బయల్పడ యుద్ధములో సమయానుకూలముగా తేరు నడుపవలయుంజుమీ! శీఘ్రముగా తేరునకు గుఱ్ఱములంబూన్చి కవచములు తొడిగి సిద్ధము చేయుము." అని పలికి తానును వీరులకు తగిన రీతిని వివిధాలంకారములు గావించుకొని, యలంకరింపఁ బడినదియు, బంగారు చిత్రపుష్పములచే నొప్పినదియు, సకలాయుధ సహితంబైనదియు, నున్నతమగు టెక్కెముఁగలదియునైన, యరదమును సారథిగుఱ్ఱంబులం గట్టి సిద్ధముఁగావించి తెచ్చినదానిపై నధిరోహించి భూసురాశీర్వాదములును జయజయశబ్దములును నతిశయింపఁగా ప్రయాణంబయ్యెను.

అట్టి తఱుణమున విరాటుని తమ్ముఁడైన శతానీకుండను వాఁడును తన యన్నయుంబోలె సర్వాలంకార శోభితుండగుచు కాంచన స్యందన మారోహించి పరాక్రమంబు మెఱయఁగా పయనమయ్యెను. అతనితోడనే విరాటుని రెండవతమ్ముఁడు మదిరాశ్వుం డనెడివాఁడు మహాశౌర్యముతో మదించిన యేనుంగుల సైన్యముతో భూమికంపింపఁగా నద్భుత ప్రకారంబుగ సర్వాయుధములుం దాల్చి రథారూఢుండై కదలెను. సూర్యదత్తుండను పేరుగల విరాటుని మూడవతమ్ముఁడు మెఱుపు లొసంగెడి యాయుధ సముదయమును ధరించిన కాల్బలంబులతో వెడలెను.

పిమ్మట విరాటరాజు పెద్ద కొడుకును, శత్రుభయంకర శౌర్యయుక్తుండునునగు శంఖుండనువాఁడు యెక్కుడు పటాటోప మెసంగఁగ యారణ్యకులైన భిల్లవీరుల దళంబులతో శంఖధ్వనులు సేయుచు బయలదేరెను. యుద్ధమునందు శక్తి సామర్థ్యములచే పేరు పొందినవారును నెంతటి బలీయులైన శత్రువులనైనను చీరికిఁగొనక నిర్జించువా రనె

ప్రఖ్యాతిఁ జెందినవారలనగు వీరుల కెక్కుండ్రను వివిధ వాహనానాయుధములు [illegible] నానా విధాయుధములుంబూని యుత్సాహంబుతో [illegible]

## విరాటుఁడు యుద్ధమునకు వెడలుట

ఈ లాగున విరాటరాజు పౌరుల జయఘోషణములు మిన్నుముట్ట ప్రయాణంబై మహారభసంబుతో పురంబు వెలువడి సైన్యములు సన్నిహిత నొక్కటిగాఁ గూర్చుకొనుటకై నగరబహిఃప్రదేశమున కొంచెము సేపు నిలిచెను. అట్టియెడ ధర్మతనయుఁడు భీమ నకుల సహదేవులను బిలిచి రహస్యంబుగా "మీరు విరటునిం బురస్కరించి యతనిదృష్టికిఁ దోఁచు లాగున నంతంత నిలిచియుండుఁడు" అని చెప్పి తానంతట గ్రక్కున మత్స్య భూపతిం జేరఁబోయి యతనితో నిట్లనియె.

"నరేశ్వరా! నేను కమునొక్క మునివలన నా యుద్ధవిద్యను బాగుగా నభ్యసించియున్నాను. నాకును యుద్ధముఁ జేయు నేర్పుగలదు. గోవులను మరల్చుటకై బంధువులంగూడి నీవు పోవుచుండఁగా, నేనొక్కఁడ నింటి యొద్ద నొంటరివాఁడనై యూరకుండఁజాలను. నేనును మీతోడ యుద్ధమునకు రాఁదలంచితి. కావున నాకును నొకరథమును దెప్పింపుము" అని పట్టుదలగాఁ జెప్పిన యతని మాటను ద్రోయఁజాలక విరటుఁడు సమ్మతించుటయు, తనతమ్ముఁడును నయిత నతనికి సహాయముగాఁ దోడ్కొనిపోవ నెంచి వెండియు నిట్లనియె.

"ప్రభువరేణ్యా! మన వలలుండును, దామగ్రంధియు, తంత్రీపాలుండును యుద్ధము చేయుటయందు మంచి నేర్పు కలిగియుండెడివారు. వారియొక్క సామర్థ్యమును పూర్వము నేనుగూర్చి యెఱుఁగుదును. వారు వారుగా మీరు సమరమున కరుగుచుండఁగా తామునుం బిలిచిన రావలయునని కాఁబోలు నిలిచి మిమ్ము చూచుచున్నారు. కాఁబట్టి వారిని నయితము సంగరమునకుఁ బిలుచుకొని పోవుట మంచిది. నాకు మిక్కిలి యిష్టము. రథములు నాయుధములుం దెప్పించి యిచ్చి యీ మువ్వురనుం దోడ్కొనిర" మ్మని చెప్పిన విరాటుండు ధర్మజుని వాక్యంబులు విని సంతసించి శతానీకునింజూచి "తమ్ముఁడా! ఈ కంకభట్టునకును వలల, దామగ్రంథి, తంత్రీపాలురకును మంచి రథములును, నుత్తమములైన యాయుధ కవచాదులునుం దెప్పింపుము. ఈ నలుగురును మనకు

సహాయులై వచ్చి యుద్ధములో జయమును గలిగింతురు. శీఘ్రముగా నేను చెప్పినట్లు కావింపు'' మని యాజ్ఞాపించెను.

ఆమాటలు విని శతానీకుఁడు ''అలాగే చేసెద'' నని తక్షణమున భీమసేన నకుల సహదేవులం బిలిపించి, వారికి గావలసిన వన్నియును సిద్ధముం జేయించి, యంగరాగ మాల్యాభరణాలంకృతులను గావించిన యావలుప్రదును సంతసంబున నరదంబులెక్కి యప్పట్టున తమకుం దగిన రథసారథులు గలుగమిం జేసి, తామే తేరులు నడుపుకొనుచు, విరాటుని సేనలతోఁ గూడి ప్రయాణంబైరి.

ఇటుల నెల్ల బలంబులును గదలి యుత్సాహముతో పోవు చుండు సమయంబున ఏనుఁగులు చెవులు వీచుటచేఁ గలిగిన గాలివలన నడవిలో చెట్లు విఱిగి పడుచుండెను. తేరులు నడుచు చప్పుడువలన, భయపడి యవి యేడ్చుచున్నవో యనునట్లు ప్రతిధ్వనులు పర్వతము లలో కలుగుచుండెను. కఠిన దట్టముగా గుఱ్ఱముల నడకవలన నెగసిన ధూళిగవిసిన సముద్రములు బురదయగుచుండెను. కాల్బలముల భారమును భరింపలేక భూమిని మోయుచుండు శేషకూర్మము లొకదానిపై నొకటి యొరగుచుండెను. యివ్విధమున ధరణి గ్రక్కదల, గోపాలకులు పశువులుతోలుకొని పోఁబడిన మార్గమును చూపుచుండ, వానిజాడ ననుసరించి మత్స్యవల్లభుఁడు చతురంగ బల సమేతుండై పోవఁ దొడంగెను.

ఇత్తెఱంగున వేగముగాజని ముందు గోవులం దోలుకొని యరిగెడి సుశర్మ సైన్యంబులనుచూచి యాగ్రహముమీఱగా కూడముట్టి యొక సముద్రముతో మఱియొక సముద్రము తాకినట్లు దళంబులను గవియించిన, సింహనాదములు, నట్టహాసములుం భేరులు నతిశయింప విరటుని బలంబులు త్రిగర్త సైన్యంబుల నత్యుగ్రముగా దాఁకెను.

అప్పుడు రణభేరులు మొదలైన వాద్యములు పెల్లుగా మ్రోగుచుండినను, యిరుకెలంకుల సేనలందును ధనువులయొక్క ఓంకారధ్వనులును, నొండొంటి నొఱసికొనుటచే కలిగిన ఖడ్గముల చప్పుడులును, తేరులు నడుచుటవలన పుట్టిన గొప్పరాగములును, గుఱ్ఱముల సకిలింతలును యేనుగుల గర్జనలును, సైనికుల సింహనాదములును నపరిమితం బగుటచే వాద్యధ్వనులు సుంతయైనను వినరాక యుండెను.

## విరాట సుశర్మల సైన్యములు సంకులముగాఁ బోరుట

ఈవిధమున నుండెడి యుభయ బలంబులును నొండొంటిం దాఁకి ఘోరసాగిరి. అపుడొకరికత్తి మఱొకరికత్తికిందాకి మంట లెగయు చుండెను. యొకరిపై నొకరు ప్రయోగించు బాణములు మంట లెగ యించుచుండెను, శంఖములు పొడిపొడియైనవి, కవచములు భేదింపఁబడెను. వారు ప్రయోగించు శరములలో కొన్ని మర్మస్థానములు భేదించునవియు కొన్ని దేహముల నెగరఁగొట్టునవియును, కొన్ని శిరములం ద్రుంచు నవియు, కొన్ని యిరువురు మువ్వురు తనువులం దూఱిపోవునవియునై, సేనలం గలంచుచుండెను. అద్భుతమైన యాసంకుల సమరంబును మింట నుండి చూచి నారదముని యానందముతో గంతులు వేసి యాడుచు కొని యాడఁ దొడంగెను.

అయ్యవసరంబున మేలి భటులు గడంగి, యొరుల బాణములచే నిహతులగువారింజూచుచు రోషమినుమడింపఁగా యాపీనుఁగులఁద్రొక్కు కొనుచు శత్రువులను లెక్కచేయక వారేయు శరంబుల కెదురునడిచి మహాశౌర్యముతో జంపి రక్తము ప్రవాహముగా బాఱునట్లుచేసి, యొం డొరులను మెచ్చుచు పోరాడుచుండిరి. ఆ యుద్ధమం దప్పుడు, శౌర్యంబు తో నొక్కండ నేకుల నెదిరించి వారివీఁదికిఁ బోయిన వాసముందు నిలువలేక చెదిరిపోయి మరల కూడుకొని వేలువేలుగా కొట్టుచోట్లును, పెక్కండ్రు చేరి యొకనిమీఁదికిఁబోగా వారి నెదుర్చుటకు సాధ్యము గాక వాఁడు మిన్నక నిలుచుచోటులును, ఒక సేన రెండవబలంబుతో మాఱ్కొని వెనుదీయక పోరాడు చోటులును, ఉభయ బలములు నుయ్యాలయుంబోలె వెనుకకును ముందునకునుం బోవుచు సమర మొనరించు చోటులును, గలిగి యవ్విధంబున నశ్వబలంబులు బొమ్మలాడు తెఱంగు దోఁపఁగా పోరాడుచుండిరి. ఆయుద్ధమును మింటనుండి కనుంగొని దేవతలుపొగడు చుండిరి.

పంతముతో యిరువురు శూరాగ్రేసరులు తలపడి యొండొరుల నతిక్రమింపవలయునని, యుద్ధమునకుఁజొచ్చి, తాము ప్రవేశించినంతనే యిరుపాయలుగా వచ్చిన పరసేనలతో పోరి యాసైన్యములు పరుగెత్తు చుండఁగా, మొదట నెదిర్చిన శూరు లిరువురును తొలఁగక కొంతతడవు సంగర మొనర్చి తమ తావులకుఁబోవుచుండిరి. ఏనుంగుల తొండములు

నుండి పడు ఫూత్కారమువలన నెగసిన తుంపరలచే భూమిపై ధూళి యడంగెను. మిక్కిలి పొడవులైన పతాకలును, సిడెములును మిన్ను ముట్టుచుండెను, గజములకుఁ గట్టియున్న గంటల మ్రోతలవలన దిశలు మాఱు మ్రోగుచుండెను, ఏనుంగుల కన్నులయొక్కయు, వానికిఁబూసి యున్న సిందూరముయొక్కయు కాంతులు సూర్యరశ్మిని మించి ప్రకాశించుచున్నవి. ఇట్లుండెడి కరిసేనలు గదియించి బలియులైనశూరులు, రూపములఁదాల్చిన రౌద్రరసంబోయన బాణవర్షమును పగతురపైఁ గురియించుచుండిరి. ఆ మదపు టేనుంగులు యుద్ధరంగమున నంతటను వ్యాపించి సేనలను రూపుమాపఁదొడంగెను. మఱియు నెక్కువ బల పరాక్రమములుగల శూరులు వివిధములైన యాయుధములను గొని కడు చాతుర్యముగా, మింటనుండి చూచుచున్న వేలుపు లాశ్చర్యమును బొందునట్లు నొచ్చియు వెనుదీయక పోరాడుచుండిరి.

పేరుపొందిన రథికులు, తమరథములను యెదిరివారల తేరుల నొగలతో నొగలు తాఁకి విఱుగునట్లు కదియ దోలించి, యాపగ తుర యరదంబులపైకి లంఘించియు, కొందఱు తమ తేరుల గుఱ్ఱములు చంపబడఁగా, విరథులై కత్తులు మొదలైన యాయుధములుగొని పోరాడియు, తమ సారథులు చావఁగా తామే సూతకృత్య మొనరించుచు శరములు ప్రయోగించి వారి భటులంజంపియు, కొందఱు తమ్ము ప్రతివీరులు గొట్టుటచే దిగ్గన మూర్ఛనొంది తెలిసి, యాకొట్టినవానిని బదులుకొట్టి యు, నీరీతిగా నేమరక యుత్సాహంబు తొలంగక శౌర్య మేయటుల నాకృతులు దాల్చెనో యనుతెఱంగున భయంకరమైన ద్వంద్వయుద్ధమును చేసిరి.

## శతానీకుని యుద్ధము

పైఁజెప్పిన తెఱంగున రెండు పక్షముల సైన్యములును నించుకయు నధైర్యంబును బొందక విజృంభించి కొంతతడవువరకును యుద్ధముఁ జేయుచుండఁగా, నట్టియెడ విరాటరాజు తమ్ముఁడైన శతానీకుఁడు కవచ భూషణ కాంతులను మెఱపులెసంగ ధనుష్టంకార శబ్దంబు మేఘ రావముగా నొప్పఁగా ప్రళయకాలపు ఘనాఘనంబోయన బాణములను వర్షముపోలె శత్రుబలంబులపైఁగురియించుచు నెదిరించెను.

శతానీకుఁ డిటుల విజృంభించి యడ్డులేక పరాక్రమంబునిశ్శం

సారథులతోడను, గుఱ్ఱములతోడను గూడ నూఱు తేరులను ధ్వంస మొనరించెను. అతని తమ్ముడగు మదిరాక్షుండనువాఁడు పరాక్రమ సామర్థ్యంబు తెలియఁబడఁగా నతి చాతుర్యముగా శరంబు లేయుటయు, వింట సంధించుటయుం దెలియుటకు సాధ్యముకాని తెఱంగున లాఘవం బెసంగఁగా, యెప్పుడును నల్లెత్రాడు లాగిన చేయి చెవియొద్దనే గనుపడుచుండ తన యన్నకు సహాయుండై పోరఁదొడంగెను. అతఁడాకర్ణాంతముగా లాగి బాణములు సంధించి ప్రయోగించుచుండగా నిల్లు మండలాకారముగా తోఁచుచుండ యాచాతుర్యమును చూచి యందఱు నాశ్చర్య మొందుచుండిరి.

ఇవ్విధంబున మదిరాక్షుండు విజృంభించి నాలుగు నూఱుల తేరులను ధ్వంసము చేసి మహా పరాక్రమముతో యేనుగులను, గుఱ్ఱములను పదాతులను లెక్కకు మించఁగా గొప్పించియుఁ గూల్చెను, అతని సమర ప్రకారమును గనుచున్న దేవతలును నయితము విస్మయచిత్తులను గావించెను. విరాటరాజు మూఁడవతమ్ముఁడైన సూర్యదత్తుండు నిజరథంబును మండలగతులఁద్రిప్పుచు, సైన్యములను గలంచి, తనశక్తి వెల్లడియగునట్లును, "లోకంబున శూరుండనినచో, యితఁడే శూరుం"డని యందఱును గొనియాడునట్లును, యేనుంగుల బలంబును తాఁకి, పెక్కుమదగజంబులం జంపెను.

అపుడు శంఖుఁడనువాఁడు పెండ్లికిఁ బోవువానివలె సంతోషము తన ముఖంబునఁ దోపఁగా రథమును శత్రుబలంబులం గదియఁదోలించి మిక్కిలి ప్రతాపముతో నొరులకు కానరాకుండు చందమున చాతుర్య లాఘవంబులు మెరయ బాణనికరంబులం బ్రయోగించి దళంబులనిలపైఁ గూల్పఁదొడంగెను.

అయ్యవసరంబున యామేటి వీరుల పరాక్రమమున యొరించి నిలువలేక సుశర్మ సైన్యములు కలతనొంది మందరపర్వతముతో క్షీరాబ్ధిని చిలుకునప్పుడు సముద్రము క్షోభమునొందినట్లు సంక్షోభమును పొందెను తత్కాలంబున మత్స్యనాథుండు తనతమ్ములు చేయుచున్న యుద్ధప్రకారమును చూచి మిగుల సంతోషించి సారథితో సుశర్మధ్వజము కనంబడుచున్న చోటికి తేరును తోలుట కాజ్ఞాపింపఁగా, నాతండటులనే చేయుటయు, నప్పుడమితేఁడు మించిన కోపముతో, నేసలం గదసి వెరుల యేనూఱు రథములను నుఱుమాడి పొడియగునటు చేసెను.

## విరాటుని సేనలు విజృంభించి పోరాడుట

తమ రాజు యుద్ధముఁ జేయుటఁజూచి విరాటుని దళంబులు వీర రసావేశ మతిశయింపఁగా, సుశర్మ సేనలందాకి, బహుతర శస్త్రాస్త్ర సమూహంబులం బ్రయోగించుచును, విక్రమంబుఁ జూపుటయు, తద్విధం బును జూచి నారదుఁడు సంతోషముమీరగా నెమలికుంచెను ద్రిప్పుచు నాట్యమునుఁ జేయఁదొడంగెను. ఇటుల విరాటుండు వాని సైన్యమును, మతియుంగల శూరాగ్రేసరులును మహాధైర్యముతో నొక్కసారిగా, గలిసి పటాపంచలు జేయుచుండ, వారినెదిర్చి నిలువనోపక నానాముఖం బులకును విచ్చి పాఱుచున్న తనసైన్యముయొక్క దైన్యస్థితింగనుఁగొని సుశర్మ మిక్కిలి రోషమును, కోపమును నధికరింపఁగా కన్నులనిప్పు లొలుక తనకు తన తమ్ముఁడు సహాయుండై వచ్చుచుండఁగా, త్వరితముగాఁ జనుదెంచి శత్రువులు భీతిల్లునట్లు విరాటుని వ్యూహంబును దాకెను.

ఇట్లు తొరసిల్లి మదపుటేనుంగు తామరల కొలనులో చొచ్చిన రీతిగా విర బలంబులలో ప్రవేశించి పరాక్రమ మతిశయింపఁగాకలతపడు నట్లు చేయఁదొడంగెను. తమరాజు శౌర్యమునుజూచి, సుశర్మ సైన్యము లుత్సాహంబుతో విజృంభించి బహువిధములైన యాయుధంబులం బూని వైరిసేనలను నుఱుమాడుట కారంభించుటయు. వీరికిని వారికిని పోరు ఘోరంబై ప్రవర్తిల్లెను. ఆ సంగరమును గని వేలుపులు సయితి మాశ్చర్యము నొందుచుండిరి.

## విరాటుఁడు సుశర్మతో యుద్ధముఁ జేయుట

సుశర్మ పరాక్రమమునకు తాళలేక విరటుని సేనలు కలంగి తొలం గుటయు, నవ్విరటుం డాగ్రహించి బలంబులఁ జేరీచి నిలువరించి, త్రిగర్త పతిని గానఁజేయక యల్పుఁడైన సేవకునింజూచిన విధంబున నలుసగా నెంచి యెదిరించిన వారిరువురకును, భయంకరమయిన యుద్ధముజరుగు చుండెను. ఆ నృపతులొకరిపై నొకరు ప్రయోగించు సాయకపరంపర లొండొంటింబాకి మింట మంట లెగయించుచుండఁగా పరస్పర జయాభి లాషఁగలవారై పోరెడి యవ్వీరులు కోప మత్సరాగ్రమైన యిటువంటి రెండు రూపములు దాల్చినదో యనునట్లు తోచుచుండెను.

తత్కాలమందు మత్స్యవల్లభుండు తీక్ష్ణములగు పదిబాణములు సుశర్మ యొమ్మునందును, పదితూఁపులు మొగంబునను నాటునట్లులనేసి,

యతని తేరునకుఁ గట్టియున్న గుఱ్ఱములను గూల్చెను. సుశర్మ యతని లెక్కగొనక శౌర్యంబుతో బంగారపు పింజలతో నొప్పుచు మిక్కిలి వాడిమిగల యేబది సాయకములు విరటుని మేననాటును. ఈ ప్రకారముగా నొకరిమీఁద నొకరు విరామములేక బాణప్రయోగముఁ జేయుటచే యవి దట్టముగా మింటఁ గలియుటచేతను. తమ రాజులు పోరాడుచుండుటంజూచి, యుభయుల సేనలును, నుత్సాహశౌర్యములు మించి కదిసి యుద్ధముఁ జేయుటకుం దొడరుటచే లేచిన ధూళి పైని వ్యాపించుటచేతను సూర్యరశ్మి లేకపోయి యది పగలయ్యు, రాత్రియైన విధంబున చీకటులు గ్రమ్మి కన్నులు కానరావయ్యెను. అట్టియెడ సైనికుల దేహములనుండి కారు నెత్తురువలన నేల దుమ్ములడంగి భూమి యెఱ్ఱని కాంతితోకూడి కనుపట్టుచుండుటచే యాసమయము సూర్యోదయ సమయము ననుకరించుచుండెను.

అంతలో విరాట సుశర్మలొకరి శరంబుల నొకరు నివారించిన కతన మరల సూర్యకాంతి ప్రసరించుటచే వెలుతురు కలిగెను. అలాగు వెలుఁగు గలుగుటకు సంతసించి యుభయ బలంబులును వెనుదీయక శస్త్రాస్త్ర సాధనంబులచే నత్యద్భుత ప్రకారముగా యుద్ధమును జేయుచుండు నయ్యదనున రవి క్రమముగా మందరశ్మియై పడమటి కొండయుం జీకటి గవిసినంగాని సమరముఁ జేయుటను విడువరు కాఁబోలు. వీరికిఁ గొంత విశ్రాంతిని గలిగించెదనుగాక"యనితలఁచి భాస్కరుండు తొలంగిపోయె నేమోయని తోఁచు చందమున సూర్యుండస్తమించె. అయినను మునిమాపు చీకటియందు నయితము విడువక సైనికులు యుద్ధము జేయుచుండి, యప్పటప్పటికి నంధకార మెక్కుడగుటయుఁ జేయునది లేక పోరుట నుడిగి యక్కడక్కడ నిలిచిరి.

వారు శౌర్యముమించియుం జీకటిలో సంగర మొనరించుట కష్టమగుటచే కొంతసేపు తమ యలసట తొలంగ, నిలిచియుండఁగా, తన వంశజులైన పాండుకుమారులు యుద్ధముఁ జేయుటకు తమకించుచుండెదరనియు, అట్టితరి వారికి చీకటియుండినచో కష్టమగును గాన దానిం దొలంచవలయుననియు, నెంచి వచ్చి నిజ కాంతులచే యా గాఢ తమసంబును నివారింపఁ బూనెనో యని తోఁచునట్లు శశికిరణుం డుదయించెను.

చంద్రోదయ మగుటయు చీకటులు విరిసి వెలుతురు గలిగెను. వెలుతురు పొడమగానే మరల రెండువైపుల సేనలును యుద్ధమునకు తారసిల్లెను. విరాటుఁడును, మహాశౌర్యముతో సుశర్మను నతని తమ్ముని నెదిరించి వారి రథములను పెక్కింటిని ధ్వంసముఁ గావించెను. అపుడు త్రిగర్తేశ్వరుం డత్యంత కుపితుఁడై, తానును, తన తమ్ముఁడును తమ రథంబులను రెంటిని విరటుని తేరుపైకిఁ దోలించి, యుగ్రమూర్తులొప్పఁ గా, యతనిసారథింజంపి, తేరికిఁగట్టియున్న గుఱ్ఱములను వధించిరి.

ఇట్లు విరటుండు విరథుఁడగుటయు నతఁడు క్రిందికి దిగినది చూచి యతని సేనలు వెఱంగుపడి నలుదిశలకును పాఱఁజొచ్చెను. అదియు సమయంబని యెంచి సుశర్మ విరాటరాజును బట్టుకొని, సింహనాదముఁ జేసిన వాని సేనలో జయ దుందుభులు మ్రోయఁదొడంగెను. మహా సంతోషమున త్రిగర్తపతి మత్స్యవల్లభుంగొని మరలిపోవఁ దొడంగెను.

## ధర్మనందనుఁడు విరటుని విడిపించుటకై భీమునిఁ బంపుట

అట్టియెడ ధర్మనందనుండు విరాటరాజు పగతునిచేత పట్టువడుటయు, సుశర్మ గర్వంబునుం జూచి, మనంబున వేగిరపాటు గదురఁగా భీముని నవలోకించి యతనికి మత్స్యనాథుని దుస్థితిఁజూపుచు "తమ్ముఁడా! ఈవిరాటరాజు మరుగునఁజేరి మన మిన్నిదినముల వరకును సుఖముగా కాలమును గడపితిమి. ఇపుడతఁడు శత్రువుచే జిక్కికొనిపోఁబడుచుండఁగా మిన్నక చూచుచుండుట మనకు ధర్మము కాదు. కావున నీవు శీఘ్రముగా రథమును తోలుకొనిపోయి సుశర్మ నడ్డగింపుము. విరాటునకు కీటువంటి యాపత్కాలమున సహాయము జేయవలసినది మనకువిధి. ఆలస్యముఁ జేయక వెంబడింపు" మని చెప్పెను.

వృకోదరుండు తనయన్న మాటలువిని శరీర ముప్పొంగుచుండఁగా నత్యుత్సాహము గలవాఁడై యగ్రజునితో "అన్నా! ఇదిగో! ఇపుడే నేను యీముందట కనుపట్టుచుండెడి యీపెచెట్టును పెల్లగించుకొని దీనిచే వైరులంజంపి, సుశర్మను పరాజితునిఁగావించి యెల్లరు నచ్చెరువొందు విధంబున త్వరితముగా విరాటుని విడిపించెదను. ఒక్కింతతడవు నీవును నకుల సహదేవులును నిట నిలిచి నా సామర్థ్యంబును గనుచుండుఁ" డని పలికెను.

ధర్మజుం డతని సమరోత్సాహమును జూచి నవ్వుచు, నటుల నొక్కనినిగా నతనిం బనుచుటకు సమ్మతింపక "సోదరా! నీప్రజ్ఞ నెఱుంగని వాఁడనైనఁగదా చెప్పవలయును. ఎంతటికైనను నీవు చాలుదువు. కాని, యైనను నిపుడు మనము మన రహస్య ప్రవర్తనము వెల్లడి కాకుండునట్లు నటించవలసియున్నది. గొప్ప వృక్షమును పెఱికి పట్టుకొని యొక్కరుండవుగా నీవు యుద్ధమున కుపక్రమించినయెడల, నిన్నుఁ జూచి యుభయసైన్యము లాశ్చర్యముఁ జెంది, భవత్ప్రతాపమునుబట్టి భీముఁడను వాఁడవని తెలిసికొందురు. అటుల నెఱింగిరేని మన యత్నమంతయు భగ్నమగును. కాఁబట్టి నీ యుద్దేశప్రకారము చేయుట మంచిది కాదు. వృక్షంబుం గొనుటయు, సంగరముఁ జేయుటయును మాని, నకుల సహదేవులను చక్రరక్షకులుగాఁ బెట్టుకొని, లోకసామాన్యంబులైన చాప కృపాణాదులగు నాయుధములచే విరోధివర్గంబును వధించి వేగముగా విరాటుని ముక్తునిం జేయు" మనియెను. అని యిట్లు ధర్మసుతుండు చెప్పుటయు, మదపుటేనుంగున కంకుశము విధంబున భీమునకా పలుకులు విరోధంబగుటయు, నతండు తాను తలచినట్లు చేయుటకు వీలుగాక, వృక్షమువంకఁ జూపక మత్తకరి భంగి మేనుం గదల్చుచు, మహాగ్రహముతో బొమ ముడిపాటు గదురఁగా, ధర్మజునిం జూచి "అగ్రజా! సరి! నీవు చెప్పిన చొప్పుననేచేసి శత్రువుల నోడించి విరాటుని విడిపించి [illegible] శీఘ్రముగా నీకొప్పగించెదను" అనుచు బలికిన పాండవాగ్రజుండును సమ్మతించెను.

పిమ్మట వారును తమ తేరులం దోలుకొని సుశర్మ సేనలం దాఁకుటయు, సైనికులకును పాండుసుతులకును ఘోరయుద్ధము సంఘటిల్లె. వెనుదీయక పోరాడుట కారంభించిరి. వారి యుద్ధము కనులకాశ్చర్యకరంబై యుండెను. వృకోదరుండు త్రిగర్తబలంబులను లెక్కచేయక తానొక కొలనుం జొచ్చిన మత్తకరీంద్రము తెరంగున కలంచి విజృంభించి, రథ తురంగ సారథి యుతంబులుగా రెండువేల తేరులను ధ్వంసము గావించెను. మహాసామర్థ్యముతో ధర్మనందనుండు వేయిరథములను, నకులుఁ డేనూఱు తురంగములును సహదేవుండు మున్నూఱు రథములునుం గూల్చిరి

అంత కుంతీనందనాగ్రజుండు తన తేరును సుశర్మయున్నదిక్కునకుఁ దోలించి శౌర్యం బతిశయింపఁగా వానిపై ననేకములైన దివ్యాస్త్రములు ప్రయోగించి నొప్పించిన యతండలిగి, పదిబాణముల ధర్మజుని మేననాటి నాలుగుశరములచే యశ్వములం గొట్టెను. ధర్మరాజు మిక్కిలి కోపముఁ

గొని సుశర్మసాయకములను ఖండించి వాడితూపులచే యతని యరదంపు గుఱ్ఱములను, సారథినిం జంపెను.

ఈ ప్రకారముగా, కంకుభట్టాదులు తన సహాయార్థముగా యుద్ధముఁజేసి సుశర్మను గెలింగించుటను చూడఁగానే, యతని చేపట్టుపడియుతని తేరుమీఁదనున్న విరాటరాజు మిగుల నుత్సాహము ధైర్యమును నంకురింపగా, తటాలున నరదముపై నుండిన గదనుగైకొని, తాను వృద్ధుండయ్యుండియు యువకునివలె చందమున త్రిగర్తనాథునుఁగొట్టెను. అంతలో భీమసేనుండు నియ్యంబున సుశర్మ తేరుమీఁదికి నురికి యాతనింబట్టుకొని, పెడ ఱెక్కలుగా గట్టిన, విరటుండు క్రిందికి దిగిపోయెను.

## పాండవులు సుశర్మ నోడించి జయము నొందుట

వాయునందనుండు సుశర్మను బట్టుకొనుటయు, నదిచూచి యతని బలంబులు భయమొంది వెనుకకు మరలి పారఁదొడంగిరి. ఈ ప్రకారము చక్రరక్షకులైన కోశాధ్యక్షులును, సముఖులు పెద్దలైన బంధువులును పలాయనంబగుటయు, వెనుకొనిపోయి పాండుసుతులు గోవర్గమును మరలించి పొదలి తెచ్చి తమ యున్న పాలికిచ్చి వేలువేలుగా విరాటునకు ముందు నిలిచిరి. వారినిజూచి విరాటుండు మిక్కిలి యాదరమును, ప్రియంబును తగిన సంతోషముతో, తగినవిధమున గౌరవముఁజూపి, యధికమైన స్నేహ వాత్సల్యములు మనంబున నంకురింప పాండవాగ్రజునిం జూచి యిట్లు చెప్పెను.

"ఓయి యుత్తమగుణనిధీ! ఈ విపత్సమయమున నా ప్రాణమును, పసుగఱలో నా పరువును గాపాడితివి. ఇటువంటి మహోపద్బాంధవుండవగు నీకు మఱుమేలు చేయునంతటి శక్తి నాకుఁగలుగకున్నది. ఏమిచేసిన నీ ఋణము తీఱును? నీకుం జేయఁదగిన ప్రత్యుపకార మెయ్యదియో తోఁచ లేదు. కావున నా రాజ్యము నీకొసంగఁదలచినాను, కైకొనుము. ఈ నా శరీరమును, నా యైశ్వర్యమును నిపుడు నాకు నీ యొసంగినవియే యగును. కాఁబట్టి యివి నీకే యిచ్చుచున్నాను. వీనినిఁ గైకొని, మత్స్య దేశాధిపతివై నన్ను నీ సేవకునిగా గ్రహించి రక్షింపుము. నామాటనుత్రోయ వలదు. ఇంక నా దేశమునకు నీవే యధిపతివి" అని పలికెను.

విరాటుం డీవిధముగా చెప్పగా విని యజాతశత్రుండు మందహాస వదనుండై యతనిం జూచి, "నరేశ్వరా! ఇపుడు నేను చేసిన మహాత్కార్య

మెద్దియును లేదు. నీ ప్రాపున నుండెడి నేను నీకు సంకటము గలిగినపుడు శక్తికొలఁది సహాయ మొనరించుట యొక గొప్పవిషయమగునా? ఇట్టుల చేయవలసినది విధిగాదా? దీనికై యింతగా నను బొగడవలదు. ఎట్లును నీవు జయమును బొందినాఁడవు. సంతోషమున విజయలక్ష్మిం జేకొని నీవు పురంబును జేరుటయే నేను సకల సంపదలునుం బొందుట కాని రాజ్యభోగంబులు నాకేమిటికి? నన్ను గొప్పఁజేసి పలుకకు'' మనియెను.

అతని పలుకులువిని విరాటరాజు మిగుల నాశ్చర్యమును బొంది సంతోష మతిశయింపఁగా, మఱియు నధికమగు గౌరవముఁగలవాఁడై ధర్మతనయునింజూచి, ''మహాత్మా! ఇట్లు నాకొఱకై నీవు యుద్ధముఁ జేసి జయమును కలిగించుట నాయందు నీకుఁగల ప్రియముచే నపకారముఁ గావింపఁదలంచియే యని తలంచుచున్నాను. వేఱు కారణమేనియును నాబుద్ధికిఁదోచ లేదు. నీవు కాక యావలలుండు చేసిన యద్భుతకృత్యము వర్ణనాతీతమైనది. కాలాగ్నితుల్యమగు శత్రు బలములలోఁజొచ్చి భయంకరముగాఁగలంచి నాశము నొనరించెను. అతఁ డద్వితీయ శక్తిసంపన్నుడుగాని సామాన్యుఁడుగాఁడు. నా జయమునకతఁడే కారణమని చెప్పినచో యది యతిశయోక్తికానేరదు. వలలుండు చేసిన యుద్ధమువంటి దానిని ఇదివరకును నెచ్చటను నేను చూచియే యెఱుఁగను. అతనిపరాక్రమము నెంతయు మెచ్చుచున్నాను. ఇంకను దామగ్రంథి యన్నవో నిర్లక్ష్యముగా తాటిపండ్లు రాలినవిధముగా పడునట్లు శత్రువులశిరంబులు నేలఁ బడఁగూల్చెను. తంత్రీపాలుం డొనరించిన సమర ప్రకారమును వర్ణించుటకే యలవికాదు. సేనలలోఁజొచ్చి కలగుండు పడఁజేసి పరబలంబులను రూపుమాపి మనకు మిక్కిలి యుద్ధోత్సాహమును గలిగించెను. బాగు! బాగు! స్నేహితునకు సంకటము కలిగినపుడు నివారించిన వాఁడే పురుషుఁడు. ఓయి, కంకుభట్టా! ఈమాట నీయందు తార్కాణమైనది. మీరు నలువురుదక్క మనసేనలో తక్కిన యందఱును నోడిపోయిరి. మీవలన నేను పరిపూర్ణమగు జయమును పొందినాడను. కాఁబట్టి మీకు యేనుగులు, గుఱ్ఱములు రథములను, ధనమును, నుత్తమస్త్రీలను, వేయేల మీకేమి కావలయునో యవి యన్నియు గొఱంత లేక యొసంగి మిమ్ము గౌరవించుటకు నిశ్చయించినాను అటుల చేయనైతినేని మీ ఋణమును దీర్చుకొనిన వాఁడను కాఁజాలను.'' అని యీరీతిగా మత్స్యనాథుండు పలికిన ధర్మజాదులతనితో ''రాజోత్తమా! మీకు

సంతోషము కలుగుటయు మమ్ము గౌరవించుటయునే మాకు చాలును. వేఱుగా బహుమతులు మాకువలదు. నీవు మమ్మాదరించుటయే సకలార్థములకు నెక్కుడు. నుతి ధనాదులేమిటికి? మేమున్నను మీకన్యులము గాము, మీవారము. ఇంతగా మమ్ము పొగడనేల? ఇంక నేతద్విషయమును గూర్చి యిట్టిట్టని యేమియుం బలుకవలదు. పురంబునకుం బ్రయాణమగుము. పట్టణము జేరినంతట నీవెటుల మమ్ము మన్నింపందలంచిన, యటులం జేయుదువుగాక'' అని పలికిరి. వారిమాటలువిని విరాటరాజు మిక్కిలి సంతోషించి ప్రయాణంబయ్యెను.

ఆ సమయమందు యుధిష్ఠిరుండు రాజుం జూచి ''మత్స్యధరావల్లభా! ఇపుడు నేనొకటి కోరెదను. సంశయింపక నాకోర్కెను తీర్పవలసినది. అది యేదనగా, మన చేఁబట్టుబడియున్న యీ త్రిగర్తపతిపై కనికరించి, రథగజపదాది సహితముగా నితని విడిచిపుచ్చుము. మన చే విడువఁబడి పోయి యెటులనైన నీతడు బ్రతుకునుగాక! ఈప్రకారము చేయుటెంతయు నాకుఁ బ్రియంబు. నేను కోరినట్లు కృతవర్మను పోవిడిచి, వేగముగా పోఁగల సేవకులను మున్ముగా మన పురంబునకుం బంపుము, వారలుపోయి పట్టణంబున మీ విజయప్రకారమును చాటించి, పురాలంకారము గావించి జయధ్వజంబును ప్రతిష్ఠించి, గీతవాదిత్రని స్వనంబులతో, భూసుర మంగళాశీర్వచనములతో నెదుర్కొనుసటుల నేర్పాటుంజేయు'' మని చెప్పిన, విరాటుండు శీఘ్రముసంగొందఱను తత్కార్యంబులను నియమించిపంపెను. వారలుపోయి తెల్లవాఱుటకు పూర్వమే నగరంబున గెలుపును ప్రకటించి, పురాలంకారాది సకల కృత్యములను నిర్వర్తించిరి.

## విరాటరాజు పాండవులతోఁగూడి రాత్రి యుద్ధభూమిలోఁగడపుట

ఇట పాండవులును, విరాటుండును మహాసంతోషముతో పట్టువడి లజ్జావనతముఖుండై యున్న సుశర్మకు వివేకముఁగఱపి సేనాసహితంబుగా విడిచి పుచ్చి, యతండుపోయినపిమ్మట, మడిసులవగకుం గొగిపడియున్న పాదసమూహములు, చిగురుటాకుల చక్కనిశయ్యల చందంబునఁదోఁచు చోటులును, తునిసి చిక్కువడియున్న తొడలు మదించిన యేనుఁగుచే కలఁచఁబడిన తామరల కొలనులోని తూడులో యనందగి యొప్పుచోటులును, ప్రోవులుప్రోవులుగాఁబడియున్న ప్రోవులుగాంచి మరించినయుంచలు పేరాకలిచే నతిముతీంబెటికిన రాసులు గట్టిగట్టి తామరతూండ్లతో

గూడినకొలంకులలో యున నొప్పుచుండు స్థలంబులును, ఉంగరములు వ్రేళ్ళ యందు మెఱయుచుండగా తెగిపడియున్న బాహువులు, ఫణినికరంబు ననుకరింప భుజంగలోకమును దలపించు చోటులును, నెత్తుటం దేలుచునవ్వి నట్లున్న శిరంబులు వికసించిన తామరలనం జూపట్టునోడలును, నవయవ భేదంబు తెలియంగరాక పడియున్న శరీరములచేతనిండి యమునివంటయింటి చందముగానుండు ప్రదేశములును, గలిగి యున్న భీ[illegible]మహా[illegible] సమరసంగర భూమిం జూచుచు, మత్స్యభూపతి ధర్మనందనాదులతోం గలసి కొంత దూరమందు రమణీయముగానుండెడి స్వచ్ఛమగు యమునా [illegible] నాంటిరాత్రి యట గడుపుటకు నిశ్చయించి, వేగునంతవఱకు నందు విడిసి యుండిరి.'' అనియిట్లు వైశంపాయన మహర్షి చెప్పిన విని జనమేజయుండు మహాత్మునింగాంచి, "మునికుల వరేణ్యా! అటుపిమ్మట నేమి జరిగెనో, యెట్లయ్యెనో యావృత్తాంతము నెఱింగింపు'' మని యడిగెను.

మూడవ ప్రకరణము

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు

సంపూర్ణము



# నాలుగవ ప్రకరణము

మునిశ్రేష్ఠుండైన వైశంపాయనుండు జనమేజయునిం జూచి యిట్లని చెప్పందొడంగెను.

"ఓయి నరేంద్రా! పాండుసుతులతోఁ గూడి విరాటుండు సంతసముతో నాఁటి రేయి సంగరభూమి సేనల సైనికస్థలంబునఁ గడపెననుటను వినుపించితినిగదా! తరువాత నడచిన వృత్తాంతము నెఱింగించెదను వినుము. పూర్వోక్తక్రమముగా, విరాటరాజు తానును పాండుకుమారులును సేనలతో నొక యిసుక బయలునందు రాత్రిని గడిపిరి. మఱునటి దినము సూర్యోదయ కాలమున దుర్యోధనుండు, భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామ, కర్ణాది వీరోత్తములతో, బహుళ సేనాసమేతుండై మహాపరాక్రమముతో వచ్చి విరాటనగరంబునకు కుడిదిశం జేరి యటంగల పశుగణములం బట్టికొనెను. అట్టియెడ పశుపాలకులైన యల్పులు వారిని వారించి వేగిరపాటుతో వారినడ్డగించుటయు, కృప, అశ్వత్థామ, కర్ణ, శకుని, దుశ్శాసన ప్రభృతులా గోపాలకుల వాడి శరంపులం గప్పియులంచిరి. అప్పుడు పసుల కాపరులది కౌరవ బలంబులగుటం దెలిసికొని నిలువనోపక భయభ్రాంతులై మరలి మరలి చూచుచు పలుగెడలకుం బరుగెత్తి పోవందొడంగిరి.

## ఉత్తరుఁడు యుద్ధమునకుఁ బోవ నిశ్చయించుట

అస్సమయమున గోపాలకాధ్యక్షుఁడు దెబ్బలుతిని మిగుల నొచ్చి, యఱచుచు, తన రథమును దోలుకొని నగరంబునకు త్వరితముగా నరిగి, రాజమందిర ద్వారము చెంత దిగి, బిరబిర లోపలికేగి, యంతఃపురంబుననుండు విరాటునికొడుకు పుత్రుఁడగు భూమింజయునకు తన రాక నెఱింగించి యనుమతివడసి దగ్గఱకుఁబోయి నమస్కరించి తొట్రుపడు మాటలతో నిట్లనియె.

"రాజనందనా! కౌరవసైన్యము వచ్చి యుత్తర దిశయందలి మన గోవుల నాక్రమించెను. వారు పశువులం దోలుకొని పోవుచున్నారు. మేము వారి నడగించితిమి కాని మమ్ము లెక్కచేయక బాణసమూహములచే

నొప్పించి పరువిడి దరిమిరి. మేముభయ మొంది తద్వృత్తాంతము నెఱింగింప వచ్చితిమి. శీఘ్రముగా నీవుపోయి శత్రుసైన్యములను నిర్మూలించి గోవులను మరలింపుము. ఆలస్యము చేయవలదు. మీతండ్రిగారెప్పుడెప్పుడును సభలో నందఱును వినుచుండఁగా నీవు గొప్ప పరాక్రమవంతుఁడవనియు, భయపడినవారినిరక్షించువాఁడవనియు, ధైర్యవంతుడవనియు, సమర్థుఁడవనియు, బలశాలివనియు, నీగుణవిశేషములఁగూర్చి మిక్కిలి ప్రశంసించి పలుకుచుండును. సమయము లటస్థించినది. ఇపుడు మీ జనకుఁడు పొగడుచున్న దానికిఁ దగినట్లుగా శౌర్యమునుజూపి, వైరులనోడింపుము. వేగముగా తేరు సిద్ధముజేయించఁ వలయు. ఆయుధములు గైకొని కవచాదులుదాల్చి ప్రయాణముగమ్ము. తామసించుట కిపుడు సమయము కాదు.'' అని యివ్విధముగ నంతఃపుర స్త్రీలయెదుట తన ప్రతాపమును పొగడి గోపాలకాధ్యక్షుఁడు పలుకుటయు, నుత్తరుండా మాటలచే నుప్పొంగి మహా గర్వముతో, నచ్చోట నందఱునువినుచుండఁగా గోపాలునితో నిట్లనియె.

"ఓహో! ఆలాగా! ఆ కురు బలంబులు నాకు లెక్కలోనివి కావు. క్షణకాలములో వైరులఁబాఱదోలి పసులను మరల్పగలను. కాని, ఇపుడు నాకుందగిన రథసారథి లేకున్నాఁడు. దీనికై చింతిల్లుచున్నాను. మన సారథులందఱును యుద్ధమున కరిగియున్నారు. మఱియెవరుగలరు? మన పట్టణములోని వారిలో, సారథ్యమును చక్కగా చేయుటకు నేనొక్కఁడ మాత్రమే నేర్చియున్నాను. నాతో సమానుండైన సూతుఁడే లేఁడు. అయిన నేమిలాభముగలదు? నేనేయుద్ధమునకు పోవుచుండగా, సారథ్యమునకు వేఱొకండుండవలయునుగదా? ఇపుడు తగిన సారథియే దొరికెనేని, పగవారిని జయించుట గొప్పపనికాదు, ఇటుల మనమాలోచింపుచు, కాలముఁగడపుచుండినచో, గోవులందోలుకొని వారు చాలదూరము పోవుదురేమోయని భయపడుచున్నాను. త్వరితముగా నెవ్వసినైనను, సారథ్యము చేయఁగలవాని నొకని వెదకి కొనురండు. దుర్యోధనాదులు నాపరాక్రమమునుచూచి యర్జునుండేమోయని భ్రమించి భయమొంది పాఱిపోవునట్లుచేసి గోవులను మరలించు కొనివచ్చెదను. ఇటులచేయనిచో నన్నుగురించి పొగడుచుండిన రాజుగారు మొదలగు వారియొద్ద నాకు గౌరవముదక్కదు. కాబట్టి యిపుడు నిమిషమైనను తడవు చేయకూడదు. ఎవనినైన సారథిని వెదకుఁడు."

టయునచ్చోటనుండి యీమాటలు వినుచుండిన ద్రుపదనందనయాయుత్త రుండు తా నర్జునునివంటివాఁడననియందు నసూయయు, కౌరవులజయించె దనని చెప్పినందుకు పరిహాసభావమునుం గలదియై తటాలున నచ్చోటనుండి పోయి యంతఃపురములో జరిగిన వృత్తాంతమును పార్థుని కెఱింగించెను.

## అర్జునుఁడుత్తరునకు సారథిగా నుండునట్లు చేయుటకు ద్రౌపదిఁబంపుట

ఇట్లు చెప్పిన ద్రౌపది మాటలువిని యర్జునుండు దినంబులు లెక్కించి తమ యజ్ఞాతవాస కాలం బతిక్రమించుటను నిశ్చయించి యా తెఱం గమ్మగువకుఁ దెలిపి "ఇపుడుమరల నంతఃపురంబున కేగి, బృహన్నలకు సారథ్యముఁ జేయుటయందు మంచి నేర్పుకలదనియు, ఖాండవదహన కాలమున నర్జునునకు సారథ్యముఁ జేసి యతనికి జయముగలిగించుటయు మఱియుం బెక్కుసారులు తేరుగడపినదియు నే నెఱుంగుదుననియు, ఇపుడు బృహన్నలను సూతకృత్యంబునకు నియమించి సంగరమునకుఁ బోయినచో కురుబలంబుల నశ్రమంబున గెలువవచ్చుననియుం జెప్పుము. ఒకవేళ వారు నీపలుకు లాదరింపక యట్టిట్టు మఱి యేమైనం బలికిరేని, వారికి నమ్మిక పుట్టునట్లు మాటలాడి యెట్లైననుఁ నన్నుఁ బిలుచునట్లు చేయుము, శీఘ్రముముగా బొ"మ్మని పనుపుటయు, పాంచాలి వల్లెయని బిరబిర యుత్తర యున్నచోటునకుం బోయి యామెతో నిట్లనియె.

"ఓయమ్మా! ఇపుడుత్తరకుమారుండు యుద్ధమునకు వెడలనెంచి రథసారథిలేక విచారించుచున్నాఁడు. ఇటువంటి సమయమున తెలిసిన విషయమును చెప్పకుండుట నుచితిదిగాదు. నేను బాగుగా నెఱింగియుండు దానిం జెప్పెదను వినుము. మన బృహన్నలకు అర్జునుండు మెచ్చికొను నంతటి బాహుబలమును సారథ్యముఁ జేయు నేర్పునుం గలిగియుండెను. ఈబృహన్నలవలన ఖాండవదహనాదిబహుసంగరములయం దర్జునుండు విజయమునొందెను. కావున యీవృత్తాంతము నుత్తరకుమారునితో చెప్పి యొప్పింపు"మనెను.

ఇట్లు చెప్పగా యుత్తర యామెను దోడ్కొని యుత్తరునియొద్ద కరిగి తనతో ద్రౌపది చెప్పినప్రకారముగా చెప్పెను. అవృత్తాంతము నుత్తరుండువిని పకపకనవ్వి పాంచాలివంకఁజూచి "బాగుబాగు! సైరంధ్రీ! మంచి సమాచారముం దెచ్చితివిసుమీ! నేను నపుంసకుని జూచుటకే రోతపడుచుండు వాఁడను. అటువంటివానిని సారథిగాఁగొని యుద్ధ

సారథి మృతినొందెను. ఇప్పటివరకును తగిన సూతుండు దొరకలేదు. కాఁబట్టి యతఁడు సారథిలేక యున్నాఁడు. ఇపుడన్ననో కౌరవబలంబులు వచ్చి గోగణంబులం గొనిపోవుచున్నట్లు పసులకాపరులువచ్చి చెప్పినందున నాయన్న యుద్ధ సన్నద్ధుండై పోయి వారి వెంటఁబడిలి గోవులమరల్చికొని రాఁదలంచి తేరునడుపుటకు తగినవాఁడు లేమిచే వగచుచుండఁగా నచట నుండిన సైరంధ్రి నీసామర్థ్యంబును వర్ణించి చెప్పిన, యతండు సంతసించి నిన్నుందోడ్తెచ్చుటకై నన్ను బంపఁగా, నేనునునీయందుఁగల చనవువలన నెటులనైనను బిలిచికొని వచ్చెదనని దృఢముగాబలికి పనిఁబూనివచ్చితి. నీవన్ననో యీసమయమున నాయందుగల ప్రియంబు వెల్లడియగునట్లును నీశక్తిప్రకటనమగునట్లును, నామాటల ననాదరింపక వచ్చియిక్కార్యంబునకుఁబూని తొడరిన యుపద్రవంబును తొలగింపవలయును. ఇటుల చేయనొల్లవైతివేని నీకు నాపైనను రాగంబు కొఱంత యగుటగాఁ దలంచికొనియెద. మదీయ వాక్యములను జులకన చేయక నావెంటర మ్మనికోరి చెప్పుటయు బృహన్నల యాపలుకులు విని మొగంబునఁ జిఱునగవు మొనయుచుండఁగా నెంతయు, నాదరప్రియంబు లెసంగంజూచి, "రాజపుత్రీ! సారథ్యముఁ జేయునేర్పు నాకుం గలుగునా? అయినను నీవు చెప్పిన కతంబున పిమ్మట నెట్లయిన నగునుగాని యాలోచింపక యాపనిఁబూని యరిగెదను. ఉత్తరా! నీవు కోరినచో, సారథ్యము జేయుటయేకాదు. మఱియెటువంటి యసాధ్యములైన పనులను గోరినను నెంత కష్టముగా నుండినను వెనుదీయక పూని యా కార్యములను సాధించి నీకు సంతోషమును గలిగింపుదును" అని చెప్పి నర్తనశాల వెలువడి, సంతసముతో నుత్తరునియొద్ద కరుదెంచెను.

దూరమున వచ్చుచుండగానే యుత్తరుండు బృహన్నలను చూచి తొందఱపాటుతో తన సమీపమున కతఁడు రాకపూర్వమే "ఓబృహన్నలా! నాకు కౌరవులతో యుద్ధము తటస్థించెను. కాఁబట్టి యిపుడు నీవు సారథ్యము చేయవలయును. ఆలస్యము జేయుక వచ్చి నేను సిద్ధము చేయించియున్న తేరునెక్కుము. ఇవిగో! కవచాదులను ధరింపుము. ఈ సమయమున నీవు మఱేమియు సద్దము చెప్పవలదు. నీసామర్థ్యమును సైరంధ్రిచెప్పఁగా వింటిని. దీనికొఱకే నిన్ను రావించితి" నని పలికెను.

ఆ మాటలను బృహన్నల విని "అయ్యా! ఏదైన నాటపాటలందు ప్రసక్తి గలిగినపుడు నన్ను పిలిపించుట యుక్తముగాని యిటుల

యుద్ధ కార్యమునకై పిలువవచ్చునా? ఈ కార్యమును చేయుటకు నాకు శక్తిగలదా? చక్కగా విచారించి దీనికిఁ దగిన వానిని మఱియెవ్వని నైనను నియమించుట మంచిది. బాగుగా యోచన చేయుము" అనియెను.

ఉత్తరుండా పలుకుల నాదరింపక, "ఓబృహన్నలా! ఇవి యేమి మాటలు? నీవు మున్ను ఫల్గునునకు సారథ్యముచేసి ఖాండవదహన కాలమున జయమును గలిగించితివఁట. ఆనేరుపు యిపుడేల లేకపోవును? నీబుద్ధి పరాక్రమముల నంతయును విన్నాను. ఊరక యుద్ధముమాటలు పలుకక నాయందు ప్రీతియుంచి ప్రయాణముగమ్ము. ఈ కార్యముఁ జేయక నీకుతప్పునదికాదు" అని దృఢముగ చెప్పిన యర్జునుండతనికి మారాడవెఱచి సమ్మతించిన లాగున నటించి యొప్పుకొనెను. ఆ యు నా క్షణంబున విరాటసుతుఁడు కవచాదులం గొనివచ్చి యతని కొసంగునట్లు సేవకుల కాజ్ఞాపించెను.

పరిచారకులు శీఘ్రముగాఁబోయి కవచమును దెచ్చి బృహన్నల కిచ్చిరి. అతఁడు దానింగొని, చేతగాని వానివలె నటించుచు, తాఱు మాఱుగా తొడుగుకొని యచ్చటి యంతఃపుర స్త్రీలను నవ్వించెను. అది చూచి కవచమును సరిగా తానే బృహన్నలకుఁదొడిగి, తానును యుక్త మైన మఱుపును దాల్చి యుద్ధోచితాలంకృతుండై పసుల మరల్చి తెచ్చు టకై వేగిరపడుచున్న మానసముతో బృహన్నలవంకఁగని "ఏమీ! ఇంక తడవుఁజేయనేమిటికి? ఆవులను మరల్చుకొని వచ్చుచుండఁగా మన జయమును చూచి పురజనులు సంతసించి పొగడునట్లు చేయవలయును. వేగిరముగా తేరికి గుఱ్ఱములం గట్టుము, ధ్వజము నిలుపుము" అని చెప్పెను.

బృహన్నల యతనింజూచి "రాజకుమారా! నీవు యెటుల చెప్పె దవో యాలాగునఁ జేయుచు, నాశక్తి వంచనలేక పనులు గావిం చుచుండెదను. నావలనం గాఁదగిన పనులకు నన్ను నియమించుచు శత్రు వుల నోడించి జయమును పొందుము" అనిచెప్పి లోలోన సంతోషమునం బొంగుచుపోయి, తేరును చక్కఁగా నలంకరించి, యలంకరింపఁబడిన హయములనుగట్టి, బంగారపు ధ్వజమును యుక్తప్రకారముగా తేరుపై నిలిపెను.

ఈవిధముగా సన్నాహముఁ గావించి ప్రయాణమునకు సన్నద్ధుండై యున్న బృహన్నల నుత్తరయు నామె చెలులునుంజూచి 'మీరు కురు వీరులను గెలిచినంతట వారు ధరించియుండు వస్త్రములలో వింతగా నుండు చిత్రవర్ణములుగల గుడ్డలను బొమ్మలకుఁ గట్టుటకొఱకై కొన్ని తీసుకొనివచ్చి మాకొసంగు''డని చెప్పిరి.

బృహన్నల వారిపలుకులు విని సంతసమున నుత్తరంగని ''అమ్మా! యుత్తరకుమారుండు కౌరవుల జయించినంతట బొమ్మపొత్తికలు తెచ్చుట గొప్పకార్యమా! అలాగే తప్పక కొనివచ్చెదను''అని చెప్పి యుద్ధమునకు వలయు, విండ్లు, బాణములు, కత్తులు, మొదలైన సాధనములం గొని పోయి రథముపై క్రమప్రకారమున పదిలముగాఁబెట్టి తాను నొగలెక్కి గుఱ్ఱముల పగ్గంబులు ముడుతలువీడ్చి చక్కజేయుచుండ తత్సమయంబున విరాటనందనుండు గోపాలకులం బిలిచి పసులం దోలుకొనిపోయిన దిక్కు నడిగి, వారు స్మశానవాటిక దెసంబోవుటను చెప్పినవిని తేరునెక్కి ప్రయాణంబై పోవుసమయంబున పౌరులును, పుణ్యాంగనలును, భూసురులును, బృహన్నలం జూచి ''తొల్లి ఖాండవదహన సమయంబున నర్జునునకు నీవు సారథ్యంబొనరించి యాతనికి జయముఁ గలిగించితి వని వింటిమి, అట్లే నీ సహాయమున నిపుడు భూమింజయునకు జయంబు గలుగునుగాక. శుభంబు వాటిల్లునుగాక'' యని పలుకుచు సేసలుచల్లి దీవన లిచ్చుచుండఁగా పురంబు నిర్గమించి యతిశయమైన పరాక్రమముగల యా యర్జునుండు నేర్పుతో నడుపుటచే మహావడిగా పరుగెత్తుచున్న గుఱ్ఱంబులంజూచి రథవేగంబు నెంతయు మెచ్చుచు, ప్రేతభూమి సమీప ప్రదేశంబును సేరంబోయి, ముందుగా కొంతదూరమున, పసులం దోలుకొనిపోవుచున్న సేనలునడచుటచే ఎగసినధూళి నల్లని ప్రదేశములందు నిండి యాకు గుబురుల వలెను ఎఱ్ఱని చోటులలో చిగురులవలెన్ తెల్లని స్థలంబుల నిండి నపరాగము పూవుపొదలవలెను, పచ్చనియెడల పుష్పాడి విధంబు నను దోలుచుండ, విశాలమైన చక్కని యుద్యానవనము భూమినుండి యాకాశమునకు గోపురము పోవుచున్నదో యనునట్లు కనుపట్టుటయు నటువంటి కౌరవులయొక్క మహా సైన్యమును దృష్టించి చూచెను.

ఉత్తరుఁడు కురుబలములం గని భీతినొందుట

ఇట్లు విరాటనందనుండు చూచి మిక్కిలి భయమునుపొంది దేహముగ గుబ్బాటునుచెంది వడంకుచుండఁగా, దృష్టి నిశ్చేష్టముకాగా,

దత్తఱపడుచు బృహన్నలను విలోకించి, యధికమైన దిగులు దోఁప నతనితో నిట్లనియె

"ఓబృహన్నలా! సామాన్యముగా నుండునని తలంచితిని గాని సైన్యము భయంకరమును నపారమునుగాఁగనుపట్టుచున్నది. భీష్మద్రోణ ప్రభృతులైన మహాశూరులనెడి మండుచున్న యోరుమద్ది చెట్టుగలదియు దుర్యోధనుండనెడి యెండకాలపు ప్రచండ సూర్యుని ప్రతాప ప్రకాశముతోఁగూడినదియు, నాయుధంబులనెడి వేఁడిమిగల చతురంగబలంబులతో నొప్పునదియు, యున్నతధ్వజంబుల పెనుమంట నాలుకలు గలదియునగు యీ కౌరవసైన్యమనెడి కార్చిచ్చును నేను సమీపించుటకుఁ గూడ శక్తుండనుగాను. నేను చిన్నవాడను, అస్త్రవిద్యను బాగుగా నేర్చియుండలేదు. ధనుర్విద్యాప్రవీణులైనట్టియు మహాప్రసిద్ధులైనట్టియు ఘనులైన శకుని కర్ణదుశ్శాసన ప్రముఖులతో యుద్ధముఁ జేయుట నావంటి వానికి సాధ్యమగునా? అయ్యో! ఇట్లుండుటను మనము తెలియక వచ్చినారము. వీరిందాకినచో మనగతి యెట్లగునో కదా? ఈ సైన్యమందలి యోధులందరును మిక్కిలి శూరులు. మనము వీరి నెదిరించి పోరఁజాలము. అప్పటప్పటికిని నాకు భయము మించుచున్నది. బృహన్నలా! ఇటుచూడుము. నా దేహము గడగడ వడంకుచున్నది. ఇట్టి స్థితిలో నేనీ వీరులతో బోరఁగలననియు, జయింపగలననియు నాశ నాలోన నిసుమంతయుం గలుగదయ్యెను. దృఢముగాఁ జెప్పుచున్నాను. నేను వీరిని జయింపఁజాలను. కావున త్వరితముగా రథమును వెనుకకు మరలింపుము. అట్టె తోలుకొని నిబ్బరంబునఁ బోవుచున్నాఁడవు. నీకు ప్రాణములమీఁద యాశ కలుగదా, యేమి? నా మాటలు విన లేదా?" యని వెఱపుతోకూడిన దైన్యమునఁ బలికెను.

అపుడు శతమఖనందనుం డతని వాక్యములు విని మొగంబున జిఱునగవంకురింపఁగ, తలయూఁచి "రాజకుమారా! ఏలయింతగా భయము నొందెదవు? గొప్ప పరాక్రమవంతులగు రథికవీరుల మీఁదికి బోవుటకు నేను వెఱ్ఱివాఁడనా? అటుల నేలపోవుదును? మన గోవులను తోలుకొని పోవుచున్న యల్పజనంబుల నెదిర్చి మన పశువులను మరలించుకొని పోవలసినదియే కాని, భీష్మాదులతో పోరాడవలసిన యగత్యము మనకుఁ గలుగదు. ఏకార్యమునకై వచ్చితిమో యాపనిని నెఱవేర్చుకొనుట మనకు కర్తవ్యము గోవులనువిడిచి, యింతటి ప్రయత్నముతో వచ్చియు,

యూరక మరలిపోవుట నీవంటివానికి ధర్మము కానేరదు. వింటివా? అంతఃపుర స్త్రీలయెదుట వారు సంతోషించునట్లు పసులను శీఘ్రముగా మరలించి తెచ్చునట్లు ప్రతిజ్ఞఁజేసిచెప్పి మహా శౌర్యవంతుఁడవై తేరు నెక్కివచ్చి యిపుడీ సైన్యములనుచూచి వెఱచి మిన్నక మరలిపోవఁ దలంచుట యవమానకరము. ఇది తగిన పద్ధతికాదుసుమీ!" యని బదులుచెప్పి యరదంబును తోలుచుండెను.

అతఁడు చెప్పినమాటలు విని యుత్తరుఁడు భీతి యతిశయింపగా, వడంకుచు "అయ్యో! బృహన్నలా! వలదువలదు. తేరును మరల్పుము అంతఃపుర స్త్రీలు సంతోషింపకుండిన నుండురుగాక, పశువులేమైన నవ్వుదురు ఇంక నేను వానిజోలిందలంపను, ఖండితముగా నేనీ వీరులతో పోరాడజాలను, యేదియెట్లైనను ప్రాణములు దక్కించుకొనినం జాలును" అని కడు దైన్యముతో చెప్పెను.

అర్జునుండు వాని పలుకులకు లోలోనవ్వుకొనుచు ధైర్యము పురికొల్పఁదలంచి "ఉత్తరకుమారా! ఏల తహతహ నొందెదవు? తనబలమును, యెదిరిబలమును బాగుగాచూచి తెలిసికొని సాధ్యము కాదని గట్టిగా తోఁచిన పక్షమున యుద్ధము చేయుట మాని తిరిగిపోవలయును. కాని తొందఱ పడిపోవకూడదు. శూరులైన వారు యీ ధర్మమును సయితము పాటింపనొల్లరు. అంగీకరింపరు. అది యట్లుండ, నీ వైపున కిపుడీ కురుబలంబులు తిరిగి చూడనైన లేదు. ఇంతలోన నింతటి భయమును జెందుటకు కారణమేమి? నా బుద్ధికి దోఁచకున్నది. దిక్కులు మాఱు మ్రోగునట్లు ధ్వనించు శంఖనాదములకు భయమును జెందక, సేనలత్రొక్కుడుచే రేఁగిన దుమ్మునకు వెనుదీయక, చతురంగబలంబులు మీఁదికి వచ్చినప్పుడు చలింపక, గుఱ్ఱములమీఁదను, సారథిమీఁదను, పరులు బాణవర్షమును గురియించి కవచములు భేదించి దేహములు నాటునట్లు చేయుచుండు సమయంబున కలఁతనొందక శత్రువుల పరాక్రమంబునకు సహించి వెనుకంజవేయక యుద్ధరంగములో నిలిచి జయించినచో లోకమందు కీర్తికలుగునుకాని యివ్విధమున దూరమునసుండి యరిదళంబులఁ జూచినంతనే వెఱచి పరుగెత్తిపోయినయెడల జనులు మసలంజూచి పరిహాసించి నవ్వుదురు. భయపడవలదు ధైర్యమువలం

## ఉత్తరుఁడు యుద్ధముఁ జేయలేనని మొఱబెట్టుట

పార్థుండిట్లు చెప్పఁగా యుత్తరుండాపలుకులు విననొల్లక యతనిం జూచి "బృహన్నలా! సుశర్మ యపారసైన్యములతో వచ్చి గోవులను మరల్చికొని పోవుచుండఁగా వానినడ్డగించి జయించి పశువులం దెచ్చుటకై మత్స్యమహీనాథుండు సైన్యమునంతయుంగొని యుద్ధమునకుఁబోయెను. కావున పట్టణములో నిపుడు మనకు సహాయముగ నెవ్వరును లేరు. పసివాఁడనైన నేనొక్కఁడ నొంటరినిగా యీ కౌరవ సేనతో పోరాడఁజాలను. నీవు నా పలుకులాదరింపక, నడ్డముగా నిరుపయోగములైన మాటలు చెప్పవలదు. కౌరవులు మనల తిరిగిచూడకమున్నే తేరుఁ ద్రోలుకొని యూరుఁ జేరవలయును. లేనిబింకమును దెచ్చుకొని తొడరుట యుక్తముగాదు. కావున రథంబును మరల్పుము" అనిన నతనికి పార్థుండిట్లనియె.

"ఉత్తరా! భయపడకుము. పగవారు సంతసించునట్లు నీవీలాగున వెఱపుమాటలం బలుకకుము. పశువులకై వచ్చినవారము వానిని విడిచి పోయినచో మనయశక్తతంజూచి పట్టణమందలి జనులు నిందింపుదురు. అవమానముకలుగును. అదియునుగాక, యందఱును వినుచుండఁగా సైరంధ్రి నా పేరును గొప్పగాఁజెప్పెను. దానివలన నెంతో నీవు నన్ను గొప్పచేసి తోడ్కొనివచ్చితివి. నా శౌర్యమును కొనియాడ వచ్చునపుడు పౌరులు దీవనలొసంగిరి. ఇంతటి గౌరవముతో వచ్చినవారమైన మన మిపు డీకురుబలంబులఁగని, వెఱచి వారు పశువులం గొనిపోవుచుండగా వ్యర్థులవలె విడిచి మరలి పురంబున కరుగుట హీనమైనపని కాఁబట్టి యావులను మరలింపక వచ్చుటకు నాకు సమ్మతముగాదు, నేను రాజాలను. దీనికై నీవు వెఱపు నొందకుము. నీవు ధైర్యమును తెచ్చుకొనుము, కౌరవులిపుడు మిక్కిలి యాశ్చర్యపడునట్లు బలపరాక్రమముఁ జూపి యావులను విడిపించుకొని పురజనులు సంతోషింపులాగున మరలిపోవుద" మని వచియించెను.

ఈప్రకారము పలుకుచునే తేరు పోనిచ్చుచుండుటయు, నర్జునునిం జూచి, మోము వెలవెలనై మానసంబు దిగులుచేఁ దల్లడిల్లుచుండఁగా, పెదవులు యెండుచుండ డగ్గుత్తిక యడర విరాటసుతుం డతనితో "ఓహో బృహన్నలా! నీపలుకులు కడుని

మునసుండియే పారలిపోయినచో మనలఁజూచి పౌరులు నవ్వుదురంటివి. ఇది యాశ్చర్యకరమైన మాటగాని యొండుగాదు. ఏలనవ్వుదురు? ఒక వేళ నవ్వినను నవ్వుదురుగాక, దానివలన లోటుగలుగఁబోదు. కాని నీవిపుడు నామాటల కడ్డము పలుకవలదు. నేను చెప్పెడి విధముగా చేయుదువైతి వేని, పోయియుద్ధమును నీవే చేయుము. క్రొవ్వియున్నావు పోరుటయందు నీవు యెక్కువ యుత్సాహము కలిగియుండునట్లు తోచుచున్నది. నా కలనఁగాదు. నేను రాఁజాలను. ఇంక నీయిష్టము వచ్చినట్లు వర్తింపుము. అటులైనను నేను ముందుకు రానొల్లను దిగిపురంబునకుఁ బోయెద'' నని పలికి, తన బాణములను ధనస్సును నితర సాధనంబులును రథంబుపై విడిచి దిగ్గున క్రిందికి దూఁకి సిగ్గువీడి తొందరగా పట్టణమార్గమునుబట్టి పరుగెత్తి పోవసాగెను.

## కురువీరు లర్జుని రూపముఁగని సంశయించుట

ఫల్గునుం డతని చర్యలఁజూచి తనలో నసహ్యమును బొందుచు బిరబిర గుఱ్ఱముల పగ్గములను నొగలకుముడిచి తేరునిలిపి భూమిమీఁది కుఱికి తలవెండ్రుకలు ముడివీడి వీపున వ్రేలుచుండఁగా, తాను ధరించి యున్న యెఱ్ఱని వస్త్రముకొనలు నేలపై జీరాడుచుండఁగా, యుత్తరుని బట్టుకొనుటకై వెన్నంటి పరుగెత్తిపోనఁదొడంగెను.

తత్సమయంబున కురుబలంబులు నిలిచి వారలంగనుఁగొని వింతఁ జెందఁదొడంగిరి. వారిలో తెలియనివారు పార్థుని ప్రచ్ఛన్నమైన వేషి వేషమును జూచి యతనిని గుర్తింపలేక, యా వికృతాకారమును గేలి చేయుచుండిరి. కాని బుద్ధిమంతులైన వారలతని లక్షణములును దీర్ఘ బాహువులును, శౌర్యమును, నడకయుం జూచి సంశయించి తమలో నొండొరులు ''ఔరా! ఎవ్వఁడోకాని, స్త్రీవేషమును పురుషరూపమునుం గలిగి వికృతముగా కప్పంబడినదైన యితని చక్కఁదనమును, శౌర్య మును ప్రకాశింపక బూడిదగప్పుటచే ప్రకాశింపకున్న నిప్పువలె ప్రకాశింపకున్నాఁడు. బాహువులును, నడయుం జూడఁగా నర్జునుని చందమున తోఁచుచున్నాఁడు. ఇతఁ డర్జునుండుగానే యుండవలెను. సంశయింపవలసినది లేదు. ఎందువలన ననఁగా అతఁడుగాక మఱియొకండు కురుసేనతోఁ బోరుట కొంటరిగా రాఁజాలఁడు. అర్జునుఁడేయైనచో యా భేదితనమెట్లు వచ్చెననుటగదా యిపుడు విచారించవలసిన సందేహ

శము. దీనికిని తగినకారణము కనుపట్టుచున్నది. అర్జునుండుతన యజ్ఞాతవాస సమయ నిర్వర్తనమునకై నిజతేజము దెలియనీయక నీచమైన యీ పేడిరూపమును దాల్చి విరాటరాజునొద్ద యుండియుండనోపును. ఇదియె యిట్టి యాకృతితో నుండుటకు కారణము. అన్యథాతలంపవలసినదియే లేదు. విరాటరాజు పట్టణములో నుండిన బలమునంతయుంగొని దక్షిణగోగ్రహణ యుద్ధమున కేగియుండుటచే నతని కుమారుఁడు మనల నెదిరించుటకై రాఁదలంచి తనకు సారథ్యము జేయువారు లేనందున తేరునడుపుట కితనిని దోడ్కొని వచ్చియుండవలెను మనబలంబులువచ్చి గోవులను బట్టుకొనిన వార్తనీ యుత్తరుండనెడి విరాటుని కొండొక కుమారుఁడువిని, పసివాఁడగుటచే దీర్ఘాలోచనఁ జేయక యహంకారముతో వచ్చి సముద్రతుల్యమైన యీ సైన్యమును జూచి హెచ్చఁగుంది తేరు డిగ్గనురికి మరలి పరుగెత్తి పోవుచున్నాఁడు. కాని, పేడిరూపముతో నుండెడి యతం డర్జునుండనియు, నతని పరాక్రమంబెటువంటిదగుటయు నుత్తరుండెఱుంగఁడు'' అని యివ్విధంబున నాలోచించుచు నిరీక్షించుచుండఁగా, నర్జునుఁడు రయంబున నూరుబారల దూరంబు పోయిన యుత్తరునిండాసి తటాలున కౌఁగలించి పట్టుకొని నిలువరించెను.

## ఉత్తరుఁడు తన్ను విడువుమని బృహన్నలను వేడుకొనుట

అపు డుత్తరుం డతని పట్టు విడిపించుకొనుటకై పెనఁగులాడియును విడిపించుకొనలేక మోము వెలవెలఁబోయి భయముచే పెదవు లెండగా పరితపించుచుండఁగా నతని యొడలంతయుం జెమటపుట్టెను. కాళ్ళును చేతులును గడగడ వడంకసాగెను. గుండెలు తటతట కొట్టుకొనఁదొడంగెను. విలవిలఁబోవుచుండెను. దుఃఖముతోఁగూడిన దీనపుచూపులతో బృహన్నలను చూచుచు, తడబాటు మాటలతో హీనకంఠస్వరముతో విడిచి పెట్టుమని వేడుకొనెను. సిగ్గుపడి పలు తెఱంగుల ప్రార్థించెను. వ్యసన మెక్కుడగుచుండ ''బృహన్నలా! నను విడిచితివేని నేను పట్టణమున కరిగినంతట నూరువరహాలయెత్తుమేలైన యపరంజియు, నత్యుత్తమములైన యెనిమిది గొప్పవైడూర్యములును, మంచిగుఱ్ఱములు కట్టిన తేరును, పది యేనుగులును, మఱియు నొక గ్రామమును నీకు బహుమతిగా నొసంగెద''నని యేడ్చుచు పలికెను. ''మన్నించి విడిచిపెట్టుము.

నాపై మిక్కిలి ప్రేమగలదై నారాక కెదురు చూచుచుండు మాతల్లిని చూడవలయును పోవనిమ్ము నన్ను నిర్బంధింపకు'' మని మఱియుం బెక్కు తెఱంగుల దీనాలాపంబులం బ్రార్థించుచుండఁగా, పార్థుఁడతని చందమునకు నవ్వుచు వినునక తేరుదగ్గరకుఁ గొనివచ్చి యూరడించి యిట్లు చెప్పెను.

"ఉత్తరా! నీవు వెఱవ వలదు. ఈ కురు వీరులతో యుద్ధము చేయుటకు నీకు శక్తి లేకున్నచో నేను చెప్పినట్లు చేయుము. ధైర్యముగా నామాటలు వినుము. ఏమనఁగా నీవు యుద్ధముఁ జేయవలదు. కాని నాకు సారథ్యము నొనరింపుము, చాలును. చిచ్చఱ పిడుగువలె నేనీ శూరుల నందఱును వధించి సేనను బాఱఁదోలి దుర్యోధనాదులజయించి యావులను మరల్చెదను, నాప్రాణము చూడు'' మని చెప్పి యాపలుకులకు విరాట సుతుం డొప్పుకొనకున్నను బలత్కారముగా నతనిని నొగలపైఁ గూర్చుండఁబెట్టి తానును తేరెక్కి రథికుఁడై మున్ను తమయాయుధంబులు బెట్టిన జమ్మిచెట్టునొద్దకు తేరుఁదోలునట్టుచేసి యావృక్షముదగ్గఱ కేగెను.

అర్జునుం డివ్విధమున జమ్మియొద్ద కరుగుసమయంబున, బేడిరూపముతో నుండియు, తేజముచే శత్రుభయంకరుండై కనుపట్టుచున్న యావీరాగ్రేసరుం గాంచి కౌరవ సైనికులు మనంబులు కలంగి నివ్వెఱపాటు నొందియుండఁగా, వారల తీరును, తదీయ లక్షణముల కనుగుణ్యముగా కనుపట్టుచున్న యపశకునములును విలోకించి, ద్రోణాచార్యుండు యిట్లనియె.

## ద్రోణుఁ డుత్పాతములఁగూర్చి కురువీరులతో చెప్పుట

"ఓహో! చూచినారా? మన సేనలో ననేకములైన యపశకునములు కనుపట్టుచున్నవి. సూర్యుని కాంతి మాసినది నలుగడలను నక్కలు కూయుచున్నవి. మేఘము లంతటను మింట వ్యాపించి నానావిధములగు చిత్రవర్ణములు కలిగినవై యున్నవి. వాద్యము లన్నియో తమంతట తామే వికార ధ్వనులతో మ్రోగుచున్నవి. ఇవియునుగాక మనసైన్యమందలి యేనుఁగులు నిష్కారణముగా ముందుకు వంగుచున్నవి. గుఱ్ఱములు కన్నులనీరుఁ గార్చుచున్నవి. పడగలు వంగినవి. కాలిపోయినట్లు వీరులధైర్యము లడంగుచున్నవి. ఆయుధములు మండుచున్నవి. దిక్కుల పొగలు క్రమ్ముచున్నవి. మఱియు నెన్నియో యుత్పాతములు పొడకట్టు

చున్నవి. ఈలక్షణములంబట్టి యాలోచింపఁగా, మహాఘోరమైన సంగ్రామంబు ప్రవర్తిల్లఁగలదని దృఢముగా చెప్పవలసియున్నది. కాఁబట్టి యిపుడు కర్తవ్యమేమనఁగా, యందఱును, మీ మీ వ్యూహంబులను బాగుగాఁదీర్చుకొని మీమీ యాయుధములను, వాహనములను సిద్ధము చేసుకొని భయమొందక దృఢప్రజ్ఞులై నేర్పుతో గోవులను రక్షింపవలసిన”దని చెప్పి ద్రోణుండా బేడిరూపముతో వచ్చినవాడు విజయుండని తనలో తెలిసికొనియున్న వాఁడగుటచే యొకవేళ యాలోచింపక యతఁడు వచ్చెనేమో యజ్ఞాతవాసనసమయభంగం బగునేమో యనెడి సంశయ భయంబులు మనంబునఁ బెనంగఁగా భీష్మునివంకఁ జూచిన, పరోగత జ్ఞానసమర్థుండగు శంతనుసూనుం డాచార్యుని తలంపు నెఱింగియు మిన్నకున్న యతనికి కనుసన్నఁ జేసి యశ్వత్థాముఁ డిట్లనియె.

## భీష్ముఁడు ద్రోణాచార్యుని సంశయము నివారించుట

“ఈవచ్చెడివాఁడు సదుపాయ మెఱుఁగని వాఁడుగాయున్నాఁడు. కాదేని మహావీరులైన యీకౌరవులకుఁ గనుపడునా? ఒక పట్టునొద్దకుఁ బోయెడి నెపమున మనమీఁదికి వచ్చుచున్నాడు. అహంకారముచే యుక్తాయుక్తముల నెఱుంగఁడు. వీని యాకృతిఁ జూడఁగా, నింద్రునివలె కనుపట్టుచున్నాఁడు. ఇటుల సాహసించి వచ్చుచున్న వీని యభిప్రాయ మేమియో తెలియకున్న”దని గూఢార్థముఁగల మాటలు పలికెను.

ఇట్లు ద్రోణుండు చెప్పినవిని భీష్ముఁడతని సంశయము నివారింప నెంచి యామాటలకు జవాబుగానుండునట్టి రహస్యార్థముఁగల వాక్యము లను, తాను దుర్యోధనునితో మాటలాడునట్లు నటింపుచు కడు చతురం బుగా నిట్లు చెప్పెను. “కురువల్లభా! ఆలోచింపఁగా మనమిపుడు శత్రు వుల కనుకూలమైన ప్రదేశమును దాఁటి వచ్చితిమి. అయినను యుద్ధము సమయమున తటస్థించినది, గాని శత్రువుల నింక భయపడవలసినది లేదు” అని నిజాభిప్రాయమును వెల్లడించి యాచార్యుని సందేహమును నివారించి, బహిరంగంబుగా నిట్లనియె.

“మహీనాయకా! ఈవచ్చుచున్న వాఁడు పార్థుఁడుగాని యన్యుఁ డుగాఁడని తోఁచుచున్నది. సింహము గుహాంతరమున నాకలితో కష్ట పడుచుండి ఏనుఁగులనుచూచి, మిక్కిలి కోపముతో వానిమీఁదికి వచ్చు నట్లు పాండవ మధ్యముఁడు మిక్కిలికష్టముతో వనవాసము నజ్ఞాతవాస

మునుం దీర్చి సంకటముల కోర్చియుండి యుద్ధోత్సాహముచే నిలసిల్లు నాంకారముగలవాఁడై మన సేనమీఁదికి వచ్చుచున్నాఁడు. ఈసమయ మున నీ యర్జునునితో యుద్ధము చేయఁజాలిన శక్తివంతులు మన సైన్య ములో లేరు. సులభముగా వచ్చి గోవులను మఱలించుకొని పోవును. బాహుబలముచే నితఁడు శివుని సయితము మెప్పించెనని మనము విని యున్న వారమే కాదా?" యనియెను.

ఇట్లు భీష్ముఁడు పలుకుటయు ద్రోణాచార్యుఁడు తదర్థంబును దెలిసికొని యర్జునునకు సమయభంగంబు లేకునికి కెంతయు సంతసించి యా సంతోషము మొగంబునఁ గనపడనీయక దుర్యోధనునిఁ జూచి "ఔను! మనలో నర్జునుని మార్కొన జాలు వాఁ డెవ్వఁడును లేఁడు. నిశ్చయంబుగా మన సేనలోఁ జొచ్చి చీకాకుపఱచి యా మేటి విలుకాఁడు పసువులను మరలించుకొనిపోవుట నిశ్చయము" అనెను. అతని మాటలు విని కర్ణుండెంతయును నాగ్రహమునొంది యుగ్రదృష్టుల నాచార్యుని వలనుఁగని యిట్లనియె.

"ఓహో! గురుఁడనెడి గౌరవముచే నీమాటలకు మాఱాడనోడి యుండుటం జేసి నోటికి వచ్చినట్లును, తోచినట్లును, పల్కుచుండెదవు. ఎప్పుడును నీవు పాండవ పక్షపాతబుద్ధి గలిగియుండువాఁడవు. హరియందు నీకు ప్రేమ యధికము. ఇట్లుపలుకుట యుక్తము కానేరదు. ఈ సేనలో నర్జును నెదిరింపఁగల వాఁ డెవ్వఁడును లేఁడని చెప్పితివి. ఆహా! ఎట్టివంటి మాటయనవలెను? కౌరవబలంబున కంతకును నీవుమాత్రమే గొప్పవాఁడ వని నీయభిప్రాయము కాఁబోలు. చాలుచాలు, ఇంకనూరకుండుము. సేనలోని వారికందఱకును నుత్సాహము తగ్గిపోవులాగున శత్రువును పొగడుచు, వాని పరాక్రమమునను వెనుదీయుచున్నావు. అర్జునుఁడు కడు గొప్పవాఁడనియు, శౌర్యవంతుఁడనియు నీబుద్ధికితోచినఁ దోచవచ్చును గాని, నిజము నాలోచించినచో, వాని యాధిక్యత నాకు మతేమియుం గనుపట్టదు. పొగడఁదగినంత గొప్పతనమొద్దియు వానియందు గలుగదు. ఈ వచ్చుచున్నవాఁడు కిరీటియే యైనచో, భయపడ వలసినదిలేదు. నాయొక్కయ మోఘములైన బాణములచే వానిగర్వమణంచి యోడించి నా బాహుబల సంపదం జూపి మన సేనలోని వారినందఱను సంతోషింపఁ జేసెదను. నా ప్రతాపమెట్టిదియో యట్టె చూచుచుండు" మని యుగ్ర

దుర్యోధనుండు రాధేయుఁడు చెప్పిన మాటలువిని యిట్లనియె "ఓహో! రాధానందనా! నీవు పొరబాటుగా బలుకుచున్నావు. ఇపుడు మనకు గొప్పలాభము చేకూరినది. అదినీవు తలంపనైతివి. వచ్చినవాఁడు అర్జునుండేయైనచో నెంతయును మేలుచేకూరినట్లే! మరల సోదరులతో గూడి పోయి పండ్రెండు సంవత్సరము లడవులలో నుండి తీరవలయును, తప్పదు. అర్జునుండు కాక మఱియెవ్వఁడైన నగునేని, మదీయక్రూరనారాచ పరంపరలచే నిస్సత్త్వునిఁ జేసి వధించి సేనల కాశ్చర్యమును గలిగించెదను" అని గంభీరముగా చెప్పెను.

ఆ మాటలు తమకు సమ్మతములు గాకయుండినను, భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు కామంగీకరించిన వారివలె లేని వికాసమును మొగంబులకుఁ దెచ్చుకొని సంతోషించినట్లు నటించిరి. అట్టియెడ నర్జునుఁడు తేరును శమీకవృక్షముచెంత నిలుపునట్లు భూమింజయునితో చెప్పి, యతండట్టుల చేయుటయు నిట్లనియె.

"రాజకుమారా! ఈచెట్టుపై గాండీవమను నాదు విల్లు పెట్టఁబడి యున్నది, యదితప్ప తక్కినవిండ్లు నాభుజబలమున కోర్వఁగలవి కావు. ఇపుడు మనయొద్దనుండెడి విండ్లు నీవంటివారికిందగినవి. గొప్పయుద్ధము సంభవించి నపుడివి నాభుజబలమునకు నిలువఁజాలవు. గాండీవమున్ననో యిట్టి వేయి శరాసనముల యంతటి బలముగలది. సామాన్యమైనది కాదు. ఆగాండీవ మున్నచో నెంత దృఢమైన కవచమునైనను, మఱియెంతటి పెద్దవాని నైనను ఖండింప వచ్చును. తగిన యాయుధము లేక బలము మాత్రము కలిగియున్నచో యుద్ధమున నుపయోగింపదు. కాబట్టి నీవు వేగ మీ చెట్టుమీఁదికెక్కి మహనీయంబైన యావిల్లును దెచ్చియిమ్ము. పాండునందనులైన ధర్మజ భీమార్జున నకుల సహదేవులు తమతమ యాయుధంబు లన్నియుం జేర్చికట్టి యీతరువుపైఁ బెట్టియున్నారు. ఆకట్టను విడదీసి యందున్న గాండీవమును మాత్రముకొని తక్కినవి యెప్పటిచందమునఁ గట్టియుండున్న చోటునఁ బెట్టి ర" మ్మని చెప్పెను.

అర్జును డివ్విధమున నియమించుటయు శవాకారంబున నున్న యా యాయుధముల కట్టను గనుంగొని "బృహన్నలా! యది పీనుఁగుగా కనుపట్టుచున్నది. దానినిముట్టుకొనుట యెట్లు? నన్ను రాజపుత్రుఁడనని తలఁపక యిటువంటి యనర్హమగు నీచకార్యమునకు నియమించుట నీకు తగునా? ఈపని నెటుల చేయుదును?"



సుశర్మ గోవుల మరల్చుట.

ఉత్తరుడు బృహన్నలకు గాండీవమును తెచ్చియిచ్చుట.

యర్జునుం డా పలుకులువిని యతని యందు మిగుల నాదరబుద్ధిగలవాఁడై “నృపాలకుమారా! అన్యులంటకుండుటకై మఱుఁగు పఱచి కట్టిపెట్టిన శవాకృతిగల యాయుధముల కట్టయేగాని పీనుఁగు గాదు. నీవు సంశయింపకుము. ఇది పీనుఁగయేయైనచో, దీనినిఁ దాకుటకు రాజపుత్రుఁడవగు నిన్ను నియమింపుదునా? మాటనమ్ముము. ఆయుధముల కట్టగాని శవము కాదు. ఆలస్యముఁ జేయక చెట్టెక్కి కట్టను విచ్చి యందలి గాండీవమును మాత్రము తెచ్చి నాకొసంగు” మని చెప్పిన యుత్తరుఁడు తనకిష్టముగాకుండినను విధిలేక మెల్లగా యావృక్షముమీఁది కెక్కెను.

## ఉత్తరుఁ డర్జునునకు గాండీవమును దెచ్చియిచ్చుటకు చెట్టునెక్కుట

అర్జునుండు రథంబుపై నిలిచి శీఘ్రముగా కట్టను విచ్చికొని రమ్మని త్వర చేయుటయు నుత్తరుండా యాయుధంబుల కట్టకుం గట్టఁబడియున్న బంధంబులు వదలించెను. అపుడందలి యాయుధములు సూర్యాదిగ్రహములు ప్రకాశించునట్లుగా నతని కన్నులు మిఱుమిట్లుగొనఁ బ్రకాశించుచు, భయంకర సర్పముల చందమునఁ గనుపట్టుచున్న చూచి భయమొంది యంట జాలకుండుటం గాంచి యుక్తమైన మంచిమాటలతో పార్థుండు వాని భయము తొలఁగునట్లు చేసెను.

అంతట నుత్తరుండు ధైర్యము వహించి, యాకట్టను విడదీసి, సవ్యసాచిని “సారథీ' యని పిలిచి “ఇందొక గొప్పవిల్లు బంగరు కమలములు పొదగఁబడి మిక్కిలి ప్రకాశముగలదై కొండచిలువవలె నాశ్చర్యమును బుట్టించుచున్నది. పాండునందనులలో దీనిని ధరించువాఁ డెవ్వఁడు? మఱియు నిందున్న యాయుధములు వారిలో నెవ్వఁడెవ్వఁడు దాల్చును? చెప్పు” మని యడిగెను.

అర్జునుం డతనితో “ఉత్తరకుమారా! మొదట నీవు చూచినదియే గాండీవమనెడి విల్లు. అదియే అర్జునునకు ముఖ్యాధారమైనది. ఈ గాండీవమువలననే యతం డనాయాసముగా దేవతలను రాక్షసులను జయించును. అదిసామాన్యమైనది కాదు. భయంకర కాంతులుగల యది పురాణ పురుషులచేఁ గొనియాడఁబడినది. శత్రువులకు భేదింపరానిది. దేవతలచే నిర్మింపఁబడి దోషరహితమైన సకల ధనువులలోనను నత్యుత్తమంబని పేర్కొనుట కర్హమైనది. మహనీయమైన యావింటిని మున్ను బ్రహ్మదేవుండు వేయేండ్లును, ప్రజాపతి యిరువది నాలుగువేల

సంవత్సరములును, నింద్రుండు నెనుబదియైదు సంవత్సరములును చంద్రుండే నూఱేండ్లును, వరుణుండు నూఱు హాయనంబులును క్రమంబుగా ధరించియుండిరి. పిమ్మట వేడుకపడి వరుణుని వలన నగ్ని దేవుండు పుచ్చుకొనెను. అంతట నయ్యగ్ని యర్జునుండు చేసిన యద్భుతఖాండవ దహన కార్యంబునకు మెచ్చి విబ్బచ్చునకు నొసంగెను. అతండును నఱువదియైదు సంవత్సరములు దీనిని ధరింపఁగలండు. ఈవిల్లు త్రిలోక పూజ్యమహిమగలదై యిటుల నొప్పుచుండును. మఱియుం దక్కిన యాయుధంబులం జెప్పెదను విను'' మని యిట్లనియె.

''ఆయాయుధములలో నల్లగలువలరంగుగలిగి బంగారపు వృషభములను దాపియుండువిల్లు ధర్మరాజుది. బంగారపు కోతులను నిలిపినదియు, తాటిచెట్టువలె మిక్కిలి పొడవుగా నుండునదియు నైన విల్లు భీమునిది, నిప్పువలె నెఱ్ఱని కాంతి గలిగి కొనలయందు పైడి చేపలు దాపియుండునది నకులుని విల్లు. బంగారపు నెమళ్ళు చెక్కఁబడి సారము గలిగి యొప్పుచున్నది సహదేవుని ధనస్సు. మఱియు గోచర్మముచేఁ జేయఁబడిన యొరలో నుంచఁగట్టి బాణము అర్జునునిది. అతిశయమగు కాంతులతో నొప్పుచున్న యాగదాయుధంబు భీమసేనుండు ధరియించునది.'' యని యందున్న బాణములు, కత్తులు, కవచములు మొదలైన సాధనంబుల నన్నింటిని వేఱు వేఱుగా రూపించి వర్ణించి చెప్పెను.

## ఉత్తరుఁ డర్జును నెఱుంగక పాండవుల వృత్తాంతము నడుగుట

ఈరీతిం దెలియఁ జెప్పినను బుద్ధిహీనుండైన యుత్తరుం డతని నర్జునుండని తెలిసికొనలేఁడయ్యెను. ఆమూఢుండు పాండవ మధ్యమునిం జూచి ''బృహన్నలా! పాండవులు మహనీయంబులైన యీసాధనంబుల నిచ్చోటం బెట్టి యేకారణమున నెచ్చోటికిఁ బోయిరో నీవు యెఱింగియున్నంత వఱకును చెప్పవలయును. పాండునందనులు మిక్కిలి యోగ్యులు. వారు భక్తితో పెద్దల నాదరించువారు. బంధువులందు ప్రియము గలవారు. శత్రువులకు భయమును బుట్టించు మహాబలవంతులు. నేనన్ననో వారికి మేనల్లుఁడను. వారికిపుడు దైవగతిచే చెడ్డ కాలము ప్రాప్తించి కష్టపడుచున్నారు. అయ్యో! భగవంతుఁడా! పాపము! ధర్మస్వరూపుండయిన యా ధర్మనందనుఁ డెచ్చట డాగియున్నాఁడో, భీమార్జును లెందుబోయిరో, నకుల సహదేవుల వృత్తాంత

మెట్టిదివో, రాజుల భార్య లందరిలోనను నత్యుత్తమురాలైన ద్రౌపది యెచ్చోట నెట్లుకష్టము లనుభవించుచున్నదియో, తెలియదు. అదుర్మార్గులైన దుర్యోధనాదులవలన న్యాయ ప్రవర్తనులగు పాండవేయుల కిటువంటి సంకటములు సంప్రాప్తమయ్యెను, ఏమి చేయవచ్చును? కపటపు జూదము నాడుటచేత ధర్మరాజు శత్రువులను వధింపఁజాలిన బలపరాక్రమములు గలిగియుండు వారైనను, నీచులగు దుర్యోధనాదులకు లోఁబడి పెక్కులిడుములలోఁ బాలయ్యెను. కాలగతి నెవరు తప్పింపఁ గలరు? తమ గొప్ప రాజ్యమును, విడిచిపోయిన వారగుటచే యెందరిగియున్నవారో, వారి వృత్తాంత మేమియుం దెలియ నేలేదు. ఇప్పుడు వారివిషయమును గూర్చి నీవు యేదైనం జెడుమాటలను చెప్పుదువేమోయని భయపడుచున్నాను. అటుల కలుగకుండుటకై దేవునిఁ బ్రార్థించెద" నని వగపు గదిరి యడిగిన యుత్తరున కర్జునుం డిట్లనియె.

"ఉత్తరా! వారిని గురించి వగవవలసినది లేదు. విధివశంబున తటస్థించినట్టి యాపదల నెవ్వరునుం దప్పించుకొనజాలరు. కాలగతి యట్లుండుటం జేసి, వచ్చిన సంకటములకోర్చి తమ ప్రతిజ్ఞను తప్పక వారు పాంచాలీ సహితులై పండ్రెండేడులు వనంబులో నివసించి, పదమూడవ సంవత్సర మజ్ఞాతవాసము జరుపవలసియుండుటచే యిచ్చోటికివచ్చి మన పట్టణములో నాపన్నులై వర్తించుచున్నారు వారి నెఱింగించెద విను" మని తిరిగి యిట్లు చెప్పెను.

## అర్జునుఁ డుత్తరునకు తమ్ము నెఱింగించుట

"రాజకుమారా! కంకుఁడను పేరుతో రాజునొద్ద నుండెడివాఁడు ధర్మనందనుండు, వలలుఁడను వాఁడు భీముఁడు, అశ్వశిక్షకుఁడుగానుండు నతఁడు నకులుఁడు. దామగ్రంథి యను పేరుతో పశువుల కాపరిగానుండు వాఁడు సహదేవుఁడు, చెప్పుట కారంభించినాఁడను కావున నింక దాపకూడదు నేను అర్జునుండను. మాలిని యనుపేరుతో నుండు యువతియే ద్రౌపది. ఆ ద్రౌపదిని మోహించియే నీ మేనమామయైన కీచకుండు చచ్చెను. అతనిని యతని తమ్ములను, గంధర్వులు చంపిరనెడి పేరుతో భీమసేనుండు వధించెను. ఇదియు నీవడిగిన పాండవులమగు మా వృత్తాంతము సుమీ!" యనినుడివెను.

ఇట్లు చెప్పఁగా భూమింజయుం డధికమైన సంభ్రమాశ్చర్యములు మనంబున ముప్పిరిగొన సంశయముఁ జెంది సవ్యసాచిం జూచి

"నీవు విజయుండ నంటివిగదా అర్జునునకు బ్రసిద్ధములైన పది పేరులు గలవు. బృహన్నలా! వానినిఁ జెప్పితివేని నిన్ను నేను నమ్ముదును. సంశయము వీడి యర్జునుండవని తలంతును. ఏయే కారణములచేత యర్జునున కటువంటి పేరులు గలిగెనో, యాకారణములు తెలిసియుండవలయును గదా? వానిని సంతోషము కలుగునట్లుగా యెఱిగింపు" మని యడిగెను.

అర్జునుండతని సందేహము నివారింప నెంచి "ఉత్తరా! వినుము. భూమినంతయు జయించి ధనము నార్జించినవాఁడ నగుటచే ధనంజయుఁడనియు! యుద్ధములందు పరాజయము లేనివాఁడ నగుటవలన విజయుఁడనియు; నా తేరున కెప్పుడును తెల్లని గుఱ్ఱములనే కట్టుట వాడుకగాన శ్వేతవాహనుండనియు, ఇంద్రుఁడొసంగినదియు, మిక్కిలి ప్రకాశముతోఁ గూడినదియు, సమరమున శత్రువులకు భయమును పుట్టించునదియు నైన యభేద్యమగు కిరీటమును ధరింతునుగాన కిరీటియనియు, గొప్ప వీరులకు సయితము చూచుటకు కష్టముగా దోఁచునట్లు యుద్ధములో వెనుదీయక నెత్తురుబురదలుగట్టునట్లు చేయుచుండుటచే భీభత్సుండనియు, సంగరములో రెండు చేతులతోడను వెనుక ముందు, ప్రక్కలందును నొకతీరీతిగా బాణములు ప్రయోగించు చుందును గావున సవ్యసాచి యనియు, నాశరీరము మృదువైన తెల్లని రమణీయ వర్ణముగలదగుటచే నర్జునుండనియు, ఫల్గునీ నక్షత్రమునఁ బుట్టినందున ఫల్గునుండనియు, నేను చూచుచుండగాను యుద్ధములో నెంతటివారైనను నాయన్నయైన ధర్మజుని మేనం గాయమును గలిగింపఁ జాలరు. ఎట్టివా రెదిరించినను జంపుదును కావున జిష్ణుండనియు, నాతల్లికి పృథయను నామము గలిగి యున్నందున నాకు పార్థుండనియు నిటుల నీకారణములవలన పది నామములు గలిగినవి. మఱియు, సకల దేవతలు నడ్డగించినను లెక్కసేయక పుండరీకనాభుని సహాయమున ఖాండవవనంబుదహింప జేసినసమయమున నాప్రతాపమునకు మెచ్చి బ్రహ్మయు రుద్రుండును ప్రత్యక్షమై సంభ్రమమున వినతుండనై యున్న నాయందు కరుణించి, యనేకములైన దివ్యాస్త్రములిచ్చి కృష్ణుండ నెడి పదునొకండవ నామంబొసంగిరి. వారియాజ్ఞచే దేవాధిపప్రముఖులును పెక్కు బాణంబులనిచ్చిరి. ఇంక నరమపతి కిరీటమొసంగిన కారణములును జెప్పెదను విను" మని యుట్లయె.

"ఖాండవ దహనానంతరము వరముచే గర్వించి దేవతలకు జయింపరాని వారును మహాబలశాలురునగు నివాతకవచులను దైత్యులు మూడుకోట్లు వేలుపులం గలంపంగా నిద్రానుమతంబున నతనిరథంబు నెక్కి మాతలి సారథ్య మొనరింపంగా, నొక్కరుండనేగి యారక్కసుల నుక్కడించి గెల్చితిని. దుర్జయులైన హిరణ్యపుర వాసులను దేవతలకు పరమశత్రువులగు దైత్యుల నరువదివేల సంఖ్య గలవారి నరణ్యంబున సముద్రతీరమున నెదిరించి పరిమార్చినాడను. అపుడు పురుహూతుం డెంతయుం బ్రీతుండై దేదీప్యమానంబైన కిరీటము నొసంగెను. మఱియుంగల దేవత లొక శంఖము నిచ్చిరి. దేవతలచేత నివ్వంబడిన దగుటచే యాశంఖము దేవదత్తంబను పేరుసంబరంగె, నేను యెపుడును నిసుమంతయుం జలింపక వెనుదీయక ధీరంబున నందఱు వైరులసేనియుం బారిగొందును. మున్ను దుర్యోధనుండు చిత్రరథుం డనెడి గంధర్వ రాజుచే పట్టుపడినపుడు పదునాలుగువేల గంధర్వుల నిర్జించి యతనిని విడిపించినాడను. మదీయ వృత్తాంత మంతయుం జెప్పితి. ఉత్తరా! నీవింక భయపడవలదు. ధైర్యమున నుండుము. నీవు జూచుచుండంగా యీకూడియున్న కురుసేనలను జయించి, భీష్మ ద్రోణాశ్వత్థామ కర్ణ దుర్యోధన దుశ్శాసన ప్రముఖులు చేయునది లేక నివ్వెఱంగొని కనుచుండంగా మన కరుపులం గ్రమ్మరించెద" నని సత్యంబుగం బలికిన విని యుత్తరుండు సంతోషము నాశ్చర్యము నతిశయింపంగా, దిగ్గ క్రిందికి డిగ్గనురికి, చనుదెంచి భయభక్తులతోడ పార్థునకు సాష్టాంగ దండప్రమాణంబు లాచరించి ముకుళిత హస్తయుగళుండై నిలిచి యిట్లనియె.

## ఉత్తరుండు బృహన్నల నర్జుననిగా నెఱుంగుట

"సమర్థులును, శౌర్యవంతులును నగుశత్రువుల గర్వమునడంచు నట్టి పరాక్రమము గలవాడా! సర్వజనులకును సంతోషముం గలిగించు మనోజ్ఞమైన రూపముగలవాడా! నేడు నీవు యిటుల నాకుంగనంబడుట మదీయ పుణ్య విశేషమని తలంచెద. నాభాగ్య దేవత నీరూపమును దాల్చివచ్చి నాయెదుట తోంచినట్లున్నది. ఇపుడు నాదాభయము పోయి యెనికి బదులుగా సంతోషము గలుగుచున్నది. శూరోత్తమా! ఇంతకుమున్ను నేను నిన్నెఱుంగక చెప్పిన నాయుల్లవు

మాటలు మనసున నుంచక మఱియాదరంబున మన్నించి యాశ్రితునిగాఁ గైకొని రక్షింపుము" అని వినయమున వేఁడుకొనెను. అర్జునుఁ డతని పలుకులు విని మనంబున నతనిపై నెక్కుడైన యనురాగమును మోమున సంతసమును దనరఁగాఁ గన్నులనుండి యానంద బాష్పములు జాలు వాఱుచుండ తటాలున తేరుపైనుండి క్రిందికి దిగివచ్చి యుత్తరునిఁ గౌఁగలించుకొనెను.

అంతట విరాటసుతుండు కలంక దేఱి, దృఢమనస్కుఁడై పాండవ మధ్యమునిఁ జూచి "అర్జునా! ఇప్పుడు నాచిత్తమున నున్న తలపోటు పూర్ణముగా తొలఁగి ప్రసన్నమయ్యెను. నేను యుద్ధముఁ జేయుటకు సమర్థుఁడను కానుగాని, నీపరాక్రమముచే రక్షితుఁడనై శత్రువులు సయితము మెచ్చునట్లు నీకు సంగరములో సారథ్యమును చేసెదను. నేను తేరు గడపుచుండఁగా నీవు విజృంభించి కురుబలంబులను జయించి మన గోవులను మరల్పుము. నీకు యుద్ధములో సారథ్యముఁ జేయవలయునని నాలో పెక్కునాళ్ళుగా కోరికఁ బొందినవాఁడనై యుంటిని, కాని తటస్థించలేదు. దైవానుగ్రహంబుచే యిపుడు సిద్ధించినది. నా వేడికోలు నంగీకరింపు" మనియెను.

సవ్యసాచి యత్యాదరమున నతఁడు చెప్పిన వాక్యములు విని "ఉత్తరా! నీపై నాకు మిక్కిలి ప్రీతిగలదు. కాఁబట్టి నీవు కోరినట్లే చేయుము. ఇసుమంతయైనను నీకు భయముగాని, కష్టమునుగాని కలుగ నీయను. నిన్ను నస్త్రములను కడుజాగరూకుఁడనై రక్షించుచుందును. శత్రువు లెంతటివారై యుండినను వారిని చూచి నీవు వెఱపు నొందవలదు" అని చెప్పిన "గుణాఢ్యా! నీవు పార్థుఁడవనుట నెఱుంగఁగానే నా భయంబు లన్నియు పటాపంచలైనవి. ఇంక నేను దేనికిని వెఱవను, కాని యొక సందేహము నాలో తొలంగకున్నది. దాని నివారింపవలయును. ఏమనగా నీవు పురుషశ్రేష్ఠుండవై యుండియు నిటుల పేడిరూపమున నుండుటకు కారణమేమి? ఈ విషయము నెఱింగించి సంశయము దీర్పుము. ఇదియె నేనడుగఁ దలంచినది" యని యడిగెను.

అతని కర్జునుం డిట్లనియె "నేను ధర్మరాజు నాజ్ఞచే బ్రహ్మచర్య వ్రతమును బూని, మున్ను నాకుఁ గలిగిన శాపకారణమున సిద్ధించిన రూపముతో నొక సంవత్సరము వ్రతము వహించియుంటిని. అది లోకులకు నపుంసకత్వముగాఁ దోఁచెను. అదియును నింక మీఁద నుండదు

సుమీ!" యని తనవికృతాకారమునకు కారణమును చెప్పిన, యుత్తరుండుప్రమోదమానసుండై యతనింజూచి "అయ్యా! అడిగినవిషయములన్నియును విసుగుఁగొనక చెప్పినా సందేహములు నివారించితివి. ఇటుల చేయుట నాయందు నీకుంగల యధికమగు ప్రియంబునకు తార్కాణము అసదృశ పరాక్రమోపేతుఁడవగు నీప్రాపు గలిగినది గాన యింక నేను దేవతలకైనను భయపడు వాఁడనుగాను, నీబాహువుల మఱుగున నిశ్చలుండనై యుండెదను. ఇంకమీఁదట నేను చేయవలసిన కార్యంబెయ్యదియో నిశ్చయించి నన్ను నియమింపు" మనుటయు, నర్జునుం డతనితో "వృక్షమారోహించి యాయుధముల కట్టలోని నాగాండీవంబును, బంగారపు పింజలు గల బాణములుండెడి యంబుల పొదలు రెండును నాయొక్క కవచఖడ్గములును మాత్రము పుచ్చుకొని తక్కిన సాధనంబుల నెప్పటివలె గట్టిపెట్టిరమ్ము"ని నియోగించెను. వల్లెయని యుత్తరుండు త్వరితముగా నర్జునుండు చెప్పినట్లే యాపనులను గావించెను.

## అర్జునుఁడు నిజరూపముఁ గైకొనుట

అంతట కిరీటి నియతాత్ముఁడై యధిదేవతలకు ప్రణమిల్లి భక్తితో యుత్తరుండు తెచ్చియిచ్చిన దివ్యకోదండాదులు గైగొని ప్రకాశవంతమగు స్వరూపముతో చూపట్టెను. పిమ్మట నతండు దేవేంద్రుండు తనకొసంగిన చెవులపోగులను, తలపాగనుం దలంపగా నవి వచ్చెను. యర్జునుండపుడు తలవెంట్రుకలు చిక్కుదీసి చక్కగా ముడివేసుకొని పాగయును పోగులును ధరించి, దృఢముగా నడుమునకుదట్టికట్టి, యప్పుడు తనచేతులలోనుండు గాజులనుచూచి నవ్వుకొనుచు తేరుపై నెక్కెను. అట్టియెడ నతని కిరీటము నందే పుట్టినట్లుగా నాకాశమంతయును ప్రకాశింపఁజేయుచు పొడ కట్టెను.

అతిరథశ్రేష్ఠుండైన యమ్మేటి యివ్విధమున సన్నద్ధుండై యాయుధంబులు పదిలముగా తేరుమీఁద నమర్చిపెట్టి తనుత్రాణాదులు ధరించి, యమ్ములపొదులు పట్టుకొని, గాండీవంబును బుచ్చుకొని యెక్కు బెట్టి సారించి గుణధ్వనిఁ గావించెను. ఆధ్వనికి బెదరి పక్షులును మృగములును నాల్గువైపులకును బాఱందొడంగెను. వృక్షములు చలించెను. కురుబలంబులు భయభ్రాంతినిం బొందెను. ఆకాశమునకు దిక్కులందును ప్రతిధ్వనులు కలిగెను.

పిదప నర్జునుం డగ్ని దేవునిం దలంచి ప్రార్థించుటయు, నతండు తన వరంబుచే మున్ను గలిగిన విశ్వకర్మ నిర్మితంబైన మాయామయంబును, వానరాకారమును గల భయంకరమగు టెక్కెమును దానినాశ్రయించి యుండు వికృతాకారములు గల బహువిధ భూతములనుబుత్తెంచె.అంత నయ్యరదంబుపై నుండిన యుత్తరుని సింగపు టెక్కెమును దీసి జమ్మి చెట్టుపైఁబెట్టించి, యగ్నిదత్తమగు తనహనుమత్కేతనమును రథంబుపై నిలిపి, దివ్యంబైన దేవదత్తంబనెడి శంఖము పొడ సూపుటయుంగొని సంసిద్ధుం డగుటయు, నుత్తరుండు సన్నద్ధుండై నొగలపై నెక్కి, తురంగ ముల పగ్గములు సవరించి పట్టుకొని, యుంగములం దడవుచు వాని జవ సత్వంబులను వర్ణించి చెప్పుట కారంభించెను.

తత్సమయమున సవ్యసాచి యతనితో "ఉత్తరా! చాల తడవైనది సుమా! పసువులు దూరము పోయెను. వేగముగాఁబోయి మనము కలుసుకొనవలయును. తేరును యీశమీ వృక్షమునకు ప్రదక్షిణముగా పోవనిమ్ము" అని పనుచుటయు నుత్తరుం డట్లేగాకయని యతఁడు చెప్పి నట్లు యరదంబునుదోలెను. అర్జునుం డపు డుత్సాహము గలవాఁడై పెక్కు పిడుగులొకసారిపడఁగా కలిగెడి ధ్వనివంటి భంకర శబ్దము బుట్టు నట్లు తన శంఖమును పూరించెను.

అర్జునుఁడు శంఖము పూరించి కురుసైన్యమును కలత నొందించుట

ఆ శంఖధ్వనిచే సముద్రములు కలంగెను. భూమి యదరెను. దిక్కులు చలనము నొందెను. స్వర్గము కలఁతపడెను. పాతాళము భ్రమించెను. గ్రహములును నక్షత్రములును చెదరెను. బ్రహ్మదేవుండు సయితము సంక్షోభమును చెందెను. తటాలున గుఱ్ఱములు క్రిందఁబడి యెను. ఉత్తరుండు చచ్చినట్లు నొగలపై గూలఁబడి తెలివి దప్పెను. అర్జునుండానిధమును జూచి, రథము డిగ్గి గుఱ్ఱములనుతట్టి పగ్గములను పట్టి లేవనెత్తి యుత్తరుని వికృతాకారమును గని యుపచరించి తెలివి నొందఁజేసి ధైర్యము గలుగు మాటలు చెప్పి కౌగలించి యతనితో యిట్లనియె,

"ఉత్తరా! నీవు రాజపుత్రుఁడవు. గొప్ప సేనలతో మెలంగు చుండువాఁడవు. ఇటువంటి నీవు యీశంఖధ్వనికి భయమొందవచ్చునా? ఇవి నీకు క్రొత్తలు కావుగదా! కాఁబట్టి ధైర్యమును వహింపుము"

అనిన విరాటుని సుతుఁడతనితో "నీవు చెప్పినది నిజమే కాని, అయినను నేను యిదివరకు వినిన శంఖ భేరీ ప్రముఖములైన ధ్వనులెవ్వియు దీనివంటివి కావు. ఇది యన్నిటిలో యతిభయంకరము. నద్భుతమైనది. ఇటుల మోహమును గలిగింపగల శంఖధ్వనిని యిదివరకును విన్నవాడనే కాను. ఈ రావము మిక్కిలి యధికమైనది. దీనికి నేనోర్వఁజాలను. పాండునందనా! ఈ మహాశబ్దమువలన నా చెవులు మూతలు పడినవి. దిక్కులు తిరుగుచున్నవి. నామానసమన్ననో, కలఁత నొంది దగ్ధమైనట్లున్నది. నీయొక్క మహోత్తరమైన తేజస్సు నా మనస్సును పరవశ మొందించుచున్నది. మూర్ఛనొందక యెట్లు నిబ్బరముగా నుండుదును!" అనియెను. అర్జునుండా మాటలకు నవ్వి సమయోచితముగాఁబలికి, క్రమముగా భయమును మానునట్లుచేసి, రథమును సాగిపోవనిచ్చి ముందుగా నుత్తరునితో చెప్పి దృఢముగా నుండుమని రెండవసారి భీకరారవంబెసంగ శంఖమును పూరించెను. వెంటనే గుణధ్వనిఁ జేసెను.

## ద్రోణుఁడు దుర్యోధనునకు విజయుని రాక నెఱింగించుట

అపుడా యల్లెత్రాటిశబ్దమును, శంఖారావము నేకమై బ్రహ్మాండమంతయు నిండి చలింపఁజేసెను. ఇవ్విధమున పాండవ మధ్యముండు విరాటనందనుని దృఢచిత్తునిం గావించి, రథము నడుచు చప్పుడును, గుణముక్రమోతయు, చిందంబు టులిపును నతిశయింపగా త్వరితంబుగా వచ్చుచుండు సమయంబున, కౌరవ సైన్యములో ద్రోణాచార్యుండు దుర్యోధనునితో యిట్లనియె,

"కురుకులవల్లభా! వింటివా? అల్లెత్రాటియొక్క శబ్దము బ్రద్దలగునట్లు క్షోభముఁగలిగించుచున్నది. శంఖారావము బ్రహ్మాండమంతయు బగులునట్లు తోఁపగా, సర్వభూతములు మూర్ఛ నొందించుచున్నది. ధ్వజముయొక్క కాంతులు భయంకరముగా నాకాశ మంతయు నావరించుచున్నది. కిరీట రుచులు చూపులు చెదరులాగున మహాప్రకాశము గలదై వెలుఁగుబుట్టించి భ్రమింపఁజేయుచున్నది. కాఁబట్టి యీ గురుతులం బట్టి యాలోచింపఁగా ఇటువంటి యల్లెత్రాటి నాదముగలది గాఁడీవముగానే యుండవలయునుగాని. యొండు గానేరదు. శంఖధ్వని దేవదత్తమునుండి పుట్టినదియే! నిస్సంశయము. కిరీటము దేవేంద్రుని వలన నివ్వఁబడినదియే యని దృఢముగా చెప్పవచ్చును. ఇతర మకుట

# నాలుగవ ప్రకరణము

ముల కింతటి యద్భుత ప్రకాశము కలిగియుండదు. వీనినిబట్టి యిప్పుడు నిర్భయుండై మిక్కిలి పరాక్రమముతో మనపై యుద్ధమునకు వచ్చుచున్నవాఁడు శత్రుభయంకరుండైన యర్జునుండే కాని యన్యుండు కాఁడు. ఇంక మనము వాదులాడుచుండుటచే లాభము లేదు. అతని నెదిరించి యుద్ధముఁ జేయుటకుఁ దగిన గొప్పవీరులను చూచి యేర్పఱుపుము" అని యిట్లు చెప్పి కృపాశ్వత్థామాదులైన యోధవీరుల నవలోకించి "మన సైన్యమందు దుర్నిమిత్తములు కనుపట్టుచున్నవి. వీటిని చూడగా మనకు జయము కలుగుట సందేహమని తోఁచుచున్నది. దీనికొక యుపాయమును చెప్పెదను. నాయుక్తి మీ కందఱకును సమ్మతమై యుండెనేని యటుల చేయుఁడు. ఎట్లనగా దుర్యోధనుండు ముందును, నతని వెనుక గోవులును, వాని వెనుక సేనయు నందఱును పిమ్మట మన మందఱమును విల్లువ్యూహముతీరి నడువ వలసినది. ఈప్రకారము చేసినచో మఖవసుతుండు మనల సమీపింపఁగానే యెదిరించి యుద్ధముఁ జేయుట మనకెంతయు ననుకూలముగా నుండును. ఇది నాయభిప్రాయము. మీకు మఱియెట్లు తోఁచునో యావిధమున కార్యవిధానంబును నిశ్చయింపుఁ"డని చెప్పెను.

గురుం డీరీతిని బలుకుటయు విని సుయోధనుండు భీష్మ, కర్ణ, కృప వికర్ణాదుల దెసఁగనుంగొని, "నేను ముందే యీ విషయమును గూర్చి చెప్పియున్నాను. ఇప్పుడు మనము వెఱవ వలసినది లేదు. పాండుకుమారులు జూదమున నోటుబడి, తాము పండ్రెండేండ్లు వనవాసమును, నొక సంవత్సర మజ్ఞాతవాసమునుం జేయుట కొడంబడికదా వెడలి వచ్చిరి. ఇది మన కెఱుంగ రాకుండునట్లు వారు వర్తింపవలసినదగు పదమూడవ సంవత్సరము ఇంకను నజ్ఞాతవాసకాలము సంపూర్ణము కాలేదు. కొంత యున్నది. ఇట్టి తఱి నర్జునుండేయై యిటువచ్చువాఁడు తాను బయలుపడెనేని మరల పండ్రెండు సంవత్సరము లరణ్యవాసముఁ జేయ వలయును. ఈవిషయమును మనమజ్ఞానముచే తెలిసికొనకున్నను, రాజ్యకాంక్షచే వేగిరపడి వారు వచ్చినను నేర్పాటుప్రకారము జరిగి తీఱవలసియుండును. ఇందలి మంచిచెడుగులను, హెచ్చుతక్కువలును దెలిపి కాలనిర్ణయము నొనరించి పలుకుటకు పితామహుండే యర్హుఁడు. ఉత్తరుని మాత్రమే కాక యర్జునుండు వచ్చుట సయితము మనకెక్కుడు లాభంబే కాని నష్టము కలుగదు. మొదట సుశర్మను దక్షిణపు దిక్కునకు

గోవులం బట్టుటకై పనిచియిచ్చోట పశువులం బట్టుటకై మనము వచ్చుట కేమి కారణము? మత్స్యపురంబున కౌరవు లున్నవారిని శంకించి, యుండినచో గోరక్షణార్థము వారు విరాటునకు సహాయముగా రాఁగల రనియు, అటుల వచ్చినయెడల నెఱింగి వెండియు నరణ్యమునకుఁబనుపఁ వచ్చుననియుం గదా వచ్చినారము. ఆలోచింపుఁడు. మనము మొదటనే యిటుల చేయవలయుననెడి పద్ధతిని నిశ్చయించుకొనియే యరుదెంచిన వారము. దీనికై యిపుడు విచారమేమిటి? అర్జునుండైననేమి? మఱి యెవ్వఁడైననేమి? దేవతలు వచ్చినను మనకు భయములేదు. పగవాఁడగు విరాటుని పెక్కునాళ్ళనుండి సంపాదించికూర్చియున్నవానిగోధనము నపహరించితిమి. ఈపశులం గొనిపోవుటకింక నెవ్వరికిని సాధ్యముకాదు. ఈసమయమున చేయవలసినదియేమనఁగా, మనమించుకయుం జలింపక యెవ్వఁడు వచ్చినను నొకరికంటె నొకరు మించి బాహు బలమును చూపవలయును. కీర్తికరమైన యుద్ధము తటస్థించినపుడు శౌర్యవంతులమైన మనము భయపడరాదు గదా? చిత్తంబులం గలఁతఁజెందక దృఢపఱచుకొని సందేహము వీడి వాహనములు నాయుధంబులును, సిద్ధము జేసికొని ముందుగా నిలచి సేనల కుత్సాహముఁ బుట్టునట్లు చేయవలయును కాని సమయము తటస్థించినపు డొకరిమొగము నొకరుచూచుకొనుచుండుటచే ప్రయోజనము కలుగదు సుఁడీ! మనసైన్యములో గుఱ్ఱములు సకిలించుటయు వెనుకనుండి గాలివీఁచుటయు శుభసూచకములు. జయము తప్పక కలుగును. అర్జునుం డొకండు వచ్చినంతనే యతండేమి చేయఁగలడు? ఈ మహాసైన్యమును జయించుటకు వానికి శక్యమగునా? వింటిరా! ఇతరు లెవ్వరేనియు వినినచో పరిహాసముఁ జేయుదు రనియైన తలంపక మన యస్త్రగురుండింతకు మునుపు నామొదుటనే యర్జును నెంతయుం బొగడి సేనల యుత్సాహమును చెడునట్లు చేసెను. ఇటుల పలుక వచ్చునా? అర్జునుండు వచ్చుటకు కారణముమనపైగల కోపమో, రాజ్యముమీఁది యాశయో తెలియదు. ఏనిమిత్తంబైనను నయ్యెను కాని, ద్రోణుండు తరాతరంబులను బలాబలంబులను యోచింపక పగవాని నిట్లు పొగడుట యుక్తముకాదు. ఆచార్యులైనవారలు కార్యంబు తెలియఁగను దూరముగా చూచుచుండుదురు. యుద్ధప్రసక్తినిఁగూర్చి వారినడుగకూడదు. లోకములో బుద్ధిమంతులైనవారు, భోజనముఁ జేయునపుడును, నాయుద్ధపరిశ్రమ నొనరించునపుడును, నీతి

శాస్త్ర ప్రసంగ కాలమందును, తత్కాలములకు తగినట్లు మాటలాడుదురు. కార్యంబు తెలియ నేరంగక పోట్లాడువారు అటుల పోట్లాడువారిని యుద్ధములోఁ గలిసికొని నిలువకూడదు. దానికిబదులుగా వెనుక నుండి నియమించిన యెడల వారుసంగరమును చూచుచు మనకు విజయంబుఁ గోరుచుందురు, ఇటుల జేయుట మంచిది"యని పలికెను.

## అశ్వత్థామ యుపాలంభముగా దుర్యోధనునితోఁ బలుకుట

ఇవ్విధమున దుర్యోధనుం డనుటయు నవ్వాక్యములు విని యశ్వత్థామ యాగ్రహమునొంది యతనిం జూచి యిట్లనియె. "సుయోధనా! ఇదివరకు పశువులు హస్తినాపురమునకుఁ జేరలేదు. నీవు శత్రువులను జయించిన వాఁడవునుంగావు. ఇప్పటికి నీ సైన్యములు గాని, నీవు కాని నిర్బాధకముగా పురంబును చేరినవారు కారు. ఇట్లుండగా, యల్పులైన యావుల మేపరులను బాఱఁదోలి గోవులనుబట్టుకొని, ఇదియొక గొప్ప కార్యమనియు, మహత్తరమైన పనిని సాధించితిమనియు నెంచి, కడు పొగడుకొనుచున్నావు. ఈరీతి తగినది కాదు. యుద్ధము చేసి శత్రువును జయించి యతని రాజ్యముంగొనిన వాఁడైనను నిట్లు చెప్పనొల్లడు. సత్పురుషుం డిటుల నాత్మస్తుతిని చేసికొనఁడు. జూదముచే మోసముఁ జేసి రాజ్య మపహరించి నీవు నిన్ను మెచ్చి పొగడుకొనుచున్నావు. ఈపద్ధతి యుక్తమైనది కానేరదు. ఇప్పుడు తటస్తించినది యుద్ధము కాని జూదము కాదు. ఓ రాజా! నాఁడు సభలో ద్రౌపదిని రప్పించి యవమాన పఱచుట పాండవులను నీపరాక్రమముచే జయించినావుగదా! అపుడు సహాయుఁడై యుండి యిటువంటి పనిని చేయించిన వాఁడు యెవ్వఁడు? నీమామ శకునిగదా? అదిగో! పగవాఁడు వచ్చుచున్నాఁడు, ఆ శకునియే యిపుడును భయంకరాకారుడై వచ్చెడి శత్రువును జయించును గాక! అన్యులేమిటికి? ఓయీ! ఆప్రకారముగా నీచే నవమానింపఁబడి యాకోపము మనంబునం బెట్టుకొనియున్న వాఁడు కావున, ధృతరాష్ట్రుని వంశ నాశకరమగు ధూమకేతువుఁబోలె, కపికేతనుండైన యర్జునుండు వచ్చెను. ఇపుడు నీవేమి చేయనేర్తువు? గురుండైన ద్రోణాచార్యుని తారతమ్య మెంచక దుర్మదంబున నోటికి వచ్చినట్లు పలుకుట దప్ప నీవలన కాఁగలది యేమియున్నది? దేవదానవుల కయినను దుర్జయుండైన యర్జును నెదిరించి జయించుటకు నీకు శక్యమగునా? అతని ముందు తల

జూపఁగలవా? న్యాయ ప్రవర్తనుండును, నద్వితీయ పరాక్రమ యుక్తుండును నగు నమ్మహావీరుం డెవ్వఁడైన నేమి? అటువంటి వాఁడు పగతుఁడైనను నందఱుచుం బొగడం దగినవాఁడే యగును. ఇపుడు గురుఁడొనరించిన నేర మెయ్యది? యర్జునుని నగ్గించె ననుటయే గదా! ఇది నేరమగునా? ఆచార్యుఁడు తన కొడుకునకంటె నెక్కుడుగా ప్రేమించు శిష్యుని శౌర్యమును మెచ్చి పొగడుట యమ్మహాత్మునికి లోపమని పలుకవచ్చునా? ఓయి! నీచపు పలుకులు పలుకుచున్న నీతో చేరి సిగ్గువీడి యింక నీ ద్రోణాచార్యుఁడు యుద్ధముఁ జేసినఁ జేయును. కాని నీ దుష్ట ప్రసంగమున కోర్చి నేను పోరాడనొల్లను. ఓయి, సుయోధనా! యముఁడు, మృత్యువు, బడబాగ్ని, తమ్ము నెదిరించినచో కొందఱిని వధించి, కొందఱను విడిచినను విడువవచ్చును. కాని యర్జునుని భయంకర బాణచయంబు మెదిరించిన వారిని నిరవశేషంబు గావించును. నాఁటి జూదమునందువలె నీకుత్సితపు బుద్ధులిపుడిచ్చోట సంతోషకరమై యుపయోగించవు. ఈవచ్చెడి యర్జునుఁడు భయంకర గాండీవంబుచే పిడుగులం బోలు బాణములను వర్షించును. కాని పాచికలాడునని తలంపకుము. కావున శక్తిగలదేని యుద్ధముఁ జేసి పరాక్రమమును చూపుము. వ్యర్థపు మాటలివ్విధంబున నేల బలికెదవు? నీవు ఘనుఁడవై యున్న నుండుదువుగాని మా శక్తిం జెప్పెదను. గోవులను మరలించుకొని పోవుటకు విరాటరాజే వచ్చియుండినచో మే మతని నెదిరింపఁగలము. నీవును, నీకు నమ్మకముగల నీ సహాయులుం గూడ యుద్ధముఁ జేసి, జయంబునఁ బొందుం" డని నిర్మొగమోటముగా నుడివెను.

## కర్ణుఁ డశ్వత్థామ మాటలకు జవాబుఁ జెప్పుట

ఈ ప్రకార మశ్వత్థామ చెప్పగా నవ్వాక్యంబులు విని కర్ణుండు మిక్కిలి కోపముగలవాఁడై "ఓహో! బాగు బాగు! తుదకిటులనా యేర్పడినది? మొదట మీరందఱును, గోవులను మరల్చవలయుననియు, పాండవులను గనిపట్టవలయుననియు, నెంచినవారై సమ్మతించిరే కదా వచ్చితిరి? ఇపుడిచ్చోట నర్జునునిం జూచి వెఱచి, యతని పరాక్రమమును పొగడుటయు రారాజును నిందించి పలుకుటయు న్యాయమగునా! భయముగలదేని యెవ్వరెవ్వరు జడిసెదరో వారు యుద్ధము చేయవలదు. మిన్నకుందురు. ఒకని గెలుచుట కొక్కండు చాలఁడా!

ఎందఱు కావలయును? అందఱు నట్టిచూచుచు వుందురు. నే నొక్క-రుండను మాత్రమే వారి నెదిరించి నా ప్రతాపము తెలియునట్లుగా, నతని నెదిరించి వాని కపిధ్వజమును విఱుగఁగొట్టి దాని నాశ్రయించి యుండు భూతములను బాఱఁదోలి యరదంబును తునకలు గావించి సారథి నలంచి యర్జునుని దేహమంతయు బాణ ఘాతములచే చిల్లును పడఁజేసి నొప్పించెదను. అస్త్రతాటి ధ్వని దిక్కులఁ బిక్కటిల్లగా పగతుఁడు భయంకరములైన నా బాణముల వ్రేటులకు నిలువలేక పాఱిపోవు నట్లును, మదీయ పరాక్రమంబుం గని నారదుండు సంతోషించి శ్లాఘించు నట్లును రారాజు మెచ్చునట్లును, రౌద్రాకారుండనై నేనొక్కఁడనే నాభుజబలముం జూపెదను. దీనికై మీరు భీతిల్ల వలసినది లేదు. ఊరక నిలిచి కనుచుండుఁడు. శత్రుబలమనెడి కట్టెలను క్రోధాగ్నిచే దహించు వాఁడనై యర్జునుండను నగ్నిని బాణవర్షముచే చల్లార్చి మీకందఱకును సంతృప్తినిఁ గలిగించెదను. వీరులారా! పాండవ మధ్యముఁడు పదమూడేండ్లు యుద్ధము నెఱుంగక యుండి యిపుడు పరాక్రమించి వచ్చుచున్నాఁడు. అతని బలంబును శౌర్యమును లోకు లెఱుంగుదురు. నేనన్ననో, శక్తిశౌర్యంబులు గలిగినవాఁ వలె వర్తించుచుండుదును ఇపుడు సమయము వచ్చినది. ఆ యర్జునుండును నేనును నీసమయంబున మా భుజబలంబులు మెఱయ విక్రమక్రీడా కౌశలమును జూపి యెల్లవారల మెప్పుగాంచుట యుక్తము గదా! ఇదియునుంగాక, నానాఁటికిని నాయందాదర భావమధికరింపఁగా నన్నెంతయును గౌరవించుచుండెడి యీ రారాజుయొక్క ఋణమును దీర్చుటకును, అర్జునుని యుద్ధములో నెదిరించి నేను జయించెదనని గట్టిగ రాజుతోఁ జెప్పి నా ప్రతిజ్ఞను నెరవేర్చుటకును, 'కర్ణుఁ డర్జునుండును నను వీరిలో నెవ్వఁ డధికుండో' యని తలంచు జనులకు సంశయము నివర్తిల్లఁ జేయుటకును, పరశురాముని యనుగ్రహముచే సంపాదించిన మదీయ ధనుర్విద్యా ప్రౌఢిమను లోకు లెఱుంగునట్లు గావించుటకును, నిపుడు మంచి సమయము తటస్థించినది. కావున నేఁడు నాకు సుదినము. నా పరాక్రమంబును, యుద్ధమునుం జూచుటకు మీకు యిష్టము కలదేని చూచుచుండుఁడు, లేనియెడల గోవులను దోలుకొని వానివెంట నడుగుఁడు'' అని కడుగంభీరముగాఁ జెప్పెను.

## కృపాచార్యుఁడు కర్ణు నధిక్షేపించి పలుకుట

ఆమాటలు విని యోర్వక కృపాచార్యుం డతనిం జూచి "ఓయీ, కర్ణా! ఎప్పుడును నీవు యుద్ధమునకే కాలుద్రువ్వుచుందువు. కాని కార్యసాధన ప్రకారము నెఱుంగవు. ఎటుల కార్యసిద్ధి కలుగునో యా యుపాయంబు నెప్పుడును యోచించువాఁడవు కావు. కార్యసిద్ధి కాఁ దగిన యుపాయములలో యుద్ధము హీనమైన యుపాయంబని పెద్దలు పలుకుదురు. ఇట్లనుటచే యుద్ధము పనికిరాదని కాదు గాని, దేశకాలము లెఱింగి తగినట్లు పోరుసలిపిన యెడల జయము సిద్ధించును. అటులగాక మూర్ఖత్వమున తన్నును, శత్రువును నెఱుంగలేక యాలోచింపక సంగరమునకుఁ గడంగినచో బరాజయము కలుగును గాని జయము చేకూరదు. అర్జునుం డొకండేకదా యని యాలోచనఁ జేసితివి కాఁబోలు, ఐననేమి? రాధేయా! అతండు సామాన్యుఁడా? ఇంద్రాది దేవతల నందఱను జయించి ఖాండవ దహనముఁ జేసెను గాదా! అపు డెందఱుండిరి? అర్జునుం డొక్కఁడే కాదా? బలవంతులైన యాదవ బలంబులను పటాపంచలుగాఁ బాఱఁదోలి సుభద్రను గొనివచ్చెను. తోడ నెవ్వరుండిరి? అతఁడొక్కఁడే కదా! కౌరవులకు గౌరవము కలుగునట్లు పోయి దిగ్విజయముచేసి యనేకములైన కానుకలం దెచ్చిన వాఁడతఁడు మాత్రమే కదా! ఘోష యాత్రకై పోయినపుడు చిత్రరథునిచే పట్టువడి కొనిపోఁబడుచున్న దుర్యోధనుని గంధర్వులను గెల్చి విడిపించి తెచ్చిన దెవ్వఁడు? అతఁడొక్కండే కదా! మఱియు, నివాతకవచులను జయించినదియు, వేలుపులు సయితము జయింపలేని కాలకేయులను జయించినదియు, నీయర్జునుం డొక్కండే కదా! ఇంక నొక్కవిషయమాలోచింపుము. ద్రౌపదీ స్వయంవరమునందు, యెందఱో రాజులు కూడి యర్జునునితో యుద్ధముఁ జేసి యోడి పోయిన దెఱుంగుదువు కదా! అపుడు నీవు వారితో నుండిన వాఁడవుగాదా! ఉన్నవాఁడవో, కావో నిజముగా చెప్పుము. ఇప్పటి నీయొక్క ప్రతాప మపు డెచ్చటికి పోయినది? పాండుపుత్రులలో నొక్కఁడొక్కడును, గొప్పపరాక్రమముగలవాఁడై శత్రువులను జయించి గొప్పపేరును పొందియున్నాఁడు. నీవన్ననో, ఈదుర్యోధనుని యాదరమునకు పాత్రుడవై మహాపరాక్రమవంతునివలె నిచ్చట కడుగొప్పగా బింకపుమాటలు పలుకుచున్నాఁడవు. వలదు. మిన్నకుండుఁడు.

ఏదీ! నీవు కావించిన గొప్పకార్య మేదేనియుం గలదేని యొక దానిం జెప్పుము. ఏమి చేసితివి? గర్వముచే రజ్జుల పలుకుచుండెదవు, ఇంక చాలును, నీప్రసంగము నింత పట్టుచాలింపుము. ద్రోణాచార్యుం డర్జు నుని పరాక్రమమును పొగడినది కడుతప్పుగా భావించుచున్నావు. కాని తారతమ్య మెఱుంగవు. ఆచార్యుడే యననేల ఇపుడు నేనుం జెప్పె దను. రాధేయా! నీవు యిపుడు గర్వించి యొంటరివై యర్జునుని మాఱొ్కని యుద్ధము చేయనెంచుట సముద్రము నీది దాఁటుటకును, కార్చిచ్చులో నుఱుకుటకును, నాదిశేషుని కోఱలు పెఱుకుటకునుందలంచి నట్లున్నవి. పెనుగాలి వీచుచుండగా, మండుచున్న మంటను చల్లా ర్చుటకొక్కండు పూనిన విధముగా నీవు మాత్రమొక్కరుండ వాయర్జు నునితోఁబోరఁజాలవు, ఇదినిశ్చయమైనమాట. నీపట్టుదల నిరుపయో గము. వేగిరపడి పూనితివేని కష్టమును పొందగలవు, తప్పదు. ఈ ప్రగ ల్భోక్తులు లాభకరములు కావు. నామాటలు వినుము. మనమందఱము నెటులనైనను రాజును రక్షింపవలయును. కావున యుద్రేకమువీడి తద్వి ధానము నాలోచింపఁ గలిగిన యోచింపుము. దుర్యోధనుండును, భీష్మ ద్రోణాశ్వత్థామలును, వారితో చేరి నీవును, నేనును మాఱొ్కని యా యర్జును నెదిరింప వలయును. కాని యిందెవ్వఁడు నొక్కఁడు పోరఁ జాలఁడు. అతనితో యుద్ధముఁజేయుటకు శివునకు సయితము శక్యము కానేరదు. అందఱుంగలసికొని జయమునకు బ్రయత్నింపదగు" నని పలికెను.

## రాధేయుఁడు కృపాచార్యు ననాదరంబుగాఁ బలుకుట

కృపాచార్యుం డివ్విధమున చెప్పఁగా కర్ణుండెక్కుడుకోపము గల వాఁడై యుగ్రముగా నతనిఁ జూచి "ఓహో, సరి! నీ స్వభావము బాగుగాఁదెలిసినది. ఈ కురురాజు నిన్ను శత్రువులందు ప్రీతికలవాడవని యెఱింగి యుండియుం దనకు సహాయముగాఁ దోడ్కొని వచ్చినాఁడు. నీ నడువడి మంచిదికాదనుటను నేను తెలియని వాఁడనుకాను. లోకములో దుర్బలులును, పిఱికివాఁడు నైనవారు కుటుంబ సమేతముగా తమ యేలిన వాని సొమ్ము తనివి గలుగ ననుభవించి యతని యన్నముఁదిని గుడ్డకట్టి మహాసంతోషముతో కాలము జరుపుచుండి యుద్ధము తటస్ పించి నపుడు జాడగా తొలంగిపోవుదురు, కాని ధైర్యముతో ముందు

నిలిచి కృతజ్ఞత గలవారై సంగరముఁ జేయనొల్లరు. అట్టివారిలో నీవు నొకండవని చెప్పవలయును, అయ్యో! పాపము! నీవు యుద్ధముఁ జేయఁ జాలవు. యజ్ఞములందు పక్వాన్నము వలసినట్లు భుజించుచు, నిర్వైరసన చిత్తుండవై యుండుము పొమ్ము. ఈ రాజైన దుర్యోధనుండు నిన్ను యుద్ధసమయంబున పోరాడుటకు బదులుగా, స్వేచ్ఛగా తిరిగినిడిచినాఁడు. ఈప్రసక్తితో నీకింక నేమి సంబంధము గలదు? ఇటులనంటినని కోపమును పొందక యింటిమార్గమును బట్టుము. ఓయి కృపాచార్యుఁడా! యుద్ధము నావంటి శూరాగ్రేసరులు చేయదగిన కార్యముగాని, నిన్నుఁ బోలిన మనుజులకు సాధ్యమగునది కాదు. నేను విల్లుచేతఁ బట్టి నిలిచితినేని పదునాలుగు లోకములును భయముఁజెందును. నా బలమును పరాక్రమంబునుం దెలియక తోఁచినట్లు పలికినాఁడవు. అర్జునుండు నీకుగొప్పగాని నాకతండొక లెక్కలోనివాఁడు కాడు. పగవాఁడొక్కనికై యింత దూరము విచారింప వలయునా? వానిని జయించుటయొక గొప్ప కార్యమా? ఇంక నీవలనఁగా దేని నోరును మూసికొని జరుగురీతిని మిన్నక చూచుచుండు'' మని యలక్ష్యముగా బలికెను

## భీష్ముఁడు కర్ణునిఁ దూలనాడుట

రాధేయుని పలుకులు విని యోర్వక భీష్మాచార్యుం డతనిపై నసహ్యత దోఁపగా, దుర్యోధనుం జూచి ''కౌరవేశ్వరా! ఇది యెంతయు నసంగతంబును, ననర్హంబునైన ప్రసంగముగాని వేఱుకాదు, ఇపుడు ద్రోణుండు చెప్పిన మాటలు నీతియుక్తములై యుండునవిగాని, వ్యర్థమైనవికావు. అశ్వత్థామయు సముచితముగాఁబలికెను. కృపాచార్యుని వాక్యంబు లెంతయును యుక్తము లగును, వీరు చెప్పిన పలుకులలో నేమి తప్పు గలదు? ఇంకని య్యంగ రాజన్ననో తారతమ్య మెఱుంగక మాటలాడుట కేవలము నీచముగా తోఁచుచున్నది. తాను మన్ననగల గొప్పవాఁడై యుండిన నుండును గాక! సంగర పాటవంబుగలుగు మాటలు చెప్పుట తనకు తగునుగాని, ఇంచుకయైనను మరియాద నెంచక మాన్యులైనవారి నివ్విధమున నలతిఁగాఁ బలుకుట యుచితంబుగాదు. ఇవి రాజాదరంబుచే పొసఁగిన గర్వోక్తులు గాని యన్యములు కావు. సమర్థుడైనవాఁడు దేశకాలము లెఱింగి సమరము చేయవలయును. కాని యీ తీరున పెద్దలైన మనుష్యుల నవమాన

కరముగాఁ పలుకరాదు. బలపరాక్రమములుగల శత్రుఁడు సమయము చూచి యుద్ధమునకు వచ్చినపుడు దూరదృష్టి గలిగిన బుద్ధిమంతుఁడెవఁడును నిట్లు పలుకుటకు సాహసింపఁడు. మహాత్ములగు వారన్ననో సుగుణములు గలవారు, పగతుఁడైనను వానిని పొగడుదురు. సమయము వచ్చినపుడు పరాక్రమమును జూపుదురు. ఈకర్ణుఁడు కార్యము రీతి తుది మొదలెఱుంగఁడు. ఎపుడును మిక్కిలి గర్వముతో కడు గొప్పవానివలె పెద్దలను దూషించుచుండును. గురువులును పెద్దలునగు ఘనులు, పూజ్యులును, గౌరవముగా మాటలాడుట నర్హులగుదురుగాని, నిందింప దగిన వారలగుదురా? ఇటుల చేయుట యయోగ్యుల లక్షణముగాని, మంచిది కానేరదు" అని పలికి కృపుని యొక్కయు నశ్వత్థామ యొక్కయు కరంబులు గ్రహించి వారితో "మీరు ఘనులరు, విన్వచ్చుండు వచ్చుచున్నాఁడు. ఇపుఁడు చాలపనియున్నది. ఇది విరోధంబునకు సమయంబుగాదు. సర్వము దెలిసిన వారగు మీరలు వివేకంబు చాలని వాఁడేదేనియు నొకటి పలికిన నట్టి మాటలు మనంబులం బెట్టుకొనక కర్తవ్యము నాలోచింప వలయును. కోపమును జెందకూడదు, నాపలుకులు వినుండు. మనమందరమునుం గూడి కయ్యంబు జేయుదము. గొప్పసంకటము తటస్థించినపుడు వేఱుపాటు లిగడని బుధులు వక్కాణింపుదురు. ఒకవంక వేదంబులును, మఱియొక వంక ధనుర్వేదంబునుం బెట్టుకొని యుండెడి మహానుభావులరగు మీకు సమానులెందునుం గలుగరు. కరు బలంబులకు నెద్దియేని కీడొకటి వాటిల్లెనేని ప్రసిద్ధి నొందిన యుత్తములరుగా నుండియు మిన్నక చూచుచుండిచో యీనిందకు మీరు పాత్రులు గావలసి యుండును. కాఁబట్టి, మీరు క్షమింపుఁడు. తెలివిలేక యెవఁడైన నొకమాట యన్నచో దానిని మనసునఁ బెట్టుకొని మనలను నమ్మి యున్న రాజు కార్యమును చెడగొట్టరాదు. అటువంటివారు మీరు కాదు" అని కలంకు తొలంగు మాటలతో వినయముగాఁ బలికెను.

ఆ మహనీయుని పలుకులు విని ద్రోణాదు లతనిం జూచి బదులాడకుండిరి. మఱిమఱియుం జెప్పుచున్న సమయంబున కృపాశ్వత్థామలు భీష్ములతో "అయ్యా! మన్నించుటకుఁగాని, రాజకార్యమును చెడగొట్టుటకుగాని బాగుచేయుటకుఁగాని మేము తగినవారము కాము. మాకు మన్నన కావలసినదియే లేదు. ఏమియైనను సరేము

నకు నస్త్రగురుండే తగినవాఁడు. మీరితని కోపమును దీర్చిన, చాలును. మమ్ముగూర్చి యేదియుం జెప్పవలసిన యావశ్యకము గలుగ" దని చెప్పిరి.

## భీష్ముఁడు ద్రోణాచార్యుని వేడుకొనుట

భీష్మాచార్యుం డంతట నూరకుండక, దుర్యోధన కర్ణులను బోధించి కూర్చుకొని గురుని సమీపించి బహుప్రకారంబుల కార్యసందర్భముల నుపన్యసించి యిట్టి తన కోపంబుడుగుట లెస్సయని పల్కి చెంత నుండు దుర్యోధనుం జూచిన, యతండు పితామహుని యభిప్రాయంబు నెఱింగి గురు ననేకభంగుల ప్రార్థించి, యశ్వత్థామను బతిమాలి, కృపుని మన్నింపుమని యడిగికొనెను. ఇట్లు భీష్మదుర్యోధనులు తమ్ము వినయంబునఁ బ్రార్థించుటయు, ద్రోణుం డంతకు మున్ను మనంబునఁ బొడమి యున్న కోపంబును వీడి ప్రసన్నుఁడై యందఱును వినఁగా నిట్లనియె.

"ఉత్తముఁడైన యీ భీష్ముఁడు చెప్పినపుడే నాకోపము తొలంగినది. పెండియు కురుపతి యెంతయుం బ్రార్థించుటం జేసి నాలోనికలంగు దీఱినది. ఇంక మీఁదట తెలియక కాని, సాహసించి కాని దుర్యోధనునకుఁ గీడుగలుగునట్లు మనలో నెవ్వరును ప్రవర్తించకూడదు. జాగ్రతగా జరుగవలసిన విధానము నాలోచించుట మంచిది. అర్జునుం డెక్కుడు కష్టము లనుభవించి యున్నాఁడు. కావున మనపై కోపముతో తన ప్రతాపమును చూపును, కావున నప్రమత్తులమై యుండి యొకటిగా కూడి మనమందఱము నతని నెదుర్కొనవలయును. ఇంతకు పూర్వము కురురాజు, పాండవుల వనవాసాజ్ఞాతవాసముల కాలమును గురించి సంశయించి పలికియున్నవాఁడు. ఈ విషయమును నాలోచింపఁ దగినదియే కాని, దానిఁగూర్చి నిజమైన తెఱంగెట్టిదియో యెఱింగి సందేహము నివారించుటకు భీష్ముం డొక్కరుండ తగినవాడు. ధర్మాధర్మజ్ఞుండైన యతనికి సకల విషయములు కరతలామలకంబు, కావున యీ సంశయం బతండె నివారించుఁగాక" యని చెప్పి భీష్ముని వంకఁ జూచెను.

## భీష్ముఁ డర్జునునకు ప్రతిజ్ఞాభంగము గలుగమిం దెలుపుట

ఈ ప్రకారము వచించిన గురుని మాటలు విని గాంగేయుండు గురుపతింగని, అర్జునునకు ప్రతిజ్ఞాభంగము కలుగదు. వారి నిర్ణయ కాలమైన యజ్ఞాతవాస సంవత్సరము తీఱినది. ఎట్లనగా రెండేసి యొంత

కొకటి యధిక మాసము వచ్చును. ఆ యధిక మాసము లన్నియుం గూర్చి లెక్కించిన యెడల పదమూడేండ్లను నిన్నటితో సరిపోయెను. అర్జునుండు కొత్తవాఁడు కాఁడు. ఈ లెక్క నెఱింగియే యతండు తన ప్రతిజ్ఞాకాలము సంపూర్ణ మగుట నిశ్చయించుకొని, నేఁడు మనకు గనఁబడి నాఁడు. పాండవులు ధర్మవర్తనులు గాని యధర్మమున నడచువారు కారు. అనఘుఁడును వారికి న్యాయకర్తయునైన ధర్మతనయుండు నాయకుఁడై యుండఁగా నెన్నఁడు న్యాయపథముం దప్పి వర్తించుట కెంతమాత్రమును సమ్మతింపఁడు. ఎన్నెన్నియో కష్టముల ననుభవించి చిక్కియున్న కౌంతేయులు వివేకహీనులై తమకు మరల కష్టము కలుగుట నెఱింగి యుండి త్వరపడి మనకు కనఁబడుదురా? వారు నీతిఁదప్పి చరించువారే యైనచో జూదమున నోడిన నాఁడే యుద్ధమునకు వచ్చియుండుదురు. ధర్మమునకు కట్టుబడిన వారలగుటచే సైరణతో కాలమును నిరీక్షించుచుండిరి. ఇప్పుడన్నో తమ ప్రతిజ్ఞ తీరినది. కావున నింక వారు తమ పరాక్రమమును చూపక మానరు. మనము జాగరూకతతో సన్నద్ధులమై యుండవలయును. ముఖ్యముగా నొకమాట చెప్పెదను వినుఁడు. ఆ వచ్చుచుండెడివాఁ డర్జునుండగుటచే మనమే జయింపఁగలమని తలంపకూడదు. యుద్ధములో రెండు పక్షములకును నెట్లు జయము కలుగును? ఒక పక్షమునకు జయమును మఱియొక పక్షమున కపజయమును గలుగుచుండును. కాఁబట్టి కర్తవ్యమెయ్యది? జయాపజయములను రెంటికిని సిద్ధమై, యేది గలిగినను తత్ఫలము ననుభవించుటకు సమ్మతించి సమరమున కాయత్తులమై యుండవలెను. ఈ సందర్భము లన్నియుందలంచి యాలోచింపఁగా, వారితో నేదో యొకవిధముగా సంధిగావించుకొనుట యుచితంబని నా బుద్ధికిఁ దోఁచుచున్నది'' అనెను.

ఇట్లు భీష్ముఁడు చెప్పినవిని దుర్యోధనుఁడు చిఱునగవుతో కూడిన ముఖముగలవాఁడై పితామహునింజూచి ''ఔను! నీ చెప్పిన పద్ధతులన్నియు వినుటకు బాగుగానేయున్నవి. కాని అయినను, పాండవులకు రాజ్యభాగము నిచ్చుటకు నాకు యిష్టములేదు. ఇవ్వఁదలంచ లేదు. ఇవ్వను. కాఁబట్టి మఱి యేవిధమునను వారికిని మనకును సంధి కుదరనేరదు. కర్తవ్య మెట్లనఁగా పరాక్రమము వహించి యుద్ధము చేసి జయమును పొందుటకే నిశ్చయించినాను. ఇంక సంధి మాటలు విడిచి కర్తవ్యంబు తెఱంగును గూర్చి యాలోచన సేయుం'' డని దృఢ

టచ్చుటను, మోహరించియుండి నడుచునట్లుగా యేర్పాటు నొనరించి, యుద్ధోత్సాహముతో వ్యూహం బీలాగున నెంతయు దృఢమై యుండఁగా, తాఁటి సిడెంబుతో నొప్పుచున్న యరదంబు నారోహించి యాసేన కంతటికిని తాను వెనుకనుండి నడిపించు చుండెను.

ఈలాగున కురుబలంబు లరుగుచుండు సమయము నొక్కఁడైన యర్జునునకును, నధికమైయొప్పు కౌరవ సైన్యమునకు జరుగఁబోయెడి గొప్ప యుద్ధమును చూచుటకు యిచ్ఛగలవాఁడై యేర్పాటుగా మునులును, దేవతలును గొలుచుచుండఁగా సుదర్శనం బనుపేరుగల విమానంబుపై నెక్కి దేవేంద్రుం డాకాశ పథంబున నరుదెంచెను. స్వర్గము నందుండిన రాజులును, చక్రవర్తులును, తమతమ యుత్తమ చిహ్నాది విభవములతో నవ్విమానముపై సురపతిని పరివేష్టించి యుండిరి. పురందరుని చెంగటనే నొక పెద్దగద్దియపై, దేవతా స్త్రీలు వింజామరలు వీచుచుండఁగా మహావైభవముతో పాండురాజు సకలాలంకార శోభితుఁడై యుత్సాహముతో కూర్చుండి యుండెను.

## అర్జునుఁడు కురుబలంబుల కూడముట్టుట

తత్సమయమున, యర్జునుని భయంకర దేవదత్త ధ్వనికి సహింపలేక ముఖములు త్రిప్పుచు రథము వేగముచే నెగసిన ధూళిగప్పి వివర్ణము నొంది కోతిటెక్కెంబు కాంతులు కన్నులు మిఱుమిట్లు గొలుపఁగా తెలివిఁదప్పుచు, శత్రు భయంకరుండై వచ్చుచున్న విజయుని యుగ్రమూర్తిం జూచి, తల్లడిల్లుచుఁ బోవుచున్న కౌరవసేనం జూచుచు, గుఱిపెట్టినట్లు చక్కఁగా మహావేగముతో తన తేరు నడచుచుండఁగా, ప్రళయ కాలమున వేయిమంది భైరవులు గర్జించిన విధముగా భీషణారావ మొసంగ సింహనాదము చేయుచు కిరీటి యాబలంబుల సమీపించి, క్రోసెడు దవ్వుపోవు నంతటి లోపుననే వెంబడించి, యుత్తరునిం జూచి యతనితో "ఉత్తరా! అదిగో! చూచితివా! మనకు ముందు పెద్ద సేన యొకటి యరుగుచున్నది. దానికి ముందు భాగమున కొంత సైన్యము పసులం దోలుకొని పోవుచున్నది. ఈ రెండు భాగములకును ముందు మఱియొక సైన్యభాగము చనుచున్నది, కనుము. భీష్మాది యోధవీరు లీప్రకారముగా మనరాకను చూచి యేర్పాటుగా సేనలను పంచి నడిపించుచుండెదరని తోఁచుచున్నది. ఈసైన్యములలో దురభిమానము కలవాఁ

డును, నహంకారియు, దుష్ప్రసంగముఁ జేయువాఁడును, దుష్టాత్ముఁడును నగు దుర్యోధనుం డెచ్చట నున్నవాఁడో తెలియలేదు. ఇపుడు మనము చేయవలసినది యేమనఁగా, దుశ్శీలుండగు దుర్యోధనుం డెచ్చట నున్నవాఁడనో కనుఁగొని యెందఱు మనకడ్డము వచ్చినను లెక్కసేయక కడచి, మొదట వానిమీఁదికి పోవలయును. వానియున్నచోటు నెఱుంగ వలయునుగదా! కావున యిపుడు నీవీ గొప్పసైన్యమునకు ప్రదక్షిణముగా తేరును పోనిమ్ము. దుర్యోధనుని పట్టుకొనిన యెడల ఈ సేనయంతయు విఱిగిపోవును. సులభముగా నావులను మరల్పవచ్చును. ఇట్లు సర్వకార్యములను సాధింపవచ్చును. ఈ గొప్ప సేనలో నతఁడు కనపడని యెడల మనము వీరిని విడిచి ఆవుల మందను శీఘ్రముగా వెంబడింతము. మనకు పసుల మందలు చీలిపోకుండ మరలించుకొని వచ్చుటయే ముఖ్యమైన కార్యము. ఆ పనిని మనము సాధించితిమేని దుర్యోధనుండు తప్పక చిక్కును'' అని చెప్పెను. ఉత్తరుం డతని పలుకులువిని అట్లే చేసెదనని రథమును సేనలకు ప్రదక్షిణముగాఁ బోనిచ్చుటయు, సమీపమునకుఁ జనినంతట నర్జునుండు తలయెత్తి యాసైన్యమును నలువంకల బాగుగా చూచెను.

ఇట్లు కలయఁగనుంగొని యందు మధ్యమందునను, కుడిప్రక్కను, యెడమ ప్రక్కను, ముందును, వెనుకను, పదమురను, సుత్రగమునను, నుండిన వారినిట్టి వారని సారథి కెఱింగించి ''ఉత్తరా! ఈ బలంబులలో వీరియందు దుర్యోధనుండు కనుపడలేదు. ఆలోచింపగా నతఁడు గోవులంగొని ముందు పోవుచున్నాఁడని తోఁచుచున్నది. రాజు లేనపుడు వ్యర్థముగా యీ దళంబులతోఁ మార్కొని యేమి సేయవలె? ఏమి లాభముగలదు? కావున యీ సేనలు మనల నడ్డగించి యుద్ధమునకుఁ గడంగుటకు మున్నే మనము దాఁటిపోయి ముందుగాఁ బోవుచున్న సైన్యమును తాఁకి నిలువరింప వలయును, రథంబును బోనిమ్ము'' మ్మని త్వర చేసిన యుత్తరుండటుల చేయుటయు, వింట శరంబులు సంధించి, గురు కృప గాంగేయుల చరణసమీపస్థలంబులం బడునట్లు నమస్కార సూచకముగా రెండేసి బాణంబులను ప్రయోగించెను.

## ద్రోణుఁ డర్జునునిఁ బ్రశంసించుట

అపుడు ద్రోణాచార్యుండా సవ్యసాచిని చూచి సంతుష్ట మానసుండై సమీపవర్తులగు నాప్తజనులతో మెల్లఁగా ''ఆహా! అర్జునుని

భక్తియు మరియాదయు నింత యొప్పుచుండుట ప్రశంసింపఁదగిన విషయము. చూచితిరా! అతం డెంతయు సద్గుణోపేతుండగుటచే యిర్విధమున నమస్కార కుశలప్రశ్న సూచకముగా బాణము వేసి మాయందు తనకుఁగల గౌరవభావమును వెల్లడించెను. ఇట్టివిగదా యుత్తమజనుల లక్షణములు” అని మెచ్చి పొగడెను.

ఈ ప్రకారము పొగడి మరియు నిట్లనియె. “అదే చూడుఁడు. చలించుచున్న గాండీవముయొక్క కాంతి మెఱుపువలెను, ఱెక్కమందలి గసిగర్జనము ఉఱుమువలెను, తేరు వర్షాకాలపు మేఘమువలెను నొప్పుచుండఁగా నర్జునుండు మేఘవాహనుండైన దేవేంద్రుని చందమున ప్రకాశించుచున్నాఁడు. అహో! అనేక బలవంతులైన శత్రువు లనెడి వేసవికాల మడంగిపోవును. పెద్ద కాలము యెడబాసి యున్నవాఁడు కావున నిపుడు నమస్కార కుశల ప్రశ్నములు చేయుటకు గుఱుతుగా, పాదంబుల బడను, చెవుల వెంబడియుం బోవను రెండేసి బాణముల వేసెను.

ఈ యర్జునుండు పదమూడేండ్లు మిక్కిలి కష్టము లనుభవించి యధిక కోపముతో వచ్చినవాఁడు. కావున పరాక్రమముతో సమీపించి యీ యాయుల్పసైన్యమును నిర్మూలింపక విడువఁడు. వనవాసము నజ్ఞాతవాసమును నెఱవేర్చి యిపు డర్జునుఁ డుదయించిన సూర్యుని చందమున కనఁబట్టుచున్నాఁడు” అని చెప్పెను.

భీష్ముండును కృపాచార్యుండును ఫల్గునుం డేసిన బాణములు నమస్కార కుశలప్రశ్నా సూచకంబులని గ్రహించి తమలో నతని భక్తివిశేషంబున కెంతయు సంతోషించిరి. విజయుండా తక్కిన వారి కయ్యానసరంబున చూచుటకు శక్యముకాని భయంకరుండై యాసైన్యములను గణింపక యనాదరించి, ముందు సేనలతోఁ బోవుచున్న యావుల దెసకై పోవఁ దొడంగెను. అవ్విధంబునుఁ జూచి గాంగేయుండు కురువీరుల నవలోకించి వారితో నిట్లనియె.

## భీష్ముఁ డర్జును నడ్డగించుటకై కురువీరులఁ బురికొలుపుట

“ఓ వీరాగ్రేసరులారా! ఈ యర్జునుని చాల దినములకు చూచినారము. అయ్యో! పాపము! మిక్కిలి కష్టము లనుభవించి వచ్చినాఁడు. ఇతఁడు సజ్జన ప్రియుండును మిత్రుల కధీనమైనవాఁడును, చుట్టము

లకు మేలుచేయువాఁడును, వైరులకు భయమును బుట్టించు వాఁడునై నగువాఁడు. లోకమందు ఈయర్జునుని వంటి యోగ్యులు కలుగరు. ఆహా! ఇతని యాకృతియు తేజమును చూచుటకు మనకు దుస్సహముగా నున్నది. లోకమంతయుం బాలింపఁదగిన వాఁడని చెప్పవచ్చును. మనకు వెనుకనుండి వచ్చియు మనల సమీపించుటకు ఇష్టము లేనివాఁడై తన రథమును తొలగించుకొని, యోరచూపులతో మనవంకఁ జూచుచు, ముందునకు వడిగా సాగిపోవుచున్నాఁడు. ఇతఁడు చనుచున్న విధమును చూడఁగా మనలో నిచ్చట దుర్యోధనుండు లేకుంట, తెలిసికొని ముందుపోవుచున్న వాఁడని యెంచి వేగముగా నతనిమీఁదికి నరుగు చున్నాఁడని తోఁచుచున్నది. నిస్సంశయముగా నర్జునుని యభిప్రాయము మదియె కాని వేఱుకాదు. దుర్యోధనునిపై నర్జునునకు మిక్కిలి కోపము గలదు కావునఁబట్టి యతనిని పరాభవించి యలయించుటకే పోవుచున్నాఁడు. ఇపుడు కర్తవ్య మెట్లు? ఈవివ్వచ్చుఁడు మనకును దుర్యోధనునకును నడుమఁ జేరెనేని గొప్పసంకటమే యేర్పడును. అసహాయ శూరుఁడైన యితనితో దుర్యోధనుం డొక్కఁడు పోరఁజాలఁడు. శీఘ్రఁగా నిలిచి నె దిరించి పోరాడ లేకపోవునుగదా! ఇంక నొరులమాట యర్జునునకు లెక్కయా? కురుపతి యితని కెంత మాత్రము నోడిపోవును? సందర్భ మీటుల నేర్పడినది. కావున సత్వరముగ నిపుడు మన మీ దళమును పోయి దుర్యోధనునకు సహాయముగా నతనితో చేరవలయును. పోనిక తడవుఁ జేసితిమేని కార్యము చెడును, నిశ్చయము, అర్జునుండు దుర్యోధ నునిఁ దాకి యతనిని వధించెనేని యందఱము మనము కలిగియుండియు ప్రయోజనమేమి? కురురాజు మడసిన నంతట అప్పు లేమిటికి? ధనము లేల? ఏవి కలిగినను వ్యర్థమే! మీరింక నాలస్యము సేయక నడువుఁ'' డని మిగుల తొందఱపాటుతో కూడిన మాటలు చెప్పి బలంబులఁ బురి గొల్పెను.

ఈతీరున సురాపగానందనుండు సేనలం గదలించి రయంబున దనతేరు నావంకకుఁ బఱపించి పోనఁ దొడంగుటయు నతనివెంట సైన్యం బంతయును త్వరితగమనంబున నడువసాగెను. ఆగొప్పదళంబులు తన వెనుక తఱిమివచ్చుటయు బహువేగముతో గోవులం దోలుకొని ముందు వైపున సైన్యభాగ మరుగుచుండుటయు, గనుంగొని గోరక్షక సేనలకు దాను సమీపముగా జని, రెండు క్రోసుల దూర మరుగు నంతలో

మొలుంగులును, నొక్కటిగా కలిసి, భూమ్యాకాశ మధ్యమున నిండి పిక్కటిల్లెను. తత్సమయంబున గోవులు చెలరేగి తోఁకలు మీఁది కెత్తుకొని, భూమి యదరుచుండగా వెనుకకు మరలి యుత్త ముత్రై యర్జునుండు వచ్చిన వారిం బట్టి పురంబు దెసకు పరుగెత్తి పోఁ దొడంగెను. అదియె సమయంబని యాగోవుల వెంటనే పోవుచుండిన వానిని మేపు గొల్లలును, తమ పసువుల వెంటఁ బరువిడి పోయిరి.

అర్జునుం డవ్విధంబుఁ గాంచి భూమింజయునితో "ఉత్తరా! మన గోవులు పట్టణపు దిక్కునకు దారిబట్టి పోవుచున్నవి. గోపకులు నరుగుచున్నారు. ఇపుడు చేయవలసిన దేమనఁగా, వెనుక వచ్చుచున్న సేనలు మనయావుల కడ్డపడకుండునట్లు చేయవలయును కావున శీఘ్రముగా నడుమ ప్రవేశించునట్లు తేరును బోవనిమ్ము" అనిన యుత్తరుండు నటుల చేయుటయు, నర్జునుండు పసువుల వెంటఁ బరుగెత్తి పోవుచున్న గొల్లలంబిలిచి "మీరు భయపడవలదు. ఆవులను దోలుకొని పట్టణమున కరుగుఁ" డని వినునట్లు బిగ్గరగా నరచి చెప్పెను.

అంతలో, గుఱ్ఱములతోడను గజములతోడను కురుబలంబులు వాని కడ్డపడ వచ్చుటయు, మేఘములవలె గపిసిన యా సేనల నర్జునుండు ఝంఝూవాతమునుంబోలె పటాపంచలు చేసి పాఱద్రోలి యావులను చెదరిపోవనీయక యచ్చోటును దాటించిన గోపాలకులతో నయ్యావులు పోయి తమ పొలము ప్రవేశించెను" అని యివ్విధముగా వైశంపాయన మహర్షి యర్జునుండు గోవులను మరలించిన తెఱంగుం జెప్పిన విని జనమేజయుం డత్యాశ్చర్యమును జెంది, "మహాత్మా! అద్భుతముగా తోఁచుచున్నది. పాండవ మధ్యముఁ డవ్విధంబున గోవులను మరలించి నంత నేమి జరిగినది? యర్జునుం డేమి చేసెనో, కురునాథుం డేమి గావించెనో, యతని సైన్యము లేమయ్యెనో, భీష్మాది యుద్ధవీరులెట్లు వర్తించిరో, పిమ్మట నడచిన వృత్తాంతము నెఱింగింపుఁ" డని మిక్కిలి ప్రియముతో నడిగెను.

నాలుగవ ప్రకరణము-సంపూర్ణము

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



# ఐదవ ప్రకరణము



దేవా! అవధరింపుము. ఋషిశ్రేష్ఠుండు జనమేజయ చక్రవర్తినిం జూచి, యర్జునుండు కురుసేనలను ఛిన్నాభిన్నములు చేసి చీకాకు నొందించి గోవులను పురంబు దెసకుం బోవ మరలించి నంతట జరిగినవృత్తాంతంబు నిట్లని చెప్పనుపక్రమించెను. "ధరావరోత్తమా! తరువాత జరిగిన విధంబును వినుము. అర్జునుండు శత్రువీరులు చూచుచుండ, అడ్డు లేని తన భుజబలము నతిశయింపఁగా గోవులను మరలించి యంతఁబోవక, తనకు కొంచెము దూరమందు కనపట్టుచున్న దుర్యోధనునిం జూచి యుత్తరునితో "రాజనందనా! అదిగో! మనకు యెదుట దుర్యోధనుండు గానవచ్చుచున్నాఁడు. చూచితివిగదా! మన తేరును రయంబున నతనియొద్దకుం బోనిమ్ము" అని చెప్పెను. అతని యిష్టానుసారముగా నుత్తరుండు రథమును నటుపంపఁ దొడంగెను.

అర్జునుడనున నింక తడసిన కార్యంబు దప్పుననెడి తలంపుతో త్వరితముగా కురువీరులు మూడువేల రథంబులతోడను, గాంగేయకర్ణ లోకోత్కృష్టుండు వేమోసి తేరులతోడనుం గూడుకొని ముందు మిగిలి కురుపతి దెస కరుగుచున్న నిర్వచ్చున కడ్డమై యెదురుదిరిగి నిలిచిరి. అపుడు కౌంతేయు బ్రహాసనొంది పట్టి పఱచుకొనిన పశువులు విడిపించుకొని పోంబడుట కెంతేయు నగచుచు, చేయునది లేక నిట్టూర్పులు బుచ్చుచున్న యా సుయోధనుండును, తనతమ్ములు మొదలైనవారితోం గూడి నేయి రథంబులతో గాంగేయాదులను వెంబడించి, యెదురు దిరిగెను. తెక్కున బలంబులనుం జేరి కవియంబడియె.

ఈ ప్రకారముగా కౌరవ బలంబంతయు నొక్కటియై యెదిరించె, నయ్యవసరంబున నర్జునుండు పరాక్రమ గర్వ మతిశయింపఁగా, యాసైన్యములం జూచి చిఱు నవ్వు నవ్వుచు, వీర రసము మూర్తీభవించెనో యనునట్లు తన యాకారము కనుపట్టుచుండఁగా యుత్తర కుమారునితో నక్కడి యోధాగ్రేసరుల నిరూపించి చూచి యిట్లనియె.

## అర్జునుఁ డుత్తరునకు కురువీరులఁ దెలుపుట

"ఓయి యుత్తరకుమారా! ఈ సైన్యములోని వీరులంజూడుము. బంగారుచే కల్పింపఁబడిన యజ్ఞ వేది ధ్వజము కలవాఁ డస్త్రగురుండైన

ద్రోణాచార్యుఁడు. సింగపుతోఁక టెక్కెమువాఁ డశ్వత్థామ. అదె యావంక పసిండి వృషధ్వజమువాఁడు కృపాచార్యుఁడు. [illegible] శంఖకేతనమువాఁడు కర్ణుఁడు. రత్నమయమగు సర్పధ్వజము గలవాఁడు దుర్యోధనుఁడు. శత్రుభయంకరమైన తాళధ్వజము గలవాఁడు మా పి తామహుఁడై యున్న భీష్ముఁడు. నీవు కేతనములను చూచి నేను చెప్పిన ప్రకారముగా వారు ఫలానివారని గుఱుతు తెలిసికొనుము.

వీరిలో ద్రోణాచార్యుఁడు మహాపురుషుఁడు. పూజ్యుఁడు. మా వంశపు రాజకుమారుల కందఱకు నాచార్యుఁడు. కావున మన మా మహాత్ముని దిరస్కరింపకూడదు. ఈ ద్రోణునకుఁ బ్రదక్షిణముగ మన రథంబును దోలుము. ద్రోణాచార్యుఁడు సామాన్యుఁడు కాఁడు. సకల విధాస్త్రశస్త్ర ప్రయోగోపసంహారక్రియా నిపుణుఁడు. లక్ష్యభేద ము లెఱిఁగి కడుదూరము వఱకును బాణములు పఱపి యాలక్ష్యములు నరి పడునట్లు చేయఁగల సామర్థ్యముగలవాఁడు. ఎక్కువ బాహుబలమును, ధనుర్విద్యయం దద్వితీయ పాండిత్యమునుం గలిగినవాఁడు. ఇతనిం జూచిన నెంతటి బలియులైన శత్రువులును భయమొందుచుందురు. కాఁబట్టి ఈ ద్రోణాచార్యునితో మనము యుద్ధమునకు పూనకూడదు. మాయ జూదమున మమ్ముగెలిచి గర్వించియున్న దుష్టులగు దుర్యోధనుని సంహరించుటయే నాకు కర్తవ్యము. ఇపుడు నేనతని వధింపఁబోవుచుండ నామీఁద ద్రోణుం డడ్డపడి బాణములు ప్రయోగించునో మిన్నకుండునో చూడవలయును. ఆచార్యుడు మనల నెదిరించినపుడు అతనితో పోర వలయునేగాని ముందుగా పోఁకూడదు. అశ్వత్థామయు మహాబలవంతుఁడు. అతఁడు శివుని వరముచేత బుట్టినవాఁడు. కురువీరు లందఱిలో నను గురుపుత్రుండు మేటి యనవచ్చును. అతని పరాక్రమమునకు దేవతలు సయితము భయమొందుచుందురు.

కృపాచార్యుఁడు మాతండ్రికి స్నేహితుఁడు. అధికమైన ధైర్యమును, నస్త్రవిద్యయం దపారమైన పాండిత్యమునుం గలవాఁడు. ఇతడు ద్రోణాచార్యునికి సమానమైన వాడని చెప్పదగును. చిన్నవాడు మాకు మొదట నితఁడే విద్యను నేర్పెను. ఈ ద్రోణాచార్య కృపులు మిక్కిలి పూజ్యులగుటచే తొలుత మనమై వీరితో యుద్ధమునకుఁ బోవుట తగదు. ఒకవేళ వీరు మనకెదురైరేని తేరు నుపాయముగా తప్పించి యావలికిఁ బోవనిమ్ము.

నేర్పరి. మాయందును దుర్యోధనాదుల యందును సమబుద్ధి గలిగి యుండును. అయినను మాకు మేలు గోరుచుండెడివాఁడు, సత్యశీలుఁడు. అటువంటివాఁడు యుద్ధమున కేల వచ్చెనని యడిగెద వేని, ఆతఁడు దుర్యోధనునియొద్ద నుండుటచే నిపుడు వారికి సహాయుఁడుగా నరుదెంచెను. కాని మాయందు కోపమువలన వచ్చినవాఁడు కాఁడు. ఎంతటి లక్ష్యమైనను తప్పక కొట్టుటయందు గాంగేయుండు మిక్కిలి సమర్థుండని యెఱుంగుము. అతఁడు నిరుపమాన శక్తిసంపన్నుఁడగు పరశురామునితో యుద్ధము చేసి జయించినవాఁడు. కాఁబట్టి భీష్మునిసమీపమునకుఁ బోవక సేన్యాలోఁ ద్రిప్పించి రథమును త్రోలుము. అతనిదండ మహ్యోసేని యొక యదుర్గైనను మనల ముందునకు సాగి పోనిన్నాఁడు. దుర్యోధనుని యొద్దకుఁగాని, సేనలమీఁదికిఁగాని చనినచో మిక్కిలి కష్టము నొందింతును.'' అని యీప్రకారముగా నర్జునుండు కురువీరులను గూర్చి వారి పరాక్రమమును వేఱువేఱుగా వర్ణించి యుత్తరునకుఁ దెలియఁజెప్పి యుద్ధోన్ముఖుం డయ్యెను.

## అశ్వత్థామ కర్ణుని గోష్ఠోక్తులు బలికి పరిహసించుట

అట్టియెడ నశ్వత్థామ కర్ణునిం బిలిచి సరోష సోపహాసోక్తుల నిట్లనియె. ''ఓయి రాధేయా! ఇంతకు పూర్వము నిన్ను నీవు పొగడుకొని తోఁచిన లాగున నెన్నియో ప్రగల్భోక్తులు పలికినాఁడవుగదా! సమయము వచ్చినది. అదుగో! చూడుము. లేడిగుంపుమీఁదికి పులివలె యర్జునుండు మనసేనలమీఁదికి వచ్చెను. ఇపుడందరకును సంతోషము గలుగునట్లు ధైర్యముతో నతని నెదిరించి యుద్ధముఁ జేయుము. మాటలకుఁ దగిన చందమున ప్రతాపమును చూపుము. దుర్యోధనుండు తన కార్యభారమంతయును నీతలమీఁద నే యుంచి యుండెను గదా! ఊరకుండిన నెట్లు? అర్జునుని మార్కొని పోరాడుటకు శక్తి చాలక నీకు భయము కలిగిన యెడల శకునితో నాలోచనఁ జేసి మాయ జూదమైన నాడింపుము. కురురాజు నిన్ను నమ్మి యున్నందు కేనియో యొకటి చేయుట యుచితము'' అని యెత్తిపొడుపు వాక్యములు బలుకుటయు, నప్పలుకులు విని కర్ణుం డధికమైన యాగ్రహమును జెంది కన్నులు రక్తవర్ణము దాల్పఁగ నత్యుగ్రుండై యశ్వత్థామను తీక్ష్ణదృష్టులం గాంచి యతనితో పరుషముగా నిట్లనియె.

"ఏమీ! ఓయి, యశ్వత్థామా! ఏమి చెప్పితివి? నేనా? యర్జునునిం జూచి భయముఁజెందువాఁడను? భయ మెందువారలలో మొదటి వాఁడనగు పిరికి పందను నీవు గాని నేను గాను. అల్పుఁడవైన నీవు నన్ను గేలి చేసెదవా? ఛీ! ఇంక నోరుమూసుకొని మిన్నకుండుము. శూరుండైన వాఁడు హీనసత్త్వుఁడగు నీవలె వెనుదీసి పలుకుటకు సాహసింపఁడు. నీసహాయమును గోరి నేను యుద్ధమునకు రాలేదు. నీవు నాకొక లెక్కలోని వాఁడవు గావు. అర్జునుఁడే కాదు, వానియబ్బయగు దేవేంద్రుండు వచ్చినను నాకు భయము లేదు. నా పరాక్రమ మెఱుంగక యూరక వదరెదవు. ఇప్పుడు నీవు నా సామర్థ్యముం గనుచుండుము" అని పలికి కర్ణుం డధిక రోషముతో సన్నద్ధుండై యుద్ధోన్ముఖుం డయ్యెను.

ఈపూర్వమే యుద్ధసన్నద్ధులై భీష్మ ద్రోణ కృపాశ్వత్థామాదులు పార్థుని నెదిరించిన యది చూచి ససైన్యంబుగా దుర్యోధనుఁడును నతని ముందుకుఁ దన తేరును దోలించుకొని పోయెను.

పూర్వోక్త ప్రకారముగా నాయైన గురు భీష్ములును, దుర్యోధనుండును నొకటిగా గూడి మహాకార్యోత్సవంబున నెదిరించుటయు, నయ్యావసరంబున దుశ్శాసన దుష్ప్రిమ దుర్ముఖ ప్రముఖ కౌరవకుమారులును, శకుని సైంధవ ప్రభృతులగు బంధువులును, బాహ్లీక సోమదత్తాది సామంత సింహంబులును, మఱియుం బెక్కండ్రు యోధులును, వీరులును, నొక్కమారుగా ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, పదాతులును నొప్పారుచుండగా వీరపాటుగ దురంగా త్రోచిపడిరి.

అట్టి సమయంబున భూమి చలించెను. అంబరతల మంతయును ధూళి గప్పెను. సూర్యరశ్మి గానరాకుండెను. వాద్యధ్వనులచే దిశలు మాఱు మ్రోగుచుండెను. భూమ్యాకాశముల మధ్యభాగ మెల్లను సైనికులు యాయుధముల కాంతులు నిండి దేవతలకు సయితము తేఱిచూచుటకు శక్యముగాకుండెను.

## అర్జునుఁడు కౌరవ బలంబులను దునుమాడుట

శతముఖ నందనుం డప్పుడు భయంకరమైన వెగటు నగవుతోఁ గూడిన ముఖము గలవాఁడై, యా దళంబులను దళాధిపతులను మార్కొని, బాణప్రయోగమును చేయుటయు, అల్లెత్రాడు నుండియు వింటికొనలనుండియు చేతులనుండియు శరపరంపరలు తమకు తాముగా

నే వెడలుచున్నవో యని తోఁచునట్లు మొత్తములు మొత్తములుగా బోయి శత్రువులఁ దాకుచుండెను. గాండీవగుణధ్వనివలన బ్రహ్మాండము పై చిప్ప పగిలిన చందమును దోఁపఁ జేసెను.

ఇట్లు ఎదిరించిన పదాతి సైన్యమును ధ్వంసము చేసిన యనఁగని యాపీనుగులం ద్రొక్కుకొని తనమీఁదికి వచ్చుచున్న యితర సేనలం జూచి సంతసించి గాండీవమును చేత దృఢముగాఁ బట్టుకొని గుఱి దప్పకుండులాగున శరములఁ బ్రయోగింప దొడంగుటయు నవి యొక్కొక్కటియుం బెక్కులై, వైరి బలంబులం దాకుటయు, వానిచే పెక్కండ్రు కూలిరి. అనేకుల దేహములు భేదించుకొని పోవుటచే వారి శరీరములు రంధ్రము లేర్పడి రక్తధారలు స్రవించుచుండెను. కౌరవ సైన్యములో వీరు లనేకు లతని నెదిరించి క్రూర నారాచాహతిచే హతులగుటం జూచి మఱియుం బెక్కండ్రు గూడి యమ్మేటి విలుకానినిఁ దాకి యతని ధాటికి సైఁపలేక తదీయ గాండీవముక్త ఘోరభల్ల సముదయములచే వధింపఁబడి పుడమిపైఁ బడిరి.

అయినను కురుబలంబులు వెనుదిరుగక యుత్సహించి మఱి మఱియుం దన మీఁదికి వచ్చుచున్న యర్జునుండు, వారు ప్రయోగించు సాయకముల వలనను, నితర సాధనములవలనను, తన తేరునకు సారథికిని గుఱ్ఱములకు దెబ్బలు తగులకుండులాగున నేర్పు మెఱయ శాత్రవుల బాణచయంబును వారించుచు, వారి యమ్ములను గొన్నిఁటిని చీల్చియు, కొన్ని తుత్తునియలుగా ఖండించియు కొన్నిఁటిని పొడియగునట్లు చేసియు కొన్నిఁటిని చెక్కలు ముక్కలుగావించియు నన్నిఁటిని నాశముఁ గావించెను. మఱియును శత్రువీరుల కవచంబులు చించియు, రథంబుల జూర్ణీకరించియు, ధ్వజములను గుఱ్ఱములును విఱుగనేసియు తన పరాక్రమమును, శరలాఘవంబునుగాంచి వైరులు సయిత మాశ్చర్యమొందు విధంబున విక్రమ కేళి సల్పెను.

మింట దేవతలును, క్రింద శాత్రవులును పొగడుచుండఁగా నమ్మహావీరాగ్రేసరుఁడు విజృంభించి వింటి నారిని మాటిమాటికిని మ్రోగించుచు నర్ధనిమిష కాలములో సైనికుల దేహములు దూట్లుపడి రక్తములు చక్కఁగా పూచిన మోదుగ చెట్ల యడవి చందమున చూపట్టెను. అంతట పేరుపొందిన రాజు లతని నెదిరించిన, వారి తోడన యుత్తమ బలయుతమైన సైన్యములు కలిసి యర్జునుని యరదంబు చుట్టు

ముండెను. ఆ బలంబు లందలి గుఱ్ఱములకు గట్టిన చిఱుగంటల యొక్కయు గదంబులకుఁ గట్టిన పెద్ద గంటల యొక్కయు, వడివడిగా నడుచు తేరుల యొక్కయు ధ్వనులొక్కటియై దిక్కులు పిక్కటిల్లునట్లు వినఁబడుచుండెను.

తాత్కాలమున దేవత యావేశించిన వాని విధంబున నుప్పొంగి యర్జునుండు విజృంభించుటంగని యుత్తరుం డత్యుత్సాహముతో నతని శ్లాఘించుచుండఁగా, ఆ భూమింజయుని పొగడ్త వాక్యములను నతనికిం బొసగిన సంతోషమును విని గనుంగొని తనలో మిగుల సంతోషమును జెంది, పాండవమధ్యముండు మఱియు నుద్రేకించి పూని సదా విల్లు మండలాకారముగా కనుపట్టుచుండఁగా, యెడతెగక గుణధ్వని కలుగుచుండగా శత్రువులపై బాణముల వర్షము గురియించెను. చూపరు లర్జునుండు గుణధ్వని యెడతెగక మ్రోగుచుండగా విల్లు సదా మండలాకారముగా వంగియుండ కరలాఘవము మెఱయ బాణములు ప్రయోగించుటను చూచి, ఆశ్చర్యమును జెందుచుండిరి. ఒక్కసారిగా తన కిరణములను భూమి నంతటను బ్రసరింపఁజేయు సూర్యుని చందమున నర్జునుండపు డొక్కసారిగా కౌరవసేనలో నంతటను దగులుచుండునట్లు నిశిత శరపరంపరలం బరపఁ దొడంగెను. అతని లక్ష్యమా సాయకము [illegible] యుండెను. ఆ బాణములు తగిలి [illegible] ములు, ఏనుఁగులు, తేరులు, కాల్బలములును, నసంఖ్యముగా నేల గూలఁ దొడంగెను. విలువిద్యయం దసామాన్య పాండిత్యము గల యాయోధాగ్రేసరుండు తన రెండు భుజములకును రెండు బాణములపొదలు తగిలించుకొని యిరుచేతులతోడను వెనుక ముందు ప్రక్కలకు శరములు ప్రయోగించుటచే యవ్విధమున రెండమ్ముల పొదలుండుటకు యతని కెంతయు ననుకూలముగా కనుపట్టుచుండెను.

అర్జునుని రథమునిచో, మనస్సు నిరాటంకముగా సంచరించు లాగున సమస్థలమనియు, విషమస్థలమనియు లేక, ధారాళముగా యిష్టమైనట్లు నలువంకలను దిరుగుచుండెను. తత్సమయంబున బలంబులను నిర్బలంబు లొనరింప నెంచి యతండు మిక్కిలి పరాక్రమముతో తనరథమును సైన్యములు రెండు భాగములుగ చీలునట్లు నడుమఁ బరపించి, మరల నడ్డముగాఁ బోనిచ్చి నాలుగు భాగములుగా చీలునట్లు చేసి వెండియు మూల మూలలకునుం బోవుచు, చిన్న చిన్న గుంపులుగా విచ్చి

నశించిన విధముగా నయ్యర్జునుండు మహాసముద్రంబు బోలిన కురుబలము నందు జేరి నాశముఁజేసి దాని గర్వము నడగించెను. అతఁడా సైన్యంబునకు ప్రళయకాల మృత్యు సదృశుండై చూపట్టెను.

ఆ సమయంబున గుఱ్ఱంబుల త్రొక్కుడుచే రేగినధూళి యడఁగునట్లు, నెత్తురులు చిమ్మిన క్రోవిలోనుండి వెలిగియుబాగున గల్లుబాణములు తగులుటచే మీఁదికెగయుచుండఁగా. రుధిర సిక్తములైన యా శరంబులంతటను వ్యాపించి, సూర్యకిరణ సమూహముల ననుకరింపఁగా, నటుల నెగసిపడిన నెత్తురుధారలచే దడిసిన భూప్రదేశమంతటను నెఱ్ఱగా నొప్పుచుండుటచే యుద్ధభూమి సాయంకాల సంధ్యారాగయుక్తమగు గగన తలము చందంబున శోభించుచుండెను.

బాణ ఘాతలచే పగిలి యేనుఁగుల కుంభములనుండి రాలిన ముత్తెములు నక్షత్రసమితియుం బోలికనుపట్టగా గాండీవివలనఁ ద్రుంపబడుచున్న వారణంబుల గండస్థలంబుల మూఁగియుండి వెడలిచి పాఱు తుమ్మెదగుంపులు పొగలుగను, శత్రుబాణము లర్జునుని బాణములం దగిలిన యొఱయిక చేకలుగుచున్న కాంతులు మంటలుగను, భయంకరమైన కార్చిచ్చువలె నర్జునుని కోపము మించి శరము లొండొరుల దాకిన చటచ్చటా ధ్వను లతిశయింపఁగా కౌరవసేనాకాననమును దహించెను. మఱియు నప్పుడు నెత్తురు మడుగులు నీళ్ళుగాను, తెల్ల గొడుగులు తామర పూవులుగాను, వింజామరలు హంసలుగాను, గొప్ప యుద్ధరంగము గొప్ప తటాకంబువలె యుండఁగా నర్జునుండు త్రుంచుచున్న కతన నెగిరి పడుచున్న వైరుల సాయకంబుల యినుప ముక్కులా కొలనికిం బోవుడి తుమ్మెదలవలె నొప్పుచుండెను.

సైనికుల తలలు పగిలి వెలువడిన మెదడులు రొంపిలాగునను, తెగిపడియున్న వారి కాళ్ళు చేతులు గనిమలవలె కనుపట్టుచుండఁగా నది నెఱిఁగి కాపుఁవాడు పిత్రుటకై భూమిరొంపిచేసి దున్ని పెట్టినట్లు సమరావని గనుపింప, నాము సేద్యగాఁడు విత్తనములు చల్లెడి విధంబున నర్జుని బాణములు తగిలి రత్నచయము జలజల రాలుచుండెను. శత్రుజన భయంకరుఁడైన యర్జునిని తేరు సేనలలోఁ బోవుచుండఁగా, దానివేగము వలన నెదురైన యరదంబులును సైనికులును చూర్ణమగుచుండెను.

ఆ విధంబును జూచి వీరులైనవారు కొందఱు నెదురుగా యుండి వచో తాము నటుల నగుదుమనెడి భయంబుతో తొలఁగి దూర

ముగాఁ బోవుచుండిరి. కొందఱు యుద్ధభటులు శరముల తాకుడుచే క్రింద పడుచుండఁగాఁగని కొందఱు వెఱచి సంగరంబునుమాని పరుగెత్తి పోవ సాగిరి. కొందఱతండు సూర్యాస్తమయము వరకును పోరుట విడఁడనియు, కొందఱు నిశ్శేషముగా బలంబుల రూపుమాపినఁగాని పోఁడనియుం దలంచి భయభ్రాంతులై తత్తఱ మొందుచుండిరి. దేవతలు సయితమా వివ్వచ్చుని పరాక్రమమును, నతఁడు సేనలఁ జూపు విధంబును మింట నుండి యఱ్ఱెచూచి, యొకవేళ తమ్మును సైతమతఁడు సంహరించునేమో యని భీతిల్లిరి.

ఈ విధముగా బలంబులు నాశమగుచుండఁగా చూచి యోర్వలేక రాజులందఱు నతని నెదిరించి నిలిచిరి. వారి సద్దునుండు చూచి యుత్సాహ మతిశయింపఁగా గాండీవంబును గుణధ్వని చేసి యుగ్రాగ్రహుఁడై వింట నారాచములు సంధించి, ద్రోణుఁడు మొదలైన వారిని చేరనీయక బాణవర్షముచే వారించుచు, తన కెదుటనుండు కర్ణునిం దిలకించి కోప మినుమడింపఁగా, నిశిత భల్లంబులు పఱపి, యతని తేరు గుఱ్ఱములను, సారథిని నొప్పించి, యతని కవచమును బగిల్చి, జీవస్థానములను భేదించి, మఱియుం గలుగు రాజుల నందఱను మిక్కిలి నొప్పించి, తన సామర్థ్యము నెఱుఁగునట్లు గావించి దేవదత్తమును పూరించిన నతని విజృంభణము నకు భీతిల్లి సైన్యములుపోయి భీష్ముని మఱుఁగుఁ జొచ్చెను.

గాంగేయుండు వెఱచినదళంబుల నుత్సాహమును బొందు నట్లు పురికొల్పి, మరల యుద్ధోన్ముఖు మొనరించి తా నా బలంబులకు బాసటగా నిలిచిన నితని యుద్దేశంబు నెఱింగి యయ్యెదనున రథ గజ తురంగ పదాతి బలంబులతోఁ గూడి ద్రోణుండు, నశ్వత్థామయు, కృపుఁడును, కర్ణుఁడును, వికర్ణుఁడును మొదలుగాఁగల వీరులు దుర్యోధను నికి ముందుగా వ్యూహమును బన్ని యర్జునున కడ్డముగా నిలిచిరి. సవ్య సాచి వారి నవలోకించి యవ్వీరులలో నొక్కొక్కనితో వేఱు వేఱుగా యుద్ధముఁ జేయవలె ననెడికోరిక గలవాఁడై యుత్తరునితో నిట్లు చెప్పెను.

“ఉత్తరా! గుఱ్ఱముల నించుక తడవు నిలిపి, వాని మేనులు నిమిరి, మనకు ముందు ఱెక్కములతో వ్యూహముగా తీరి నిలిచియున్న వీరులను, గజములను బాగుగా చూడుము. నాతో యుద్ధముచేయుటకై కోరియుండు కర్ణుని రథం బల్లదె! కేతనము కానవచ్చుచున్నది చూచి

రేవా! తొలుత నతనితో మనము సమర మొనరింపవలయును. ఈ కర్ణునిఁ దాకి యోడించి, యితఁడు కడుమేటి శూరుఁడని తలంచి యతని బలమును నమ్మియున్న దుర్యోధనుని తలంపు వమ్ముఁ గావించి, దుఃఖంబును జెందునట్లు చేయవలెను. కాఁబట్టి యింక త్వరితముగా కర్ణుని మీఁదికి రథమును బోవ" నిమ్మచి చెప్పిన విరాట రాజాత్మజుం డర్జునుం డాజ్ఞాపించిన లాగునఁ గావించెను.

## అర్జునుఁడు చిత్రాంగద ముఖ్యులైన కురుకుమారుల నిర్జించుట

అంత నయ్యైంద్ర తనయుండు ఎద్దునుచూచి దానిని చంపుటకు యత్నించు బెబ్బులి చందమున, రాధేయుని మీఁదికి రాఁబోఁడంగెను. అతని రాకనుగని, చిత్రాంగదుండును, చిత్రరథుండును, సంగ్రామజిత్తును, దుష్ప్రహుండును, చిత్రసేనుండును, వివింశతియు, దుర్ముఖుండును, దుర్జయుండును, వికర్ణుండును శత్రుంతపుండును, దుశ్శాసనుండును. మొదలుగాఁగల కురుకుమారవర్గంబు నిరర్గళప్రకారములగు రథములును గుర్రములును మెఱయఁగా మింగుమిగిలి చనుదెంచి, పటుతరములగు బాణములు ప్రయోగించుచు నందఱు నొక్కసారిగా నడ్డుదగిలి యెదిరించినంజూచి, విజయుండు గాండీవ గుణధ్వని తంత్రీనాదముగను, నెదిరించిన శూరులు వాయించు వారుగను, గాండీవంబు వీణగాను నొప్పఁగా విక్రమవిహారంబునకుఁ గడంగుటయు, నట్టియెడ వికర్ణుండు ముందు నిలిచి యనేకములగు శరములు ప్రయోగించెను.

అర్జునుండు వానిని సరకుసేయక వారించి వారిచేతి విల్లును త్రుంచి వాడి సాయకముల నొప్పించిన సహింపలేక యతండు పాఱిపోయెను. వికర్ణుని చందమును జూచి శత్రుంతపుఁ డనువాఁడు కడు నుత్సాహంబుతో నెదిర్చి వాడిమిగలవియైన పెక్కులు శరంబులు ప్రయోగించుటయు పార్థుఁడు వాని సాయకములను ఖండములు చేసి, పది బాణములచే సారథిని నొప్పించి, యైదమ్ముల నతని నొవ్వ నేసెను. కాని వాఁడంతఁ బోవక వెండియు నుత్సహించి వచ్చెను. అపుడా గ్రహము మించి కిరీటి యొక్క యుగ్రశరంబుచే వానికంఠంబు త్రుంచి నేలఁబడవేసెను. శత్రుంతపునిఁ జంపి, తక్కిన వారొక్క రొక్కరుగా నడ్డుదగిల కుండునట్లు చేయనెంచి, బహువిధంబులైన సాయకములు పరపి యందఱు పఱుగెత్తిపోవునట్లు విక్రమంబు చూపెను.

సంగ్రామజిత్తు అనువాఁడాశూరు లవ్విధంబున యుద్ధరంగమును విడిచి పాఱిపోవుట నవలోకించి యసహ్యమును జెంది 'ఇసీ! ఇటుల శత్రువునుచూచి భయపడి పఱగెత్తునట్టి మీరు సంగ్రామమున కేలరావలయును!'' అని వారిని నిందించుచు, మిక్కిలి గర్వముతో నర్జునునిం దాకెను. అతఁడట్లు ఎదిరించి పెక్కు లుగ్రభల్లంబులు నరునిపై తనరించిన నతండలిగి వానికంఠము నొక శరంబుచే త్రుంచివైచెను. తన తమ్ముఁడాలాగున చంపఁబడుటను కర్ణుఁడుచూచి బలిగోలతో పొడిచిన యేనుంగువలె నత్యంత కోపముఁగొని, అటులన నర్జునుఁదాకి సారథిని నొవ్వనేసి, పంద్రెండు వాడి శరముల నతనిపైఁ బరపెను.

గరుడుండు పామును చూచి పట్టుకొనుటకై ఱెక్కలు విచ్చి వెడలినట్లు సవ్యసాచి పెక్కు ఘోరాస్త్రములు ప్రయోగించుచు, నత్యుత్సాహంబును జెంది కర్ణు నెదిరించెను. ఇట్లు మేటివీరులైన కర్ణార్జునులు తలపడి పోరుట కారంభించుటయు, వారి శౌర్యసంపద కాశ్చర్యము నొంది యుద్ధము చేయుటమాని కౌరవసేనలు నిలిచి యట్టియూరక చూచుచుండెను.

తత్సమయంబున ప్రళయకాలపు మేఘము భయంకరంబుగా కొండపై వానగురియు చందంబున నింద్రసుతుఁడు కర్ణునిపై శరవర్షముఁ గురియించిన, నతండు చలింపక పెనుగాలి మేఘ పటలి నెగఁగొట్టిన విధముగా నా బాణంబుల నెల్లను నివారించెను. ఆ సమయంబున కర్ణుండు తానగ్నివలెను, నతని ధనుస్సు మంటవలెను ప్రకాశించుచుండఁగా చూచి కౌరవ సైన్యము లెంతయు సంతోషంబునుజెంది వాద్యంబులు మ్రోయించెను. కాని కర్ణుని బాణము లర్జునునిఁ దాకినపుడు సంతసించు వార లర్జునుని బాణములు కర్ణునిం దాకినపుడు దుఃఖాక్రాంతు లగుచుండిరి

ఈ రీతిని వెనుదీయక పోరాడుచుండు నతని సవ్యసాచి కర్ణునుద్దేశించి, ''ఓయీ కర్ణుఁడా! కురుపతి సభలో నీవు నీకెవ్వరును సాటి లేనట్టు పొగడుకొనుచుండుదువు ఇపుడా నీ ప్రతాపముఁ దెలుపఁదగిన సమయము వచ్చినది. నిన్నుఁగని కౌరవు లెల్లరు సంతోషించునట్లు యుద్ధము చేయవలయును. ఇంటిలో డంబపు మాటలు పలికినట్లు కాదు. ఆమాటలు సంగరమున చెల్లవు. సామర్థ్యమును చూపవలయును. ఈ వీరు లందరు వినఁగా నీవు పలికిన మాటలు పెక్కుఁగలవు. కాబట్టి

యీ తరుణమున వెనుదీయగూడదు. అదియునుగాక నీ తమ్ముడగు సంగ్రామజిత్తును కన్నులార నీవు చూచుచుండఁగానే చంపినాడను. ఇంక నీవు వెనుక కడుగుఁ బెట్టక నిలిచి నాతో పోరుము ఓయీ! బింకపు పలుకు లెన్నియయినం జెప్పవచ్చును గాని, చెప్పినట్లు చేయుటకు మాత్రము శక్యము కానేరదు, మరచితివా! నాఁడు సభలో ద్రౌపది నవమానించి నపుడు నీవు నవ్వినవాఁడవు గావా? ఆ ఫలమునిపు డనుభవింపఁగలవు. తప్పించుకొని పోఁజాలవు సుమీ! 'ఇట్టి శౌర్యవంతుఁడ వపు డేల యూరకుంటి' వని యెంచెదవేమో! నేను ధర్మపాశముచే కట్టువడి మిన్నకున్నందున నాఁడు నీవు బ్రతికి పోఁగలిగితివి ఇపుడు తప్పించుకొన లేవు. నీ శక్తి యంతయు నిప్పుడే జూపవలె' నని పరిహాసించి పలికెను.

## కర్ణుఁడర్జునుని పరిహాసించి పలుకుట

అర్జునుం డిట్లు చెప్పిన విని రాధేయుం డతనిఁ జూచి వెగటు నగవునగి, "ఓహో! అలాగా? అపుడు ధర్మహానికి వెరచి యూరకుండి, ఇపుడు నీ పరాక్రమమును చూపుటకు వచ్చితివా? నాకు నీయన్నపై మోహాపేక్షతో నుండినట్లు పదుగురితోడనుం జెప్పికొనుట కప్పుడు కారణమేర్పడినది. అటువంటి నాకు నిపుడేదియుం జెప్పలేవు. నా నిమ్ము నీ సామర్థ్యమెట్టిదియో యీసమయమున చూచెదంగాక. వనవాసము నజ్ఞాతవాసమును గడిపి వచ్చిన యెడల దుర్యోధనుం డెట్లైనను రాజ్యభాగమిచ్చునని యాశచే నీ విన్నాళ్ళ వరకును నడవులలో దాగియుంటివి గాని, నిజముగా ధైర్యమును పరాక్రమమును నీకుఁ గలుగవు. ఉన్నచో నాఁడే నీ శక్తిఁ జూపి యుందువు. కొన్ని చోట్ల నచ్చటను నీవు కొంత శౌర్యమును చూపినట్లు వింటిని. కాని నేను నమ్మలేదు. వలననేగా నీ ప్రతిజ్ఞకు సందతనమును నేను యెఱుంగుదును. స్పష్టముగా గనుఁగొన్నపుడుగాని నాకు నమ్మకము పుట్టదు. ఇపుడు గనబఱచి నమ్మునట్లు చేయుము. వృథా మాటలవలన ప్రయోజనము లే"దని యల్పతిగాఁ బలికెను.

## కర్ణార్జునులు ద్వంద్వ యుద్ధముఁజేయుట

ఇట్లు చెప్పి కర్ణుఁడు పార్థునిపై నాలమ్ములు గురియించిన యతండు గాండీవమును చిత్రగతులం ద్రిప్పుచు; కానీనుని మీఁద మిక్కుటముగా నిశిత శరంబులు గురియించె, నయ్యిరువురును దేవాసుర సంగ్రామ

క్రమంబు ననుసరించి పోరం దొడంగిరి. ఇరువురుం బ్రయోగించు బాణములు గవియుటచే మింట రవిబింబము మాటుపడి రశ్మిలేక పోవుటచే చీకటులు నెరసెను. గాలిచొచ్చి వీవకుండెను.

అయ్యవసరమున కర్ణుని సేన చుట్టుకొనుటయు, నర్జునుండు రథంబును మండలాకారముగా చుట్టు నుంద్రిప్పుచు, తత్సైన్యమును రూపుమాపుచు, కర్ణుని దేహంబు చిల్లులుపడి రక్తధారలు గారునట్లు బహుతర బాణతతులు నించి యలంచెను. అందుకు రోషించి కోపముతో కర్ణుండు మీదికి రాగా యర్జునుం డతని విల్లును ఖండించెను. తన విల్లు పోయిన, కొఱత తనకు లేకుండనట్లు రాధేయుండు శక్తి యనెడి యాయుధము నతనిపైఁ బ్రయోగించిన, దానిని వీరాగ్రేసరుండగు వివ్వచ్చుండు కురుబలంబులు భయమును, దుఃఖమును, నాశ్చర్యమును జెందునట్లు వాడి బాణములచే నడుమనే ఖండించి వైచెను.

మఱియుం గర్ణుని మన్నించు వీరులు సాహసించి పైకివచ్చిన, మిక్కిలి కోపముగలవాఁడై యర్జునుండు వారి యేనుంగుల నెడి గొప్ప వృక్షముల మిసి, నిజబాణ సమూహమనెడి పెనుగాలిచే భగ్నంగూల్చి, యావీరుల ఘోరలీల వధించి, యత్యుగ్రమూర్తితో నొప్పు నతని గర్వంబును చూచి సహింపలేక సూతపుత్రుండు వేఱొక విల్లును గైకొని నాలుగు బాణములచే గుఱ్ఱములను, నారు శరంబుల నుత్తరుని, నెనిమిదింట తేరును, పది సాయకముల టెక్కెమును, నఱువదినిశిత భల్లముల నర్జునునిఁ గొట్టెను.

ఈలీల కోపమాకారముగను, టెక్కెము కొనలుగాను, బాణములు మంటలుగాను కర్ణుండనెడి యగ్నిహోత్రుఁడు జ్వలించుచుండఁగా వానిని చల్లార్చుటకై టెక్కెము మెఱుపుగాను, రథధ్వని యుఱుముగాను, బాణధారలు వర్షముగాను గలిగి యర్జునుండనెడి మేఘుఁడు విజృంభించి బాణవర్షముఁ గురిసిన వర్షము పెల్లున కురుసేనయను కొలనున యోధుల ముఖముల నెడి కమలములు కాంతిచెడి దైన్యమొందెను.

కర్ణుఁడు వెండియు నడరి కఱకుటమ్ములను ప్రయోగించుచున్న మిగుల నాగ్రహమునొంది యర్జునుండు పిడుగులవంటి శరములను రాధేయుని తలయు నొడలును పగులునట్లు ప్రయోగించెను. మహా మే● వీరుండైన యా సూతసుతుండా బాణములు తన దేహాంగములు భేది●

పగా, నోర్చి నిలువలేక సిగ్గువీడి భూమి యదురునట్లు యుద్ధరంగము నుండి పరుగెత్తిపోయెను.

అవ్విధంబునుగని మత్స్య రాజకుమారుండెంతయు సంతోషమును బొంది యార్వసాగెను. కర్ణుండు పాఱిపోవుటయు దేవదత్తమును పూరించి యర్జునుం డుత్తరునితో నిట్లనెను.

"భూమింజయా! ఈ కర్ణుడు కౌరవ సేనలో పేరుపొందిన శూరుఁడు. వాని స్థితి యిట్లయినది చూచితివిగదా? ఇతండు పరాజితుండై పాఱిపోయెను. ఇంక నస్త్రగురుండైన ద్రోణాచార్యుని నెదుర్కొనవలె యును" అని చెప్పి వీరావేశంబున కురుబలంబుం జూచినయతని రౌద్రాకారమును శౌర్యమును గాంచి యుత్తరుఁడు భీతినొంది "పాండు కుమారా! నీబలమును నీకోపము నప్పటి కప్పటికి నెక్కుడగుచున్నది. ఏలనో కాని నీమూర్తిని చూడఁగా నాకు మిక్కిలి భయము కలుగు చున్నదిసుమా! కాఁబట్టి యింక నేను సారథ్యముఁ జేయజాలను. నేను పుట్టి బుద్ధి తెలిసిన దాదిగా నిటువంటి యుద్ధము నెపుడును చూచినది కాని వినినది కాని లేదు. ఇపుడు చూచుటచే నా మనస్సు కలఁత నొంది పరవశమై నాయింద్రియము లస్వాధీనము లగుచున్నవి" యని దైన్యముగాఁ బలికెను.

ఉత్తరుని మాటలువిని యర్జునుండు చిఱునగవు నవ్వి యాతనితో "రాజకుమారా! ఏల భయమొందెదవు? నేనుండఁగా నీవు వెఱపనేమిటికి? ధైర్యమును విడువక సంతోషముతో యుద్ధ ప్రకారమును చూచుచు గుఱ్ఱముల కుత్సాహము కలుగునట్లు తేరును నడుపుము. శీఘ్రముగా నిమ్మెదిరించిన వీరులను జాఱదోలి జయశీలురమై మనలఁ జూచి జనులు మెచ్చునట్లు పురంబునకుఁ బోవుద"మని యిట్లు ధృతి కలుగఁజెప్పి భయమును నివారించెను.

ఆపలుకులు విన్నంతట నుత్తరుండు ధైర్యమును చెందెను. పాండవ మధ్యముండు ధనస్సుచు టంకారము చేయుచు వెండియు నుత్తరునితో "ఉత్తరా! అదిగో! ఎదుట తనరథమునకు నెఱ్ఱని గుఱ్ఱము లొప్పు చుండఁగా దృఢతర దీర్ఘ బాహువులును, దృఢమైన కవచమును, విశాల మగుఱొమ్మును కలిగి ద్రోణాచార్యుండు కనుపట్టుచున్నాఁడు, చూడుము! ఈ ద్రోణుం డద్వితీయపరాక్రమ వంతుఁడు. మాకందరకును విలువిద్య నేర్పిన యాచార్యుఁడు. దుర్యోధనాదులును, మేమును నితని యొద్దనే

ధనుర్వేదము నభ్యసించితిమి. ఇతఁడు వేదవేదాంగ పారంగతుఁడు. నీతి శాస్త్ర కుశలుఁడు. సత్పురుషులచే పొగడఁ బడఁదగిన సద్గుణసంపన్నుఁడు. కడు బుద్ధిమంతుఁడు. సకల శాస్త్రములు నెఱింగినవాఁడు. నింటివా? యీ యాచార్యునకు తన కుమారునికంటె నాపై ప్రేమ యధికము. ఇటువంటి యుత్తముఁడైన గురునితో నిప్పుడు యుద్ధము చేయవలసి వచ్చినది. రాజ ధర్మదోషము కతన నిర్బంధమున తటస్థించెను. కాఁబట్టి మనరథము నతనిపైకిఁ బోవని"మ్మని చెప్పిన యుత్తరుం డట్లే చేసెను.

అంత తనమీఁదవచ్చు విజయునిఁ జూచి ద్రోణుండు ఏనుఁగు మీఁది కేగెడు సింహమువలె యెదిరించెను. ఆ మహాత్మునిఁ జూచి యర్జునుండు మిక్కిలి భక్తితో చేతులుమోడ్చి మ్రొక్కి "స్వామీ! మేము విపినంబులలో వాసముచేసి చాలా కష్టము లనుభవించి యున్నాము. ఆపన్నులమగు మాయందు కరుణ యుంచ వలయును. మీవంటి గొప్పవారు మాపై కోపమును చెందఁగూడదు. మహాత్మా! తొలుత మీరు నాపై బాణము వేసినఁగాని నేను ప్రయోగింప జాలను" అని చెప్పెను. అతనికిఁ దనయందుగల భక్తికెంతయు నలరి, ద్రోణుండు చూచువారికి సంతోషముబుట్టునట్లు తానే మొదట నిరువది బాణము లర్జునునిపై వేసెను.

## అర్జునుఁడు ద్రోణునితో యుద్ధముఁ జేయుట

అర్జునుం డా బాణములు నడుమనే ఖండింపఁగా నాచార్యుం డతనిపై లక్షబాణములు ప్రయోగించెను. నర్జునుండును నతనిపై పెక్కు శరములు పఱపెను. మహాశూరాగ్రేసరులగు ద్రోణార్జునులిరువురు నట్లు తలపడి యాకాశం బంతయు నస్త్రములచే గప్పువడఁజేసి, రాజులకును సైనికులకును నాశ్చర్యము జనింపఁజేసిరి.

ధనుర్వేదపండితుండైన ఆ ద్రోణాచార్యునితో యుద్ధముఁజేయుట కర్జునున కొకనికేఁదక్క యితరులకు సాధ్యమా? ఒకవేళ నీశ్వరుండు పార్థునితోఁ బోర సమర్థుడగునేమో కాని యన్యులోపరు. అట్టి వారి సంగరమ్మం జూచి సైనికులు తమలో "ఆహా! ద్రోణుండేయు సాయకము లొకటివెంట నొకటిగా పైకిఁ బోవుచుండఁగా నన్నిటిని నడుమనే యర్జునుండు పొడిగా ఖండించుచున్నాఁడు చూడుడు, ద్రోణుని బాణములు తెల్లఱెక్కలు కట్టబడినవి, అర్జునుని బాణములు నల్లని ఱెక్కలు కట్టఁ

బడినవి, యొకటిచే గురుని బాణములు హంసలవలెను పార్థుని బాణములు మేఘముల చందమునను, తోచుచున్నవి. హంసలు మేఘములం గని వెఱచును గదా! అట్లే యర్జునుని దివ్యాస్త్ర చయంబులచే యాచార్యుని శరములు కొట్టువడుచున్నవి'' యని చూచుచు వర్ణించుచుండిరి.

ఆ సమయంబున ద్రోణార్జునులు విజృంభించి యిరువురును నల్లెత్రాడులు ప్రయోగించుచు భయంకరముగా నొకరిపై నొకరు భల్లని కరంబును వఱపుచు సవ్యాప సవ్యముగా నచ్చెరువు కలుగునట్లు రెండు చేతులతో యుద్ధము చేయుచుండిరి. అపుడు బ్రహ్మాస్త్రము, అగ్ని బాణము వాయుశరము, వరుణసాయకము దానవభల్లము మొదలగు నానా దివ్యాస్త్రములను ద్రోణాచార్యుండు ప్రయోగించుచుండగా, వానినెల్లను నర్జునుం డాయా రూపములుగల బాణముల చేతనే నివారించుచుండెను. ఆ యిరువురును వేయుచున్న శరములు మింట దట్టముగాబర్వి సూర్యరశ్మి లేక చీకటిగానుండుట వలన చూపరుల కెవ్వరే యస్త్రమున ప్రయోగించుటయు, వారించుటయుం దెలియదయ్యె.

తత్సమయమందు కుంభ సంభవుని సేనలు నర్జునునకడ్డుసొచ్చిన యతండలిగి, యబ్బలంబుల నూఱు సేయుటయు కుండలములతో నవ తెగిపడెడి చెవులును, కిరీటములతో డుఱికినిగి నూఱు తలలు గలిగి, రక్తప్రవాహంబుతో గూడి యుద్ధంబుం జూడగా, భూమియంతయు నిండిన నెత్తుటి సముద్రమగుచు, వీరుల భూషణములందలి రత్నములు సముద్రమందలి మణులగుచు నొప్పారుచుండెను.

ఈ ప్రకారముగా తత్సేనం దీనదశం బొందించి పిదప నిరుపమ నయ్యర్జునుండు గురునితో నద్భుతప్రకారమున పోరాడుచుండెను. ఆచార్యుడతని శౌర్యధైర్య పరాక్రమ సంపదం జూచి యత్యాశ్చర్యము నొంది, తనలో 'ఓహో! వజ్రి దేవరాయండగు యింద్రుని కుమారుండగు నీయర్జునునితో యుద్ధముం జేయుటకు మనకెంత శక్యము? ఆ పరమేశ్వరునకు సాధ్యమగునేమో కాని యన్యులెవరు' అని యెంతయుం బొగడుచుండగా, మింటనుండి చూచుచుండెడి దేవతలు మెచ్చి "ఆహా! ఇంత తడవు నిలిచి యర్జునునితో యుద్ధముం జేయుటకు ద్రోణునకుం జెల్లెను. కాని యితరులు నిలువగలరా? సైన్యమున కెల్ల తానే ముందుండి పోరుచున్నాడు. ఇటుల గదా పోరసలుప వలయును బాగుబాగు'' అని పొగడిరి.

అప్పుడు వివ్వచ్చుండు మిక్కిలి వేగముతో ద్రోణుని దేహమును ధ్వజమును, సారథిని, గుఱ్ఱములను, చక్రమును వాడిబాణములు నొత్తి గాం... చే గప్పిన యారీతింజూచి సైనికులు కెలిచి హాహాకారము చేయ సాగిరి. ఇట్లు క్రమముగా ద్రోణుని బలము తగ్గుచుండుటయు నర్జునిశౌర్య మెక్కుడగు చుండుటయుం గనుంగొని యశ్వత్థామ తటాలున తన బలం బులతో నడ్డవచ్చి యర్జును నెదిరించెను. అర్జునుం డతని నెదిర్చి నిశిత సాయకనికరములు ప్రయోగించుటయు నశ్వత్థామయు బహుశస్త్ర చయంబులచే పార్థునిం గప్పెను.

ఇట్లు వారిరువురును ఘోరంబుగాపోరాడుచుండగా నయ్యిరువురి సంగరము నింద్ర వృత్రాసురుల సమరమువలె నుండెను. ఒండొరుల యాయుధములు తగులుటచే తగులుటచే కలుగుచున్న చిటపట ధ్వనులు కార్చిచ్చును మంటలో వెదుళ్లుకాలి పగులుచున్నట్లు తోచుచు, కురు సేనల కాశ్చర్యమును బుట్టించె. అర్జునుం డశ్వత్థామ గుఱ్ఱములను నొప్పింపంగా గురుపుత్రుండు కొంచెము సందుచూచుకొని యమరపతి వించి యల్లెత్రాటిని ద్రెంచి సుతునియతండు నేటొకయల్లెత్రాడు గూర్చు కొనునంతలో వాడిమిగల యెనిమిది శరంబులచే నర్జునుని నొప్పించి సింహనాదముం జేసెను.

## అర్జునుం డశ్వత్థామతో యుద్ధముం జేయుట

కౌరవ వీరులలోన నర్జునుని వింటి యల్లెత్రాటిని నఱికిన వాండు ఈ యశ్వత్థామ దక్క మఱియొకడు లేడు. "అశ్వత్థామ బహు పరాక్రమవంతుం" డని దేవత లతనిం బొగడిరి. అర్జునుండు విల్లు నెక్కు బెట్టి గురుసుతునిం దాకెను. ఇరువురకు నపుడు పోరు ఘోరముగా జరుగం దొడంగివారు ప్రయోగించు బాణములు మింటనొండొంటి నొఱ సికొని భయంకరముగా మండుచు, పిడుగులవలె పడుచుండెను.

## అర్జునుండు కృపాచార్యునితో యుద్ధముం జేయుట

అయ్యెదనున నశ్వత్థామకు సహాయముగా కృపాచార్యుండువచ్చి యర్జునునిం దాకిన నయ్యింద్రజుండు గురుకుమారుని విడిచి కృపుని నెదు ర్కొనుటయు కృపుండతనిపై ననేకములైన దివ్యాస్త్రములు ప్రయో గించి నొప్పించె. యర్జునుం డలిగి యతని శరముల నన్నిటిం దునిమి కలుకు టమ్ముల నెంతయు నొవ్వనేసిన. మిక్కిలి కోపమును బొంది

ఊదిన నిప్పువలె మండుచు, కృపుఁడు విజృంభించి వాఁడి బాణములు టెక్కెము మీఁదను తేరు మీఁదనుం బఱపి యనేక విచిత్ర దివ్యాస్త్ర చయంబుల నర్జునుం గప్పి దిక్కులు కలంగ నార్చిన, కోపాటోపంబున నర్జునుం డయ్యోధుని కేతనముం ద్రుంచి, యున్నిసన్ని భోగంబులగు శరంబుల నతని మేను బాగుగా గాఁడ నేసిన, కృపుని చక్రరక్షకులైన చంద్రకేతుఁడును, చిత్రాశ్వుఁడును, మణిమంతుఁడును, మంజుమాలియు, హేమవస్త్రయు, సురథుండును, సుషేణుఁడును, వరిష్ఠుండును, సుకేతుండును, నుక్కుమెఱయ నొక్కసారిగా సవ్యచ్చుం దాకిరి. అట్లు వారు మార్కొని వచ్చుటయు నర్జునుం డత్యంతాగ్రహంబున నతి భయంకరములును నుగ్రములును నైన తొమ్మిది శరములు లోక, సారిగాఁ గొని ప్రయోగించి యాచక్ర రక్షకుల తొమ్మండ్రగురి తలలును నొక్కనిమిషములో ద్రుంచి నేలఁ గూల్చెను.

పిమ్మట నతండు పదమూఁడు సాయకములు గొని యొక బాణముచే కాఁడిని విఱిచి, రెంటిచే బండి కండ్లను దునియ నేసి, నాలుగు బాణములతో గుఱ్ఱములను చంపి, మూఁడు శరములచే నొగలు చూర్ణము జేసి, యొక భల్లమున విల్లును, మఱియొక దానిచే సారథి కంఠమునుం దునిమి కృపునిఁ జూచి నవ్వుచు మఱియొక తీవ్రనారాచం బతని ఱొమ్మున నాట నేయుటయు, కృపాచార్యుండు రథము లేనివాఁడై, తన తేరుబోయి, గుఱ్ఱములు చచ్చి విఱిగినను, సారథి హతుఁడైనను కొంచమైనఁ జలింపక యర్జునునిపై శక్తియను నాయుధముం గొని యేసెను.

తన మీఁదికి మండుచు వచ్చుచున్న కృపాచార్యుఁ డేసిన యాయుగ్రశక్తిం జూచి, పాండవమధ్యముఁడు పది బాణములచే దానిని దుత్తునియలొనరించి యార్చినఁ గని కృపుఁడు తనశక్తి యటుల వమ్మగుటకుం గినిసి రౌద్రమూర్తియై డాలును కత్తియుం గైకొని రయంబున నర్జునునిపైకి వచ్చెను. తటాలున సవ్యచ్చుఁ డతని చేతులలోని డాలును కత్తిని తునియ నేసిన చేయునది లేక కృపాచార్యుండు కోఱలూడ్చిన పెనుబామువలె నూర్చుచుంబోయి యశ్వత్థామ రథము మీఁద నెక్కెను. ఆరీతిఁ గనుంగొని సేనలు భయము నొంది; భీష్మాచార్యుని గాఱుగఁ జొచ్చిన నర్జునుండు విడువక యుబలంబులను వెంబడించి వధింపఁ దొడంగుడయు, సేనలతోడ పెక్కండ్రు రాజు లతని నెదిరించి యుద్ధముఁ

జేయఁగా నతండు చతురంగ బలయుతముగా మహాకోపముతో వీరా ళులను సంహరించి సింహనాదముఁ జేసెను.

ఈ ప్రకారముగా శూరాగ్రణి యగు ఫల్గునుండు శరజాలంబుల నఱుమాడి కండలు బురదగాను, తునిగిపడిన యేనుగు దేహములు చేపలు గాను, వింజామరలు నురుగులుగాను, శూరుల తలలు తామర పువ్వులు గాను, నొప్పుచుండెడి నెత్తుటేఱును యుద్ధభూమియందు ప్రవహించు నట్లు చేసెను. సైన్యముల నిట్లు రూపుమాపి, గాంగేయుని దెసకు బోవు చుండఁగా నసదృశ పరాక్రమ యుక్తుఁడైన [illegible] యెదిరించిన రీతిగా కర్ణుని కొడుకగు వృషసేనుఁ డనువాఁడు వేగంబుగా నడ్డము వచ్చి తాఁకె. వానిఁ జూచి యర్జునుండు నవ్వుచు, నొక బాణం బున వాని విల్లుఁ ద్రుంచి, మైమ వాఁడిగల శిలీముఖంబులను [illegible] బాగుగా నాటించిన, యానొప్పి కోర్వలేక భయముతో వృషసేనుండు తేరుపైనుండి క్రింది కుఱికి తిరిగితిరిగి చూచుచు పాఱిపోయెను.

అట్టిగాండ్ర. దుశ్శాసన, శకుని, దుర్ముఖ, వివింశతి, వికర్ణముఖ్యు లరుదెంచి పొదివిరి. వారిం జూచియులుక యతిశయిల్లఁగా గుణధ్వనిఁ జేసి యతులితములైన దివ్యాస్త్రములచే నందరను నొంచి కలంచి రథ ములు విఱిచి గుఱ్ఱములం జంపి, సారథులం దునిమి విండ్లు తునుకలుగా విఱిచి టెక్కెములు ఖండించి యందఱకు విందొనర్చుటయు వారలని ముందు నిలువనేరక సిగ్గువిడి యొకని వెనుక నొక్కఁడు పరుగెత్తిపోవఁ దొడఁగిరి. వారినిచూచి యర్జునుండు నవ్వుచు నుత్తరునిఁ బిలిచి యత నితో నిట్లనియె.

“ఉత్తరా! ఈపరుగెత్తి పోవువారిం గనుము. అదే ముందు భాగంబున బంగారుమయమగు తాటిచెట్టు సిడము మెఱయుచుండఁగా, నిశ్చలమైన మెఱపుతో గూడిన మేఘమువలె నను! భీష్ముఁడు కను పట్టుచున్నాఁడు. ఇపుడతనికి మన బాణముల రుచి కొంచెము చూపు దము. త్వరితముగా నతని యొద్దను రథమును దోలు”మని చెప్పెను. సంతోషముతోడ నుత్తరుం డటులనే జేసెను.

## అర్జునుఁడు భీష్మునితో యుద్ధముఁ జేయుట

అర్జునుఁడు తనమీఁదికి వచ్చుటనుచూచి భీష్ముండు కురుసేనలు సంతోషించునట్లు తన శంఖమును నూదిన, నర్జునుండును దేవదత్తమును

పూరించె. అంతట తలపడి భీష్మార్జును లొండొరులఁ దాకి పోరఁదొడఁగిన మంచిదని యాబోతు లొకదాని నొకటి యెదిరించి పోరాడు చందమున నొప్పుచున్న వారి సంగర ప్రకారమును వింతగా దేవతలు మింటనుండి చూచి పొగడుచుండిరి.

ఈ ప్రకారము చూచుచు "ఆహా! ఈభీష్మార్జునులు మన కంటెను, రాక్షసుల కంటెను శస్త్రవిద్యయం దధికులుగా నున్నారు. వీరిరువురుం బోరుట కొండొరు లెంతయుం దగియున్నారు. ఇతరులు వీరి నెదిరించి నిలువఁజాలరు" అని యొకరితో నొకరు పలుకు కొనుచుండిరి. అప్పుడు సేనలు కాంతలును, నఱపులును, సింహనాదములు వాద్యధ్వనులును చెలఁగఁగా భీష్మునకు కోసటమై యర్జునునిఁ బొదివిన గాంగేయుం డనిమిష దివ్యాస్త్రంబులు నొకటి రెంటిఁ జక్రములపై నేసి రెండు శాణములను గుఱ్ఱములను, నాలుగింట సారథిని నొప్పించి వెంచియుం బదశరము లర్జునుని మేనుగాడ నేసిన యమరేశనందనుండు చలింపక మిక్కిలి యుత్సాహంబుతో గాండీవ మగ్నిగోళము వలె వర్తులమై మండు చున్నట్లు కనుపట్టుచుండఁగా నించుకయు సందులేకుండు లాగున విశిఖ పరంపరలచే గంగాసుతుని గప్పెను. అర్జునుని శరము లనడు గాఢమగుచును. భీష్ముండను సూర్యుండు తన్నమయమున నిజశరా చయము నెడి కిరణజాలముచే విరియించెను.

అంతట కిరీటి యనేకములైన నానావిధ సాయకములను ప్రయోగించుటయు, భీష్ముండు వానిని నడుమనే ఖండించుచుండె. ఏ దేవతాక మగు బాణము నేయునో, నా బాణము తోడనే భీష్ముండతని శరంబులం ద్రుంచు చుండెను. ఏ సెల్లు ప్రయోగించునో యటులనే ప్రయోగించి తనబాణములన్నిటిని ఖండించుచుండఁగా నర్జునుం డెంతయు గోపమూని నొకయుగ్రాస్త్రముచే భీష్మాచార్యుని వింటిని తుండెములు గావించెను.

తన విల్లు నఱకుటఁ గాంచి భీష్ముఁడు వేరొక విల్లుఁ గైకొని పాండు నందనునిపై శరవర్షముఁ గురిసిన నయ్యాపగా నందనుని చక్రరక్షకు లుగ్రులై యర్జునుం దాకి పెక్కు సాయకములతనిపైని గురియించిన నెంతయు నలుక నొంది నిముషములో వారి శిరంబుల నర్జునుండు ఖండించి భీష్ముఁడేయు దివ్యాస్త్రమును వారించి యతని గుఱ్ఱములను సారథిని నొప్పించి యెదురులేని ప్రతాపముతో బోవుచుండఁగా చూచి విస్మయించి ద్రోణాచార్యుండును మింట సిద్ధులు నగ్గింప దొడంగిరి.

అపుడించుక సందుచూపి పితామహుండు విజయుని యెడమ వైపున గాడు నట్లు వాడిబాణములు ప్రయోగించి నొప్పించె. నాఱేఁటుల కర్జునుండు మిగుల నొచ్చి యాగ్రహ మతిశయిల్లఁగాఁ శిలాటున మిక్కిలి వాడిగల బాణములచే మరల నతని వింటిని ఖండించి వెండియు నతండు వేరొక వింటినిఁ బుచ్చుకొనునంతలో వేగంబుగా నమోఘ సాయకము నమ్మహావీరుని యురంబున నాటఁజేసిన భీష్ముండు మూర్ఛనొంది తేరుపై నొరిగెను. సారధి రథమును తొలఁగఁ దోలుకొని పోయెను.

అర్జునుం డప్పటికిని యుద్ధమందు తృప్తినొందని వాఁడై కౌరవ సైన్యము గుంపులు గూడి యుండెడి చోటులం గాంచి, ద్రోణ కృపా శ్వత్థామాదులు చూచుచుండఁగా విజృంభించి యచ్చటికిం బోయెను. అటుల వచ్చిన యమ్మేటి శూరుని రాకంగని యశ్వత్థామ కర్ణునితో "రాధేయా! వీఁడుగో! అర్జునుండు వచ్చినాఁడు. ఇతని నిపు డెదుర్కొని నీవే జయింప వలయును గాని యన్యులోపరు, కాఁబట్టి జడియక తాకి పోరాడుము" అని పరిహాసముఁ బలుకుటయు, అతని యెత్తిపొడుపు మాటల కెంతయు రోషించి, కర్ణుం డతనితో "అలాగా? అయిన నుదీయు ప్రతాపమును నిలిచి యట్టెచూచు చుండుము. ఇపుడే నే నతని గర్వము నడంచెదనుగాక" యని చెప్పి యర్జునుని మీఁది కరుగుచుండఁగా నొప్ప వీరులైన రాజులును, బంటులును నతని కంటెముందుగా పార్థునిం దాకిన నతఁడు తొంటవుడుగుఁ జొచ్చి కలచు నుదపు టేనుగువలె యోసేల యంతయుం గలఁచి యంతంతకు శౌర్య మతిశయము గాగా రాజులను గూల్చుచుండ కౌరవ బలంబులు మిగుల డస్సి బల శౌర్యము లడంగి యుద్ధముఁ జేయలేక యుంతట నంతట నూరక నిలిచి యుండెను.

అట్టితరుణంబున నుత్తరుం డర్జునునితో "ఫల్గునా! అప్పటప్పటి కిని పరాక్రమ మతిశయింపఁగా నీవు విసువక యుద్ధముఁ జేయుచున్నాఁడవు. ఎంత తడవు వధించు చుండినను శత్రుదళములు మొండి పట్టు దలతో నెదిరించు చున్నవి, కాని తఱుఁగ లేదు. ఇది నా కెంతయుం గష్ట ముగా నున్నది. దాహము మించి నాలుక యెండు చున్నది. ఇట్టి స్థితిలోనుండు నేనింక సారథ్యము, జేయజాలను" అని చెప్పెను.

ఉత్తరుం డిట్లు పలుకఁగా నవ్వుచు, విభ్వచ్చుం డతనితో "ఉత్తరా! జంక వలదు సుమీ! నేను కలిగియుండఁగా నీకు భయ మొంద వలసిన యాశ యెద్దియును గలుగదు. ఇంక నించుక తడవు

నిప్పువైచి యుండును, చాలును. ఒక వేళ కష్టముగా తోఁచినచో నేనును నీకు సహాయముగా నడుమ నడుమ తేరు నడుపుచుండెదను, ఇంతటి వలుగను పేరుపొందిన శూరులు ప్రక్కలందు నాచే వేటులఁబడి సొమ్మసిల్లి తొలఁగిరి. ఇంక దుర్యోధనుం డొక్కండె మన బారికి చిక్కకున్నాఁడు. అయ్యో! తన తమ్ములు మొదలైన వారలం గూర్చుకొని మనమీఁదికి తాఁడు వచ్చుటకు యత్నించుచున్నట్లు తోఁచుచున్నది నూహించెను. అతఁడు కడు దురభిమానము గలవాఁడు. కావున వానిని విడిచిపోఁగూడదు. వారును సమీపమందే యున్నారు. నీవా దుర్యోధనుఁడుండు దిక్కునకు రథంబును బోవని''మ్మని వారలం జూచి పురికొల్పి యుత్సాహముఁ గలిగించిన యుత్తరుండు సమ్మతించి రథంబును సుయోధనుని వంకకుఁ బఱపెను.

అపుడు మాటి మాటికి నడ్డుపడుచున్న కురుదళంబుల విదళించుచు చిఱునగవు దనరఁగా, డాయవచ్చిన యర్జునునింజూచి కౌరవేశ్వరుండు కఱ్ఱతోఁ గొట్టినప్పటి కోఁతపులివలె నుగ్రుండై యెదిరించి వచ్చిన హరి సుతుం డతని బొమ్మల నడుమ వాడియైన రెండు బాణములను బాగుగా నాట నేసెను.

## అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధముఁ జేయుట

ఆ బాణ ఘాతలచే మదధారలు కాఱుచున్న యేనుంగువలె నెత్తురు కాఱఁగా, దుర్యోధనుం డతి తీక్ష్ణమైన శరంబొకటి యర్జునుని ముఖమున నాటనేసె, అందువలన నొచ్చి మొగంబున నెత్తురుగారఁగా యుధిష్ఠిరానుజుఁ డాగ్రహమును జెంది యసంఖ్యసాయకంబులచే దుర్యోధనుం గప్పిన, యతఁడా శర సందోహమును ఖండములుచేసి నివారించి యంత కంటె నెక్కుడుగా బాణచయము నరునిపై గురియించె. ఆ యిరువురి పోరాటమును మదించిన రెండు గజములొండొంటి దాకి పోరాడునట్లు తోఁచుచుండెను.

అత్తఱి దుర్యోధనుని తమ్ముఁడు వికర్ణుండను వాఁడు పెద్ద యేనుంగు నెక్కివచ్చి మేఘవాహనుండైన యింద్రుని చందమున నరునందాకి బాణవర్ష మతనిపైఁ గురియించె, వికర్ణుం డిట్లు యెదిరింపగా నాకలిఁ గొనిన యమునివలె యర్జునుండు మహా కోపంబుతో వాడి బాణముం గొని యతం డెక్కియున్న యేనుంగు ముఖంబున నూటిగా ప్రయోగించిన

యాశరము దాని ముఖంబున జొచ్చి తోకనుండి వెడలిపోయెను. మదించిన యా యేనుగ వజ్రాయుధపు దెబ్బచేకూలిన కొండవలె క్రిందఁబడెను. అది పద్మరాగమాలికలచేత నలంకరింపఁబడి యున్న దునఁ నేలఁ గూలినపుడా మణుల కాంతులతోఁ గూడిన యగ్నిజ్వాలలచే మండుచున్న కొండయో యనునట్లు కనుపట్టుచుండె.

## వికర్ణుడు పరుగెత్తిపోవుట

తన యేనుంగు పీనుఁగైన వికర్ణుఁడు క్రిందికి దుమికి పరుగెత్తిపోయి వివింశతి తేరుపై నెక్కెను. అంతలోనే [illegible] శరలబు నర్జునుండు రారాజు నురంబులో నాటనేసెను, [illegible] నొచ్చి యుండుటయు, వికర్ణుని యేనుఁగు చచ్చి నేలను [illegible] జిచ్చపడియుండు నవసరంబున నర్జునుని శరపరంపరలచే నిర్వ్యాప్తులై వారిని బడలు పడఁజేసిన చేయియుఁ గాలును నాడక, రథికులు [illegible] నలుదిక్కులకుం బాఱిపోయిరి. తన చుట్టునుం గల సైన్యం బవ్విధమున విచ్చిపోయి బయలగుటయు నురగకేతనుండు చేయునది లేక తానును యుద్ధమును వీడి వెనుకకు మరలెను.

దొరలు వెఱిగి యుద్ధభూమిని విడిచి యిట్లు పరుగెత్తుటయు మహారథులు నతిరథులును నిలువలేక చెల్లాచెదరై పోవుచుండఁ బలంబులెచ్చోటనుండిన నచ్చోటనుండి తత్తఱపాటుతో పాఱిపోయెను. అపుడా రాజులతోఁ గూడి దుర్యోధనుఁడు చనుటం జూచి, నర్జునుడు కలిసి పోయెడి యేనుగుల గుంపును చూచి సింహము లేచినట్లు పాండవ మధ్యముఁడు గర్జనముఁజేయుచు పరుగెత్తుచున్న రథికులను వెనుముట్టి తరుమఁ దొడంగెను.

కొంతదూర మీరీతిగా తరిమి సమీపించి కర్ణుని పెదతలఁ వాడి నతుల నొకటియు, రారాజు వీపున నాటునట్లొకటియు, నిట్లు రెండు వాడి తూఁపులు ప్రయోగించిన మిక్కిలి నొచ్చి కర్ణుడు తక్కిన వీరులతో "యోధులారా! మనము పరుగిడి పోవుచున్నను నర్జునుండు తఱుముకొని వచ్చుచున్నాఁడు, ఏట్లైనను రాజును వధింప వలయు ననెడి తలంపున నరుదెంచినట్లున్నది. కురువంశంబున కంతటికిని యీ నృపాలుఁడు ప్రధానుఁడు, ఇపుడెట్టులైనను మన మితని రక్షించుట మిక్కిలి యావశ్యకము. ఇతఁడు క్షేమముగా నుండిన మొదల నక్క

కార్యములునుం జేసినట్లే యగును. కావున కర్తవ్య మేమనఁగా పరుగెత్తక నిలిచి యర్జును నెదిరించి మన పరాక్రమము చూపవలయును వెనుదీయ కూడ" దని చెప్పెను, కాని యతని పలుకులు పెడ చెవుల నిడి బదులాడక, ద్రోణ భీష్మ కృపా శ్వత్థామ ప్రముఖులు పోవు చుండుటయు, నెంతయును చింతనొంది దుర్యోధనుండు వారితో "ఓహో! నన్ను పరాయి వానివలె విడిచి మీరుపోఁదగునా? నాకొక యాపద కలిగినపుడు సహాయులై యుండి నా కష్టంబును తొలంగించుట శూరలక్షణము, ఇప్పుడు మీరు మిన్న కరుగుచుండుట న్యాయముగా" దని పలుకుచుండఁగా యతని పలుకు లర్జునుండు విని, నవ్వి యతని పలుకులకు వారు సమాధానంబుగా సూటి మాటలాడుచు తాము వెనుకవారై యాదుర్యోధనునితోఁగూడి మరలక పోవుచుండగా నర్జునుండు వెనకనుండి గొంతెత్తి కురుపతినిఁ బిలిచి బిగ్గఱగా యిట్లనియె.

## అర్జునుఁడు దుర్యోధను నుపాలంభించుట

ఓహో! దుర్యోధనా! పోకుము, నిలువుము, నిలువుము. యుద్ధమునుండి పాఱిపోవుట రాజధర్మము కాదు. ధర్మముమాట యటుండగా ఇపుడు పోరునకు వచ్చినది నే నొక్కరుండను మాత్రమే! కుంతీదేవి కొడుకులలో చిన్నవాఁడను. నీవన్ననో పెక్కండ్రు యుద్ధవీరులతోఁగూడిన మహాసైన్యముతోడ నుండెదవు. ఇంతటి బలము గలిగియు చిన్నవాఁడనైన నాకొకనికి భయంబునుపొంది, నీవును నీమిత్రులును పరుగెత్తి పోవుట పరిహాసాస్పదంబుగాని గౌరవము కాదు. ఇదియును గాక యుద్ధమునకు బిలుచు చుండగా రాక పోవుట శూరుండవైన నీకు తగదు. లోకులు నిన్ను మెచ్చుకొనరు. కౌరవరాజా! ఇటు చూడుము. మరలుము. యుద్ధము చేయలేక పాఱి పోయితివేని, రాజ వీధులలో పట్టపు టేనుఁగు నెక్కి రెండు ప్రక్కలను బెక్కులు గజములు గలిసి వచ్చుచుండగ వేడుకలతో నూరేఁగుటయు, రత్నాభరణములు ధరించి కొలువు కూటంబున మహా వైభవంబుతో కూర్చుండుటయు, కస్తూరి చందనాగరు ప్రముఖ సుగంధ ద్రవ్యములను పూసి, సంతోషముగ చక్కని లలనామణులం గూడి విహరించుటయు మొదలు గాఁగల రాజ భోగము లనుభవించుటకు శక్యము కాదు. ఇది యుద్ధరంగము కాని జూదము లాడెడి మందిరము కాదు. మునుపటివలె నిచ్చోట మాయ

జూదంబును కల్పించి రాజ్యభోగంబులు కొల్ల గొట్టుటకు వలను పడదు. రా! రమ్ము! సమర్థుండవేని నాతో కయ్యముఁజేసి నన్ను జయింపుము. సాధ్యము గానిచో సంగరంబున హతుండవై యుత్తమ లోకమును పొందుము. ఇసీ! నీవంటి గొప్ప రాజైన వాఁడు చూపరులు నవ్వఁగా పోవఁజెల్లునా? ఇట్టి బ్రతుకును నొక బ్రతుకగునా? శత్రుఁడు పిలువఁగా యుద్ధము చేయలేని నీబోఁటి పిరికిపంద జీవితము నొక జీవితమగునా? కీర్తిమంతుఁడు కానివాఁడు యెన్ని నాళ్లు జీవించి యుండినను నేమి లాభము?'' అని నిందించి పలికెను.

అర్జునుని మాటలు విని తోఁకఁద్రొక్కిన పాముచందంబున రోష మతిశయింపఁగా మహా కోపంబుతో దుర్యోధనుండు తన బలంబులను మరల్చి యుద్ధసన్నద్ధుండై యర్జునునిఁ దలపడియె. భీష్మ ద్రోణాదులును రాజునకు సహాయులై కవ్వడిఁజుట్టు ముట్టిరి. బలంబులకు ముందు పరుగెత్తి పోవుచుండిన సేన లపుడు రాజును, తక్కిన యోధులును, వెనుదిరిగి పోరుకుఁ గడంగుటం జూచి నిలిచి తామును తెగువను బొందికూడిరథసంబునం బోరుటకుఁ గవిసిరి. ఇవ్విధంబున వ్యూహంబుతో వీరాగ్రేసరులు పొదువుటయు, నర్జునుండు సన్నద్ధుండయ్యె కురువీరు లసంఖ్యములైన సాయకంబులను చిత్తజల్లు చందంబున నర్జునునిపై గురియింపసాగిరి.

## అర్జునుఁడు సమ్మోహనాస్త్రముచే కురువీరుల సొక్కించుట

కుంతీ నందనుం డతిశయించిన కోపము గలవాఁడై గాండీవము నెక్కిడి, పటుతర బాణ నికరంబులచే తన రథంబునకును, సారథికిని, గుఱ్ఱములకును దెబ్బలు తగులకుండ రక్షించు కొనుచు, నేర్పును, పరాక్రమంబును, లాఘవంబును మెఱయఁగా, యొకనికైనఁ దప్పిపోకుండ నటు కురుబలంబుల నందఱను శరచయంబుచే నొప్పించి, ధృతరాష్ట్ర నందనుని ప్రియముఖ్యులన భంగ పెట్టవలయునని తలంపుతో ఆసమయంబున నింద్రు డధిదేవతగాఁ గలదియు, తప్పక తనపనిని చేయునదియు, శత్రువులకు దీనత్వముఁ గలిగించునదియు, నైన సమ్మోహ నాస్త్రమును గైకొని వారిపైఁ బ్రయోగించె. దానివలన కురువీరులును సైనికులును, నొడళ్లు మరచి యాయుధములు జాఱవిడిచి తలలు వ్రేలవైచి సొక్కి నిద్రించువారివలె మోహావశులై చాపకట్టుగా నేల వ్రాలిరి.

అట్టియెడ నర్జునుండు తామువచ్చునపుడు తమతో యుత్తర చెప్పిన మాటలం దలంచి యుత్తరుని బిలిచి "ఉత్తరా! నీ చెల్లెలు బొమ్మ పొత్తికలు తెమ్మనెను. మఱచితివా? వానింగొనిపోవుట కిది మంచి సమయము. వీరు మేను తెఱుంగుటకు పూర్వమే పోయి, మంచిగా నుండు వారిగుడ్డలం గైకొనిరమ్ము. అవిగో! చూచితివా? ఆ యశ్వత్థామయు కురురాజును చుట్టియున్న పాగాలు నల్లనివి, కర్ణుని తలగుడ్డ పచ్చనిది, ద్రోణ కృపుల పాగాలు తెల్లనివి. కాఁబట్టి పోయి యవి యన్నియుం గొనిరమ్ము. భీష్ముఁడీ యస్త్రమునకు బదులెఱుంగును గనుక యతఁడు మాత్రము తెలివి కలిగి యుండును. కాఁబట్టి యతని యొద్దకు నీవు పోవలదు" అని చెప్పెను.

ఉత్తరుండును సంతోషముతో గుఱ్ఱముల పగ్గంబుల నొగలకుఁ గట్టి రథము దిగి త్వరితముగా పోయి అర్జునుండు చెప్పిన ప్రకారంబుగా నందఱి వస్త్రములునుం గైకొనివచ్చి యరదంబుపై బెట్టి తానును నెక్కి కూర్చుండె. నంత "యుత్తరా! మనమీ తేరుల యిరకటమును దప్పించుకొని కొంచెము నిలుతము, తేరు పోనిమ్ము" అనిన నతండు కదలించె. అప్పుడు భీష్ముడు లేచి కిరీటిం దాకి యతనిపై శరవర్షముఁ గురియించె. అర్జునుండు భీష్ముని గుఱ్ఱములను, సారథిని నొప్పించి, పటుతర బాణ ప్రకరముచే నమ్మహా వీరునిం జిక్కుపఱచి, నిలువరించి రాహువునుండి వెలువడు సూర్యుని చందంబున తేరుల యిరకటంబుతోఁ గూడిన సైన్యంబులనుండి వెలువడివచ్చి కొంచెము దూరంబుగా నరిగి నిలిచె. అంతలో కురుసేనలును తెలివినొందె.

దుర్యోధనుండు దేహమెఱింగి కన్నులువిచ్చి యనతి దూరంబున నిలిచియున్న యర్జునుం జూచి, తమ కతనివలనఁ దొడరి హీనస్థితిం దలంచి కలత నొందిన చిత్తముతో రోష మధికరింపఁగా వెండియు, సంగరోన్ముఖుం డగుటకు యత్నించిన, భీష్ముం డయ్యవసరంబు గని నవ్వుచు, "కౌరవేశ్వరా! ఇంత పట్టుదలం జాలు [illegible]ము. సైన్యములును వీరులును, నీవును, తలగుడ్డలు పోవుట సయితము నెఱుంగలేక యొడళ్లు మరచి పడియుండఁగా, న్యాయ వర్తను డైన యర్జునుండు క్రూర కృత్యంబునకు గడంగక పోవుటచే బ్రతుకు దక్కెను. అతఁడు క్రౌర్యమునకే బూని యుండెనేని మనమందఱమును హతులమై యుండ వలసిన వారము. దుర్యోధనా! నీతను వెఱుంగక

పడియున్నపుడు నిన్ను చంపక విడుచుటచే యర్జునునకెంగల దయా గుణం బెట్టిదియో తెలియలేదా? యోగ్యుం డగుటచే నతండు మనల నింతటితో విడుచుట యదృష్టము. మరల యారితున్న వానితో పోర దలంచుట యవివేక లక్షణముగాని యుక్తము కాదు.

సమ్మోహనాస్త్రము మహిమచే మనము మూర్ఛిల్లి తలగుడ్డలు పోవుటం దెలిసికొనలేక పడియుండి లేచి మూర్ఖత్వంబున మరల నతని నెదిరించితిమేని, ప్రాణములతో విడిచిన యా శూరాగ్రేసరుండు కోపంబును జెంది యందరను మనలను వధించును గాని విడువఁడు. కాఁబట్టి సంగరముమాటఁ దలంపక వచ్చినదారింబట్టి మన దేశమునకుం బోవుదము, మరలుము, అర్జునుండు విరాటుని గోవులంగొని సంతోషముతో బోయినఁ బోవునుగాక! దీనికై మనకింత పట్టుదల యక్కఱ లేదు, ఏమిటికి? నా పలుకులు విని నీ యభిప్రాయంబు విడువు" మని చెప్పి యమ్మహీనాథుని యత్నమును వారించెను.

దుర్యోధనుండు పితామహుని మాటలకు బదులాడక యుద్ధము చేయు కోర్కెను విడిచి కోపమువలన కలంగిన మానసముతో, నిట్టూర్పులు పుచ్చుచు ఉద్రేకమువీడి నిలిచెను. తక్కినవారును అనలసన్నిభుండై తోచుచున్న యర్జునుని తోఁడి కయ్యంబు కురుకుమారులకు నాశన హేతువగుటం దలంచి వారిరక్షణ మావశ్యక మగుటచే గాంగేయుండు చెప్పిన ప్రకారముగా యుద్ధాపేక్షనుం దొఱంగి నిలిచిరి.

పిమ్మట భీష్మానుమతంబున సైన్యములు మరలి పోవం దొడంగినం గని యర్జునుండు వెనుక కొంత దూరంబు వరకుం దఱిమి నడిచి, ఛత్రములు, చామరములు నెగురఁగొట్టి దేవదత్తంబును పూరించి, యొక కఱకు టమ్ముచే కర్ణుని కిరీటములోని మణులు రాలగొట్టి "కర్ణా! పోయివచ్చెద" నని భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలకు నమస్కరించి యనుజ్ఞవేడి యెల్లవారును వినుచుండఁగా "ఓయి దుర్యోధనా! నేఁటికి బ్రతికిపోఁడవు, పురంబున కరుగుము, నేను పోయివచ్చెద" నని యెలుఁగెత్తిచెప్పిన ప్రచండ భానుతేజుండై యొప్పుచున్న యతనివంకఁ జేరి పారఁజూడలేక కౌరవ యోధులు తమదారింబట్టి పోయిరి.

అంతట చూపకులం దరిమి నిలిచిన మదపు టేనుంగువలె నిలిచి యర్జునుండు విరాటాత్మజుం గాంచి "ఉత్తరా! వచ్చిన కార్యమైనది. పశువులను మరలించినారము, శత్రు బలంబులను వధించి, దుర్యోధ

నాదులను జయించితిమి. జయించుటయే కాక, వారి తలగుడ్డలను గైకొంటిమి. యవమానించితిమి. తలంచిన రీతిగా నన్నియు నయ్యెను. ఇంక మనము పట్టణమునకుం బోవుదము. ఇచ్చోట వేఱు కార్య మెద్దియును లేదు. మీతల్లి మొదలగు వారు చిన్నవాఁడవైన నీవు యుద్ధంబునకు వచ్చుటచే దిగులొంది నీరాకకై యెదురు చూచుచుందురు. శీఘ్రంబుగా పట్టణంబునకుఁ బోయి వారికి సంతోషముఁ గలిగింపవలయును, కాఁబట్టి రథము నింక మరలింపు" మనిన నుత్తరుఁడు తేరుం ద్రిప్పి నగరంబునకుఁ బోవుటకు నడుపఁదొడంగెను.

అప్పుడాదారిలో తత్పూర్వము యుద్ధములో నరునిచే దెబ్బలు తిని త్వరితంబుగా నడువలేమిచే వెనుకకుఁ జిక్కి మెల్లమెల్లగా నరుగుచుండిన కౌరవసైనికులు తమకెదురుగా వచ్చుచున్న యర్జునుంజూచి భీతిల్లి రక్షింపుమని దీనముగావేడిన యర్జునుండు వారి కభయ మొసంగి యూరడించిన వారలెంతయు సంతసమున నర్జునుంబొగడి దీవించుచు తమదారింబట్టి పోయిరి.

పిమ్మట నర్జునుం డుత్తరునింగని "రాజకుమారా! నేనొకమాటను చెప్పెదను. నాపలుకులువిని చెప్పినట్లు నీవు చేయవలసినది. ఏమనఁగా, నీవు నీ తండ్రియొద్ద కరిగినంతట కౌరవ బలంబుల జయించుటయు గోవులను మరల్చుటయు, నన్నికార్యములును, నీవేచేసినట్లు చెప్పవలయునే కాని నే నొనరించినట్లు వెల్లడిచేయకూడదు. ఈమాట నీవు మరువవల" దని చెప్పెను.

ఉత్తరుండతనింగాంచి నవ్వుచు "అట్లే చెప్పెదను గాని చెప్పినను, యీ మహత్కార్యంబును నేను చేసితిననిన యెవ్వరును నమ్మంజాలరు, ఏల ననఁగా, నావలన నింతపని కాదనుట రాజెఱుంగును, జనులు నెఱుంగుదురు, వారికి నమ్మకము గలిగింపవలయుననిన నీపేరును చెప్పి తీరవలయును. అటులనైనను, నీవు కోరునంతవరకును, లోఁబడినవాఁడనేగాని, కార్యములునడుపుటకు స్వతంత్రుండనుగాను సుమీ!" యని పలికిన నర్జునుండతని మాటలువినుచు రథంబును తమ యాయుధంబులు బెట్టియుంచెడి జమ్మిచెట్టునొద్దకుఁ దోలించి, గాండీవము మొదలైన సాధనములు పూర్వపురీతిని చెట్టుపైఁ బెట్టునట్లు నియోగించిన యుత్తరుం డట్లేకావించె.

అంతట తన కపిధ్వజము దేవదత్తము, కిరీటము మొదలగునవి మాయమగునట్లు వానిని ప్రార్థించిన యవి యదృశ్యంబులయ్యె, నంతట నెప్పటివలె దేరుపై ఉత్తరుని సింగపుటెక్కమును బెట్టించి, తాను మరల సారథ్యంబును సేయుచు, నుత్తరుం డాయుధంబులతో తేరుపై నుండునట్లు చేసి నగరకెక్కి పోనం దొడంగిన దేవేంద్ర ముఖ్యులైన దేవత లర్జునుని పరాక్రమంబును, యుద్ధ ప్రకారంనుగాంచి మెచ్చి వర్ణించి పొగడుచు తమ నివాసంబుల కేగిరి.

అర్జునుం డుత్తరునితో "ఇపుడు నీ విజయంబును పురంబులో ప్రకటముం జేయుటకుగా ముందుగా గోపాలురంబనుపు" మనుటయు, వతండట్లె కావించె. ఈ ప్రకారముగా నర్జునుండు తన వర్తనంబును రహస్యముగా నుండునట్లు గావించి యరదంబును దోలుకొని పురాభి ముఖుండై చనుచుండె.

అంతకుమున్నుగా విరాటరాజు శత్రువులనుజయించి ససైన్యుండై నిజనగరంబును ప్రవేశించి, పాండుపుత్రులును పరిజనంబులును గొలువంగా వనితాజనంబులు శేషలు చల్లుచుండంగా మహా సంతోషముతో సింహాసనముపై నాసీనుండై తన విజయంబును కొనియాడ వచ్చిన వారి నెల్ల మరియాదగావించి, యుత్తరుండెచ్చట నున్నవాండని విచారించెను.

## ఉత్తరుండు యుద్ధమునకుం బోవుటవిని విరాటుండు చింతించుట

అపుం డచ్చటి వారలు రాజుతో దుర్యోధనుండు భీష్మ ద్రోణ, కృపాశ్వత్థామాది యోధవీరులతోం గూడిన సేనలతో వచ్చుటయు, నుత్తరపు వైపునందలి గోవులం బొదివికొని పోవుటయు, నపుడుత్తరుం డావులను మరలించి తెచ్చుటకై బృహన్నలను సారథ్యమునకు నియమించి రథంబెక్కి యొక్కరుండు పయనంబై కురుబలంబుల మీందికి బోవుటయుంజెప్పిన విని, యధికమైన విషాదమును, భయమును, మానసమును గలంపంగా మంత్రుల మొగంబులు సూచి వారితో నిట్లనియె,

"మంత్రులారా! ఉత్తరుండు పసితనమున, హానివృద్ధులను, తరాతరంబులను నెంచక యుద్ధమునకు పోయెను ఒంటరివాండై వాండు పోయినది తగిన పనిగాదు. మీరు వేగముగా వానికి సహాయపడుటకు చాలినంత సైన్యమును బంపుండు" అని ధైర్యముగాం జెప్పిన యతని మాటలు ధర్మనందనుండు విని రాజేంద్రా! దీనికై విచారింప వలదు.

మనకు దక్షిణ గోగ్రహణమున సుశర్మ యోడిపోయి జయము కలిగినది. ఇట్లే మన యుత్తరునకు నయితము నిస్సంశయముగా జయము కలుగును. అతఁ డొక్కఁడే యైనను బృహన్నల సారథిగా నుండుటచే నే యుపాయమును కలుగదు. బృహన్నల మిక్కిలి పరాక్రమవంతుఁడు. దేవతలనైనను సాధింపఁ గలవాఁడు. కావున భయమొంద నక్కఱలేదు. శుభము కలుగును. శాంత చిత్తుండవై యుండు'' మని పలికెను.

ధర్మనందనుం డట్లు చెప్పినను విరాటునకు చింత తొలంగలేదు. ధైర్యము గలుగదయ్యెను. అతఁడు మంత్రులతో ''దక్షిణ గోగ్రహణమున యుద్ధముఁ జేసి డస్సి యున్నవారలుగాక తక్కిన శూరుల నందఱను ఉత్తరునకు సహాయముగా పంపవలసినది. త్వరితంబుగా వారు బోయి యుత్తరుఁ డేమయ్యెనో వాని వృత్తాంత మెట్టిదియో మనకు తెలుపవలయును. ఇప్పటి కిదియే తగిన యాలోచన. చేయవలసిన పనిని మనము చేసినచో పిమ్మట భగవత్సంకల్ప ప్రకారము జరుగఁ గలదు'' అని చెప్పి మది కుదురక తత్తర పాటును జెందుచుండు నంతలో, యుత్తరునిచేఁ బంపఁబడిన గోపాలకు లరుదెంచి, రాజుం గని దండముఁ బెట్టి యిట్లని విన్నవించిరి.

''మహాప్రభో! ఉత్తర కుమారుండు పరాక్రమముతో కౌరవులను గెలిచి గోవులు మరల్చి, బృహన్నల సారథ్యముఁ జేయఁగా వచ్చుచున్నాఁడు. అతనికి గాని సారథికిఁ గాని గుఱ్ఱములకుఁ గాని యొక దెబ్బయైనను దగులలేదు. ఈ శుభవార్త నెఱింగించుటకై పంపఁగా మేము ముందుగ వచ్చినారము'' అని చెప్పఁగానే విరాటునకుఁ గలిగిన సంతోష మింతంత యనుటకు వలనుగాదయ్యెను.

అతఁ డా గోపకులం జూచి ''ఏమీ! మన యుత్తరుఁడు కురు బలంబులను జయించెనా? ఆవులను మరలించినాఁడా? వచ్చుచున్నాఁడా? ఎంత దూరమున నున్నాఁ'' డని యిట్లు మాటి మాటికి నడుగుచు, లోపలి యానందరసము నేత్రమార్గముల వెలికి జాఱుచున్నదో యనునట్లు కన్నులనుండి సంతోష బాష్పములు రాలుచుండఁగా, తన కుమారుం డంతటి మహాత్కార్యమును చేసెనుగదా యనెడి గర్వం బతిశయింపఁగా పార్శ్వవర్తులైన మంత్రులు మొదలైన వారితో ''మన యుత్తరుండు శత్రువులను బాఱదోలి విజయమునొంది వచ్చుచున్నాఁడట. కావున

గజముల మీఁదనుండి గంటలు వాయించుచుఁ బట్టణమున సంతటను, వాని గెలుపును జాటఁబంపుఁడు. ఎదురుగా ముత్తైదువలను బ్రాహ్మణులనుం బంపుడు. చుట్టును బరివేష్టించి వచ్చుటకై, గణికలను, వారణములను, తేరులను భటసముదయంబును, వాద్యంబులతోఁ బంపుఁడు. మన యుత్తరయు, నామె చెలులైన కన్నియలును, సుగంధద్రవ్యచయముంగొని యుత్తరున కెదురుగాఁ బోవునట్లు చేయుఁడు" అని భటుల నియోగించి, గోపాలురు శుభవార్తం దెచ్చుటచే వారికి వస్త్రములును, సొమ్ములును బహుమతి యొసంగి వెంబడియున్న కంకుభట్టు నాలోకించి, "ఇపుడు మంచి సంతోష సమయమగుటచే నొక యాట పగడ సాల యాడుదమా!" యని నవ్వుచు చెప్పిన, కంకుఁడా మాట విని "మహీనాథా! నీవు [illegible] నున్నాఁడవు. ఇటువంటి సమయంబులో నితనితోఁ బందెముగాఁ బూని యాడి జయించుటకు నాకు సాధ్యమగునా? భయము గలుగుచున్నది" యనియెను.

ఆ పలుకులకు విరాటుండు ముసిముసి నగవులు నగుచు "చూతము గాక యొకయాట యాడుదముర" మ్మని, సమీపంబున మెలంగుచున్న సైరంధ్రిఁబిలిచి సారెలుం బలుకయుం దెమ్మని చెప్పించి వానిని తన ముందునకుఁ దీసికొని "కంకభట్టా! సమీపంబున కేతెర" మ్మని పిలిచెను. అతండును నగుచు "ఔనౌను, జూదంబాడుట యెంత మంచిది? కాని" మ్మనుచు చేరువకు వచ్చినంత యిరువురును బ్రారంభించి యాడుచుండిరి.

ఆ సమయంబున విరాటుండు యుధిష్ఠిరుసిం జూచి యిట్లని పలికెను, "బ్రాహ్మణోత్తమా! మున్ను ధర్మరాజు జూదమాడి, రాజ్యమును దమ్ములను భార్యను పన్నిదముగా నొడ్డి యోటుపడి శ్రమలొందఁ బొల్పడెను. కాఁబట్టి జూదమునాడుట యుక్తమైన పని కానేరదు సుమా!" యని పలుకుచుని యాడుచుండి మరల నవ్వుచుఁ జూచి, తన కుమారుని జయమువలన కలిగిన యానందము మితిమీరఁగా తన్ను తా నెఱుంగక "ఆహా! ఉత్తరుం డెంతటి గొప్ప కార్యమును చేసెనో చూడుము. బలియులైన కౌరవ వీరులను గెలిచి గోవులను మరలించుట యనిన సామాన్య కృత్యమా? వాని బలపరాక్రమములు చాలా గొప్పవి. ఆలోచింపఁగా ఉత్తరుని వయస్సునకిది మహాత్కార్యముగాని

గొప్పదైనది కాదు. లోకములో నింతటి చిన్నతనములో నెవ్వఁడును నెన్నఁడును, నెచ్చటను నింత గొప్పపనిచేసి తనవంశమున కౌన్నత్యము కలుగునట్లు పరాక్రమముఁ జూపుట కనినదియు, వినినదియును లేదు. ఇది యెంతయు నద్భుతమైన విషయం” బనిన నతనితో ధర్మజుం డిట్లనియె.

“ఓయి రాజా! నీవు నీ కుమారుండు గొప్పకార్యమును చేసెనని యతని నెంతయు శ్లాఘించుచున్నాఁడవు. కాని నాకు నమ్మిక కలుగ లేదు. ఉత్తరుం డింతటిపనిని చేసెననుట హాస్యాస్పదము. దుర్యోధనుఁడు మొదలైన కురువీరుల నీకుమారుండే యోడించియున్న యెడల లోకంబున నింతకుమించిన యాశ్చర్యంబుగాని, యతనిని మించిన శూరుఁడుగాని యుండుట యరుదు. బాగుగా యోచింపు”మని తన మాటలకును సంతోష [illegible] చెప్పిన [illegible] కటకటపడి “కంకు భట్టా! ఈ ప్రకారముగా నీవనుట యుత్తరుని విజయము కల్లయని చెప్పుటగాదా? చాలు జాలు. నీవుగాక మఱియెవ్వఁడేనియు నిట్టి మాటలు పలికియుండినచో వాని నిపుడు తగినట్లు శిక్షించి యుందును. నీవు బ్రాహ్మణుఁడవగుటచే నీతప్పును మన్నించినాఁడను. ఊరకుండు” మని మహాకోపముతో కన్నులెఱ్ఱబాఱి కటములదరుచుండఁగాఁ బల్కి, యాగ్రహావేశమున సారెలు విసరి విసరి చప్పుడు గలుగునట్లు పలకపై వేయుచుండగా, యతని మాటలను, కినుకను గణింపక యుధిష్ఠిరుం డతనితో మరల నిట్లని చెప్పెను.

“నరేశ్వరా! బృహన్నల వెంటఁబోయి తన పరాక్రమముఁ జూపుటకు సమయమేర్పడినపని యుద్ధోత్సాహముచే విజృంభించియుండు నప్పుడు కౌరవ యోధులేకాదు, దేవాసురులైనను యుత్తరుండు జయింపఁగలండు. ఇంకనైన యుత్తరునిఁ బొగడవలసిన యంశము కనుపట్టు” దనిన మాటకు నాగ్రహముపొంది విరాటుఁడు కోపముతో కూడిన వికటంపు నగవు నగుచు “ఏమీ! ఆలాగా? నీవు చెప్పినవాక్యము లత్యాశ్చర్యకరములు గానున్నవి. పరాక్రమవంతులైన వైరు లెదిరించినపుడు యుద్ధములో శస్త్రాస్త్రములుగాని నేర్పుతో పరాక్రమముం జూపునట్టి సారథుల సంతతివారిని నెచ్చటను మేము చూచి యుండలేము. నీ తెలుఁగుదుప్పు కాబోలు. ఓయీ! నేను నా కుమారుని జయమును గూర్చి పొగడుటవలన నీ కేమయినను, కష్టంబును నష్టంబునుం గలదా? ఈ యోర్వలేని తన మేమిటికి? ఈ తెలివిలేని మాటలను నేను విన

నొల్లను. ఇంక నిట్లుపలుకవలదు, నోరుమూసుకొని యూరకుండుము. ఏదేనియుం జెప్పితివేని నీకుమఱియాద దక్కదుసుమీ!'' యని యాగ్రహంబున పలికిన యుధిష్ఠిరుండు జడియ కిట్లనియె,

''స్వార్థముగా కుమారుని యందలి ప్రేమచే నీ యభిప్రాయంబునకు విరోధంబుగాఁజెప్పితినని నాపై నలిగి పలుకుచున్నాఁడవు. కాని బాగుగా నాలోచించిన వాఁడవుకావు. ఈ కార్యము యుత్తరుండు చేయలేఁడు, చేయలేదు. మఱి యెట్లనగా, యుత్తరుని సారథిగాఁ జేసికొని బృహన్నల రథికుఁడై యుండి కురుసేనలను జయించి గోవులను మరలించి యుండవలయును. నామాట తప్పదు. ఇదియే సత్యమనుటకు వెనుక నీవే యెఱుంగఁగలవు. ఇపుడుత్తరుని జయము మాటనువిడిచి యీయుద్ధములో బృహన్నల కౌరవుల జయించివచ్చుట నంతటను చాటించుటకు సేవకుల కాజ్ఞాపింపు'' మనుచు నవ్వుచు నిశ్శంకుఁడై చెప్పెను.

## విరాటుఁడు కంకుభట్టును సారెతోఁ గొట్టుట

ధర్మరాజు యిట్లు చెప్పఁగా విరాటునకు ఒడలు తెలియ నంతటి కోపముగలిగి ముఖముఁ జేగురింపఁగా నతని నుగ్రదృష్టులంగని ''ఏట్లూ! ఊరకుండు మనిన యుండక నోటికి వచ్చినట్లు ప్రేలుచున్నాఁడవు. ఇది యోగ్యుని లక్షణమగునా? నా కుమారునకు బదులుగా నపుంసకుని బొగడెదవు తగునా?'' యని తటాలున నాడుచుండిన పాచికం గొని పాండవాగ్రజుని ముఖంబున విసరికొట్టెను. ఆ ప్రేటు తగిలి యజాతశత్రుని మొగంబున గాయమై నెత్తురు వచ్చెను.

అపుడు కౌంతేయాగ్రజుం డించుకయు వికటుడై కోపము నుచెందక తనకు సమీపవర్తియైయున్న పాంచాలివంకఁ జూచుచు నున్నకున్న, యామె యా తెఱంగెఱింగని రయంబున నతనిఁజేరవచ్చి తన పైట చెఱఁగుతో నెత్తురును మెల్లగానొత్తి యటగల బంగారు చెంబులోని నీటితో గాయముం దడిపి తుడుచుచుండఁజూచి విరాటుఁ ''డో తరుణీ! చీర చెఱంగున నెత్తురుం దుడుచుచున్నావు. ఇది యేమిపని? వేఱొక వస్త్రంబును దెచ్చి తుడవక యిట్లొనరించుట కేమి కారణము? ఇంత శ్రద్ధతో నీ విపుడీపనిని చేయుటకు పూనిరానేల?'' యనియడిగిన సైరంధ్రి యిట్లనియె.



విరటుఁడు కంకుభట్టును సారెతో గొట్టుట



పాండవులు విరాటుని కొలువవచ్చుట

నిప్పుడే యీనొప్పికిఁ దోడ్పడిరి''య్యని చెప్పిన ధర్మతనయుం డాఘని హోరించెను ''ఓయీ! బృహన్నల నాయందుమిగుల భక్తిగలవాఁడు. అతఁడు వచ్చి రాజువలన గలిగింపఁబడిన నా మొగమందలి గంటుమండి జాఱుచున్న నెత్తురుచూచెనేని కోపంబునుబొంది తన యంతరమును రాజునంతరమును విచారింపక యేదైనం గీడుగావించును. కాఁబట్టి ఈ నెత్తురును బాగుగా తుడుచుకొనునంతవరకును నతనిని రానీక నిలువరించి పిమ్మట రానిమ్ము. ఈలోపల ఉత్తరుని మాత్రమిటకుం దోడ్తెమ్ము'' అని చెప్పెను. ఇట్లు చెప్పి విరాటరాజు సంతోషాతిశయముచే తానాడిన మాటలు వినకుండఁగా యాద్వారపాలకునితో మఱియుం జెప్పవలసిన పలుకులు చెప్పి పంపెను.

అంతట వాఁడు పోయి యర్జునుని వెలుపటనే నిలువరించి యుత్తరుని మాత్రము తోడ్కొనివచ్చి రాజుముందట నిలిపిన యుక్కుమారుఁడు తండ్రి పాదంబులకు మ్రొక్కి నిలుచుటయు విరాటరాజు కుమారునిజూచి మేను సంతోషముచే పులకరింపఁగా, కన్నులు నానందబాష్పములు రాలుచుండఁగా యుత్తరునితటాలునఁ గౌఁగలించి చాలసేపువరకును నక్కు మైమరచియుండి పిమ్మట తెలివినొందిన యుత్తరుండు జనకునకు మరల మ్రొక్కి కంకుభట్టునకు సవినయంబుతో నమస్కరించి యతని మొగంబునంగల నెత్తురుతోటి గాయంబునుచూచి ''అయ్యా ఇదియేమి? ఈ గాయమేలకలిగినది?'' యని యడిగిన ధర్మనందనుండూరకున్న భూమింజయునకుఁ దండ్రి యిట్లనియె.

''కుమారా! నేను నీ విజయమునుగూర్చి సంతోషించి పొగడఁగా నితండు నాకు విరోధముగా నపుంసకుండైన బృహన్నలను కొనియాడ సాగెను. ఆ మాటలకు కోపముకలుగుటచే నేనితనిని పాచికతోఁగొట్టితిని'' యని తెలియఁ బలికెను.

విరాటుఁ డిటులఁ బలుకఁగానే యుత్తరుఁడు నిట్టూర్చి భయమును తొట్రుపాటును నతిశయింపఁగా, నయ్యజాతశత్రుని యందత్యాదరముతోఁపగా తండ్రితో ''అయ్యా! మీరు గొప్పతప్పును జేసితిరి. ఇట్లు చేయరాదు. ఈమహాత్ముఁడు మనకెంతయుం బూజ్యుండు. ఈయన యేమి చెప్పినను, నదియే సరియని మన మంగీకరింప వలయునుగాని యట్టిపని యాక్షేపించుట యుక్తముకాదు. కాబట్టి మీరిపుడీ మహానీయుని వేడుకొని యితనిని క్షమాపణము నడుగుఁడు. ఉత్తమ ద్విజులకు

కోపము గలిగెనేని రాజుల కాయుస్సంపదలు నశించునని చెప్పుదురు గదా!''యని చెప్పిన యామాటలెంతయు నుచితముగాఁ దోఁచుటయు, విరాటరాజు భయభక్తియుక్తంబుగా తనచేసిన తప్పును మన్నింపుమని కంకుని మిక్కిలి ప్రార్థించుటయు నతండు రాజుంగని ''నరేశ్వరా! ఈ యల్ప విషయమునకై యింతగా నన్ను వేడుకొన నేమిటికి? నాకు నీయందు లేశమైనను కోపములేదు''అని యుత్తరుఁతో ' ఈ భూపాలుండును చెడుతలంపుఁగలవాఁడు కాఁడు, ఇది సమయ దోషంబుచేఁ గలిగిన పొరబాటుగాని యన్యముకాదు, దీనికై నాలో కినిసినని తలంపవల''దని తన నిర్మల భావం బేర్పడఁగా మొగంబున చిఱునగవు వెలయం బలికె. కంకుభట్టునకు తనపై కోపము గలుగకుండుటకు మత్స్యవల్లభుండు సంతోషమును బొందె.

అట్టి సమయంబున రాజానుమతంబున బృహన్నల యచ్చోటికి వచ్చి నమస్కరించి నిలుచుటయు, నతని దగు మరియాదల నాదరించి విరటుండు కొడుకుంజూచి ''కుమారా! నీవు చెప్పిన కార్య మద్భుతమైనది. అసదృశ ధనుర్విద్యా కౌశలులును, శౌర్య పరాక్రమ ధుర్యులు నగు ద్రోణుఁడు, భీష్ముఁడు, కృపుడు, నశ్వత్థామ, కర్ణుడు మొదలుగాఁగల మహాయోధులు మన పశువులం బొదివికొని పోవుచు వాని రక్షణంబునకు బూని యనేకములైన దివ్యాస్త్రములు ప్రయోగించుచుండఁగా, వెనుకనుండి దుర్యోధనుడు పురికొల్పుచుండఁగా, మహాసముద్రమువలె విజృంభించుచుండు కురుబలంబుల నొక్కరుండవు నీ వెట్లనెదిరించితివి? నీవన్ననో చిన్నవాఁడవు. ఒంటరివాఁడవుగాని సహాయుండొక్కఁడైనను లేఁడుగదా? శౌర్యముతో నెదిరించినపుడు మొనగాండ్రైన యా కురువీరు లూరకుందురా? ఒకచోట కొంచెము శత్రుబలము తొలంగినచో మఱియొక వైపునుండి వచ్చి సేనలు చుట్టుముట్టుచుండును. ఒక వ్యూహమును భేదించిన నింకొక వ్యూహమును బన్ని రిపువీరులు నొప్పించుచుందురు. ఒక్కఁడవే కదా యని యలక్ష్యముగా తమశక్తి యంతయుంజూపి యలంచియుందురు. ఆ వీరులు సామాన్యులుగా నెంచఁదగిన వారుకారు. వారిలో భీష్ముఁడు ధనుర్విద్యయందు పేరొందిన పరశురాముని జయించినవాఁడు. ద్రోణుండు విలువిద్యయం దారితేరిన అస్త్రవిద్యావాది గురుడు. అశ్వత్థామ శివుని వరమునఁబుట్టిన మహాపరాక్రమవంతుఁడు, అజేయుండు. కర్ణుండసహాయ శూరుండు. కృపా

చార్యుండు ద్రోణునకు సాటియైనవాఁడు. ఆ కురుసేనలోని తక్కుంగల వారును నల్పులుగారు. దేవాసురులనైనను జయింపఁగల మేటివీరులు. ధృతరాష్ట్రుని కొడుకులన్ననో మిక్కిలి పరాక్రమముగల యోధాగ్రేసరులు. ఒక్కొక్కండే భూమి యంతయు జయింపఁగల సామర్థ్యముఁ గలిగినవారు. అటువంటి బలవంతుల నెదిరించి, యొక్కరుండవైన నీ వెట్లు ధైర్యమున మేన నించుక గాయమైనను లేక జయించితివో తెలియఁ బలుకుము. ఉత్తరా! ఆవులను నీవు రక్షించిన విధమెట్టిదియో, శూరాగ్రణియగు దుర్యోధనుండు నీజయమునకును తనకుఁ బొసంగిన యవమానమునకును సహించి పరుగెత్తిపోయిన రీతి యెట్టిదియో యెఱింగింపుము. ఇది యాశ్చర్యకరమైన విషయముగాని యల్పమైనది కాదు. దీని నెఱుంగుటకు నామనంబు వేగిరపడుచున్నది. త్వరితముగా జరిగిన యుదంతమంతయుం దెలుపు'' మని యడిగెను.

### ఉత్తరుఁడు మాఱుబాటుగా యుద్ధక్రమముఁ దండ్రితో చెప్పుట

తండ్రి యిటుల నడుగగా నుత్తరుండతనితో ''రాజేశ్వరా! ఈ విషయము మీరు తలంచినట్లు మిగుల నద్భుతమైనదియే గాని, ఆ కౌరవ బలంబులను జయించినదిగాని యావులను మరల్చినది గాని, నేను కాదు. అంతటి మహాత్కార్య మొనర్చునట్టి శక్తి నాకు కలుగునా? మఱి యెట్లనిన, మనకు దైవము తోడ్పాటు గలుగుటచేత, దేవసన్నిభుండును, తేజోవంతుఁడును, మహాప్రభావమును, పరాక్రమమునుం గలవాఁడునైన, మహాపురుషుఁ డొకండువచ్చి యుద్ధముఁ జేసి, కౌరవుల నోడించి, పశువుల మరలించి నన్ను రక్షించినాఁడు. ఆ వృత్తాంతముం జెప్పెదను వినుండు. నేను రథంబెక్కిపోయి, ధూళిచే యాకాశము కప్పంబడుచుండు నట్లును, భూమి యదంగునట్లును, పశువులం బొదివికొని పోవుచున్న భయంకరమైన సముద్రమువంటి కౌరవసేనలను జూచి భయభ్రాంతుఁడ నైతిని. యేమియుం దోఁనక వెనుకకు మరలి పరుగెత్తఁ దొడంగితి. అట్టి తరుణమున నా మహానుభావుఁడు నాయొద్దకువచ్చి పాఱిపోవలదని ధైర్యమును చెప్పి నన్ను రథముపైఁ జేర్చిన యతనియాజ్ఞకు నేను బద్ధుండనై యుంటిని. అంత నమ్మహానుభావుఁడు కురుబలంబులను వెంబడించి, యచట దుర్యోధనుండు తానున్నందున తేరును సైన్యములకు ముందువైపుగాదోలించి యెదిరించి యందలి

శూరులనోడించి, గోవులను మరలించె. అతఁడంతటితో విడిచినవాఁడు కాఁడు. ఆవులను గొంతదూరము మరలించి తోలుకొనివచ్చి మన నగర మార్గమును బట్టి వచ్చునట్లు చేసి, మరలిపోయి యా సైన్యములం దాకెను. ఆ బలంబులకు ముందుగా దూరమునఁ బోవుచుండిన దుర్యోధనుం డీ విధం బెఱింగి మరలి సకలసైన్య సమేతుఁడై యెదిరించి యుద్ధమునకు తలపడెను. ఈ ప్రకారముగా, కురువీరులకును, నేను చెప్పిన మహానుభావునకును మహా భయంకరమగు గొప్పయుద్ధము జరిగినది. అపుడా సంగరములో నా యుత్తమపురుషుని బాణచయంబువలన శత్రుసైన్యమందు రథములు, యేనుఁగులు, గుఱ్ఱములు, భటతతులును, గుట్టలు గుట్టలుగా కూలిపోయినవి. శత్రుంతపుఁడు మొదలైన రాజకుమారు లెందఱో చచ్చిరి. ఆ యుద్ధమున పడిసిన వీరులను లెక్కబెట్టుటకు నాకు సాధ్యము కాదు. తత్సమయమున కర్ణుఁడు సేనలు పరుగెత్తుటం జూచి పరాక్రమముతో నిలువరించి కూడివచ్చి యెదుర్చుటయు, నమ్మహానుభావుం డతని గుఱ్ఱములను సారథిని నొప్పించి, యతని మేను చిల్లులు పడునట్లు బాణములచేఁ గొట్టిన నిలువలేక యా కర్ణుఁడు యుద్ధరంగమునుండి సిగ్గువిడిచి పాఱిపోయెను. తరువాత నా మహాత్ముఁడు భీష్ముని మీఁదికిఁ బోయిన, యిరువురకును గొప్పయుద్ధము జరిగినది. మనకు సహాయుఁడైన పురుషుండు కోపించి గాంగేయుని విల్లునరికి బాణములచే నెక్కుడుగా నొప్పించుటయు నతండు మూర్ఛిల్లె. అపుడు భీష్ముని ప్రాణములు రక్షించుటకై సారథి తేరును తొలంగఁ దోలుకొనిపోయెను. ఇట్లు తన తమ సేనలతో వీరులందఱును నోడిపోయినను యుద్ధమందు తృప్తినొందక యా పురుష శ్రేష్ఠుండు యెదురుగా దుర్యోధనుండు తమ్ములతోఁ గూడి వ్యూహముఁ బన్ని నిలిచియుండుటం గాంచి యతని మీఁదికిఁ బోయెను. అపుడు ఘోర సంగరము జరిగెను. ఆ మహాత్ముఁడు నిజపరాక్రమ మేర్పడునట్లు వాఁడి తూఁపులచే వారలను గొట్టి బాఱదోలి వికర్ణుని మత్తగజమును జంపి దుర్యోధను నెంతయు నొప్పించె. దుర్యోధనుండు నొచ్చి కాందిశీకుండగుటయు నతని తెఱఁగుగని సేనలు భీతిల్లి పాఱిపోవుచుండఁగా కురుపతి వారితో తానును పరుగెత్తిపోయెను. వానిని వెన్నంటి యా మహానుభావుఁడు చాలదూరము వఱకుఁ దఱిమెను. ఈ ప్రకారముగా కౌరవబలంబుల బాఱఁదోలి యంతట నతఁడు వెనుకకు మరలె తండ్రీ! ఈ మహా కార్యంబును మహాత్ముఁడైన యా పురుషుండు సహాయుండై కావించి

మనకు జయముఁ గలిగించెను. కాని నేనిందు కావించినదియు, నా వలన జరిగినదియు నొక్కటియు లే''దని వివరించెను.

ఉత్తరుండు చెప్పిన వృత్తాంతము నువిని నంతట విరాటురాజునకు మహదాశ్చర్యము గలిగెను. ఆ మహానుభావుం డెవ్వఁడో, యవ్యాజానురాగముతోడ సహాయుఁడుగా వచ్చి యంతటి మహాకార్య మొనర్చి తనకు విజయంబు గలిగించు నంతటి యక్కఱ యతనికిఁ గలుగుటకు నిమిత్తమెయ్యదియో తోఁచదయ్యెను.

అపుడు కుమారునిజూచి ''ఉత్తరా! నీవు చెప్పినది కడు నచ్చెరువు గలిగించు విషయము. కరుణించి సహాయుండై తానుగా వచ్చి మనకు జయముఁ గలిగించిన మహాపరాక్రమ వంతుడైన యా మహానుభావుం డెవ్వండు? అతనిం జూచి కౌఁగలించి యర్ఘ్యపాద్యములొసఁగి భయభక్తి వినయ విధేయత లొప్పఁగా పూజించి సేవింపవలయునని నామనం బువ్విళ్ళూరుచున్నది. ఇపుడతం డెచ్చట యున్నవాఁడు? ఇచటికేల రాఁడయ్యెను? ఉన్నచోటు నెఱింగింపు''మని వేగిరించిన ''మహాప్రభో! ఆ మహానుభావుం డచ్చటనే తన యిష్టప్రకారముగా మాయమై పోయెను. నేఁడో, రేపో యతం డిచ్చటికి రాఁగలండు. మీరు కొంచెము శాంతముతో నుండిన చూడఁగలరు సుఁడీ! అతని తేజముం గనిన దేవతాసముఁడై తోఁచును. శత్రువులం గెల్చి యిపుడు మనకు గోవులం దెచ్చి యిచ్చుటకు మాత్రమే కాదు. నా యందతఁడు చూపిన ప్రియమును చూడఁగా, మనవంశమంతయు రక్షింపదలంచి యుండునట్లుగా నాకుఁ దెలిసినది. కాఁబట్టి వేగిరపాటునుడిగియుండుం''డని పలికి తండ్రిని ప్రమోదాయత్త చిత్తునింగావించెను. ఆ సమయంబున ధర్మనందనుఁడు తన ముఖమందలి గాయమును వస్త్రముచే మఱుగుచేసి అర్జునుని దెస మోముఁజూపక యుండెను.

విరాటుండు తన కొడుకు వలన కిరీటి పరాక్రమంబును వినియు నమ్మాటల మర్మంబు నెఱుంగలేక యెప్పటి నపుంసకుఁడే యనుతలంపున బృహన్నలను తగుతెఱంగున సంభావించి పొమ్మని చెప్పిన యతం డుత్తరునితో రహస్యముగా ''భూమింజయా! మిగుల చాతుర్యముగా పలికితివి సుమీ! ఇట్లే చెప్పవలసిన రీతి. ఇంక నింతకు మిక్కిలి ధర్మనందనునితోడ నేమియుం జెప్పవలవ''దని పలికి యటనుండి వెడలిపోయెను.

మత్స్యవల్లభుండు, కంకుభట్టును విడిదికిం బోవం బంచి యర్ఘ్యా పరివారంబులు సేవించుచుండఁగా యుత్తరునిం దోడ్కొని యంతఃపురంబున కేగి సుధేష్ణకు కుమారుని రాకయు జయంబునుం దెలిపి, యామె నానందవార్ధిం దేర్చి, యుత్తరుఁ డనుగగా తాను త్రిగర్తాదులను జయించిన విధంబంతయు నెఱుగఁబలికి సంతసంబున నుండెను.

విరాటునివలన ననిపించుకొని వచ్చిన యర్జునుం డచ్చటినుండి నాట్యశాల కరిగెను. అతని రాకంగని సంతోషముతో యుత్తర సఖులతో నెదురుగా నరుదెంచెను. ఆమెను చూచి యతండు ప్రియంబు రెట్టింపఁగా "అమ్మా! మేము యుద్ధమున కేగునపుడు బొమ్మలకు చిత్రవసనములు తెమ్మని చెప్పితివి గదా? తెచ్చితి నివిగో! కై కొ"మ్మని తాను కొనివచ్చిన వస్త్రముల నుత్తర కొసంగెను. ఇటుల గావించి భోజనశాల కరిగి భుజించి, నాఁటి రేయి తా మున్న దమ్ములైదుగురును, ద్రౌపదియు నొక్కచోటఁ జేరి సంభాషించు కొనుట కనువైన స్థలమును; సమయంబును. నేర్పాటుఁగావించి యవ్విధం బందఱకుం దెలియబరచె.

ఆ రాత్రి తాము తాము పూని విరాటునకు సహాయంబుగా చేసిన పనులును, గోవులను మరలించిన రీతియును నొకరి కొకరు తెలియఁబలికి కొనిరి. అనంతర మర్జునుండన్న నుద్దేశించి భీమసేనునితో "అన్నగారు నా మొగము చూడ నొల్లకున్నారు. ఇటుల మాఱుమోమిడి పలుక కొకవిధముగా నుండుటకేమి కారణమో? యెంత యాలోచించినను నాబుద్ధికి తోఁచ లేదు. ఇమ్మనుజేంద్రుని యెడల నెపుడును నెట్టి యపరాధమునుం జేసినవాఁడను కాను. ఇట్లుండుటకు హేతువెయ్యది?" యని ప్రశ్నించెను.

ధర్మజుఁ డర్జునితో తనకు గాయము గలుగుటం జెప్పుట

అర్జునుఁడిటులడుగుటయు, ధర్మసుతుండతనితో "అర్జునా! నీపై నాకు యిసుమంతయుఁ గోపము లేదు. నాయందు నీకుగల భక్తి యపారమనుట నే నెఱుఁగనివాఁడనుగాను. మఱి యిట్లుండుటకు కారణమే మనఁగా, మీరు యుద్ధభూమినుండి వచ్చుటకు పూర్వమే గోపకులువచ్చి మీ విజయంబు మాకుం జెప్పిరి, విరాటుం డా పలుకులువిని యుప్పొంగి, యుత్తరుండు కౌరవులనుజయించెనని వాని పరాక్రమము నూరక పొగడు

చుండఁగా, నేను మిన్నకుండలేక, 'ఔను! బృహన్నలతోడుగా నుండు టచే యపజయము కలుగునా? అతఁడు గలిగియున్నపుడు దేవతలనైన జయించి నిస్సందేహముగా గెలువవచ్చు నని నీమహిమను పొగడి పలికినాఁడను. అటుల నేను చెప్పినంతట, నా మాటలు విననొల్లక రోషించి 'ఔరా! నా కుమారుని పరాక్రమమును నేను ప్రశంసించుచుండగా నాకు విరోధముగా పేడివానినా నుతించెదవు? నీకు తగునా?' యని కోపము రెట్టింపఁగాఁ తెలివిలేనివాఁడై యాడుచున్న పాచికనుగొని నన్ను ముఖముపైఁ గొట్టెను. దానివలన గాయమేర్పడి నెత్తురు గారుచున్నందున వస్త్రముచేఁ గప్పుకొని నీకుఁ దెలియకుండుటకై యటు మొగంబై యుంటిని. ఇంతియ కాని యన్యకారణంబేదియును గా" దని చెప్పెను.

ఇవ్విధంబున కలతెరంగెఱింగించి మొగంబునందలి గాయమును చూపిన భీమసేనుం డమితమైన యాగ్రహమును బొంది "ఎట్లూ? ఆవిరాటుండు గర్వించి తరాతరంబు నాలోచింపక యింతపనిఁ జేసినాఁడా? ఈక్షణంబునఁ బోయి వానిని పుత్రమిత్ర బంధుసహితముగా యమసదనంబునకుం జేర్చెదనుగాక" యని మేనుప్పొంగఁగా లేచెను. అర్జునుఁడును, పండ్లు గొరుకుచు కన్నులనుండి కోపాగ్ని కణములు తొంగుచుండఁగా "ఇటులనా! జరిగినది. అంతరము నెఱుంగక నీ కిటువంటి యపకార మొనరించిన పరమనీచుండైన విరాటుని నిపుడే నాశముఁ గావించెదను. వీని రాజ్యమంతయు నిపుడే నిన్ను చేరగలదు. ఈదురాత్ముని విడువరా" దని లేచెను.

ఈ ప్రకారంబుగా వీరాగ్రేసరులైన యా యన్నదమ్ములు యిరువురును వీరావేశపరవశులై విరాటునివధింప దొడరిన వారి యుద్రేకంబెఱింగి శాంతవచనంబుల వారించి ధర్మనందనుండు వారలతో యిట్లనియె. "మీకు కోపమునడంచుకొనుఁడు. విరాటుండీ తప్పునెఱింగి చేసినవాఁడు కాఁడు. ఇప్పటివరకును మనము పాండుసుతులమనుట యతనికిఁ దెలియదు. ఇదియునుగాక మన మింతకాలమతని మఱుఁగునం జేరి యజ్ఞాతవాసప్రతిజ్ఞను తీర్చుకొంటిమి. అటువంటివాని కపకారముం జేయుట న్యాయము కాదు. ఇంక మన మతనియొద్దకుఁబోయి పాండవులమగుట నెఱింగింతము. తెలిసినపిమ్మట అతండవమానించెనేని యటుమీఁదట కర్తవ్యమాలోచింపుదము, కాని ఇప్పుడు వేగిరపడి చెఱుపు చేయకూడదు" అని చెప్పినవారికి కలిగినయాగ్రహము నుపశమింపఁజేసి, తక్కినవారు కోపించిన శాంతచిత్తులంగావించి, పిమ్మట తాము ఫలాసి

వారని విరాటునకెఱింగించు విధంబునూహించి మఱునటిదినమున నందఱు నుంజని విరటునికొలువులో బయలుపడి యుండవలసినట్లు నిశ్చయించెను. ఆ ప్రకారముచేయుట కందఱునుసమ్మతించుటయు వారానిశ్చయముతో నాటిరాత్రిగడపిరి.

## ధర్మజుఁడు విరటుని గద్దియపైనెక్కి తమ్ములతో కొలువుండుట

మఱునాఁడు తెల్లవారినంతట పాండుశూరులు తెల్లనివస్త్రములును తెల్ల పూవులు మొదలైనవానినిఁ దాల్చి రాజపుత్రులకుఁదగిన వేషములుగలవారై యైదుగురునుగలిసి రాజ సదస్సునకుఁబోయిరి. అపుడు వారిలో ధర్మరాజు విరాటునిసింహాసనముపైఁ గూర్చుండె. భీమార్జున నకుల సహదేవులు వెంబడిగా వారి వారికిందగిన యాసనములు మీఁద నాసీనులైరి.

ఈ ప్రకారము కొలువుఁదీఱి పంచాగ్నులచందమునఁ బ్రకాశించు చుండఁగా, మత్స్యభూపతి సకలాభరణ వస్త్రమాల్యాదులుధరించి మహాడాంబరముతో యుత్తరుఁడు వెంటరాగా కొలువుకూటమున కరుదెంచి, యచట తన గద్దియపై ధర్మరాజు కూర్చుండుటంజూచి యాశ్చర్యమొంది, యటులచేయుట యతండు తన్నవమానముచేయుటగాఁదలంచుచు, కోపముగదుర నిట్లుచెప్పెను.

"ఓయి కంకభట్టా! ఇదియేమిపనియనియెంచి చేసినాఁడవు? ఇంచుకయైన సందేహింపక భయముదక్కి గర్వముతో నా సింహాసనముపైఁ గూర్చుండుటయేగాక నేను వచ్చుట చూచియైనను లేచి దిగకున్నాఁడవు, ఇంతటి యహంకారము నీకెటులకలిగినది? తరాతరము లేకయు, నర్హముగాదనుట నెంచకయు నీ విధముగా ధైర్యమున చేయుట నీకు చెల్లునా?" యని గద్దించియడిగెను.

## అర్జునుఁడు విరాటునకుఁ దమ్మెఱింగించుట

విరాటు డడిగినమాటల కర్జునుండు చిఱునవ్వునవ్వి ఇంచుకయుం జలింపక మిన్నక కూర్చుండియున్న తనయన్నకు బదులుగా తా నా రాజుతో యిట్లుచెప్పెను, "ఓయీ! విరాటరాజా! కెంపుల కిరీటములు దాల్చి నగరికి నడదివ్వెలో యనునట్లుండు మహారాజులచే సేవింపఁబడువాఁడును, దండయాత్రలేకయే భూమియంతయు వశపఱచుకొన్నవాఁడును, యాచకులకు కోరినధనములిచ్చి వారినే దేశమంతటను సజీవదాన

ధ్వజములుగా నిలిపినవాఁడును, ఎల్ల దిక్కులనిండిన కీర్తిగలవాఁడును రాజసూయక్రతువు చేసినవాఁడును, సత్యవ్రతుఁడును నైన ధర్మరాజు సుమీ? ఇతండు పాండురాజకుమారుఁడు ఈ మహాపురుషుం డీయల్ప సింహాసనముపై నెక్కుటకు అర్హుఁడుగాఁడా?" అని పలికిన యతనిపలుకులకెంతయు విస్మయించి విరాటుండు సవినయచిత్తుండై "ఇతండు ధర్మరాజగునేని భీమార్జున నకుల సహదేవు లెవ్వరు? వార లెచ్చట నుండెదరు? అని యడిగిన నర్జునుండు మత్స్యభూపాలున కిట్లనియె.

"నరేశ్వరా! నీయింట వలలుఁడను పేరుతో వంటలు చేయుచు, పులులుసింగములు మొదలైనవానితో వినోదముగాఁబోరుచు మల్లుల తోడ నేర్పునఁబెనంగి యోడించు, మిక్కిలి బలవంతుఁడును పరాక్రమవంతుఁడునగా ప్రసిద్ధిబొందిన యీతండు భీమసేనుండు. ఇతండు బలియుండైన బకాసురునివధించి యేకచక్రపురములోని విప్రులను రక్షించెను. కిమ్మీరుఁడను రాక్షసునిఁజంపి యడవులలోనివారికి భయమును పోఁగొట్టెను. హిడింబుఁడను నసురునిగడపి యతని చెల్లెలు హిడింబయను దానినిఁ బెండ్లాడెను. ఇతండద్వితీయ శక్తిసమన్వితుండు.

దామగ్రంథి యనుపేరుతో నీగుఱ్ఱములకు పాలకుఁడై విచారించుచుండెడి యీతఁడు నకులుఁడు, ఇతండు సామాన్యుండు గాఁడు. శత్రువుల పాలిటికి మృత్యువు వంటివాఁడు, మిత్రులకు సదా సంతోషమును గలిగించువాఁడు. కోరిన కోర్కెలను పండితుల కొసంగుచుండువాఁడు. సజ్జనులచే కొనియాడఁబడువాఁడు. ఓయి విరాటరాజా! సద్గుణసంపన్నుఁడైన యీనకులుఁడు మాద్రికి పెద్దకుమారుఁడు.

గోపాలుర కెల్ల నాయకుఁడై నీయొద్దనుండెడి పశువులను గాచుచుండెడి వాఁడును తంత్రీపాలుండను నామము దాల్చిన వాఁడును నగు యితండు సహదేవుఁడు. ఈసహదేవునిమానసము కడుకోమలము. ఇతఁడు మాద్రీదేవికి చిన్నకొడుకయ్యును, కుంతీదేవికి మిక్కిలి ప్రియమైనవాఁడు. కపటములేనివాఁడు. పరాక్రమమందు, రాజనీతియందును నారితేరినవాఁడు. కురువంశమున కంతకును గీర్తి దెచ్చు సత్ప్రవర్తనము గలిగిన వాఁడు.

మంచి నడవడిగలిగి, మాలిని యనుపేరుఁబెట్టుకొని సైరంధ్రీ వేషముతో సుధేష్ణయొద్ద పనులుచేయుచుండెడి యువతియే ద్రౌపది. ఆ ద్రౌపదిని మోహించి భంగపఱచుటకు యత్నించినందువలననే నీ మఱ

ములైన కీచకులనందరను రాత్రికాలమున గంధర్వులు చంపినారనెడి పేరు బెట్టి రహస్యముగా యీ భీమసేనుండు వధించెను" అని చెప్పినయంతట భీముఁడు విరాటునకిట్లనియె.

## విరాటునకు భీముఁ డర్జును నెఱింగించుట

"ఓ మత్స్య నరేశ్వరా! తన రూపము తెలియకుండునట్లు నపుంసక వేషమును దాల్చి, నీయొద్దకువచ్చి పడుచుల కాట పాటలు నేర్పుచు బృహన్నలయను పేరుతో వర్తించుచున్న యితండర్జునుండు. తెలిసి కొనుము. ఇతండు మహా పరాక్రమముతో దేవేంద్రునిజయించి ఖాండవ వనమునుదహించె. ఇంద్రుండు వేడఁగా కాలకేయ నివాతకవచులను భయంకర రాక్షసులనుజయించె. చిత్రసేఁడు మొదలైన గంధర్వుల నోడించి దుర్యోధనుని బంధముక్తునిఁ గావించెఁ జుమీ!" యని చెప్పెను.

ఈ ప్రకారముగా పాండవులు విరాటునకు తమ్ము నెఱింగించిన యత్యంతమైన యాశ్చర్యమును, వేగిరమునుంగల చిత్తంబులతో కలత పడి యప్పటికిని సంశయము తొలంగమి నేమియుం బలుకలేక యాలో చింపుచుండ తండ్రినిఁ జూచి యతని కర్జునుంజూపి యుత్తరుం డిట్లు చెప్పెను.

"ఈయన యర్జునుఁడేయగుట సత్యము. ఇతం డింతకు మున్ను తన వృత్తాంతము నెఱింగింప వలదని యాజ్ఞాపించి యుండి నందున నేను ముందే మీతో చెప్పుటకు వెఱచి మిన్నకుంటిని. నిన్నటి దినము కౌరవుల జయించినదియు గోవులను మరల్చినదియు నితఁడేను. తండ్రీ! కౌరవసేన నెదిరించుట కర్జునుండు తానొక్కఁడే యుండుటయు, రెండవ వాఁడనగు నేను భయమునొంది యుండుటయు నన్ను యితఁడూరడించి సారథ్యమున కియ్యకొలుపుటయు, ఈ వృత్తాంతమంతయు దుర్యోధనాది కురువీరులు చూచుచుండిరి. అటువంటి గొప్పదగు కౌరవసేనను వెఱపు లేక యెదిరించుటయనఁగా నితని కొక్కనికి మాత్రమే సాధ్యమయ్యెఁ గాని మఱి యెట్టివాఁడును నంతటిపనినిఁ జేయఁజాలఁడు. ఈయర్జునుఁడు తాము పాండునందను లగుటను నాకెఱింగించి, మంచి మాటలతో శాంతచిత్తునిఁ జేసి తేరు నడుపుటకు నన్ను నియమించెను. నేనాయుద్ధము లోక సామాన్యమైనదిగాదలంచి యొప్పుకున్నాను. కాని పోరుప్రారంభ మైన తరువాత యది మహా ఘోరమును, నసదృశాద్భుతా వహమునై

యుండఁగాఁగని వెఱచి చక్కఁగా గుఱ్ఱములను నడుపలేక పలుతడవులు వెనుదీసి యెల్లనని చెప్పినాఁడను. ఇతండపుడు నాభయమును పోఁగొట్టి కౌరవబలములను నుఱుమాడి కాందిశీకులం జేసిన, దుర్యోధనుఁడు జయింపలేక యోటుపడి పాఱిపోవుచుండగా వెంబడించి 'ఓయి దుర్యోధనా! యిదిమ యజూదము నాడెడిచోటుగాదు. శూరుఁడైన వాఁడు నిలిచి పరాక్రమమును చూపవలసిన యుద్ధభూమిసుమీ!' యని కొంచమైనను దాక్షిణ్యములేని మాటలుపలికెను. కాని యతం డర్జునుని పలుకులను చెవులనిడక సేనలంగూడి మరలిచూడక పఱగెత్తిపోయె" అని ఇట్లు జరిగిన యుదంత మంతయును నుత్తరుం డెఱింగించిన విరాటుఁడు మిక్కిలి యచ్చెరువుఁజెంది యాదరమును, వేగిరపాటును, సంతోషమును నతిశయింపగా, నయ్యర్జునిఁ గౌఁగిలించుకొనెను. పిమ్మట భీముని నకుల సహదేవులను గౌఁగిలించి యధికమై యుప్పొంగుచున్న యానందముతో చేతులు మోడ్చి శిరమునఁజేర్చి ధర్మరాజు మొగంబుఁజూచుచు నిలువఁబడియెను. అప్పు డర్జునుం డుత్తరునిం బిలిచి వానికిఁ దన యన్నదమ్ములను కనబరచి చెప్పెను.

విరటుఁడా యుత్తములైన పాండవుల దర్శనమునకై పెద్దలను బంధుమిత్ర జనంబులను బిలిపించి యుందఱకును కౌంతేయుల నెఱింగించి సంతసముమీఱ సమస్తజన సమేతంబుగా ధర్మతనయు సేవాతత్పరుండై యతని యనుమతినిఁ బొంది యుత్తమంబైన యుచితాసనముపైఁ గూర్చుండి యంతఃపుర పరిచారికల రావించి యీ వృత్తాంత మంతయును సుధేష్ణ కెఱింగించి పాంచాల సుతను తగినచందమునఁ మరియాదలొనర్పు నట్లు చెప్పి పనిచిన, వారలరిగి నంతట ధనంజయుండా మహీవల్లభున కిట్లనియె.

' మత్స్యధరానాయకా! చాల దుస్తరమైనట్టి మా యజ్ఞాత వాసవ్రతమును యిప్పటివరకు నెట్టి కష్టములులేక బంధువుల చందమున మీ యింటనుండి మేము గడపితిమి. నీవు దయగల వాఁడవై కష్టకాలమున నెంతయు మాకు సహాయముఁ జేసినాఁడవు. దీనికి బదులు మేము నీకుఁ జేయఁదగిన మేలుకార్య మేదియో తోచకున్నది'' యని పలికిన విరాటరాజు "అర్జునా! నేనఁనగా నెవ్వఁడను? మీకు పరాయి వాఁడనా? మీవాఁడనుకానా? నీవు నన్నుఁగూర్చి యిటుల నుపచార వాక్యము పలుకతగదు? ఘనులైన మీరు సకల కష్టములను సైఁచి

యజ్ఞాతవాస ప్రతిజ్ఞను తీర్చుకొని సంతోషమును పొందుట నా భాగ్యము గాని యన్యముగాదని తలంచుచున్నాను. ఫల్గుణా! ఇంక యీ రాజ్య మంతయును ధర్మనందనుండే యేలవలయును. మేందరమును నిమ్మ హాత్మునిం గొలిచి యుండెదము. హస్తినాపురమునకు దండెత్తిపోవలసిన యెడల దానికిం దగిన సన్నాహమెల్లను చేసెదము" అని యిట్లు మత్స్యరాజు పలికిన యుత్తరుం డదంతను వినుచుండగా తండ్రితో "నాయినా! నిన్నటిదినము నన్నును, మొన్న మమ్మును రక్షించి మన శత్రువుల జయించి నీ కొసంగినట్టిదే కదా ఈ రాజ్యము? లేకున్న నేమై యగును? ఈ రాజ్యము మనకుదక్కి యుండునా? వీరిచే నివ్వంబడిన దైన యీ రాజ్యమిపుడు మనము వీరల కొసంగునట్లు చెప్పకూడదు. ఇంత వరకును [illegible] ప్రచ్ఛన్న వేషములు దాల్చి వీరు మన యింట నుండుటచేత తెలియక మనము వీరియెడల నెన్నియో యపరాధములు చేసితిమి. ఇపుడు తత్పరిహారముగా చేయవలసిన దేమనంగా మన తప్పులన్నియు క్షమించి ప్రసన్న చిత్తులగునట్లు ప్రార్థింపవలసినది. అంతియకాని వీరొసగిన ధనమునే మరల వీరి కొసంగుట యందు గల గొప్పతనమేమి గలదు? ఏదేనియు క్రొత్తదగు కానుకను వీరికర్పింపవలయును. కాంబట్టి మన యుత్తర నిచ్చుటకై రావింపు"మని చెప్పెను.

మిక్కిలి యుక్తముగను సమయోచితముగను జెప్పిన కుమారుని మాటల కెంతయు సంతోషించి విరాటరాజు కూతుం దోడ్కొని రండని పరిచారికల నియోగించిన వారుపోయి ఆవృత్తాంతమును సుధేష్ణ కెఱింగించుటయు నామె పరమానందమునుబొంది కుమార్తె నలంకరించి మంత్రుల వెంట సఖీజన సహితంబుగా పుత్తెంచెను.

## విరాటుఁడు తనకుమార్తె నర్జునున కొసంగుట

బహువిధముల నలంకరించిన యా చేడియను పైడి పల్లకిలో గూర్చుండబెట్టుకొని యిరువంకల చెలులు సేవించుచుండంగా మహావిభవముతో కొలువు కూటమునకుం దెచ్చిన విరాటుం డెదురుగాంబోయి లక్ష్మి సన్నిభయై యొప్పుచున్న యా యొప్పుల కుప్పను తానును బంధుజనులును పొదివికొని యత్యాదరముంనగొనివచ్చి ధర్మసుతునకు సమీపమందు నిలువంబెట్టి తాను చేతులుమోడ్చి మ్రొక్కి యిట్లు చెప్పెను.

మహాత్మా! మీరు ఫలానివారని యెఱుంగమిచే నేను పెక్కులు తప్పులు మీయెడల నొనరించి యుండుదును. అటువంటి నాయొక్కయు నాకు సంబంధించిన వారియొక్కయు నేరము లన్నియును మన్నింప వలయునని వేడుకొనుచున్నాను. మేమందరమును మీకు సేవకులమై యుండగల వారము'' అని విన్నవించి తన తమ్ములను కొడుకులనుంజూపి, వారిచే మ్రొక్కించి వెండియు నిట్లనియె.

"పాండు కుమారాగ్రణీ! ఇదె, ఈ కన్నియ నా కుమార్తెయైన యుత్తరను నేను పరమ ప్రీతితోడ నర్జునకొసంగుచున్నాను. ఈ సుంద రాంగిని అతనికి పరిణయముం గావింపుము. అయ్యా! నేనీమె నర్జునున కిచ్చుటయు, నేను మిమ్ముం గొలిచి యుండుటయు మావారి కందరకు నెంతయుం దన్నస్తికరమై యుండును. కాదనక నా మనవి నంగీకరింప వలసినది'' యని ప్రార్థించెను.

మత్స్యావనీపతి పలికిన వాక్యములువిని ధర్మనందనుండు సాభి ప్రాయంబుగా నర్జుననుని ముఖంబుం దిలకించిన యతండు ధర్మజుని యభి మతము నెఱింగి విరాటునిం జూచి "ధరణీవరా! ఈ యుత్తరను నేను పరిగ్రహించుట న్యాయముకాదు. ఏలననంగా, ఈకన్నియ నాయొద్ద విద్యాభ్యాసముం జేసినదగుటచే కుమార్తె వంటిదగును. ఇట్టి దానినిం బెండ్లాడుట ధర్మవిరుద్ధము. కాబట్టి ఇపుడు నీ వెంతయుం బ్రియంబుతో నర్పించిన యీ చిన్నదానిని నేను కోడలుగా నంగీకరించు చున్నాను. నా కుమారుఁడైన యభిమన్యున కీమెనొసంగి పెండ్లి చేయుము. శ్రీ కృష్ణునకు మేనల్లుఁడు, నా తనయుడు నగు నభిమన్యుఁడు సద్గుణ సంపద యందును, రూపమందును నీమెకు తగియుండును. అతని కీమె నొసంగు'' మనియెను.

అర్జునుం డిటుల చెప్పినంతట విరాటరాజతని ధర్మప్రవర్తనము నకు సంతసించి యత్యంత సంతుష్టాంత రంగుఁడై యతండు చెప్పిన లాగున చేయుటకు సమ్మతించెను. అందఱును నవ్విధమున జరుగుటకు తమ సంతోషముం దెలిపిరి.

అంత విరాటుఁడానంద మగ్నుఁడై యందఱును వినుచుండఁగా, "అర్జునునితో వియ్యమందుట కన్న భాగ్యమును గొప్పగౌరవమునునాకు మఱి కలుగదు. ఇంక జరుగవలసినరీతిని ధర్మజుండు నిర్ణయించి చెప్పవలసి నది. ఆప్రకారము మనము నడచుకొన వలనది'' యని నుడివిన యుధిష్ఠి

ఱుండు "నరేంద్రా! అర్జునుండు మిక్కిలి యుక్తముగా చెప్పెను. కావున నతండు చెప్పిన చందమున చేయుట యుచితపద్ధతి. ఇంక నీవు తడవుఁ జేయక యీశుభవార్తను బంధువుల కెల్లరకు నెఱింగింపు"మని నిశ్చయించి పలికె. అపుడు విరాటుఁడు "కౌరవ వంశజుల సంబంధముచే మత్స్యవంశము పావనంబయ్యె"నని చెప్పి యుత్తరచే పాండుసుతులకు వరుసక్రమంబుగా మ్రొక్కించిన వారామెను దీవించి యంతఃపురంబున కరుగుట కనుమతించుటయు సఖీజన పరివృతయై యుత్తరఁజనెను.

పిమ్మట విరాటరాజు వివేకులగు బ్రాహ్మణుల రావించి ముహూర్తము నిర్ణయము జేయించి యైనంతట యాదవ పాంచాలాది బంధుజనంబుల నెల్లరను పెండ్లికిఁ బిలుచుకటకై ధర్మనందన విరాటులు తమ తమ పక్షంబున వారియొద్దకు తగిన మనుష్యులం బుత్తెంచిరి. అంతట ధర్మసుతుండు మత్స్యనాథుని గౌరవించి తా మతని పాలనుంచి యజ్ఞాతవాసవ్రతమును నిరంతరాయముగా జరపుకొనుటబలికి యమ్మహీపాలుని గుణవిశేషములను మిక్కిలి కొనియాడి "రాజచంద్రా! నీవు మాకు సామాన్య బంధుఁడవుగావు. వాసుదేవుఁ డెట్టివాఁడో యటుంటివాఁడవుగా భావించుచున్నారము. సుఖీ" యని సంభావించిన విరాటుండతనికి నమస్కరించిన నతనిని గ్రుచ్చి కౌఁగలించుకొనియె. తదనంతర మారాజవరేణ్యుండు పాండుసుతులందోడ్కొని చని వివిధోపచారముల చేతను, మజ్జన భోజనాదుల చేతను పరితుష్టులంగావించె.

## దుర్యోధనుఁడు ధర్మనందనునియొద్దకు దూతను బుత్తెంచుట

ఇచ్చట వృత్తాంత మిట్లుండఁగా దుర్యోధనుండు తన పురంబున కేగుచు, మార్గమధ్యమున విడిసినచోట కర్ణ శకుని దుశ్శాసనులంగూడి రహస్య ప్రసంగముఁజేసి వారి దురాలోచన నంగీకరించి, భీష్ముండు చెప్పిన మాటలనునమ్మక యవి యప్రమాణ వాక్యములని నిశ్చయించి, ధర్మతనయుండసత్యమును పలుకు వాఁడుకాఁడని యెఱింగియున్న కతన యతనియొద్దకొక్క సేవకునిఁ బనుపనెంచి వానితో ధర్మజునకుఁ దెలుపవలసినవిధంబుఁ జెప్పి పంపెను.

ఆ సేవకుండు శీఘ్రముగా మత్స్యపురమునకరిగి ధర్మనందనునొద్దకుఁబోయి మ్రొక్కి యీరీతి విన్నవించెను. "ధర్మాత్మజా! నీవుసత్యమును తప్పి వర్తించువాఁడవుకావు. మన మేర్పరచుకొనిన యజ్ఞాతవాస

వ్రతమునిండక పూర్వమే యర్జునుండు బయలుపడినాఁడు. అందువలన నియమభంగమేర్పడినది. ఇటులైనచో జరుగవలసిన విధమును మొదటనే నిశ్చయించుకొని యున్నారము. కాఁబట్టి, ధర్మవిరోధముగానటుల నీవిధము నాలోచించి తగినట్లు చేయవలసినది'' అని మరల వనవాసము చేయవలయుననెడి యభిప్రాయమేర్పడునట్లు చెప్పి పంపిన మాటలఁజెప్పిన విని యుధిష్ఠిరుండు నవ్వి యా సేవకునిఁజూచి ''ఓయీ! నీవుపోయి సుయోధనునితో భీష్మద్రోణులు వినుచుండఁగా 'సంశయింపవలసిన యక్కఱ లేదు. ప్రతిజ్ఞ పరిపూర్ణమైనదని దృఢముగా వచించితినని చెప్పుము. ఇంకనేమి యాలోచించియు ప్రయోజనము కలుగదంటినని యెరింగింపుము పొ''మ్మని పలికెను.

ఆ సేవకుఁ డరిగి దుర్యోధనునొద్దకుఁ జేరుటయు, నతండు వాని వలన రహస్యముగా ధర్మరాజు చెప్పిపంపిన మాటలం దెలిసికొని యా రాత్రి సభ చేసి, తాను దూతను పాండవాగ్రజు నొద్దకుఁ బనుచుటం జెప్పక యే భీష్మద్రోణాదులంగాంచి యిట్లనియె, ''ఓహో! మనము మోసపోయి నారము, విన్నారా? కపటము లేనివారమగుటచే యర్జునునితో యుద్ధముఁ జేసితిమి. అతం డజ్ఞాతవాసకాలమును పూర్ణముగాఁగడిపి బయల్పడెనా లేదా? యనుటను మనలో నొక్కఁడును విచారించి నిజము నెఱింగిన వాఁడు కాఁడు. ఇప్పుడైనను తద్విషయమును బాగుగా విచారించి తెలిసి కొనవలయును'' అని పలికెను,

అతని మాటలువిని భీష్ముండు మనంబున కినుక గదురఁ దా ''దుర్యోధనా! ఇవి యేమి మాటలు? ఇంక నూఱకుండుము. ఇట్లు చెప్పినచో విన్నవారు నవ్వుదురు. ప్రతిజ్ఞ కాలము కడచెననియు, పాండుపుత్రులు అందున ధర్మరాజు ధర్మవిరుద్ధముగా ప్రవర్తింపఁడనియు ముందే పీను నేను చెప్పితిని, యా విషయమునే మరలనిపుడు ప్రస్తావించు టేల? ఏమిలాభము గలదు, తద్విషయమును గూర్చి సందియ మొందనవసరము లే''దని గట్టిగా నుడివెను,

ఆ సభలోనుండినవారు గాంగేయుండు చెప్పిన వాక్యముల నామోదించి ''ఔనౌను! పితామహుండు పలికినది యుక్తమే. తన వ్రతమును భంగపఱచుకొని వెండియు వనములకేగి యిడుములొందుటకుఁ బూని బయటపడుట కర్జునుండు వెఱ్ఱివాఁడా! వారి నియమము తుదముట్టుట నెఱింగియే యతఁడు బయటపడియె''నని యేకవాక్యముగాఁ బలికిరి.

అంత చేయునది లేక ఖిన్నుఁడై కురురాజు హతశేషబలంబులం గూడుకొని యటనుండి కదలిపోయి హస్తినాపురముఁ జేరెను.

## శ్రీకృష్ణుడు బలరామాదులతో పాండవులఁ జూడవచ్చుట

పాండుకుమారులంతట తాము జమ్మిచెట్టుపై దాచియుంచియున్న తమతమ యాయుధములను పూజాపూర్వకముగాఁ గైకొని మత్స్యమహీనాథుండు కావలసిన సహాయంబుఁ జేయగా వచ్చి యుపప్లావ్యంబను పట్టణమున వసించి మిక్కిలి వినయముతో పురజనులు సంతసించి యర్పించిన కానుకలం గొనుచు యిష్టసుఖంబుల ననుభవించుచు, మహదైశ్వర్యంబున శోభిల్లుచుండఁగా వాసుదేవుండు బలదేవ సాత్యకీ సహితుఁడై సుభద్రాభిమన్యులం దోడ్కొని, కృతవర్మయు, ప్రద్యుమ్నుండును సాంబుండును, యుయుధానుండును, రుక్మ్యుండును, నక్రూరుడును మఱియు నింద్రసేనాది పాండవులయొక్క సారథులు రథములతోడను వచ్చుచుండ ననేకులు యాదవకుమారులు రథములతోను, యేనుగులతోను, గుఱ్ఱముల తోను, పదాతులతోనుం గూడి యిరు గెలంకులం గొలిచియే తెరఁగా నరుదెంచి యుపప్లావ్యమును జేరుటయు, పాండుసుతులు వారి రాక నెఱింగి పరమానందభరితులై యెదురుగాఁబోయి యాలింగనాది కృత్యములాచరించి తోడ్కొని తమ నగరునకు వచ్చిరి.

అప్పుడు కృష్ణుడు బహువిధములైన రత్నాభరణాదులను పాండుసుతులకును పాంచాలరాజనందనకును బహుమతిగా ప్రియంబున నిచ్చెను. అంతట సుభద్ర నంతఃపురమునకుఁ బనిచి బలభద్రాదులును తానును ధర్మజాదులం గూడి యుచితాలాపంబులు జరుపుచు సంతసంబతిశయింపఁగా నలరారుచుండె. అటుపిమ్మట ద్రుపదరాజు కొడుకులతోడను, బంధుమిత్ర జనంబులతోడను నరుదెంచి పాండవులచే సత్కృతుండై ప్రమోదంబున నుండె. శైభ్యుడును కాశీరాజును బలసహితులై వచ్చి ధర్మరాజువలన సత్కృతులఁ బొంది యుండిరి.

అప్పుడు విరాటరాజు వారి కందఱకును నానావిధ సత్కార్యములు నొనర్చె. మఱియు దేశదేశములనుండియు రాజులును బంధువులును మిత్రులును పెండ్లికొఱకై వచ్చి మర్యాదలను పొంది విడిసిరి. ఈ ప్రకారముగా రెండువైపులకు సంబంధించి వారునుం జేరినంతట విరాటుండు పట్టణమందు వివాహోత్సవము చాటింప నియమించెను.

ఆ పురంబునందలి పౌరులు సంతోషముతో ధ్వజము లెత్తి వానికి బంగారు కలువపూవులదండలు వ్రేలఁగట్టి ద్వారములరత్నముల తోరణములు గీలుకొల్పి యరటిచెట్లును వాకిళ్ళ కిరు దెసలనునాటి ఇండ్లలో కుంకుమపువ్వుతో నలికి కర్పూరపుముగ్గులు బెట్టి మఱియుం దగినవిధమున సకల విధాలంకారముల నొనరించి పురంబు శోభాయమానంబుగఁ జేసిరి. వివాహమహోత్సవమునకై యలంకరింపఁ బడిన యాపట్టణమప్పుడు వసంత ఋతువులందు రమణీయయుద్యాన వనంబువలె గనుపట్టుచు వివాహమహోత్సవమున కెంతయుందగి యొప్పుచుండెను. జనులందఱు నానందించుచుండిరి.

ఈ ప్రకారముగా పెండ్లికిగాఁ జేయవలసిన పనులన్నియును సిద్ధము జేసినంతట విరాటరాజు సర్వాలంకార యుక్తురాలైన తన భార్య మొదలగు వారితోఁగూడి మంగళాలంకార గంధమాల్యములు దాల్చి బ్రాహ్మణులను ముత్తైదువలను దోడ్తెచ్చుటకు తగినవారిని నియమించి, తాను విడిసియున్న యింటియందు మణిదీపస్తంభములు నిడిపించి రత్నదీపములు బెట్టించి, చక్కని మేలుకట్టుగట్టించి, ముత్యాలదండలు వ్రేలఁగట్టించి, ప్రక్కలందు చెట్లును చిగురుటాకుల తోరణములునుగట్టించి ముత్తైదువులచే పెండ్లిమంటప మలికించి పీటలుకడిగించి, ముత్తెముల ముగ్గులు బెట్టించి యసదృశంబైన యలంకారాదులు జేయించె.

పిమ్మట పురోహితుఁడువచ్చి పెండ్లికిఁగావలసిన వస్తువులన్నియు సమకూర్చి వేదిక నలంకరించె. విరాటుండంతట మేలైన వస్త్రభూషణ గంధ మాల్యాదులచే బాగుగా నలంకరించుటకై యుత్తరకొఱకు నేర్పుగల యువతులనియమించి శీఘ్రముగా నయ్యాబల నలంకృతాంగినిం జేయించె.

## అభిమన్యుని వివాహ మహోత్సవము

ఈ తెఱంగున, క్రమముగా విరాటుండు వివాహకార్యనిమగ్నుడై పెద్దలుచెప్పిన ప్రకారము కార్యములెల్లను నిర్వర్తించి ముహూర్తకాలము సమీపించెనని ధర్మతనయున కెఱింగింపఁదగు వారిఁ బనిచి తాను బ్రాహ్మణులను బంధుజనులను పరివేష్టించి యుండఁగా వారి రాకకు నిరీక్షించుచుండె,

అపుడు ధర్మసుతుండు తానును, తమ్ములును నలంకరించుకొని శృంగారముతోఁ గూడిన శరీరములు మెఱయుచుండెడి సుభద్రాపాంచాల పుత్రికాది నారీ జనంబులును, సకలబంధు జనంబులునుఁ బరివేష్టించి వచ్చుచుండ దివ్యాలంకార సఁశోభితుండైన యభిమన్యుని నలంకరింపఁ బడిన భద్రగజంబుపై నెక్కించి యేనుగులును, గుఱ్ఱములును, పరిచారికా సముదయంబులును నడువ, స్త్రీలుం బురుషులును నానా విధములగు రత్నములు, వస్త్రభూషణ చయము, పండ్లు, పూవులు, చందనము, తాంబూల పరికరములు కుంకుమాగరు ద్రవ్యంములు మొదలుగాఁగల మంగళ వస్తు నికరములు, బంగారు పాత్రములందు బెట్టుకొని పార్శ్వంబుల నేతేర, బ్రాహ్మణాశీర్వాదములును, మంగళ తూర్య వినోదములు మిన్నుముట్టుచుండ, నటభటగాయక వందిమాగధ బృందంబుగొలువ వాసుదేవుండు ముందు నడుచుచుండ విరాటునిమందిరమునకు మహావిభవముతో నరుదెంచె.

అపుడు మత్స్యభూపాలుండు తగినవారితో తగువస్తువులతో, శంఖ జయఘంటా ప్రణవప్రముఖ ధ్వనులతిశయింపఁగా వారికెదురుగా వచ్చి ముత్తైదువలు శేసలు చల్లుచుండఁగా మర్యాదఁగావించి తోడ్కొని పోయి వివాహమంటపమునకుఁ జేరిన యెల్లవారును పరమానందమగ్నులై యున్న యవసరమున, విరాటుఁడు సముచితభంగి భయభక్తులెసంగఁగా పూజించి యపుడు చేయవలసిన పనులన్నియుఁ దమ యాచారవిధుల ననుసరించి క్రమముగానొనరించిన బ్రాహ్మణులచ్చోట చేయవలసిన శుభకర్మ కలాపములు జరిగించిరి. అట్టియెడ శ్రీకృష్ణుఁడు మొదలైనవార లుత్తరాభిమన్యులను తెరకిరువంకలను నిలువఁబెట్టిరి.

జ్యోతిష్కులు నిర్ణయించిన ప్రకారముగా లగ్నమునను భూసురాశీర్వాద వాద్యధ్వను లతిశయించియుండగా, వధూవరులకు నడుమఁ గట్టింపఁ బడియున్న తెర నెత్తించిన యుత్తరాభిమన్యులొండొరుల సౌందర్యము నితరులు పొగడుచుండఁగా విని చూచుటకై యువ్విళ్లూరుచు నొకరిపై నొకరత్యంతమైన వలపు నొందియున్న వారగుటచేత యాసమయమున మన్మథవికార కలిత చిత్తులై యొండొరులు విలోకించునపుఁ డధికానురాగ వశమ్ములై యట్టి శరీరములపైఁ బ్రసరించిన మోహపూరితములగు తమ చూపులను మరలించుకోలేక యుండిరి.



ఉత్తరా, అభిమన్యుల వివాహము

ఆ వధూవరు లత్యంతానురాగముతో మందార కల్పలతలు విరులు గురిసిన విధమున నొకరిపై నొకరు ముత్తెములు నతీతలు తలంబ్రాలుబోసికొనిరి. తత్పూర్వము సిగ్గుచే నొండొరులు చక్కగా చూచుకొనకుండినను తలంబ్రాలు పోసికొనునప్పుడు కనుగొనుటకు మంచి సమయము లభించెను. కాన బాగుగా చూచి సంతోషమును బొందిరి.

తత్సమయమున మనిలోని యనురాగము చేతులు తెలుపుచున్నవోయనునట్లు యెఱ్ఱనైన చిగురులవంటి హస్తములనభిమన్యుఁడు మదపుటేనుఁగు చిగురులనుబట్టిన విధముగా బట్టుకొనెను. ఈప్రకారము పాణిగ్రహణం బాచరించి వధూవరులుపీటలపైఁ గూర్చుండి యొకపాదునందు నాటిన మామిడియు విరజాజియుంబోలె నొప్పుచుండిరి.

ఇట్లా యుత్తరాభిమన్యుల కోర్కెలీడేఱఁగా నధికాను రాగముచే కోమలములైన పులకాంకురము లొదవి మఱియొకరికిం దగులునట్లుండెను, ఒకరినొకరు చూచుకొనుటకు సమయము దొరకుటచే నొండొరుల చూపులు తడబాటునొంది మరల్చుకొనుటకు సాధ్యముగాక యట్టెనిలిచె. ఒండొరులు చెమటలు గలసినపుడు వారు పరవశత్వము బొందిరి. హోమము చేయునపుడు వారొండొరుల శరీరములు తగిలిన కతన నానందమొందుచుండిరి.

ఈ రీతిగా నయ్యుత్తరాభిమన్యు లెనలేని సమ్మోదంబున దేలియాడుచుండఁగా విరాటరాజు వివాహకృత్యంబును నిర్వహించి మైనంతట మణులు చెక్కిన సొమ్ములును మేలైన వస్త్రములును, పరిమళద్రవ్యములును, తాంబూలాది వస్తుచయమును పైడిపళ్ళెరములో వేఱువేఱుగా నుంపించి వాసుదేవునకును, పాండుపుత్రులకును వరుసగా నొసంగి, పురోహితాదులకు వస్త్ర భూషణములును దక్షిణలునిచ్చి సంతుష్టినొందించి. యాజ్ఞసేని సుభద్రాప్రముఖ నారీరత్నముల కర్హవిధంబున సొమ్ములును మణులును, పంజరములును తగినవారిచే యంతఃపురమునకుఁ బనిచి, యభిమన్యునకు మేలైన యేడుసూరుల గజములును, శుభలక్షణ యుక్తంబులగు పదివేల గుఱ్ఱములును, నైదులక్షలు మంచి యావులను రెండువేలు తేరులును, లక్ష దాసీజనంబులును, మఱియు బెక్కు విధంబులగు వస్తువులును ధనంబులును నరణంబుగా



కృష్ణుఁడు ద్వారకలో వేడుకగానుండుట

అమ్మహనీయమగు వివాహ మహోత్సవము, సకలవిధ మంగళ ద్రవ్యములవలనను, శుభకార్యములందు చేయు పనులలో జాగ్రతగలిగి మెలంగు ముత్తైదువల వలనను, నృత్యగీతములందు ప్రసిద్ధులైన వేశ్యకాంతా జనంబులవలనను, సమస్త రత్నాభరణములు ధరించి ప్రకాశించు దేహములుగలిగి విలాసముగా చాతుర్యముగా మాటలాడు రాజకుమారుల పరిహాసోక్తులవలనను ప్రసిద్ధినొందిన నృపుల వలనను పాంచాలురు, కేకయులు, యాదవులు ఆదిగా గలుగు బంధు సముదయంబులవలనను, సస్నేహభావులై వర్తించు పాండుసుతులవలనను, మత్స్యమహీపతి మందిరము పరమ సంపద్భరితమై శోభాయమానంబై యానందకరంబై జన వినుతంబై యొప్పుచుండెను.”

అని యివ్విధమున వైశంపాయన ముని శ్రేష్ఠుండు పాండురాజనందనుల యజ్ఞాతవాస ప్రకారమును, తత్కాలాచరణ కృత్యంబులును, ఉత్తరాభిమన్యుల వివాహ మహోత్సవంబును, విరాటరాజ పాండుకుమారుల యన్యోన్య స్నేహ బాంధవ్య విశేషంబులను వివరించిన విని జనమేజయ మహీజాని యాశ్చర్యమును జెంది పరమానందమును బొందిన వాఁడయ్యెను.

శా॥ అక్రూరార్జున భీష్మ దాల్భ్య శుకము ఖ్యారాధ నాధార కా
మక్రోధాద్యరివర్గదూర యలమే ల్మంగా మనోవల్లభా
శక్ర క్లేశ హరిక్రియానిరత కృష్ణా మానసంతతుకా
చక్రాబ్జాన్విత పాణి యుగ్మ కరుణా సంపన్న విశ్వాత్మకా!

క॥ శివమిత్ర దుష్టనిగ్రహ
భవజలనిధి తరణ పుణ్యభావ ముకుందా
దివిజాశ్రయ శేషాచల
భవన స్థిరవాస భక్త పాలన సక్తా!

మత్తకోకిలా వృత్తము

సర్వలోక శరణ్య దుష్టని శాటభంజన యచ్యుతా
పర్వతోద్ధర ముక్తదోష సు పర్వయోగి జనస్తుతా
నిర్వికార విలాస మానస నీరజాయతలోచనా
శర్వరీవర సన్నిభావన సాధుజీవన పావనా.

గ ద్య

ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధ సహజ చతు
ర్విధ కవిత్వ మహాత్వాభి రామ, పౌరాణిక వంశ
పయః పారావార పర్వ శర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవి త్రాపస్తంబ సూత్ర, సావిత్రీ లక్ష్మీ
నృసింహార్య పుత్ర విజయాశ్వ చరిత్రాద్య
నేకగ్రంథ కల్పనాతి ప్రవీణతా ధురీణ
సదా చార క్రియావర్తన ప్రమాణ
సుకవిజన విధేయ పిచ్చయ నామ
ధేయ విరచితంబగు, పాండ
వాజ్ఞాతవాస ప్రవర్తనం
బను వచనకావ్యము
స ర్వ ం బు ను
సంపూర్ణము.

శ్రీ మద్వేంకటేశ్వ రార్పణమస్తు.

సమస్త సన్మంగళాని భవంతు, సర్వేజనా స్సుఖినో భవంతు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



ఆనందభారతి పవర్ ప్రెస్, మదరాసు-1.

ఎస్. వి. గోపాల్ అండు కో.,

పి. బి. నెం. 74 నెం. 63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, మద్రాసు-1.

# కుట్టుపని స్వబోధిని

దేశము అభివృద్ధి పొందవలయుననిన, పరిశ్రమలు అభివృద్ధి పొందవలయును. మన దేశములో పెక్కు పరిశ్రమలు అభివృద్ధి పొందవలసి యున్నవి. అట్టి పరిశ్రమలలో 'కుట్టుపని' ఒకటి. దుస్తులు శరీరమునకు ఒక విధమైన అందమును కలుగజేయును. అట్టి అందము గుడ్డను కత్తిరించుట, కుట్టుటలో వచ్చును. ఏయే దుస్తులకు కొలతలు ఏవిధముగ తీసుకొనవలయునో-కుట్టుపనియందు తీసుకొనవలసిన జాగ్రత్త-బాడీలు-వివిధ రకముల జాకెట్లు-వివిధరకముల మెడలు కత్తిరించు విధము-లేసులు అతికించి కుట్టుట-రవికలు-వివిధరకముల ప్రాకులు-బనియనులు-షర్టులు-స్లేకు షర్టులు కోట్లు-బుష్‌కోట్లు-లాల్చీలు పేంటులు నిక్కర్లు-డ్రాయిర్లు మొదలగు అనేక రకముల దుస్తులు కుట్టువిధానములు ఆధునిక పద్ధతుల ననుసరించి వ్రాయబడెను. కుట్టుపని నేర్చుకొనువారికని-ఇదివరలో నేర్చుకొని నూతన విధానములను తెలుసుకొన దలచినవారికిని ముఖ్యముగ చదువతగినది.

వెల రు 2-00

## స్థూలసూక్ష్మ పంచపక్షుల
# అష్టదిక్కుల ఆరూఢ శాస్త్రము

ఇందు సహదేవుడు, కుంభముని, అగస్త్యుడు, భోగఋషి మున్నగు ప్రాచీన ఋషులచేతను, జ్యోతిషశాస్త్ర వేత్తలవల్లను, కవులవల్లను తెలుపబడిన పంచపక్షుల వివరమున్ను, కాలనిర్ణయము, స్థూలసూక్ష్మ రహస్యములున్ను తమంత తామే సులభముగా తెలుసుకొనుటకు తగినట్లు వివరముగా వ్రాయబడినది. ఈ అష్టదిక్కుల ఆరూఢమను శాస్త్రము సంస్కృత, ఆంధ్ర, ద్రావిడ, కర్నాటక భాషలలో లభించిన ముఖ్యాంశములను క్రోడీకరించి సర్వజనోపకారంబుగా నుండునట్లు వ్రాయబడినది, ఆరూఢ, ప్రశ్నోత్తరములు మొదలగునవి అద్దమువలె చూపగల గ్రంథము.

వెల 1-50

# పుట్టుమచ్చల శాస్త్రము

ప్రతి వ్యక్తికినీ ముఖముమీదగాని, ముక్కుమీదగాని, చెవిమీదగాని, చేతులందుగాని, కాలిమీదగాని, కడుపుపైనగాని శరీరమందెచ్చటనైనను, ఏఅవయవము మిదనైనను పుట్టుమచ్చ లుండుట సహజము. ఇట్టి పుట్టుమచ్చలు మానవులకు కలుగబోవు శుభాశుభ ఫలితములపై నాధారపడి పుట్టుచున్నవి. శరీరముపై యేభాగమున నున్న పుట్టుమచ్చ యేమిఫలితము సూచించునో ప్రతివారికిని సులభముగా తెలియునట్లు యీ శాస్త్రమునందు వివరముగా తెలుపబడినది, పుట్టుమచ్చ లెన్నిరకములైనవి గలవో ఏరంగుగల పుట్టుమచ్చ యేమిఫలితముల నిచ్చునో వివరించబడి యున్నది. దీనిసహాయమున ప్రతి వ్యక్తియూ తమభావి జీవిత ఫలితములను సులభముగా తెలుసుకొన వచ్చును.

వెల 0-5

# రామాశ్వమేధయాగము

ఒక చాకలివాని నిందను సహించజాలక శ్రీరామచంద్రుడు గర్భవతిగానున్న సీతాదేవిని అరణ్యమునకు పంపుట, వాల్మీకిమహర్షి సీతాదేవి నాదరించుట, లవకుశుల పుట్టుక, శ్రీరామచంద్రుడు అశ్వమేధయాగముచేయదలచి దిగ్విజయ యాత్రకు పంపిన యజ్ఞాశ్వమును బంధించిన లవకుశులతో యుద్ధముచేసి రామలక్ష్మణ భరత శత్రుఘ్నాదులు అపజయముపొందుట, సీతారాములు కలిసికొనుట, శ్రీరామచంద్రుడు తిరిగి తన పాతివ్రత్యమును శంకించి అగ్నిప్రవేశము చేయగోరగా సీతాదేవి అలిగి భూప్రవేశమగుట, శ్రీరామలక్ష్మణుల యెడబాటు, లక్ష్మణుడు అయోధ్యను, సోదరులను విడచి పోవలసి వచ్చుట మున్నగు విషయములు కన్నులకు గట్టునట్లు అతివివరముగా పండిత పామర రంజకముగా వ్రాయబడిన కరుణ రసభరితమైన సీతా మహాసాధ్వి వనవాసగాథ. ఇంత వివరముగా, యింతచక్కని శైలిలో లవకుశుల అద్భుతచరిత్రముగల గ్రంథము మరొకటిలేదు. స్త్రీపురుషులెల్లరును చదువదగిన అమూల్య వచనగ్రంథము.

అట్టబైండు వె॥ 3-00

# శ్రీరామ వనవాసము

శ్రీరామ చరిత్రంబు సర్వజనాదరణీయంబును, లోకప్రసిద్ధంబును పొందిన దగుటచే యీగ్రంథమును గూర్చి విస్తరించి వ్రాయనవసరములేదు. ఇది శ్రీరామచంద్రుని వనవాస వృత్తాంతమును సామాన్యులకు తెలియని అనేక విషయములతో మృదుమధుర శైలిలో వివరముగా వ్రాయబడిన వచనగ్రంథము. సీతారామలక్ష్మణులు వనవాసము నెట్లు గడపినదియు అతి విపులముగ వ్రాయబడినది. చక్కని చిత్రపటములు చేర్చబడియున్నవి. ఎల్లరును చదువదగినది.

వెల 1-50

# శ్రీమద్భగవద్గీతా తాత్పర్యసంగ్రహము

భక్తిజ్ఞాన వైరాగ్యాది బ్రహ్మవిద్యలను బోధించునట్టిదియు, వేదాంతసారతమంబగుటచే బ్రహ్మవిద్యయనియు, తత్సహిత పురుషార్థయోగధర్మములను బోధించునది కావున యోగశాస్త్రమనియు, అర్జునుని వ్యాజీకరించి శ్రీకృష్ణభగవానునిచే ఉపదేశింపబడినందున కృష్ణార్జున సంవాదమనియు ప్రపంచప్రఖ్యాతి పొందినట్టిదియు, భారతీయులకు మిక్కిలి పూజనీయమైనదియునగు యీపవిత్రగ్రంథము సామాన్యులు సైతము చదువుకొని చక్కగా అర్థముచేసికొనులాగున తాత్పర్యము వ్రాయబడినది. సామాన్య ప్రజలకు అందుబాటుగా వుండునట్లు తక్కువధర నిర్ణయించి ప్రచురించి యున్నాము. ఇందు విశ్వరూప పటము సహా గలదు. ముచ్చటైన కృష్ణార్జునుల డబుల్ కలరు ముఖచిత్రముతో పాకెట్ సైజు 450 పేజీలు బైండు గ్రంథము.

వెల 2-00

# సనారీ విశ్వేశ్వర సంవాదము

పూజించదగినది, జ్ఞానదీపమనదగినది, ఇందు యంత్ర, తంత్ర, మంత్ర తత్వయోగంబులు వివరముగా తెలియజెప్పబడినవి. వేదాంత పరిచయము కోరువారికిది అమూల్య నిధి యని చెప్పవచ్చును. ఇందు సనారీ స్వాములపటము, పార్వతీ విశ్వేశ్వరుల పటము, లింగరూపపటము ఆఱవచక్రపటము, విశ్వేశ్వరుల యంత్రోద్ధారపు పటములు అంతేగాక నూటతొమ్మిది విధములైన ప్రశ్నకళలు, ఎనిమిది అధ్యాయములలో వివరించబడి యున్నవి. ఇందలి సారాంశములను గని తత్వమార్గమును సులభముగా పొందుదురుగాక. వేదాంతప్రియులెల్లరును తప్పక చదువదగినది

వెల **2-00**

# సర్వదేవతావశ్యమను మలయాళ మంత్రములు

ఇయ్యది యంత్రసహితమగు అమూల్యమంత్రశాస్త్రము. మలయాళ భాషలోనున్న యీగ్రంథమును మేము వ్యయ ప్రయాసలకు వెనుదీయక మంత్ర శాస్త్రజ్ఞులైన పండితులచె తెలుగునందు వివరముగ వ్రాయించి యున్నాము. ఇందు ప్రతి మంత్రమునకు నష్టకర్మ విధాయకంబు యేర్పాటుచేసి యంత్రములతో సహితము ముద్రింపబడియున్నందున అందరును చదివి ఆప్రకారము తమ తమ యిష్టదైవములను వశముగావించుకొనుటకు కామధేనువు వలె సహాయపడగల గ్రంథము. ఇందు చెప్పబడిన అధిష్టానదేవతలు విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యుడు, ఆంజనేయుడు, బాలా, గరుడుడు, సూర్యుడు, మలయాళ శృంగి దేవత, పంచభూతములు, సరస్వతీ, మహాలక్ష్మి, భద్రకాళి మున్నగు అనేక దేవతలను వశముజేసికొనుటకు తగినమంత్రములు, యంత్రములును, శిశువులకు, పిల్లలకు, పెద్దలకు కర్మవశమున వచ్చు సోకుళ్ళను, పంపులను, తోడుబోతులను నివారణ చేయుటకు మంత్రములు, యంత్రములు, తంత్రములు గలవు. ప్రతి గృహమునందును వుండదగిన గ్రంథము.

రెండుభాగములు వెల **1-50**

# వ్యభిచారము

వ్యభిచారము:—స్త్రీలకు సహజగుణమా, లేక యితరుల ప్రోద్బలంవల్ల చేయవలసివస్తున్నదా. అట్టి పరిస్థితులేర్పడుటకు కారణము లేవి? వ్యభిచరించు స్త్రీలయొక్క మనోదౌర్బల్యమే కారణమా? లేక యితర కారణము లేవైనగలవా? ఇందుకు పురుషుల బాధ్యత ఎంతవరకు గలదు? వ్యభిచారము మనదేశముననేగలదా? పాశ్చాత్యదేశములందుకూడ గలదా? మనదేశమున ఆచరింపబడుచున్న వ్యభిచారమునకు పాశ్చాత్యదేశములం దాచరింపబడుచున్న వ్యభిచారమునకు తారతమ్యములెట్టివి? పాశ్చాత్యదేశములలోగల స్త్రీల మన స్తత్వము లెట్టివి? యిట్టి విషయము లెన్నెన్నో యిందు వ్రాయబడినవి. దీనిని చదివి గ్రహించదగిన విషయములెన్నో గలవు. చక్కని శైలిలో ఉదాహరణలతోగూడ వర్ణింపబడినవి.

వెల **1-00**

# ధన్వంతరి వైద్య చికిత్సాసారం

గోసాయిస్వామి వలన చెప్పబడినది. ధన్వంతరి వైద్యమును సంగ్రహించి వ్రాయబడినది. అనుభవసిద్ధములైన యోగములు మాత్రము చేర్చబడినది. ఇందు నాడీపరీక్ష, నాడుల లక్షణములు వైద్యము నేర్చుకొనువారికి ఎన్నెన్నో వుపాయములు గలవు. అనేక సరకులకు గల మారుపేర్లు తెలుపబడినవి, షర్బతులు, మురబ్బాలు, లేహ్యములు, చూర్ణములు, తైలములు, కషాయములు. మాత్రలు మున్నగునవెన్నెన్నో ఔషధములు చేయుటకు యోగములు తెలుపబడియున్నవి. వెల 0-75

# సహదేవ పశువైద్య శాస్త్రము

ఈ గ్రంథమునందు మనము సౌఖ్యముగా ఉండునట్లు యెంతగానో సహాయపడుచున్న ఆవు, ఎద్దు, మున్నగు నోరులేని పశువులకు వచ్చు దుర్యోగముల లక్షణములు, దోషములు వివరించుచూ. ఆయా సర్వరోగములకు, దోషములకు చేయవలసిన చికిత్సలు వివరముగా తెలుపబడినవి తమ కెంతగానో సేవచేయుచున్న పశువులయొక్క రోగమేవో వాటిలక్షణములనుబట్టి యీ గ్రంథ సహాయమున తెలుసుకొని ఆ నోరులేని ప్రాణులను కాపాడుట మీవిధి, అంతేగాక మనపశు సంపదను యెట్లు వృద్ధి చేసుకొనవచ్చునో, పాడినెట్లు అభివృద్ధిచేసుకో గలుగుదుమో చక్కగా వివరించబడియున్నది. వెల 0-50

# కుక్కుట శాస్త్రము

(కోడి పందెముల ప్రతి)

ఈ పుస్తకమునందు కోళ్లలోగల జాతులు, ఏ కోడినెట్లు పెంచవలెనో, పందెము కోళ్లనెట్లు పెంచవలెనో, ఎట్టి లక్షణములుగల కోడిపుంజాలు, పందెములలో గెలుపొందగలవో, ఏకోడికెట్టి ఆహారము పెట్టవలెనో, కోళ్లను పెంచి వర్తకము చేయువారు గమనించవలసిన విషయములేవో, కోళ్లకు వచ్చు రోగములకెట్లు చికిత్స చేయవలెనో మున్నగు వివరములు గలవు. ఏతిథి, వార నక్షత్రములలో పుంజాను పందెమునకు వదలిన జయము కలుగునో తెలుపబడినది. మరియు దీనియందు యుద్ధజయాపజయ నిర్ణయము, ముష్టియుద్ధప్రశ్న, జూదమాడే ఫలాఫలములు, వేటక్రమము మున్నగునవి కూడ చేర్చబడియున్నవి. వెల 0-50

# నూతన గ్రామఫోను పాటలు

సంగీతప్రియులెల్లరి వద్దను తప్పక వుండదగిన పుస్తకము. ఇందు-తమ అపూర్వగానవాహినితో ఆంధ్ర ప్రజాకోటిని ఆనందింపజేసిన ప్రముఖ ఆంధ్ర సినీమాతారల యొక్కయు, డ్రామా యాక్టర్లయొక్కయు సుమారు 700 గ్రామఫోనుపాటలు గలవు. అనేక కామిక్ పాటలు, డైలాగులు కలవు. 200 పేజీలు పుస్తకము. వెల 1-00

ఎస్. వి. గోపాల్ అండ్ కో.,

పి. బి. నెం. 74—౮౮, కృష్ణప్పనాయుకన్ గుంటవీధి, మద్రాసు-1.

---

# సెగరోగ నివారిణి

అన్ని విధములైన సెగరోగములను నిర్మూలించు ప్రశస్తమగు ఔషధము. మూత్ర మిచ్చునపుడు, మూత్రము విడుచునపుడు పోటు, మంటలు, మూత్రద్వారము నుండి తెల్లగాగాని పచ్చగాగాని చీమువంటి ద్రవము పడుట, పొత్తికడుపు నరములు బిగదీయుట, నొప్పి మూత్రము బొట్లుబొట్లుగా తరుచుగా విడువవలసి వచ్చుట మున్నగు లక్షణములుగల యీరోగము చాలా ప్రమాదకరమైనది గాన పైలక్షణములు కనబడిన వెంటనే యీమందును సేవించిన తక్షణం నాళము దగ్గర వుండుమాని చీమువంటి ద్రవము నరికట్టి మూత్రము ధారాళముగా పోవునట్లు చేయును. నాళములయందలి జిలజిల మానును. దీనిని సేవించిన జీర్ణించిన సెగవ్యాధులను సైతము నిర్మూలించును. సీసా 1-కి **1-25**

# రోమ సంహారి సోపు

దేహమునందు యేభాగమునందు గలవైనను యిష్టములేని వెంట్రుకలను పోగొట్టుటకీయీ సబ్బు మిక్కిలి ఉపయోగకరమైనది. శ్రేష్టమయినది. నిరపాయముగా రోమములను నశింపజేసి శరీరమును చక్కగా నుంచును. పెట్టె 1-కి **1-50**

## రోమసంహారి పౌడరు 2 సీసాలు 1-00

# భోగశోక నివారిణి మాత్రలు

సంభోగానంతరము సేవించదగినవి. మిక్కిలి ఉల్లాసము నిచ్చునట్టివి. యీ మాత్రలు సేవించిన సంభోగానంతరము కలిగిన నీరుచురుకు, కాళ్ళుచేతులు దుర్బలమగుట, అలసట; ఉష్ణము మున్నగునవి లేకుండచేసి మరల సంభోగేచ్ఛను కలిగించును. మిక్కిలి ఉల్లాసము కలిగించును. 20 మాత్రలు **1-00**

# ధాతు వృద్ధి మాత్రలు

ధాతువృద్ధిని; ధాతుపుష్టిని, బలమును కలిగించు ఔషధరాజము. దీనిని సేవించిన ధాతువును బలపరచి, నరములకు బలమునిచ్చి రతికేళియందు మిక్కుటమైన సుఖము కలుగునట్లు చేయును. దేహావయవములకు బలమును, పుష్టిని, ముఖమునకు తేజస్సును, రక్తవృద్ధియు కలిగించును, మూలమునకు హేతువైన ఉష్ణమును తీసివేయును. ఒకసారి వాడిన యిందలి గొప్ప గుణములు మీకే తెలియును. వెల **1-00**

# రామకృష్ణా పండ్లపొడి

ఇది దంతచూర్ణములలో అన్నిటికంటె శ్రేష్ఠమైనది. శాస్త్రరీత్యా తయారు చేయబడినది. దీని నుపయోగించిన దంతములు కదలుట, చిగుళ్ళు పెరుగుట, పుప్పి పంటిబాధలు; పండ్లనుండి రక్తముకారుట, పంటిపైత్యము, నోటిదుర్వాసన మున్నగు [illegible] దంతములను [illegible]గా నుంచును. 4 డబ్బాలు **1-00**

# హనుమంత సంజీవి లేహ్యం

సింహమువంటి పరాక్రమమును; ఏనుగవంటి బలము కలిగించు దివ్యౌషధము. దీనిని సేవించిన దేహపటుత్వమును, పుష్టిని, ధాతువృద్ధిని, తుష్టి, రక్తవృద్ధిని; జీర్ణశక్తిని; నరములకు సేవాశయానకములకు బలమును, ముఖమునకు చక్కని తేజస్సును; ఉత్సాహమును; ఆయుర్వృద్ధిని కలిగించును. నిస్సత్తువను తొలగించును. మరియు శుష్కవాయువు, పార్శ్వవాయువు, పిత్తమయికం, నోరూరుట, వణకుపడుట, తల తిరుగుట; రొమ్మునొప్పి, కాళ్లుచేతులు పోట్లు; మేహశాక, నపుంసకత్వము, ధాతునష్టములను పోగొట్టి సర్వభోగములను సంతృప్తికరముగా అనుభవించగల శక్తిని, ఉత్సాహమును ప్రసాదించును. ఖరీదైన వస్తువులతో తయారు చేయబడినది. ముసలితనమును సైతము మరపించునట్టి బల పరాక్రమములు నిచ్చు సాటిలేని ఔషధము. 40 రోజులకు **4-00**

# నేత్రాంజనం

సమస్త నేత్రవ్యాధులకు శ్రీరామబాణమువలె పనిచేయగల మందు. దీనిని ఉపయోగము కన్నులకు వాడుచున్న కంటినొప్పి, ఎరుపులు పుసికట్టుట; మంటలు, నీరుకారుట, కకండ్లలకలు, పోట్లు, మసకగా మబ్బుగా వుండుట, కండ పెరుగుట, నేత్రవాయువులు మున్నగు కంటి జబ్బులను బాగుచేయును. ప్రతివారును యిండ్లలో వుంచుకొనదగినది. సీసా 1-కి **1-00**

# చంద్రామృతం

ఇది ఒకసీసా దగ్గరవున్నయెడల వైద్యుడులేని లోపముతీర్చును. అన్నిరోగములను పోగొట్టును. ప్రతివారివద్దను ఉండదగినమందు దీనిని పూసిన యెంతకాలమునుండి బాధించుచున్న వాతనొప్పులైనను పోవును. కీళ్ళనొప్పులు మున్నగు అన్నినొప్పులను పోగొట్టును. పొడ, తామర, చిడుము మొదలగు చర్మవ్యాధులు నిర్మూలించును. మరియు శీతల జ్వరము, కడుపునొప్పి, అజీర్ణము, శూల, దగ్గులు, కడుపులో బల్ల, శీత వాత కఫ పైత్యరోగములు, మూలవ్యాధి, బలహీనము మొదలగు అనేక రోగములను నశింపజేయు అమూల్యఔషధము. సీసా **1-50**

# జ్వరమాత్రలు

## జ్వరములను త్వరగా తగ్గించగల శ్రేష్ఠమైన మాత్రలు

అనేక విధములగు విలువగల మూలికలచే తయారుచేయబడిన యీ మాత్రలు చలిజ్వరము, వాతజ్వరము, త్రైహికజ్వరము, మొదలగు జ్వరములను త్వరితముగా పోగొట్టుటలో ప్రసిద్ధి పొందినవి. ప్రతియింటియందును ఉండదగినవి. పిల్లలు పెద్దలు నిరభ్యంతరముగా వాడవచ్చును. డబ్బి 1-కి **1-00**

# కార్డోలిన్

## (ఆస్తమా క్యూర్)

శ్రీ కార్డోలిన్ అనునది ఆస్తమాకు అమోఘమైన ఔషధము, శ్వాసకోశ సంబంధమైన ఉబ్బసము (పిల్లికూతలు మాదిరి) శ్వాసపు యొద్దు ప్రతిరకమున్నూ శరీరములో విషమును వ్యాపింపజేయు శ్వాస నిరోధము కల్గించునట్టియు, శక్తిని లోపింపజేయు నట్టిన్ని; ఆరోగ్యమును చెఱచి హృదయమును దౌర్బల్యము జేయుచుయేవిధమైన ఉబ్బసమునకైననూ అమోఘముగా పనిచేయును.

కార్డోలిన్ (ఆస్తమాక్యూర్) సేవించిన ఉబ్బసమునకు సంబంధించిన అన్ని బాధలను శమింపజేయును. శ్వాసకోశములోని కూతలు, హృదయసంబంధమైన శ్వాస నిరోధములను నివారణచేసి సుఖమునిచ్చును. అంతవరకు శ్వాసమార్గమందు దగ్గుతో బాధపడుచున్న వ్యక్తులు దీనిని సేవించిన తత్క్షణం సాధారణ వ్యక్తివలె అనగా రోగములేని వ్యక్తులవలె శ్వాసింప గలుగుదురు. అనేకులు వాడి సుఖపడుచున్నారు. ఆస్తమాకు (ఉబ్బసము దగ్గులకు) సాటిలేని ఔషధమని పేరుపొందినది

సీసా 1-కి **12-00**

# ఇంద్రియ రక్షణి

దీనిని సేవించిన మిక్కిలి ధాతువృద్ధి కలుగును. శీఘ్రస్ఖలనము నరికట్టి పడక యందు మిక్కిలి ఆనందమును కలుగజేయును. నపుంసకత్వమును తొలగించి పుంస్త్వము నిచ్చును.

సీసా 1-కి **1-50**

# లీలాతిశయము

నరములకు; పురుషచిహ్నమునకు ఉత్తేజమును కలిగించి అధికమైన సంభోగ శక్తిని కలిగించు పైపూతమందు.

వెల **2-50**

# సకలవిధ పొడ సంహారి

## చర్మవ్యాధులను నశింపజేయుటలో సాటిలేని మందు

శరీరమున మడతలుగల భాగములందు అనగా చంకలు, తొడలు; కంఠము, వస్త్రములు ధరించు నడుముచుట్టుగల భాగము; పొత్తికడుపునందును చిన్నచిన్న పొక్కులై దినదినమునకు వృద్ధియై తీరని తీటగల్గి సుఖముగా నిద్రించనివ్వకుండ చేయు నట్టి తామర, మేహతామర, మేహకారక తామర, దట్టపు తామర; మొదలగు నామములుగల చర్మవ్యాధులను, దక్షిణదేశపు పురుగుకాటు వలన కలిగే బాధలు రెండుదినములలో వున్నచోటు తెలియని విధముగా మాన్పి సుఖపరచును.

2 సీసాలు **1-50** డబ్బా 1-కి **7-50**

